ఓం

# పరిపూర్ణ దర్శనము




గ్రంథకర్త

**ఇలపకుర్తి వీరవేంకట రామచంద్రరావు**

బి. ఏ , బి. ఎల్.,

ఓం

# పరిపూర్ణ దర్శనము




గ్రంథకర్త

యిలపకుర్తి వీరవేంకట రామచంద్రరావు

బి. ఏ., బి. ఎల్.,

శ్రీ మదచలఋషి శ్రీమద్దయానంద
పొన్నాల రాజయోగీంద్రుల వారి ప్రియ శిష్యులు



సదానంద : శ్రీ యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు,
రాజయోగి (గ్రంథకర్త)

శ్రీ గురుభ్యోనమః

# ముందుమాట

శ్రీ పరిపూర్ణ దర్శనాచార్య సదానంద శ్రీ యిలపకుర్తి పీరవెంకట రామచంద్రరావుగారి రచనలలో ప్రాముఖ్యత గల గ్రంథము "పరిపూర్ణ దర్శనము" దీనియందు పరిపూర్ణభావము ఎంత సనాతనమైనదో సకల శృతి స్మృతి సమ్మతమైనదో విపులీకరింపబడినది. "గురూన్ముఖేన జ్ఞాతవ్యం" అను సూత్రానుసారంగా తెలియబడ దగినదైనను సిద్ధాంతీకరించుటయందు ఎంతో ఓర్పు నేర్పు ప్రదర్శించి పాఠకులకెంతో సహాయకారిగా నిల్చియున్నారు.

ఈ రచన నిరుపమానమై 1965 వ సంవత్సరములో ప్రథమ ముద్రణగా ప్రకటింపబడి పాఠకులనెంతో ఆకర్షించి ఉత్తేజపరుస్తూ పునర్ముద్రణకై ఎదురుచూచుచున్న తరుణంలో శ్రీ రామచంద్రరావు గారి శిష్య ప్రశిష్యులు వలయు ఆర్థికసంపత్తిని సమకూర్చి పునర్ముద్రణకు సహాయపడుతూ వారికిగల గురుభక్తిని వ్యక్తపరచియున్నారు.

అంతేగాక గురుధర్మ నిర్వహణలో శ్రీ రామచంద్రరావు గారి దంపతులు జరిపిన కృషి, గడిపిన జీవిత విధానము లోకవిదితమే. "గురోర్వాక్యం యథా తథా" యను సూక్త్యానుసారము, వారి శిష్య ప్రశిష్యులు

గురుదేవుల ఆశయ సంసిద్ధికొరకై "శ్రీశ్రీశ్రీ సీతారామ చంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిర సంస్థ" ను గుంటూరు జిల్లా మంగళగిరి మండలం యర్రబాలెం గ్రామం శ్రీనగర్ కాలనీలో ఏర్పాటు చేసి శ్రీ గురు దేవుల ఆదర్శప్రాయమైన జీవితమును, ఉనికిని లోక కళ్యాణార్థము వివరింపజేయడంలో వారికిగల సహాయ సంపత్తిని అందించు చున్నారు. గనుక నిది కడుంగడు ముదావహము.

సకాలములో యీ గ్రంథమును సర్వాంగ సుంద రంగా తీర్చిదిద్ది పాఠకులకు అందించిన శ్రీ వెంకట రమణ ముద్రణాలయం వారికి మా ధన్యవాదములు.

ఈ గ్రంథముద్రణకై తోడ్పడిన భక్తాదులందరికీ శ్రీ గురుపరమాత్మ యనుగ్రహముచే సకల శుభములు కలుగుగాక!

శ్రీరామచంద్రరావుగారి రచనలన్నియు వారి గురు దేవులు శ్రీ శివరామదీక్షితీయ పీఠాధ్యక్షులైన శ్రీదయా నంద పొన్నాల రాజయోగీంద్రులవారి దివ్యశ్రీ చరణ ములకు పూజాపుష్పములుగా సమర్పింపబడియున్నవి. అట్లే యీ భాగం కూడా యొక పూజా పుష్పంగా వారి చరణ సన్నిధి చేరాలని భక్తమండలి వారి తర పున శ్రీ గురుపరమాత్మను ప్రార్థించుచున్నాము.

ఇట్లు, భక్త మండలి తరపున

**మంచిరాజు శ్రీనివాసమూర్తి.**

శ్రీ గురుభ్యోనమః

# గురుస్తోత్రము

1. శ్లో॥ గురుర్బ్రహ్మ, గురుర్విష్ణు, గ్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ, తస్మై శ్రీగురువేనమః॥

2. శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య, జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితం యేన, తస్మై శ్రీగురువేనమః॥

3. శ్లో॥ యస్యప్రసాదాదహమేవ సర్వం
మయ్యేవ సర్వం పరికల్పితంచ
ఇత్థంవిజానామి సదాత్మరూపం
తస్యాంఘ్రిపద్మం ప్రణతోస్మి నిత్యం॥

4. శ్లో॥ వేదశాస్త్ర విఖ్యాతం పూర్ణబోధోపదేశికం
సుగుణాకరం దయానందం రాజయోగి గురుంభజే॥

5. శ్లో॥ పౌన్నాలవంశ కలశాంబుధి క్షైరవాప్తం
పూర్ణం దయానిధిమనంతగుణైక ధిష్ణ్యం
రాజాధిరాజ మకుటాంచిత రత్న సేవ్యం
శ్రీ రాజయోగి గురుమంతరతో నమామి॥



శ్రీ గురుభ్యోనమః

# "పరిపూర్ణ దర్శనం" - కృతి సమర్పణ

పద్యకుసుమాంజలి, ద్వితీయ పుష్పం.

1. శ్లో॥ సంసార సాగర సముద్ధరణైక మంత్రం,
బ్రహ్మాదిదేవ మునిపూజిత సిద్ధమంత్రం,
దారిద్ర్యదుఃఖ భవరోగ వినాశమంత్రం,
వందే మహాభయహరం గురురాజమంత్రం॥

2. శ్లో॥ విద్యాంతం,బ్రహ్మవిద్యాంతం,వార్తికాంతమగోచరం
పూర్ణబోధప్రవక్ష్యామి శృణుశిష్యమహోత్తమం

3. మంజరి 1. అనిచెప్పి మురిపించి వినుపించుదేవ !
వినిపించి మనస్సుకు కనుపించుదేవ !
కనుపించని నీరూపు కరుణించుదేవ !
కరుణించి బయలునా కనరాని దేవ !

2. నీపాద సన్నిధి న్నేనునేర్చినది
నీయాజ్ఞ తలదాల్చి నేనుగూర్చినది
నీపాదపూజార్థ మీపూలమాల
భక్తితో రచియిస్తి ప్రభురాయగొనుము.

సికింద్రాబాద్ ఇట్లు, భవదీయ పాదసేవకుడు,
16-5-1965 యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు.
గ్రంథకర

# ప రి పూ ర్ణ ద ర్శ న ము

## పీ ఠి క

పరిపూర్ణభావము, వేదము లెంత సనాతనమో అంత సనాతనమే! ఈ సిద్ధాంతముయొక్క మూలబీజములు వేదములయందున్నూ, ఉపనిషత్తులయందూవున్నవే. ఆంధ్రభాషలో యీసిద్ధాంతమును ప్రచారంచేసిన శ్రీశివరామదీక్షితులవారు, గోప్యాతి గోప్యముగానుండి శిష్యప్రశిష్యలకుమాత్రం ప్రబోధింపబడే యీసిద్ధాంతమును, తమగురువులైన శ్రీ శ్రీధర స్వాములవారివద్ద సేవాశుశ్రూషలొనర్చి తెలిసికొని, ప్రచారముగావించిరి.

"వేదోఖిలోధర్మమూలం" అనీ "సర్వంవేదాత్ప్రసిద్ధ్యతి" అనీ, చెప్పబడుతోంది. కారణం? వేదం ఒక వ్యక్తిచే రచింపబడినది కాకపోవడమే. అనేకమంది మహర్షులు వారి వారి అనుభవాలను పరిశీలనా ఫలితాలను, లేక విమర్శనాఫలితాలను, వెల్లడించడంలో వేదములలో వివిధత్వమున్నూ గానవస్తూంది. కనుకనే, శూన్యవాద సహితంగా, అన్ని వాదాలకూ సంబంధించిన మూలసూత్రాలు వేదములలో గానవస్తూన్నాయి. ఇవన్నీ కలిసే నేటి వేదాలుగా రూపొందేయి. అందు మనోవాక్కుల కందు భావములు సూటిగానే చెప్పబడ్డాయి, కాని మనోవాగగోచ

రమగు యీ అచల పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమా విధంగా సూటిగా చెప్పబడలేదు. కాని లక్ష్యార్థముగా చెప్ప బడిన అధిష్ఠానచేతన బ్రహ్మమునకుగూడ లక్ష్యార్థముగా మాత్రమే యీపరిపూర్ణభావము చెప్పబడినది. అచల ఋషులు జననమరణరహితవిధాన మీ పరిపూర్ణబోధయందు మాత్రమే కలదని దెలిసికొని, దానిని పరమగోప్యంగా నుంచి తమ్మాశ్రయించిన లక్షణయుతులకు మాత్రం ఉపదేశ రూపంగా ప్రసాదిస్తూ ఈపూర్ణభావమును కాపాడి పోషిస్తూ లోకమున సుప్రతిష్ఠిత మొనరించారు.

శ్రీశివరామదీక్షితులవారికీ, వారికిపూర్వీకులైన వేమన యోగిగారికీ పూర్వం, యీపరిపూర్ణబోధ సిద్ధాంతము, తక్కుంగల హైందవవిజ్ఞానమంతటితోపాటు సంస్కృతభాష యందే వుండిపోయినది. బౌద్ధులు పాళీభాషలోనూ, వీరశై వాదులు తెలుగు కన్నడములలోనూ, శ్రీరామానుజులు ద్రావిడంలోనూ, వారి వారిమతసిద్ధాంతములను వ్రాసిపెట్టి నట్లే, వేమనయోగిన్ని వారి తరువాత శ్రీ శివరామదీక్షితుల వారున్నూ, సంస్కృతభాషలో నిగూఢంగా నిక్షిప్తమై యుండి సామాన్యుల కందుబాటులో లేకుండాపోయిన యీ పరమ సత్యసిద్ధాంతము, దేశీయులందరికి తెలియవలెననే విశాలహృదయంతో తేట తెలుగున ప్రచారము గావించిరి.

కాని వేమన రచించిన పద్యాలలో పూర్ణభావమేగాక, నీతి భక్తి యోగ వైరాగ్యాది విషయము లెన్నో కలగాపుల గముగ రచించుటచే పూర్ణభావమంతగా తెలుగుప్రజల దృష్టినాకర్షించలేదు. అట్లుగాక, కేవలం పరిపూర్ణభావ మునుమాత్రమే సిద్ధాంతంచేసి, బృహదాశిష్ఠమును అచ్చ తెలుగులో వ్రాసి, ఆంధ్రలోకంలో ప్రచారంచేసిన శ్రీ శివ రామదీక్షితులవారి పేరుతోనే యీ పరిపూర్ణభావసిద్ధాంతం వ్యాపకమైంది. బృహద్వాశిష్ఠ సిద్ధాంతప్రతిష్ఠాపనాచార్యు లని దీక్షితులవారికి పేరున్నూ వచ్చింది.

వేదముల ప్రధానాంశయము :- అందరికి తెలిసిన లేక తెలియ సాధ్యమైన, విషయములను గురించి చెప్పుటకు వేదము లెందుకు ? తనవిజ్ఞానముచే మానవుడు తర్కించి, విమర్శించి, పరిశోధించి, సమస్త విషయములను తెలుసు కొంటూ సర్వజ్ఞత్వమునకు చేరువగుచున్నాడు. కాని మనో వాక్కుల కందని పరిపూర్ణభావము మాత్ర మట్లు తెలియ సాధ్యముకానిది. ఏలనన అపరిపూర్ణపరబ్రహ్మమును సర్వజ్ఞ త్వలక్షణములుగల అధిష్ఠానచేతనబ్రహ్మమగు యెరుకే తెలిసి కొనజాలదు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఎరుకే లేదు. కనుక తెలియరాని అపరిపూర్ణ పరబ్రహ్మమును లక్ష్యలక్ష్యార్థ రూపంగా ప్రచురపరచుటయే వేదముల ముఖ్యోద్దేశము

అనొచ్చును. మిగతా ఏవిషయమును గూర్చియు వేదములు తెలుపనక్కరలేకనే మానవుడు తెలుసుకోగలడు. ఏలననగా:- ప్రత్యక్షముగా జీవజగత్తులు తెలియబడుచున్నవి. వీని సృష్టిస్థితిలయముల కాధారమగు, సగుణ నిర్గుణ రూపమగు బ్రహ్మమునుగూడా అనుమానప్రమాణముచే నూహించి, అతీంద్రియమగు బుద్ధిచే గ్రహించవచ్చు. కనుక ద్వైత, త్రైత వాదములనుగాని అద్వైతమునుగాని తెలియుటకు వేదములుగాని గురువుగాని నిజముగా అవసరంలేదు. మనోవాక్కులకందనిది, నిరపేక్షకమైనది, నిష్క్రియోగికమైనది, శుద్ధనిర్గుణమైనది, ఆత్మాతీతమైనది, అగు పరిపూర్ణపరబ్రహ్మమును తెలుపుడుచేయుటయే వేదముల ప్రధానాశయమై యున్నదనాలి. అట్టి పరిపూర్ణభావమును బోధించుటకే గురువవసరముగాని, ఇతరబోధలకు గురువుయొక్క ఆవశ్యకతయే లేదు. "గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః" అనగా :- ఆపరిపూర్ణపరబ్రహ్మము గురువాక్యముచేతనే తెలియబడవలెను గాని, కోటిగ్రంథములచేతకూడ తెలియబడదు, అని చెప్పబడుతోంది. పరిపూర్ణ పరబ్రహ్మము నేత్రశ్రోత్రాదిప్రమాణగమ్యంకాదు. ప్రమాణములచే తెలియతగినది, శబ్దాది విషయసహితం అయివుండాలి. పరిపూర్ణ మట్టిదికాదు. అది పంచమాత్రరహితమైనది. కనుక అది

ప్రమాణప్రమేయములుగానిది. యీదృష్టితోమాత్రమే అది అప్రమాణము. అప్రమేయం. "యతోవాచో నివర్తంతేఅప్రాప్యమనసాసహ" దానిని సాక్షాత్తుగా చెప్పే శ్రుతులుండుటకే వీలులేదు. ఐనను (లక్ష్యార్థముచే) వేదముల ప్రధానాశయము, యీపరిపూర్ణపరబ్రహ్మమైవుండకతప్పదని సూచించు శ్రుతులను యీగ్రంథము చివరిప్రకరణమందు పొందుపరచినాము. పరిపూర్ణపరబ్రహ్మ విషయమగు అతీతశ్రుతులుగా పేర్కొనబడిన శ్రుతిస్మృతులుతాము ప్రతిపాదించు అధిష్ఠానచేతన బ్రహ్మముననే సరిపుచ్చుకొని, తృప్తిపడిన వార్కి రెంటి తారతమ్యము తెలియుటకై ఆ యీ శ్రుతి స్మృతులను పోల్చి చూపడమైనది. ఐతే, అధిష్ఠానచేతనబ్రహ్మమని యొకటి, పరిపూర్ణబ్రహ్మమని యొకటి, రెండు బ్రహ్మములున్నవా? వున్నవి. "ఆబ్రహ్మస్తంభపర్యంతం, పరమాత్మస్వరూపకం" అని, "సర్వంఖల్విదం బ్రహ్మ" అనీ, "ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ" అనీ, "ఏకం అనేకం భవతి" అనీ, "అనేకం ఏకం భవతి" అనీ, ఒకటిగానూ, సర్వద్వంద్వస్వరూపంగానూ, సాపేక్షికంగానూ యుండే బ్రహ్మమే, అధిష్ఠానచేతన బ్రహ్మము. దీనికి పరంగా, విలక్షణంగా, నిరపేక్షకంగా, నిష్ప్రతియోగికముగా నున్నదే పరిపూర్ణ బ్రహ్మము, అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును సిద్ధాంతంచేయుటే యీగ్రంథస్థ విషయము.

సర్వలక్షణ విలక్షణమగు అట్టి పరిపూర్ణ పరబ్రహ్మ

ముసు సిద్ధాంతంచేయు గ్రంథమునకు "దర్శనము" అను పేరు తగునా? దర్శనము అను మాటకు "దృశ్య" విషయక మగు అర్థమును స్వీకరించరాదు. అది "నచక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి...." అని చెప్పబడుతోంది. కనుక దర్శన మంటే, శాస్త్రము (Science) లేక విజ్ఞానరూపక వివరణము, అని మాత్రమే అర్థంచేసుకోవాలి.

ఇట్టి విజ్ఞానం, మతప్రతిష్ఠాపనాచార్యులగు శంకరాదు లకు లేదా? వారేల యీసిద్ధాంతమును చెప్పరైరి? అంటే అప్పట్లో అవసరంకాలేదు కనుక అని, తేలికగా తెలియబడు తోంది నాటి దేశకాలసమాజముల దృష్ట్యా సమష్టిసంఘ శ్రేయస్సుకొరకు ఎంతఅవసరమో అంతే వారు ప్రచారము చేసేరు. ఉదాహరణకు :- బౌద్ధవాద మపార్థముగావించు కొని శూన్య వాదములోనికి దిగిపోతూవున్న తరుణంలో సంఘప్రచారణకై "తత్వమసి" "అబ్రహ్మమునీవే" అని. బ్రహ్మ మపరోక్షము గావించవలసివచ్చెను, అందుచే శంకరా ద్వైతము మహావాక్యార్థజ్ఞాన మారూఢపరచుటతో పరి సమాప్తి చెందెను.

మహాపండితులెందరో యున్నారు; మీ గ్రంథమును గూర్చి ఒక్కరివల్లనైనను అభిప్రాయం తీసుకొని ప్రకటించ రేమి? అని ప్రశ్నించవచ్చును. ఇందుకు సమాధానం :- పరిపూర్ణభావమును వున్నదున్నట్లుగా గ్రహించని పండితు లెందరుంటే నేమి ?యీగ్రంథంచూస్తే వారియందు ఎప్పటి

నుంచో బూజుపట్టియున్న వారి వారిస్వమతసిద్ధాంతము నకే యీ పరిపూర్ణభావమును దిగదీసి, సరిపోయినంత వరకూ బాగుందనీ, సరిపోనిచోట్ల "యిదితప్పు" అనీ, తేలికగా అనేస్తారు. కాని నిష్పక్షపాతంగా, శ్రుతిస్మృతులన్నిటిని సమన్వయించేసుకొని చేయబడిన యీపరిపూర్ణభావసిద్ధాంతము న్యాయంగానూ సబబుగానూయుందని అయినా అనుటకు వారికినోరాడదు. వారిమతదురభిమానంతప్పక అడ్డుతగులుతుంది. కనుక పండితాభిప్రాయములకై ప్రాకులాడుట నిరర్థకంగా తోచింది. నేటి భారతరాజ్యాంగమునందు ప్రభుత్వాధ్యక్షుడై యున్న శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణపండితుడు "మనవేదాంతవిజ్ఞానము ఏమీ యెదుగూ బొదుగూ లేక, శతాబ్దాల పూర్వం యున్న రీతిగానే నిల్చిపోయి, స్తబ్దత వహించింది. పరిశీలనాత్మకంగా (Research రూపంగా) ముందడుగు వేయుట్లయే లేదు." అని పలుచోట్ల తమ అభిప్రాయమును వెల్లడించేరు. శ్రీశివరామ దీక్షిత సిద్ధాంతం, అకారతను నేటికి దాదాపు 200 సంవత్సరములకు పూర్వమే తీర్చివైచింది. కాని పరిపూర్ణబోధ నామూలాగ్రముగ వున్నదున్నట్లు తెలుసుకొన్న వారి అభిప్రాయము లేల గైకొనలేదు? అంటే, ఏగూటిపక్షి ఆగూటిపలుకే పలికింది అంటారు. యింతకూ ఎవరి అభిప్రాయం తోనూ ఏమిపని? యీ గ్రంథమామూలాగ్రంగా చదివి, "యీపరిపూర్ణభావము, సబబుగా, న్యాయంగా, వుంది, శ్రుతియుక్తిఅనుభవ

యుతమైనదే" అని సహృదయులగు పాఠకులు ఏమాత్రం సంతోషించినా, అంతేచాలు. అట్లుగాక పడిందిలిచ్చిన అభిప్రాయములను చదివి ఆ రంగద్దాల నేత్రదృష్టితో యీ గ్రంథముగాని, ఏగ్రంథముగాని, చదువుట యెంతమాత్రం, కూడదనే నా అభిప్రాయము. స్వతంత్రంగా యోచించి, నిష్పక్షపాతంగావిమర్శించి, ఏఅభిప్రాయం ఏర్పరుచుకొన్నా మంచిదే.

ఇంతకూ, గుణదోషమయం సర్వం సృష్టా స్సృజన కౌతుకీ" అన్నారు. అట్లే నారచనలోనూ వుండొచ్చు, కాని సిద్ధాంతముమాత్రం నిర్దుష్టమే భాషావిషయంలో, శిష్టవ్యావహారిక భాషలో వ్రాద్దామని వ్రాసేను. భాష కంత విలువ నీయక, భావమునే గ్రహింతురని కోరిక.

ఈ సిద్ధాంతరహస్యములను పున్నదున్నట్లు నాగురుదేవుడైన శ్రీ మదచల ఋషి రాముడుగు శివరామదీక్షితాచల గురుపీఠాపతులగు శ్రీమదచలఋషి దయానంద పాన్నాల రాజయోగీంద్రులవారివల్ల నాతెలివికొలదీ గ్రహించి, శాస్త్ర, విజ్ఞాన, అనుభవములతో జోడించి, గురుఋణము దీర్చుటకై, కేవలం లోకసేవయే ప్రధానాశయంగా, గురువర్యుల అనుగ్రహ ఆశీర్వాదములతో, యీ గ్రంథం రచించి, మీ ముందుంచినాను. ఇక చదవండి.

నర్సాపురం బుధజన విధేయుడు,
9-5-65 యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు.
(గ్రంథకర్త)

శ్రీ సద్గురుభ్యోనమః

# పరిపూర్ణ దర్శనము

## విషయ ప్రవేశ ప్రకరణము

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః

పంచభూతాత్మకమై, ఖగోళ భూగోళములతో గూడి అందుగల 84 లక్షల జీవోపాధులతో దృశ్యమానమగు, యీ సర్వ సృష్టిజాతమునందు, మానవోపాధియే సర్వోత్కృష్టమనుటకు, మానవ విశిష్టగుణమగు విమర్శనాజ్ఞానమే హేతువని సర్వాంగీకృత విషయము. అందులకే ఆంగ్లేయ పండితుడగు జాన్సను మహాకవి "మానవుడొక తార్కిక దృష్టిగల యీకలులేని ద్విపాత్తు."(Man is a reasoning featherless biped( అని ఛలోక్తిగ, మానవ శబ్దమును నిర్వచించియున్నాడు. మానవులకును పశువులకును సమానధర్మములైన ఆహార నిద్రా భయ సంగమములయందు మాత్రము వర్తించుచు, నైహిక సుఖోన్నతికై ప్రాకులాడుచు, తనకు ప్రత్యేకముగా ప్రసాదించబడిన యీ విమర్శనాజ్ఞానమును వృథాచేయునేని మానవుడు పశుపక్ష్యాదులకంటెగూడ హీనుడే యగును. అట్లుగాక

సృష్టియందుగల సర్వభోగభాగ్యాదులు క్షణభంగురములును, నశ్వరములునై యున్నవని గ్రహించి "శాశ్వత మేదైన నున్నదా? 'నేను' అనునది ఏది? నా జీవితాదర్శమేది? గమ్య స్థానమేది? అట్టి గమ్యము ననుభవగమ్యము గావించుకొను టకు సాధనయేది? యిత్యాది విషయజిజ్ఞాసచేయువారియెడల మాత్రమే మానవ నామము సార్థకమగును.

మనోవాక్కులకు దోచు సర్వము ద్వంద్వరూపముగా నున్నది మాయాబ్రహ్మములు, ఆత్మానాత్మలు, చిజ్జడములు, జ్ఞానాజ్ఞానములు, నిత్యానిత్యములు, క్షరాక్షరములు, వ్యష్టి సమష్టులు, బంధముక్తులు, జననమరణములు, సూల సూక్ష్మ ములు, రాగద్వేషములు, ధర్మాధర్మములు, సుఖదుఃఖములు ఇత్యాదు లన్నియూ ద్వంద్వ రూపములుగానే యున్నవి. జిజ్ఞాసియగువాడు సర్వద్వంద్వములను సంపూర్తిగవిమర్శించి అందు సారమేది? అసారమేది? సారాసారముల కతీతముగ నేదైనగలదా? అని విమర్శించవలసి యున్నది.

రెండు వస్తువులను పరిశీలించి, అందొకటి రెండవదాని కంటె సారమగు వస్తువు అని పేర్కొనవచ్చును. అంతేగాక సారాసారములు రెండునూ యొకే వస్తువునందు గూడ నుండ వచ్చును. సారమనగా వస్తువునందుగల శ్రేష్ఠపదార్థము. ఆ వస్తువునందలి శేషించిన అశ్రేష్ఠపదార్థమే అసారము అని చెప్ప

నొప్పును. ఉదాహరణకు ఒక చెఱకుగడను తీసికొన్నచో, దానియందుగల సారము శ్రేష్ఠమగు చెఱుకు రసము శేషించిన పిప్పియే అసారమైన అశ్రేష్ఠపదార్థమున్నూ అయివున్నది. కాని సారమని చెప్పబడిన రసమునందుగల మధుర రసము శ్రేష్ఠ తరము. సారతరమున్ను అయివున్నది. కనుక ఒక వస్తువు నందుగల స్థూల సూక్ష్మ, సూక్ష్మతర వస్తువులలో యొకదాని కంటె యొకటి సూక్ష్మమున్ను సారతరమున్నూ అగుచున్నవి తద్దృష్ట్యా అందలి మిగతా పదార్థములు అసారములగుచున్నవి ఈ దృష్టాంతము నందే మరికొన్ని విషయములుగూడ ద్యోతకములగుచున్నవి.

(1) స్థూలాతిస్థూలరూపమై కఠినాంశయుతమై పృథ్వీసంబంధ మైయున్న చెఱకుగడకంటె, సూక్ష్మమై ద్రవాంశయుతమైజల సంబంధమైయున్న తద్రసము శ్రేష్ఠమై సారవస్తువనదగి యున్నది.

(2) చెఱకురసముకంటె దానితీపి అనగా వస్తువునకంటె వస్తు. గుణము లేక వస్తుశక్తి యింకనూ సూక్ష్మమునూ సారతరమునూ అయివున్నది. అంటే సాకారముకంటె నిరాకారము, సావయ వముకంటె నిరవయవము, స్థూలముకంటె సూక్ష్మమును సార వంతమై వున్నవని మనం గమనిస్తున్నాము. ఇదే పద్ధతిగా మన విమర్శించినచో సగుణముకంటె నిర్గుణము సూక్ష్మమును సారతరమునూ అయివున్నట్లు కనుగొనగలము.

సారాసారము లీవిధముగా అన్యోన్యాశ్రిత, లేక సాపేక్షికపదములు [Relative terms] మాత్రముగుచున్నవి. సారము అసారమును, అసారము సారమును ఆశ్రయించి లేక అపేక్షించి యానామములను పొందినవి అని చెప్పక తప్పదు. ఏ వస్తువును యుదాహరణకై యెన్నుకొన్నను, అందు సారవస్తువు సూక్ష్మముగాను, అసారవస్తువు స్థూలముగాను గనబడును. మరియును సారవస్తువునకు అసారవస్తువు ఆవరణరూపముగా నున్నట్లుగూడ గానసగును. అంతేకాకుండా యీ స్థూలసూక్ష్మములు, అవినాభావ సంబంధముగలవై కలిసియే యుండును గాని ఎన్నడును యెడబాటు చెందజాలవు. కనుక సారమునందసారమును, అసారము నందు సారమును వ్యాపకమయ్యేయున్నవి. అందువలన రెంటికి సమానప్రతిపత్తి యివ్వవలసినేగాని అందొకటి హేయమును మరియొకటి యుపాదేయమును కాజాలవు.

ఈ సృష్టియందు నానాత్వము, విభిన్నత్వము స్థూల దృష్టికి గోచరించుచున్నను, తత్వతఃచూచినచో యీనానాత్వ విభిన్నత్వములు నశించి ఏకత్వమే సిద్ధించుచున్నది. యీ సృష్టికి మూలద్రవ్యములు పంచభూతములని కొంచెమించుమించుగా సర్వులును (నైయ్యాయిక వైశేషికులు తప్ప) అంగీకరించియున్నారు. పంచభూతములు ఆత్మయందు వరుసగా కల్గినవని తైత్తిరీయ శ్రుతి చెప్పుచున్నది. "తస్మాద్వా ఏత

స్మాదాత్మన, ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయో రగ్నిః, అగ్నేరాపః, అద్భ్యఃపృథివీ, పృథివ్యాదౌషధయః, ఓషధీభ్యోన్నం, అన్నాత్పురుషః॥" కనుక పంచభూతములు కార్యములున్ను ఆత్మకారణమున్ను అనజెల్లును. ప్రళయ కాలమున ఊర్ధ్వపరిణామము చెందుచూ కార్యరూపప్రపంచము తిరిగి కారణరూపమగు ఆత్మయందు బీజరూపము వహించు చున్నది. యీకార్య కారణములందొకటి సారమని, రెండవది అసారమని నిర్ణయింపజాలము. ఉదాహరణకు బీజాంకురములు తీసికొందుము. బీజము కారణము. అందుండి అంకురించిన వృక్షమే కార్యరూపము. బీజమునుండి వృక్షము కల్గుచున్నది, ఆ వృక్షాగ్రమున తిరిగి యాబీజముగల ఫలముత్పత్తియగు చున్నది. యీ విధముగా అనులోమ విలోమక్రమముగా పరి ణమించు స్వభావముగలకార్య కారణ వస్తువులలో నొకదానిని సారవస్తువని రెండవదానిని అసార వస్తువని నిర్ణయింప జాలము.

భౌతికాకృతిగాని, రూపముగాని యినుమంతయు లేక కేవలగుణరూపముగానుండు ద్వంద్వములు స్థూలదృష్టికిపరస్ప రము సాక్షాద్విరుద్ధ ధర్మములుగలవిగా గానవచ్చును. అందు గూడనొకటి సారమనియు రెండవది అసారమనియు చెప్ప రాదు. విమర్శనాదృష్టితో జూచినచో నివికూడ ఏదేని యొక వస్తువునుగాని, స్థానమునుగాని, తత్వమునుగాని యాశ్రయిం

చుకొనియుండి అవస్థాదికముతో నిశించునవియై యుండు టచే అందేదియు సారమని నిర్ణయించుటకు వలనుపడదు.

ఉదా : సుఖదుఃఖములు ఈసుఖదుఃఖములు అనుద్వంద్వములు ఒక పురుషుని అంతఃకరణకు సంబంధపడినవైయున్నవి. ఆ పురుషునికి గల రాగద్వేషములను పురస్కరించుకొని సుఖ దుఃఖము లాతనికి కలుగుచున్నవి. సుఖాభావమే సుఖము. కనుక సుఖశబ్దము దుఃఖమును, దుఃఖ శబ్దము సుఖమును అపేక్షించి ప్రవర్తిల్లుచున్నందున యివి పరస్పర సాపేక్షిక ములే. సారాసారములు అను పద ద్వంద్వముకూడా సాపే క్షికమే.

ఐతే సచ్చిదానందస్వరూపమై సృష్టికి పూర్వమే యునికి గల జగదధిష్ఠానమైయున్న బ్రహ్మముగూడా సాపేక్షిక మేనా? ఆ ఆత్మ లేక, బ్రహ్మము సాపేక్షిక ప్రతియోగిశబ్ద ములలో చేరదనిన్ని, అది నిరపేక్షిక కేవలత్వముగల వస్తు వనిన్ని పెక్కుమంది భావిస్తున్నారు. కారణము? అది నిరంజ నము, నిష్క్రియము సాక్షిరూపము, స్వయంప్రకాశము అని కొనియాడబడుచున్నది. ఈ ఆత్మ (పరమాత్మ) లేక బ్రహ్మము సాపేక్షికమో నిరపేక్షికమో యీదిగువ నుదహ రించినశ్రుతివాక్యములవల్ల స్పష్టం గాగలదు.

1. నదేవసోమ్యేఽదమగ్ర ఆసీదేకమేవాz ద్వితీయం.
2. తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి
3. (a) తత్సృష్ట్వాతదేవాఽనుప్రావిశత్
 (b) అనేనజీవేనాత్మనాఽనుపవిశ్య
4. పాదోస్యవిశ్వాభూతానిత్రిపాదస్యాzమృతందివి
5. లీలాదేతుకైవల్యం.

సృష్టికిపూర్వము బ్రహ్మ యొక్కటే తనకన్యంగా రెండవది లేకయుండెను. అనేకులుగా కావలెనని అది కోరెను. అన్ని జీవరాసులను సృష్టించి తానే అందు జీవరూపముగానుండెను. ఈ విశ్వమంతయు ఆ బ్రహ్మ పదార్ధమందు 1/4 వంతు భాగముతో యేర్పడెను. మిగతా 3/4 వంతు అమృతస్వరూపముగా అనగా బ్రహ్మస్వరూపముగానే యుండెను. ఎందుకొరకీ సృష్టి గావించి దానితో లంకెబడియున్నదనగా తన లీలావినోదముల కొరకే అని పైవాక్యముల భావమై యున్నది.

సంకల్పము, చింతన మొదలగు కర్మాచరణము, ప్రవేశ నిగ్రహాదులు ఖండాఽఖండలక్షణాలు, లీలావినోదాలు మొదలగునవన్నియు కల్గియుండి, సృష్టిబీజములను తన యందు సూక్ష్మరూపంలో యిముడ్చుకొని, తన యానం

దము కొరకు యీ విశ్వరచన గావించి దానిని ఆవిర్భావ
తిరోభావములను చెందించు యీ బ్రహ్మము నిరపేక్షక
కేవలత్వముగలది (Absolute Brahman) అగునా? జగన్నాటక
మును చూచి ఆనందించుటయే లీలగా గలదగుటచేతను, తన
ఆనందము ఆ జగన్నాటకముపై ఆధారపడుటవలనను ఆ
బ్రహ్మము నిరపేక్షకమని చెప్పరాదు. మరియును జీవరూప
ముగా ప్రవేశించి జీవవ్యవహారము జరిగించుచున్న ఆ చైత
న్యము యీ సాపేక్షిక జగత్తునందే నడయాడుచున్నది. జ్ఞాతృ
జ్ఞానజ్ఞేయములకు పరస్పరమూగల సంబంధముతో గూడియే
ఆ చైతన్యము సాపేక్షికముగా ప్రకటమగుచున్నది. జ్ఞానము
కూడా యితర పదార్థ సాపేక్షికంగానే కల్గి అదృష్ట్యానే సత్య
మైయున్నది. అన్యవస్తునిరపేక్షకంగా ఏవస్తువునకును స్వరూ
పంలేదు. ఉనికియేలేదు. ఒకదానియందొకటి వ్యాపకమై
అవినాభావముగా యంటూయున్న చైతన్యమూ పదార్థమూ
రెండూకూడా సాపేక్షికము లయ్యేయున్నవి.

వీటికన్నిటికి అత్యంత విలక్షణముగ నిరపేక్షిక స్వయం
సారవస్తువేదో యున్నదనియు, దానిని తెలిసికొనవలననియు
జిజ్ఞాసి ఆశపడుచున్నాడు. కాని తెలియబడే లక్షణమేయుంటే
ఆవస్తువు జ్ఞేయపదార్థకోటిలోచేరి జ్ఞానమునకు విషయమై
జ్ఞాతృజ్ఞానజ్ఞేయ రూపత్రిపుటిలో చేరిపోవుచున్నది. కనుక
యీ సాపేక్షిక జగత్తునకు ఆనిరపేక్షిక కేవలవస్తువే కారణ

మనిగాని, అధారమనిగాని, జగత్కారణబీజములు ఆకేవల త్వమున గలవనిగాని తానాకేవలత్వమున నిలిచి యీ సాపేక్షిక జగత్తును తనకు విలక్షణముగా చూచుచూ సాపేక్షిక జగత్తుయొక్క యునికిని విమర్శించవలెననిగాని, అనిరపేక్షక స్వయంసారకేవలత్వమును తెలిసి ప్రేమించి దానితో ఐక్యత పొందవలెననిగాని ఆశించుట నిరర్ధకమే కాగలదు. ఎంత ప్రయత్నించిననూ మానవుడు తానుతానుగావుండి సాపేక్షిక జగత్తును విడువగలుగుట అసంభవము తన యునికియే మానవుని యీ సాపాక్షిక జగత్తునకు సర్వదాబంధించుచున్నది. తాను పొందగల్గినది సాపేక్షికశాంతిమాత్రమే. తాను పొందగల్గినది సాపేక్షిక శాశ్వతత్వము మాత్రమే. తాననుభవించ గలిగినది సాపేక్షిక ఏకత్వము మాత్రమే. ఏలననగా తానూ, నిరపేక్షక కేవలత్వమూ రెండూ యునికిగల్గియుండుట అసంభవము. తాను లేకుంటేనేతప్ప నిరపేక్షిక కేవలత్వము సిద్ధించదు.

తానుండి యీనిరపేక్షిక కేవలత్వముమ గుర్తించవలెననే అడియాసకులోనై మానవుడు సృష్ట్యాదిమండియూ ప్రయత్నిస్తూనేయున్నాడు. దేశ, కాల, కర్మములను, సామర్ధ్య రూప శక్తిని, ఆశక్తిగల వ్యక్తిని లేక శక్తిమంతుని లేక స్థానమును, ప్రకృతిపురుషులను, ప్రాణప్రజ్ఞలను, సదసత్తులను

విమర్శించి చూచుచూ అందేదో యొకదానిని యానిరపేక్షిక స్వయంసార కేవలవస్తువుగా నిర్ణయించి ప్రతిపాదిస్తూ తిర్రి తన పొరపాటును గుర్తిస్తూ, ముందుముందుకు జిజ్ఞాస సాగిస్తూనేయున్నాడు. కాని దేశము, కాలము, కర్మము, శక్తి, శక్తుడు, ప్రకృతి, పురుషుడు, ప్రాణము, ప్రజ్ఞ, సత్తు, అసత్తు యివన్నియు సాపేక్షిక పదార్థజాతములోనే చేరిపోతూ సాపేక్షికమును మీరజాలక పోవుచుండెను. యిక గత్యంతరమేమి? అట్టి నిరపేక్షిక కేవల వస్తువు ఒకటున్నది అనుభావనమాత్రముతో యాజిజ్ఞాస యుపశాంతి పొందవలసినదేనా? అహా, అంతే. "యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ "నచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి, నోమనః" "అస్తీత్యేవోపలబ్ధవ్యః" అంటున్నాయి శ్రుతులు. అస్తి అని భావిస్తే అది భావాతీతమెట్లౌతుంది? మరిన్ని "అస్తి-నాస్తి"లు రెండునూ పరస్పర సాపేక్షికములుగదా! అయితే యికయెట్లు? "అది తెలియబడనిది అని తెల్పుకొంటే" అంటేసరిపోతుం దేమో? ఈ సందర్భంలో యీ దిగువ శ్రుతులను పరికించవలెను.

1. "యస్యామతంతస్యమతం । మతంయస్యనవేదసః ।
అవిజ్ఞాతం విజానతాం । విజ్ఞాతమవిజానతాం" ॥కేన॥

తా॥ ఎవడు తెలియదనెనో వానికి తెలియును. తెలుసునన్నవాడే నిజంగా తెలియనివాడు. దానిని ఏసాధనచేతను తెలిసికొనరాదని తెలిసినవాడే దానిని యెరిగినవాడు.

అహంబ్రహ్మాస్మి, అను మహావాక్యమున, యే 'అహం' అనగాయే 'నేను' ఉపలక్షింపబడినదో ఆ 'నేను' నేనై యుండి కూడ ఆ కేవలత్వమును గుర్తించలేను. ఆ నేను లేనిచో అది యున్నదని చెప్పువారే యుండరు. 'నేను' వుంటే, అది కేవలత్వమేగాదు. కనుక 'నేను' అను అహం పదార్థము సమూలంగా అత్యంత రహితస్థితిని పొందుటయే అట్టి కేవలత్వ సిద్ధి. అట్టి సిద్ధికలిగినదే జన్మరాహిత్యము. అంతవరకు యీ సాపేక్షిక చక్రభ్రమణములో, సంచర ప్రతి సంచరపద్ధతిగా, అధోర్ధ్వపరిణామములు చెందుచూ జననమరణ ప్రవాహములో "మృత్యోస్సమృత్యు మాప్నోతి "అన్నట్లుగా చచ్చుచు, పుట్టుచూ, పుట్టిచచ్చుచూ, చచ్చిపుట్టుచూ యుండి పోవలసినదే. ఇదీ అచలఋషుల దివ్యసందేశం. ఈ సందేశమే వేదోపనిషత్తుల చరమసిద్ధాంతం.

ఈ "పరిపూర్ణదర్శనము"ను ఆమూలాగ్రముగ శ్రద్ధగా చదివి యీసిద్ధాంతమును నిర్దుష్టముగా పాఠకులు ఆకళింపు చేసుకొనగలుగుదురేని నేను కృతార్థుడను. కాని సిద్ధాంతమును మాత్రమే తెలుసుకొనగలరుగాని దురుగోప్య విషయములు తేటతెల్లముకావు. కనుక యీ సిద్ధాంతము ననుసరించి కృతార్థులు కాదలచుకొన్న వారికొక్క మనవి. "గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః". "నాన్యఃపంథా౽మనాయ", కనుక "తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" అనురీతిగా గురుపాదము లాశ్రయించుటయే కర్తవ్యము. / .... /

శ్రీ గురుభ్యోనమః

# పరిపూర్ణ దర్శనము

## సృష్టి విజ్ఞాన ప్రకరణము

1. ప్రకరణోద్దేశము :- మన జ్ఞానేంద్రియములకు గానవచ్చు యీ తరులతాగుల్మాదులు పశుపక్షి క్రిమికీటకాలూ, నదీనదములూ, నిమ్నోన్నతములగు పర్వతశ్రేణులు, సూర్యచంద్రాది గ్రహములు, అసంఖ్యాకములగు నక్షత్రములు, అపారమగు సముద్రములు యీ మొదలైన స్థూల వస్తుసముదాయాన్ని జూచి విమర్శనా విశిష్టమగుమానవబుద్ధి వీని మూలతత్వాన్ని అన్వేషిస్తూనేయున్నది. హేతుబద్ధముగా ఆలోచించి సిద్ధాంతీకరించుచునేయున్నది. మన ఋష్యాదులు అట్టి జిజ్ఞాసగావించిచేసిన సిద్ధాంతములు, ఊహలు, భావాలు, మనకు నేడు వేదోపనిషదాదిగ్రంథముల యందు గానవస్తూ యున్నవి. యీ సిద్ధాంతములను పరిశీలించి యివి అన్నియు అత్యంతవిభిన్నములో లేక పరమసత్యాన్ని సాధించుటకై చేసిన ప్రయత్నపరంపరలయందు లభిస్తూవచ్చిన అవాంతరసత్యములో గ్రహించి వీని కన్నింటికి సమన్వయము గావించి సృష్టిమూలమును సిద్ధాంతం చేయుటయే యీ ప్రకరణోద్దేశం.

II (1) సృష్టి మీమాంసాప్రయోజనమేమి? :- ఏదో ఒకరీతిగా దేనినుండియో, యొకదానినుండి యీ సృష్టి అయింది. యిపుడున్నది. అందు మానవుడు సుఖమునో దుఃఖమునో పొంచూ వున్నాడు. అధికాధిక సుఖప్రాప్తి సాధనముల నన్వేషిస్తూనే యున్నాడు. కనుక మానవుని దుఃఖనివృత్తికి, అత్యధిక సుఖప్రాప్తికి తోడ్పడురీతిగా సుఖసాధనములను యింకనూ యుత్పత్తిచేయు మార్గమాలోచించవలెనే గాని యీ మీమాంసవలన ప్రయోజనంలేదు. యింటికి నిప్పంటుకొని కాలిపోవుచున్నది. దానినార్పుటకై ప్రయత్నించవలెగాని ఆ నిప్పెట్లు పుట్టింది? అనేవిమర్శ అవివేకము, శుద్ధఅనవసరం అని కొందరందురు. నిజమే, తాత్కాలికముగ, ఆ ఆపన్నివారణకై ఏదో యుపశాంతి ఆలోచించుటయే ప్రథమకర్తవ్యము. కాని ఆ యాపదలను గుర్తించినవారెప్పుడో యొకప్పుడు అట్టి ఆపదతిర్గి కలుగకుండా ఏతన్నివారణోపాయము లేమో ఆన్వేషించుట వ్యర్థముకాజాలదు గదా! అట్లే దుఃఖపూరితమగు యీజన్మ కలిగినదేమో కల్గినది కనుక యిందు లభించునంత సుఖము ఏవిధంచేతనైనా సంపాదించుటయే కర్తవ్యము అని అనుకొని ఆసుఖసాధనముల నన్వేషించుటలో మాత్రమే జీవితము సమాప్తిచెందించుకొనక అట్టి దుఃఖపూరితమగు జన్మ తిరిగి కలుగకుండా చేసుకొను యుపాయముల న్వేషించుట వ్యర్థముకానేరదు. యింటికి నిప్పంటు

కొని కాలిపోతూన్న సమయంలో ఒకనూతిని త్రవ్వ ప్రయ త్నించుట ఆయింటి నిప్పును చల్లార్చుటకు నిరుపయోగ మగునేగాని అప్పుడు త్రవ్విన నూతినీటితో ఆ తర్వాత అంటు కొనే యిండ్లనార్పుటకు సాధ్యమగునుగదా! అట్లే యిక ముందు అట్టి ప్రమాదములు రాకుండా కాపాడుకొనుటకు, ఆ అగ్నిని అదుపులో పెట్టుటకు ఆ అగ్ని పుట్టినా దానివల్ల యింటికి ప్రమాదమురాకుండా చేసుకొనుటకు, అగ్ని మూల మును అనగా అగ్ని ఏపరిస్థితులలో ఉత్పత్తి విజృంభణలు చెందునో తెలియుట, ఆపరిస్థితులు కలుగకుండా తగుజాగ్రత్త తీసుకొనుట, అగ్ని దహించని పదార్థము లన్వేషించి వానితో గృహనిర్మాణ మొనర్చుకొనుట, అగ్ని మాపకదళములను సిద్ధపరచియుంచుకొనుట, మొదలగునవి చేసుకొనవచ్చును. వ్యాధిమూలకారణమును గుర్తించినచో చికిత్సా విధానమున సౌలభ్యము గలుగునుగదా! అట్లే సృష్టిమూలమును గుర్తించు టకై చేయు మీమాంసయు వ్యర్థముకాజాలదు. మానవునికి దుఃఖనివృత్తి సుఖప్రాప్తి లక్ష్యములనుట నిర్వివాదాంశము. కనుక ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములనబడే త్రివిధ దుఃఖములను, ఆదుఃఖమూలములను, తన్నాశనా విధానము లను యెరింగినచో సుఖప్రాప్తి కలుగగలదు. ఏలనన దుఃఖ నివృత్తియే సుఖప్రాప్తి. దారిద్రవిచ్ఛిత్తియే ఐశ్వర్యప్రాప్తి.

॥ (2) సృష్టిఅనగానే పుట్టుకఅనేఅర్థముకూడా స్ఫు రించుచున్నది. పుట్టుకకలదానికి నాశనమున్ను సహజముగా

యుండును. ఉంటూవున్నది. అట్లే నశించేదానికిన్ని పుట్టుక వుండుననుట కూడా స్పష్టమే. సృష్టియందలి 84 లక్షల జీవరాసులున్ను పుట్టి పెరిగి నశిస్తూనేయున్నవి. అట్లే మానవుడును పుట్టి పెరిగి మరణిస్తూనే యున్నాడు. వున్నంత కాలమూ సుఖప్రాప్తికి ప్రాకులాడుచునేయున్నాడు. ఆసుఖములు క్షణికములున్ను అశాశ్వతములున్ను అయిపోవుచున్నవేయని వాపోవుచున్నాడు. కల్గిన సుఖము శాశ్వతంగా నిలుపుకొనగోరుచున్నాడు. సృష్టిలోని అన్నిటివలె అందరివలె అందరివలె తానున్ను నశించువాడుగానుండిన్ని శాశ్వతముగా వుండగోరుచున్నాడు. రాబోవు మరణమును ఒకవంక తెలుసుకొంటూనే ఆయూహకూడ భరించలేక వెంటనే దానిని విస్మరించుచున్నాడు. అజ్ఞాని జీవితరంగంలోని దుఃఖముల తాకిడికి ఆగలేక ఆత్మహత్య గావించుకొనుచున్నాడు. మరణరహస్య మెరుంగక మరణముతో తనకు దుఃఖవిమోచన మనుకొని మరణమును నిర్భయంగా ఆహ్వానించుకొని తాత్కాలిక దుఃఖోపశమనము గావించుకొనుచున్నాడు. కాని చచ్చినవానికి మరల పుట్టుకతప్పదు, అను సత్యమును తెలుసుకొన్నవానికే మరణమనగా భయము కలుగుచున్నది. మరణముతో యీ భార్యాపుత్ర ధన కనక వస్తువాహనాదులు, అన్నిటికన్న ప్రేమాస్పదమగు తన శరీరము అన్నిటిన వీడిపోవలెగదా అని భయము. మరణము గూడ సుషుప్త్యాదులవంటి యొక అవస్థేగదా దానికెందుకు

భయపడవలె. సహస్రవృశ్చికము లొకేతావున ఒకేమారుగా కుట్టినచో గలుగుబాధతో మరణబాధను పోల్చెదరు అగుగాక అయినను ఏదోకొంతకాలమాబాధను ఎట్లో అనుభవిస్తేసరి అనుకొని గుండె దిటవుచేసుకోవచ్చునుగదా! చావంటే భయముగాదు, చచ్చినచో తిరిగిపుట్టి త్రివిధతాపములను ఆజన్మాంతమూ అనుభవిస్తూ మరలచచ్చి, మరలపుట్టి మరల అనుభవిస్తూ యీవిధంగా అనంతముగ అసంఖ్యాకజన్మ లెత్తుచూ అనంత దుఃఖము లనుభవించవలసివచ్చునే అని, నిజముగా జ్ఞానియే భయపడుచున్నాడు. కనుక జననమరణ ప్రవాహరూపమగు సంసారమును అధిగమించిపోవలెనని ఆశించుచున్నాడు. సర్వపదార్థములూ ప్రతిక్షణమూ మార్పు జెందుటచూచి యీసృష్టిపరిధిలోగల ఏస్థానమునందునూ ఏవస్తువునందునూ, తనయందునూ, శాశ్వతత్వము లేదని గమనించి, సృష్టికిపూర్వ మేదైననున్నదా? వున్నచో అది సృష్టికి కారణమగునా? కార్యరూప మగుసృష్టి అశాశ్వతమగుచో, తత్కారణరూపమగు దానియందుమాత్రము శాశ్వతత్వమెట్లుండును? కారణమందులేని దోషములు కార్యమందెట్లు సంక్రమింపగలవు? కనుక సృష్టి కారణవస్తువునుగూడ అధిగమించి పోనియెడల శాశ్వతత్వమనునది కలలోనివార్త. సృష్టిబంధముననుతగుల్కొనిన తనకు, తద్బంధ విముక్తి (మోక్షము), సృష్టి కారణమునకు కూడ నతీతమై, సృష్టితో ఏమాత్రమూ

సంబంధపడని వస్తువునందే గలదు, పునరావృత్తిరహితమద్ధాని యందే చేకూరగలదు. కనుక అశాశ్వతవస్తువును తెలియుటకీ సృష్టియొక్కయూ, సృష్టికారణము యొక్కయూ ఆద్యంత ములు సంపూర్ణముగా తెలియుట అత్యంతావసరమైయున్నది.

3. సృష్టిరహస్యమును భేదించినచో, తానెట్లు తన సహజస్థానస్వరూప స్వభావములనుండి చ్యుతుడై అధోరూప పరిణామము చెందునో తెలియనగును. తన పూర్వస్థితికి చేరు మార్గము అనగా ఊర్ధ్వపరిణామము చెందు మార్గమున్ను సువ్యక్తముకాగలదు వచ్చినదారి గుర్తుకు తెచ్చుకొన్నచో యేస్థానమునుండి వచ్చెనో ఆస్థానమును చేరుకొనేమార్గము తద్భిన్నమై యుండదు కనుక ఆదారినిబట్టి పురోగమించి ఆశయసిద్ధి గాంచగలడు. వచ్చినస్థానము శూన్యమే అగుచో, ఆశూన్యమున తన వ్యక్తిత్వమును మహాశూన్యత గావించు కొనగలడు. అయితే పంచేంద్రియగోచరమగు స్థూలపదార్థ ములను మాత్రమేగాకుండా వానికి సూక్ష్మాతిసూక్ష్మముగ నున్న కారణవస్తులను కూడా అతీంద్రియ మనస్సుతో పరిశీ లిస్తూ అన్వేషణ కొనసాగించుట న్యాయము.

4. కర్మయొనర్చుటకనువగు స్థూలశరీరము, విషయ గ్రహణమొనర్చు పరికరములు అనగా యింద్రియములు, ఉచ్ఛ్వాస నిశ్వాసరూపముగా తన శరీరమునకును బాహ్య

ప్రపంచ మునకును తన జీవితపర్యంతం తెంపులేక సంధాన మొనర్చుచూనుండు ప్రాణవాయు సంచారము, వీనిక న్నింటిక్కి విలక్షణముగా గానుపించు తన వ్యక్తిగుర్తురూపమగు అభిజ్ఞ యివి అన్నియు ఏవస్తువు లేక వస్తువులనుండి ఏరూ పముగా గల్గినవి? వీనినన్నిటిని నియమించి పనిచేయించు కర్తఎవరు? ఏవస్తువుతో ఏపరికరముల సహాయముతో యీ విశ్వరచన గావించబడెను? యిత్యాది సమస్యలకెన్నిటికో సమాధానం యీసృష్టిరహస్య మెరింగినచో బడయవచ్చును.

5. మానవుడుకూడా సృష్టిజాతములో కానవచ్చు చున్నాడు. ఆతడీ సృష్టిలోనివాడేనా? తద్విలక్షణుడా? సృష్టి లోనివాడే అనేపక్షంలో యీసృష్టిబంధమున తానెట్లు తగుల్కొ నెను? కాడనేపక్షంలో సృష్టికిపూర్వమే తానుండెనా? అట్లుండె నంటే తానే సృష్టికర్తయా? తానుసృష్టికర్తకాడంటే, తాను ఒకడూ, సృష్టికర్త మరొకడూ, అంటూ మొత్తం సృష్టికి పూర్వం యిర్వురుండిరా? తానే సృష్టికర్త అంటే ఆసృష్టికర్త కుండవలసిన శక్తిసామర్ధ్యములు తనకున్నవా? తాను సృష్టి కర్తకాడు, ఆసృష్టికర్త సృష్టించినదానిలో తానూ ఒకభాగమే అనేపక్షంలో, మొదటినుండియూ తాను మానవుడుగానే వుం డెనా? లేక ఒక యుపాధినుండి మరియొక యుపాదికి క్రమ వికాసము చెందుచూ తుదకు మానవుడుకాగల్గెనా? క్రమ

వికాసమంగీకరిస్తే ఆవిధంగా పరిణమిస్తూవచ్చిన తొలివస్తువు లేక వుపాధికిగల స్థాన, స్వరూపస్వభావము లెట్టివి?

తనవంటి మానవులున్నూ, మానవులు మాత్రమే గాక పశుపక్షాదులున్నూ తనకుగల స్థూలసూక్ష్మాది శరీరములు, శక్తులు గల్గియుండి తనకు గలుగుచున్న సుఖదుఃఖానుభవములను అవిగూడా పొందుచూ, తనవలెనే శరీరయాత్ర సాగించుచున్నవి. కనుక యీ 84 లక్షల జీవోపాధులు సమష్టిస్వరూపమునకు ఏకవస్తువే కారణస్వరూపంగా నుండవలెను అది ఏదిఅయిననూ దానినుండియె యీపాంచభౌతిక జగత్తుగూడ సృష్టిఅయి వుండవలెను. అది తెలివీ చేతనమూలేని జడపదార్థమో, లేక తెలివిగల్గినపదార్థమో, లేక తెలివిలేనిదైనను చేతనశక్తిమాత్రము గల పదార్థమో, లేక తెలివిమాత్రమే యునికిగాగల తత్వమో, లేక మానవుల యూహకెంతమాత్రము అందని మరియొకటియో లేక కేవలశూన్యమో విచారించి తెలిసికొనగోరుట బుద్ధి వైశిష్టముగల్గిన మానవుడు తెలసికొనగోరుట మిక్కిలి సహజము. యితర ప్రయోజనములున్ననూ లేకున్ననూ మానవ విజ్ఞానాభివృద్ధియైన అందువలన కాగలదు గదా! యీ జిజ్ఞాసచేయకుండుటగాని, అనవసరమని త్రోసిపుచ్చుటగాని కేవలము అసహజము. మానవప్రకృతికే విరుద్ధము.

6. "సృష్టియే మిధ్య, పారమార్థిక సత్యత్వం లేనిది" అను పక్షంలో కూడా అపారమార్థిక సత్యపదార్థము నుతెలుసుకొనుటకు యీమిధ్యాసృష్టియే అధారమైయున్నది. సృష్టియే లేదని ప్రథమములోనే నమ్మియూరకున్నచో పారమార్థిక సత్యమని చెప్పబడే బ్రహ్మపదార్థమును గ్రహించుటకు అవకాశమే వుండజాలదు. కనుక సృష్టివిజ్ఞానము యీ పక్షంలో కూడా కడుంగడు అవసరమైయున్నది.

7. "సృష్టియదార్థమో, అయదార్థమో దానికి మూలమున్నదో, లేదో, యివన్నియు విచారించుటకు అల్పజ్ఞులమైన మనకు శక్తిజాలదు. మనమందుకు పూర్తిగా నసమర్థులము. సృష్టిరహస్యమును ఛేదింపజూచుట కడుంగడు సాహసము. భగవద్విలాసమీసృష్టి. అంతయు ఆయనలీల" అని తమసంశయములను దిగమ్రింగుకొని యూరకుండుట బుద్ధివిశిష్టుడగు మానవుని నైజమునకే విరుద్ధము.

కనుక సృష్టిమూలము నన్వేషించునట్లు తటస్థలక్షణమున్నూ యుండరాదు. కొన్ని శ్రుతులు సృష్టిమూలమును సగుణనిర్గుణ రూపమగు బ్రహ్మపదార్థముగా నిర్ణయించుచున్నవి. కొన్ని బ్రహ్మము సత్యము. సృష్టికి మూలము కాదు, సృష్టి అంతయూ మాయాపరిణామము మాత్రమే, అని అంటూవున్నవి. యీ రెండువిధములగు శ్రుతులకు సమన్వయపరచుటకైన ప్రయత్నించక తటస్థవిధాన మవలంబించుటయు కూడదు. యీపట్ల సంశయములు రెండువిధములు.

(1) నిశ్చయాత్మక సంశయము :- సృష్టికి మూల ముండుట నిశ్చయము కాని మన అల్పజ్ఞతవలన నెరుకపడ కున్నది. అనుట నిశ్చయాత్మకము.

(2) అనిశ్చయాత్మకము :- విశ్వమూలమును సంభావింపనైన మన మసమర్థులము అనుట అనిశ్చయాత్మక సంశయము.

ఎవరికైననూ సంశయములు జనించుట సహజమే కాని "సంశయాత్మా వినశ్యతి" అంటూంది భగవద్గీత.

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినస్యతి
నాయంలోకోఽస్తినపరోనసుఖం సంశయాత్మనః
భ॥ గీ॥ అ 4-శ్లో 400

కనుక సంశయము కలుగనేరాదు కలిగెనేని పూరు కొనక దానిని గురువులవలన రహితపరచుకొనవలెను. అట్లు గావించక గురువు, శాస్త్రము, పరలోకం ఆత్మ పరమాత్మ- అన్నియు బూటకములనువారి విషయం మనకనవసరం. సృష్టివిజ్ఞానమువలన సర్వసంశయ రహితము కాగలదు.

8. స్థూలాతిస్థూలమునుండి సూక్ష్మాతి సూక్ష్మముగా విచారించుటకు మానసిక ఏకాగ్రత కావలసియున్నది. మానసిక ఏకాగ్రత అంతఃకరణ పరిశుద్ధగలవానికి మాత్రమే చేకూరగలదు. అంతఃకరణ పరిశుద్ధి సత్కర్మానుష్ఠానపరునికి

మాత్రమే సిద్ధించును. కనుక పరికీయజ్ఞానముపై గుడ్డిగా నాధారపడవలసిన అవసరంలేకుండా తానుస్వయంగా సృష్టి రహస్యమును యెరుగదలచినవాడు మనస్సును ఏకాగ్రత చేసి సూక్ష్మాతిసూక్ష్మముగా వస్తునిశ్చయము గావించుకొను చూపోయి తుట్టతుదకు సృష్టిమూలమును తెలుసుకొనవలసి యుండును. కనుక, సత్కర్మానుష్ఠానము, తద్వారా అంతః కరణశుద్ధి, ఆపైన మనస్సుయొక్క ఏకాగ్రత సాధించవలసి యుండును. కనుక యీసత్యాన్వేషణలో జిజ్ఞాసి నీతివంతుడు కాగలుగుచున్నాడు. అంతేకాకుండా సమష్టిదృక్పథముతో అంతకంతకు ఏకత్వమునకును దారితీసి అన్నిటియందునూ తానె అనియూ, తనయందు సర్వమూవున్నవనియూ గుర్తెరిగి తానే ఆత్మస్వరూపుడై నిలువగలుగుచున్నాడు. బ్రహ్మమే సృష్టికారణము అయితే సృష్టి కారణ మరయుట బ్రహ్మము నరయుటయే కాగలదు. కనుక యీ సృష్టిరహస్యాన్వేషణ మానవుని ప్రథమకర్తవ్యము. సృష్టి రహస్యమెరుంగనిచో సంసారముయొక్క నిస్సారత తేటతెల్లంకాదు. వైరాగ్యం పెంపొందదు.

III సృష్టిశబ్దార్థవిచారము :- సృష్టి అను శబ్దమునకు వ్యుత్పత్తిచేయుట లేక కల్పించుట అని అర్థము. యివి క్రియలు. క్రియయున్నచో కర్తయు కర్మయూగూడ నుండ వలెను. "క్రియత యితికర్మ" అనగా చేయబడినదగుటచేత

కర్మ అని వ్యుత్పత్త్యర్థము గనుక సృష్టియనునది కర్మగా నున్నది. యీకర్మ లేక కార్యము, జీవజగద్రూపంగా ప్రత్యక్షంగా గానవస్తూనేయున్నది. కనుక, కర్తను (కారయిత, కారణవస్తువు) కనుగొనుటయే యీప్రకరణోద్దేశము.

యీ కర్తకేనిమిత్తకారణమని పేరు. ఆకర్త గొప్ప తెలివి గల్గియుండవలెను. లేనిచో యీకార్యరూప జగద్రచన యింత సౌష్టవముగా నుండజాలదు. మరి ఆకర్మచేయుటకు బహిస్సాధనములు, లేక అవయవములు లేక కర్మేంద్రియములతో గూడిన శరీరముండవలెను. అంతేగాక ఏవస్తువుతో (ఏముడిపదార్థముతో) కార్యరూపవస్తువు తయారుకావలెనో ఆ పదార్థ ముండవలెను. దానికే ఉపాదానకారణమని పేరు. ఆ కార్యరూపవస్తువును తీర్చిదిద్ది సర్వాంగసుందర మొనర్చుటకు తగిన పనిముట్లుకావలెను. వీనినే సహాయకారణము లందురు. కనుక ఒక కర్మ, లేక పనిచేయుటకు (1) ఆపని చేయుస్థానము (2) తెలివిరూపమగు కర్త (3) యింద్రియములతో గూడిన శరీరము (4) ముడిపదార్థము (5) పనిముట్లు అను అయిదున్నూ అవసరమైయున్నవి, దీనినే

శ్లో॥ అధిష్ఠానం, తథాకర్తా, కరణంచపృథగ్విధం, వివిధాచ
పృథక్చేష్టాదైవం చైవాత్రపంచమం॥ భ.గీ అ. 18-4 శ్లో

మరియు కృతకమగు (చేయబడినదగు) వస్తువునందు యీక్రింది 4 లక్షణములుగాని అందు కొన్నిగాని గానరాక

తప్పదు. అవియేవియనగా (1) ఉత్పత్తి (2) ప్రాప్తి (3) సంస్కారము (4) వికారము అనునవి. యీ నాలుగూ కర్మ ఫలములు. కనుక యీ నాలుగింటిలో ఏవక్కటి వస్తువునందు గానుపించినా ఆ వస్తువు, యొక కర్మఫలమని నిర్దేశించుటలో యెట్టి ఆక్షేపణయూ నుండజాలదు. సృష్టిజాతము నందెల్లెడలా యీ నాలుగున్ను స్పష్టముగా గానుపించుచున్నవి. కనుక సృష్టిఅంతయూ కృతకమే. అనగా చేయబడినదే అని సిద్ధాంతం చేయవచ్చును ఎట్లనగా ఉత్పత్తి = ఒక క్రొత్త వస్తువు తయారగుట.

ప్రాప్తి = గమనాదిక్రియలవల్ల ఒక స్థానము లేక స్థితి పొందుట సంస్కారము = వస్తువునందుగల దోషమును తొలగించుట వికారము = ఉన్న వస్తురూపమును మార్చి నూతన రూపమును గల్గించుట. అను యీనాలుగున్ను జీవజగత్తుల యందు ప్రతీతియగుట గమనించుచున్నాముగదా! కనుక జీవజగత్తులు కార్యరూపములనుటలో సందేహంలేదు. స్థూల రూపమగు కార్యరూప జగత్తునుంచి సూక్ష్మమగు కారణరూప వస్తువును శోధించి తెలుసుకొనుటకై కార్యరూపజగత్తునుండయే అన్వేషణ ప్రారంభించవలసియుండును. అపుడే సృష్టికారణమును మనము కనుగొనగలము.

సృష్టికి పూర్వముండిన స్థితిని మనమూహించినచో అదియొక పూర్ణవస్తువో లేక శూన్యవస్తువో, ఏదిఅయిననూ,

అది నిరాకారము, నిరవయవము, నామరూపరహితమూ అయి వుండవలెను, అనిమనబుద్ధికి తోచుచున్నది. అట్టి వస్తువునుండి అత్యద్భుతమగు యీసాకార, సావయవ, నామరూప సహిత మగు జగత్తువచ్చియుండవలెను. అనగా సావయవరూప జగత్తు సృష్టికిపూర్వం, కారణవస్తువునందు, గర్భీకృతమై బీజరూపమున యుండెనని అనకతప్పదు.

యిపుడు గానవచ్చు యీసృష్టికిపూర్వోత్తరదశలున్న వని అందరు అంగీకరింతురు. సృష్టికి పూర్వదశయందున్న సృష్టి కారణవస్తువునందు అణగిమణగి బీజరూపంగావున్న నామరూపాదులు ప్రకటమగుట సృష్టియనిన్ని తిరిగి కారణ వస్తువునందు లీనమగుట ప్రళయ మనిన్ని, అంటున్నాము కాని సృష్టి ప్రళయములనే శబ్దప్రయోగము సమంజసమై నది కాదు. ఏలననగా యిదివరకసలే లేనివస్తువు కల్పింప బడితే దానినే సృష్టియనచెల్లును. అట్లే శాశ్వతంగా నసించి పోయే లక్షణం వుంటేనే ప్రళయమనవలెను. కారణవస్తువు నుండి ప్రకటమగుట తిర్గి కారణవస్తువునందు లీనమగుట మాత్రమే. కనుక యీ జీవజగత్తులు అకారణవస్తువులో ఆవి ర్భావతిరోభావములు చెందుచున్నవి. అనిమాత్రమే చెప్ప నొప్పును. యీజీవజగత్తులను తనయందు దాచుకొంటూ కను పరుస్తూ ఆవిర్భావతిరో భావములను చెందుచూ, లేక చెందిప

చేయుచూనుండే వస్తువేది? అదే సృష్టికారణము. అదే కారణరూవస్తువుగానూ కార్యరూపవస్తువుగానూ, మార్పులు చెందుచున్నది కారణమో, ఉపాదానకారణమో లేక సహాయకారణమో లేక అష్టకారణములలో ఏకారణమో లేక యిన్నియింకాయెన్నైనా అన్నికారణములయొక్క సమాహారమైన మహాకారణమో అయి వుండవలెను అని మనయూహకు స్థూలముగా గోచరించుచున్నది:

"సృష్టి" యనగా క్రొత్తగా గల్పించబడినది అని శబ్దార్థమైనట్లు గమనించితిమి యిదివరకే క్రమరోరూపంలో వుంటే సృష్టిశబ్దం వాడరాదు. పైన వివరించినట్లు అవిర్భావతిరోభావములనే పేర్కొనాలి. లేదా, "సృష్టి" అనే శబ్దం సరిగానే ప్రయోగింబడెనన్నచో-ఆపక్షంలో నానాత్వముతో గూడిన యీసమస్తము యుగపస్సృష్టిగాకల్గినదా? అనగా ఒక్కసారిగా ఇంద్రజాలకుని జాలమువలె కల్పించబడినదా? లేక క్రమసృష్టిగా వికాసము చెందినదా? అనగా ఆదిలో ఒక వస్తువు మాత్రమేవుండి అది క్రమశః "ఏకం అనేకం భవతి" అను రీతిగా నానాత్వము చెందుతూ ఒకదానినుండి వేరొక రూపముగా పరిణమిస్తూవున్నదా? అని రెండు వికల్పములు ఏర్పడుచున్నవి. యుగపస్సృష్టి హేతువాదమునకు గాని విజ్ఞానదృష్టికిగాని సరిపడుటలేదు. కనుక క్రమసృష్టినే అంగీకరించవలసియుండును. అపుడు ఆదిలో ఏకవస్తుగావున్నదే

అంతకుపూర్వము ఏమీలేని అత్యంత అభావవస్తువని యన వలసివుండును. అదే సృష్టిఅయిన ప్రథమవస్తువు దానికేమైన మూలమున్నదా, కొనకు ప్రవేశించేందుకు స్థానమున్నదా అను ప్రశ్నలే మనకు అత్యంతముఖ్యములు.

IV సృష్టిరహస్య భేధనమునకై మానవుని ప్రయిత్నములు.

మానవుడీ సృష్టిరహస్యాన్ని భేదించుటకై ఏనాటి నుంచియో ప్రయత్నిస్తూనే యున్నాడు. వివిధ రూపములగు సిద్ధాంతములను పూర్వపక్షంచేసి కొంగ్రొత్త సిద్ధాంతములను ముందుకు నెట్టుచున్నాడు. యింతవరకు వేర్వేరు కాలములలో వేర్వేరు వ్యక్తులు కావించిన సిద్ధాంతములెన్నియో గలవు. వారివారి తపశ్చర్యల ఫలితంగా లభించిన అనుభవంలో వారు గావించిన సిద్ధాంతములు, విజ్ఞానానుభవములు మన మహర్షులనుంచి మనకు వారసత్వముగా సంక్రమించి వేదోపనిషత్తులనే పేటికలందు ఆ విజ్ఞానధనమంతయు సేకరించబడి మనకందీయబడుటచే పూర్వపూర్వ యుగముల వారందరికంటెను మనమే అదృష్టవంతులము. గాని మన పూర్వ ఋషులు గావించిన నిర్ణయములు పరస్పరవిరుద్ధములై యున్నవి. కనుక మనము అందే సిద్ధాంతమును కేవల సత్య సిద్ధాంతముగా అంగీకరింపజాలకున్నాము. ఐనమా ఆపరస్పర విరుద్ధసిద్ధాంతములన్నిటినీ పరిశీలించి కేవలసత్యా

న్వేషణా దృక్పథముతో కృషిగావించినచో అసిద్ధాంతము లన్నిటియొక్క సమాహారమందునూ మనకు పూర్ణ సత్యం గోచరించవచ్చును. అంతేగాని దేనికది విడదీసి వివేచించి నచో అది పూర్ణసత్యంకాదని, యేదోయొక దృక్కోణంతో సాధించిన అర్ధ సత్యమేననీ మనకు గానవస్తూ వుంటుంది ఈసిద్ధాంత సమూహములు యెదుటనుంచుకొని, ఒక్కటొక్క టిగా ఆకలింపు చేసుకొని వానిఅన్నిటి కూడలిస్థానమును గుర్తెరింగి సమన్వయ పరచి సృష్టికికారణమగు వస్తువును యిదమిద్ధమని నిర్ణయము చేయవలసివున్నది. గనుక మన పూర్వ ఋషుల యనుభవములను వేదోపనిషదాదిగ్రంథముల నుండి గ్రహించి తెలిసికొందము.

ఋగ్వేదము :- వాజసనేయసంహిత 33-74 :- జిజ్ఞాసి అడుగుచున్నాడు.

"కింసిద్వనంక ఉసవృక్ష మాసీత్ యతోద్యావాపృథ్వీ నిష్టతక్షుః"?

తాత్పర్యము :- ఏవనమునందలి ఏ చెట్టుయొక్క కర్రతో యీదివి. భువి (భూమ్యాకాశములు అనగా మొత్తము జగత్తంతయునని అర్థము) చెక్కబడినవి? అనిప్రశ్న- అనగా యీ విశ్వమేమూలపదార్థముతో సృష్టింపబడెను? అన్నది చాలా పురాతనమైన ప్రశ్న.

యిందుకు సమాధానంగా ఒక్కమాటలో సూటిగా "బ్రహ్మవనం బ్రహ్మ సవృక్షఆసీత్ యతోద్యావాపృధ్వీనిష్ట తక్షుః మనీషిణో మనసా విబ్రవీమివో, బ్రహ్మధ్యతిష్ఠన్ భువనానిధారయన్॥

యిందుకు తాత్పర్యము:- బ్రహ్మయే ఆవనము, ఆవనమందలి ఆవృక్షమున్ను బ్రహ్మమే. ఆ వృక్షముయొక్క కర్రచేతనే యీ దివీ భువీ చెక్కబడినవి. పండితులైనవారు, ఆ బ్రహ్మమే సమస్తభువనములను ధరించిభరించుచూన్నదని తమ అతీంద్రియశక్తులచే గుర్తించిరి. అని పై ప్రశ్నకు జవాబివ్వబడినది.

యీ ప్రశ్నోత్తరములలో సృష్టియొక్క యుపాదాన కారణమే లక్షింపబడినట్లు కనుపించుచున్నను, నిమిత్త సహాయ కారణములుగానుండుట కపుడు అన్యవస్తువే లేదని చెప్పుటకై, ఆవనమూ బ్రహ్మమే, ఆచెట్టూ బ్రహ్మమే అంటూ అపుడున్నదిబ్రహ్మమొక్కటేయని చెప్పబడినది. కనుక నిమిత్తోపాదానాది సమస్తకారణమునున్నూ ఆబ్రహ్మమే అని శ్రుతి చెప్పినట్లే అయినది.

యీవిధంగా బైలుదేరిన జిజ్ఞాసకంతటికి సమాధానంగానుండి మొత్తం హైందవవేదాంతమునకంతటికీ పునాదియని చెప్పదగిన ఋగ్వేదమునందలి నాసదీయసూక్తమని

చెప్పబడే దానిని పూర్ణముగా విచారించిన సృష్టిక్రమమం తయు ద్యోతకము కాగలదు.

నాసదీయసూక్తము :- ఋగ్వేదం దశమమండలం 129 సూక్తం.

1. నాసదాసీన్నో సదాసీత్తదానీం ।
   నాసీద్రజోనోవ్యో మోపరోయత్ ।
   కిమావరీవః కుహాకస్యశర్మన్ ।
   అంభః కిమాసీద్గహనంగభీరం॥

తా॥ సృష్టికిపూర్వం సదసత్తులులేవు. అంతరిక్షాకాసములులేవు. అపుడు దేనిని, ఎవరు, ఎక్కడ ఎవరిసుఖము కొరకు, ఆవరించిరి? గహనం, గంభీరం, అయిన అంభస్సు మాత్రం అపుడెక్కడనుండెను?

2. నమృత్యురాసీ దమృతంనతర్హి
   నరాత్ర్యాఅహ్న ఆసీత్ప్రకేతః ।
   ఆనీదవాతం స్వధయాతదేకం
   తస్మాద్ధాన్యన్న పరః కించవాస॥

తా॥ అపుడమృతమృత్యువులు రాత్రింబవళ్లు అనే నిర్ణయముచేయు సాధనములులేవు నిర్వాతంగా స్వశక్తిచే చైతన్యస్ఫూర్తి కల్గినదేదో ఏకమైయుండెను.

3. తమఆసీత్ తమసాగూఢమగ్రే
   ప్రకేతం సలిలం సర్వమాయిదం ।

తుచ్ఛేనాభ్వపిహితం యదాసీత్
తపస స్తన్మహినాఽజాయతైకం

తా॥ ప్రథమంలో అంతాఅంధకారమయమైయుండెను. సర్వము జలమయమైవుండెను. వున్న ఏకవస్తువు మాయచేపిహితమై అనగా కప్పబడినదై తన తపోమహిమచే సృష్టి ప్రకటమయ్యెను.

4. కామస్తదగేసమవర్తతాధి
మనసోరేతః ప్రథమయదాసీత్
సతోబంధుమసతి నిరవందన్
హృదిప్రతిష్యాకవయోమనీషా॥

తా॥ ప్రారంభమందు కామముండెను. ఈ కామమే మనస్సుకు బీజమై సృష్టికి కారణమయ్యెను. కవులు తమ బుద్ధిచేత హృదయములందు పర్యాలోచించి నాశనశీలమైన యీదృశ్యసృష్టి అవినాశ్యమైన అసత్తుతో సంబంధముకలదే నని నిర్ణయించిరి.

౫. తిరశ్చీనోవితతోరశ్మి రేషామ్
అధస్విదాసీదు పరిస్విదాసీత్
రేతోధా ఆసన్ మహిమాన ఆసత్
స్వధాఅవస్తాత్ ప్రయతిః పరస్తాత్॥

తా॥ దానికాంతి అంతటను ధ్రువముగా వ్యాపించెను. అది క్రిందనూ మీదనూ సర్వత్రా వ్యాపించె నుఅదే సృష్టికి

బీజప్రదమై మహిమావంతమాయెను. దాని శక్తి, ప్రభావమూ అటునిటు వ్యాపించెను.

6. కో౽ర్ధావేదక ఇహప్రవోచత్
కుతఆజాతా కుతయియంతం విసృష్టిః
అర్వాగ్దేవా అస్యవిసర్జనేనా౽
థకోవేదయత అబభూవ॥

తా॥ యీదృశ్యసృష్టి యెక్కడనుండి వచ్చినదో ఎవరినుంచి ఎట్లు పుట్టినదో దేవతలకైననూ తెలియసాధ్యముకాదు. (ఏలనన వారునూ సృష్టిలోనివారే కనుక సృష్టిమూలమును వారు గుర్తెరుగలేరు.)

7. ఇయం విసృష్టిర్యత అవభూవ
యదివాదధే యదివానదధే
యో అస్యా౽ధ్యక్షః పరమేవ్యోమన్
సో౽ంగవేద యదివానవేద॥

తా॥ దేనినుంచి యీసృష్టిఅయినదో అది స్పష్టంగా తెలిసినా తెలియకపోయినా అధిష్ఠాన స్వరూపుడగువాడేమైననూ బహుశా యెర్గివుండవచ్చును. లేక యెరుగకనూపోవచ్చును.

ఇందలి మొదటిమంత్రం, సర్వలక్షణ విలక్షణమగు కేవల పరిపూర్ణపరబ్రహ్మమును అనువదించుచున్నది. రెండవ

మంత్రములో-శక్తియుతమును, చేతనవంతమును, ఏకమును, అమృత-మృత్యువులు తేజోంధకారములు సదసత్తులు మున్నగు సర్వద్వంద్వములు లేనిదై తానుమాత్రం ప్రకాశించు స్వప్రకాశ చేతన బ్రహ్మము అనువదించబడినది. మూడవ మంత్రమునందు- అంధకారము, జలము, మాయావరణము మొదలగునవి చెప్పబడి వానిచే శబలితమై తన తపస్సుచే 2వ మంత్రంలో చెప్పబడిన స్వప్రకాశచేతన బ్రహ్మము ప్రకటమయ్యెనని చెప్పబడినది. 4వ మంత్రమునందు యీమాయాశబళితబ్రహ్మమునకు సృష్టికామన కల్గెనని చెప్పబడినది. 5వ మంత్రమునందు, యీసృష్టికామన బాగుగా విజృంభించి సర్వత్ర వ్యాపించి సృష్టికి బీజరూపమాయెనని తెలుపబడినది. 6, 7 మంత్రములలో- యీసృష్టి ఎక్కడనుండి లేక ఎవరినుండి వచ్చెనో దానిని గురించి యింతకంటె విపులంగాచెప్పుటకు అప్పడక్కడనుండి చూచినవారెవరు? దేవతలు సహితము చెప్పలేరు. అధిష్ఠానస్వరూపుడేమైననూ ఎరుగునో ఎరుగడో ఏమో- అని చెప్పబడినది. అదిష్ఠానస్వరూపుడుగూడ ఎరుగడేమోయని సందేహమెందుకనగా- బ్రహ్మము సృష్టికి నిమిత్త కారణమున్ను ప్రకృతిమూలోపాదానకారణమున్ను అయివుండి రెండున్ను అనాదులే అయినచో ఒక అనాదితత్వము రెండవ అనాదితత్వము యొక్క మొదలెరుంగుటెట్లు సంభవము? కనుక అతడున్ను ఎరుగడేమోయని అనవలసి వచ్చెను.

ఇందు స్వప్రకాశచేతనబ్రహ్మము మాయచేసిహితమై సృష్టికామనగల్గి స్వధయా, యనగా తన స్వశక్తిచేతనే సృష్టి గావించెను, అని చెప్పబడినది ఎట్లనగా– "ఏతావానస్యమహి మాఽతోజాయాంశ్చపూరుషః" అని ఋగ్వేదం 10–90–3 అనగాఆమహిమవల్లనే పురుషుడు పుట్టెను అబ్రహ్మమునకట్టి శక్తిగలదని "స్వేమహిమ్ని ప్రతిష్ఠితః" అని చాంధోగ్యం 7–24 1 లో తనమహిమయందే తాను ప్రతిష్ఠితమైయున్నట్లుచెప్పి బల పర్చుచున్నది. యీభావములు తరువాత తరువాత యెట్లు వికాసము చెందినవో గమనింతము. ఉపనిషత్తులు వానినెట్లు వివరించినవో ముందుగాచూతుము.

1. కఠోపనిషత్:ద్వితియాధ్యాయం–తృతీయవల్లి౧వమంత్రం

"ఊర్ధ్వమూలో అవాక్ శాఖఏషోఽశ్వత్థసనాతనః
తదేశశుక్రం తద్బ్రహ్మతదేవామృతముచ్యతే
తస్మిన్నులోకాశ్శ్రితాస్సర్వేతదునాత్యేతికశ్చన
ఏతద్వైతత్॥"

తా॥ అశాశ్వతమగౌ సంసారము (సృష్టి) అను అశ్వత్థ వృక్షము ఊర్ధ్వమూలముగలది అనగా బ్రహ్మమే మూలముగా గలది ఆ బ్రహ్మము పరిశుద్ధము. అదియే అమృతము ఆబ్రహ్మమునందే లోకములన్నియు అశ్రయించియున్నవి, దానినతిక్రమించిన లోకమొక్కటైనలేదు.

2వ మంత్రం "యదిదంకించజగత్సర్వం, ప్రాణ
ఏజతినిస్సృతం"

= యీపరమాత్మనుండే యీసర్వజగత్తు బయలువెడలినది.

2. ప్రశ్నోపనిషత్ : తస్మైసహోవాచప్రజాకామోవై ప్రజాపతిఃసతపోఽతప్యతసతపస్తప్త్వా సమిథునముత్పాదయతే, రయింగప్రాణంచేత్యేతౌమే బహుధాప్రజాఃకరిష్యత ఇతి:"

తా॥ ప్రజలనుసృష్టింపదలచినప్రజాపతి(హిరణ్యగర్భుడు) తీవ్రముగా ఆలోచించి (1) రయి (సోముడులేకచంద్రుడు) (2) ప్రాణము [=సూర్యుడు] అను ద్వంద్వమును సృష్టించెను అగ్నిసోమాత్మకమగు యీమిథునమువలనసకలసృష్టిఆయెను కనుక యీ యుపనిషత్ ముఖ్యాభిప్రాయమేమనగా, సగుణ స్వరూపమగు బ్రహ్మము, అనగా హిరణ్యగర్భుడు సమష్టి మనస్సును(రయి=చంద్రుడు)సమష్టిప్రాణము (సూర్యుడు)ను మొదట సృష్టించి వాని సహాయముతో సకల జగజ్జీవులను సృష్టించెను.

3. ముండకోపనిషత్: ప్రథమముండకం, 1వ మంత్రం

"ఓంబ్రహ్మదేవానాంప్రథమస్సంబ భూవవిశ్వస్యకర్తా భువనస్యగోప్తా" -సకలప్రపంచమునకు సృష్టికర్తయు,పోషణ కర్తయు అగు హిరణ్యగర్భుడు, దేవతలలోపల మొదటివాడుగా స్వయముగా ఆవిర్భవించెను. అనగా అనిర్గుణపరబ్రహ్మమే గుణస్వరూపుడాయెనని తాత్పర్యము.

6వ మంత్రం: యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణమచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం, నిత్యం విభుంసర్వగతం సుసూక్ష్మంతదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తిధీరాః

= జ్ఞానకర్మేంద్రియములచే తెలియబడనిది, వర్ణమూ గోత్రము లేనిది, అంతట వ్యాపించినది. జ్ఞానకర్మేంద్రియములు లేనిదివిభుస్వరూపమైనది, అత్యంత సూక్ష్మమైనది. నాశనము లేని శాశ్వత వస్తువును,సకలభూతములకు యోనిరూపంగా నున్నది ఏదో దానిని పండితులు చక్కగా చూచుచున్నారు. యిచ్చట గల భూతయోని అనగా మూలప్రకృతియా? లేక బ్రహ్మమా?అను సంశయమునకు వ్యాసుడు బ్రహ్మసూత్రములలో (అదృశ్యత్వాధికరణం) "అదృశ్యత్వాదిగుణకోధర్మోక్తేః" "విశేషణభేదవ్యపదేశాభ్యాంచనేతరౌ" అను సూత్రములచే బ్రహ్మమే అభూతయోని అని సిద్ధాంతంచేసెను. నిర్గుణ సగుణ స్వరూపములుగా నుండిన ఆబ్రహ్మమే భూతయోని.

8వ మంత్రం: యథోర్ణభిస్సృజతే గృహ్ణతేచ యథాపృథివ్యామోషథయస్సంభవంతి, యథాసతః పురుషాత్కేశలోమాని తథాక్షరాత్సంభవతీహవిశ్వం.

= అబ్రహము- సాలెపురుగు దారములను యెట్లు తన నుండి బహిర్గతమొనర్చి పిదప లోనికి తీసుకొనుచున్నదో, భూమినుండి వృక్షాదులు, మానవశరీరమున కేశలోమాదులు యుత్పత్తి చెందుచున్నవో అట్లే యితరసహాయంలేక యీ విశ్వమును పుట్టించుచున్నది. అనగా అబ్రహ్మమే నిర్గుణ సగుణ స్వరూపములుగానై సాలెపురుగువలె జగద్రచన చేయుచున్నది.

౭వ మంత్రం: తపసాచీయతే బ్రహ్మ తతోఽన్న మభిజాయతే,
అన్నాత్ప్రాణో మనస్సత్యం లోకాః కర్మసు చామృతం॥

= యిందు సృష్టిక్రమము వర్ణింపబడినది. జ్ఞానస్వ రూపమగు అబ్రహ్మము సృష్టిచేయు సంకల్పముతో వృద్ధి చెందగానందు అవ్యాకృతమును, అవ్యాకృతమునుండి హిర ణ్యగర్భుడున్ను, మనస్సున్ను, సత్యమను పేరుగల భూత పంచకమున్ను లోకసప్తకమున్ను, లోకస్థులున్ను, కర్మ యున్ను, కర్మఫలములున్ను ఒకదానినుండి యొకటి వుత్త రోత్తరక్రమముగా పుట్టుచున్నవి అని క్రమసృష్టి యిందు ప్రతిపాదింపబడినది.

ద్వితీయముండకం, 1వ మంత్రం, "యథాసుదీప్తా త్పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః తథా క్షరాద్వివిధాస్సోమ్య భావాః ప్రజాయంతే తత్రచైవాపియన్తి = మండుచున్న అగ్నినుంచి స్వరూపమునందు భేదములేని అనంతములగు మిణుగురులు (నెరములు) యెట్లు బయలు వెడలుచున్నవో, అట్లే నాశనరహితమగు బ్రహ్మముమండి అనంతజీవరాసులు పుట్టుచున్నవి.

౩వ మంత్రం: తస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీవిశ్వస్య ధారిణీ

= దానినుండియే (పురుషుడు) ప్రాణము మనస్సు సర్వేం ద్రియములు ఆకాశాది పంచభూతములు పుట్టెను.

5వ మంత్రం: తస్మాదగ్నిస్సమిధోయస్యసూర్యః, సోమాత్ప
ర్జన్యఓషధయః పృధివ్యాంపుమానేౖ తస్సించతి యోషితా
యాం బహ్వీః ప్రజాపురుషాత్సంప్రసూతాః॥

= జీవశరీరములెట్లు కల్గుచున్నవో యింతు చెప్పబడి
నది. ఏఅగ్నికి సూర్యుడు సమిధవంటివాడో అద్యులోకాగ్ని
నుండి చంద్రుడు జన్మించెను. చంద్రునివలన వర్షాధిష్ఠాన
దేవతయగు పర్జన్యుడును, అతనివలన భూమియందలి
ఓషధులున్ను, ఆ ఓషధులవల్ల పురుషునియందు రేత
స్సున్ను, ఆ రేతస్సు స్త్రీయందు చేరుటవల్ల శరిరము
లున్ను, ఉత్పత్తిఅయెను. (యిదేవిషయం ఛాందోగ్య ఉప
నిషత్ 5, 4 ఖండమున పంచాగ్నివిద్యలో విపులీకరింబడినది_
పంచాగ్నులు = సూర్యుడు, పర్జన్యుడు, భూమి, పురుషుడు, స్త్రీ.)

యీవిధంగా ముండకోపనిషత్తు నిర్గుణ సగుణ స్వరూప
ములుగానున్న బ్రహ్మమునుండియే జగజ్జీవులు సృష్టిఅయి
నట్లు చెప్పుచున్నది.

4. ఐతరేయోపనిషత్

1. "ఆత్మావా ఇదమేక ఏకాగ్రఆసీత్, నాన్యత్కించనమిషత్
సఈక్షతలోకాన్ను లోకపాలాన్ను సృజాయితి"

తా॥ సృష్టికి పూర్వము అత్మయొక్కటే వుండెను, యిత
రం కొంచంగూడా ఏమీలేదు. ఆ అత్మలోకములను సృజించ
వలెనని చూచెను (తలంచెను)

2. సఇమాల్లో కానసృజత, అంభో, మరీచీ, దర్శ, మాపొ౽దోమ్భఃపరేణదివం౹ద్యౌ ప్రతిష్ఠా౽న్తరిక్షం మరీచయఃపృథ్వీ మరోయా అధస్తాత్తా ఆపః

తా॥ ఆ పరమాత్మ- అంభస్సు (ద్యులోకాతీతము, మరీచి (అంతరిక్షమునగలది) మరము (భూలోకము) అపః (భూలోకమునకు దిగువగానున్న జలము) అను లోకములను ఒకదానికంటె ఒకటి దిగువకానున్న వానిని సృజించెను. యీ లోకము లన్నియు జలసంబంధంగానే యున్నవి. యిందుకు కారణము పంచభూతములలో విశేషముగా గాన వచ్చునది జలముఅయినందున జలభూతపమునకే ప్రాధాన్యత యివ్వబడెను.

3. సఈక్షతేమేను లోకపాలాన్ను సృజాయితి సొద్భ్యఏవ పురుషంసముద్ధృత్యామూర్ఛయాత్.

తానుసృష్టించిన ఆలోకములను పాలించుటకు లోకపాలురను సృష్టింతునని సంకల్పించి అపరమాత్మ ఆయుదకములనుండియే పురుషు నినిర్మించెను.

4. ఆపురుషుని యింద్రియ గోళకములనుండి యింద్రియములు యింద్రియాధిష్ఠాన దేవతలు కలైను. గనుక యీవుపనిషత్తునందుకూడ ఆత్మ (బ్రహ్మమే) సృష్టికారణమని చెప్పబడెను అందుండి తొలుదొల్త జలములు పుట్టెననియు ఆపిదప సకల లోకములు కల్గెననియు చెప్పబడినది.

5. తైత్తిరీయోపనిషత్ :- ఆనందవల్లి - ద్వితీయాధ్యాయం - ప్రథమోనువాకం:- (2) సొశ్నుతే సర్వాన్‌కామాన్‌సహ, బ్రహ్మణావిపశ్చితేతి । తస్మాద్వా ఏతస్మాదాత ఆకాశ స్సంభూతః । ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నే రాపః అద్భ్యః పృథివీ, పృథివ్యాఓషధయః ఓషదీభ్యోన్నం అన్నాత్పురుషః॥

ఆత్మనుంచి ఆకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి జలము, జలమునుండి పృథివి, పృథివినుండి ఓషధులు, ఓషధులనుండి అన్నమును, అన్నమునుండిపురుషుడునుకలైను.

షష్టమోనువాకః [2] సొఽకామయతహుస్యాం ప్రజాయేయేతి । సతపోతప్యత, సతప స్తప్త్వా, ఇదగ్ సర్వమసృజత। యదిదకించ తత్సృష్ట్వాతదేవాను ప్రావిశత్॥

తాను అనేక ప్రాణులుగా గావలెనని ఆతడు కోరెను అందుకొరకాతడు బాగుగా ఆలోచించియీ సర్వమునుసృజించెను. అట్లు సృష్టించినవాడై ఆ సృజించినవానియందుతానే మరల ప్రవేశించెను.

భృగువల్లి "యతోవాయిమాని భూతాని జాయంతే, యేనజాతానిజీవంతి । యత్ప్రయంత్యభిసం విశంతి । తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మేతి ।

తా॥ ఈభూతములన్నియు దేనిదేనియందుండి. కల్గినవో అట్టుకల్గి దేనిచే జీవించియున్నవో, నశించునపుడు దేనియందు లయమగునో అవియే బ్రహ్మము అని తెలుసికోవలెను. అనగా బ్రహ్మమునుండియే సర్వమును కల్గినవి. బ్రహ్మమువల్లనే జీవించుచున్నవి. తిర్గి బ్రహ్మమునందే లయమగుచున్నవి అని చెప్పదగును.

ఛాందోగ్యోపనిషత్, షష్ఠప్రపాఠకం ద్వితీయఖండం:-

[1] "సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవా ద్వితీయం"సృష్టికి పూర్వం, ఏకమును, అద్వితీయమును అగుసత్పదార్థ మొక్కటియే యుండెను [1]

[2] దదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజో అసృజత తత్తేజో ఐక్షత బహుస్యాం ప్రజాయేయేతి, తదాపో<sub></sub>ऽసృజత

తా॥ అసత్తు బహుప్రకారములగుటకు నిశ్చయించి తేజస్సున్నసృష్టించెను. ఆతేజస్సైన సత్తు బహుప్రకారములగుటకై మరల నిశ్చయించి జలమును సృష్టించెను.

3 తాఆఐక్షంత బహ్వాసస్స్యామ ప్రజాయెమహీ తితాఅన్నమ సృజన్త

తా॥ యిట్లుజలమైనసత్తు బహుప్రకాములసుటకునిశ్చయించి అన్నమును (పృధివిని) సృష్టించెను.

4) ఛాందోగ్య ఉపనిషత్తు -3-14- "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంతి ఉపసీత

తా॥ ఈ జగమంతయును (జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు మనస్సు అను ఏకాదశేంద్రియాములచేతను శాస్త్ర యుక్తి అనుభవములచేతను దృశ్యమానమగు జగత్తునందు సర్వము బ్రహ్మమే. ఎందుచేతనగా తజ్జలానితి అని చెప్పబడెను

తజ్జలానితి అనగా (1) తజ్జత్వాత్ = దానివలన పుట్టినదగుటచేతను (2) తల్లత్వాత్ = దానియందు లయించునది అగుటచేతను, (3) తన్నిష్ఠత్వాత్ = దానియందు స్థితిగల్గియుండుటచేతను, అనగా బ్రహ్మముచేతనే పుట్టి బ్రహ్మమునందే స్థితిగల్గియుంటూ చివరకు బ్రహ్మమునందే లయించు స్వభావముగలదగుటచే యీ జగత్తంతయును బ్రహ్మమేనని ఛాందోగ్యఉపనిషత్ విధించుచున్నది. ఈ యుపనిషత్ ప్రమాణానుసారం సద్రూపబ్రహ్మమునుండికల్గిన అగ్ని, జలము, పృథ్వి త్రివృత్కరణము చెంది సమస్తసృష్టి అయెను.

బృహదారణ్యకము:- (1) చతుర్థాధ్యాయ చతుర్థబ్రాహ్మణముశ్రుతి:- "బ్రహ్మవాయిదమగ్ర ఆసీత్తదాత్మానమేవావైత్ అహం బ్రహ్మస్మి తస్మాత్సర్వమభవత్"

తా॥ సృష్టికిపూర్వము బ్రహ్మమేయుండెను. దానికి నేనే బ్రహ్మననే అహం స్ఫురణకల్గెను. ఆ అహం వృత్తినుండి సర్వ జగత్తు యుత్పత్తి అయెను.

(2) చతుర్థాధ్యాయప్రథమబ్రాహ్మణం:- సయథోర్ణనాభిస్తన్తునోచ్చరేద్యథాగ్నేః క్షుద్రావిస్ఫులింగా వ్యుచ్చరన్తేవ

మేవాస్మాదాత్మనః సర్వేప్రాణా స్సర్వేలోకా స్సర్వేదేవాః సర్వాణిభూతాని వ్యుచ్చరన్తి, తస్యోపనిషత్సత్యస్య సత్యమితి ప్రాణావాసత్యం తేషామేషసత్యం

తా॥ ఏవిధంగా సాలెపురుగు దారమును పైకితీయునో అగ్ని నుండి మిణుగురులేవిధంగా బయల్వెడలునో అదేవిధంగా ఆత్మనుండి సర్వప్రాణములు సర్వలోకములు సర్వదేవతలు సమస్తభూతములు బయలువెడలును. కనుక బ్రహ్మమే సృష్టి కారణమని యీయుపనిషదభిప్రాయంమాండూక్యోపనిషత్తు:- 'సర్వమోంకారయేవ' అని ఒకటవ మంత్రములోనూ, సర్వగ్గ్ హ్యేతద్బ్రహ్మయ మాత్మాబ్రహ్మసోఽయమాత్మాచతుష్పాత్—అంతా బ్రహ్మమే. ఈ ఆత్మే బ్రహ్మము యిది నాల్గు పాదములుగలది అని రెండవమంత్రములోనూ "ఏషసర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽన్తర్యామేషయోని సర్వస్య ప్రభవాస్య యౌహి భూతానాం" —సర్వమునకు అదే యోని (కారణస్వరూపం) అని ఆరవమంత్రములోనూ చెపుతూ బ్రహ్మమేసృష్టికారణమని యీ యుపనిషత తెలుపుచున్నది. యోగ

శిఖోపనిషత "ఉపాదానంప్రపంచస్య బ్రహ్మణోఽన్యన్నవిదరోతే తస్మాత్సర్వప్రపంచోయం బ్రహ్మైవాపినచేతరత్—3 వ్యాప్యవ్యాపకతామిథ్యాసర్వమాత్మేతిశాసనాత్ ఇతిజ్ఞాతేపరేతత్త్వే భేదస్యావసరఃకుతః

బ్రహ్మణ సర్వభూతానిజాయంతే పరమాత్మనః
తస్మాదేతాని బ్రహ్మైవభవంతీతి వించితయ 5
బ్రహ్మైవసర్వనామానిరూపాణి వివిధానిచ
కర్మాణ్యపిసహస్రాణి భిభర్తీతి విభావయ 6
సువర్ణాజ్జాయమానస్యసు వర్ణత్వంచశాశ్వతం
బ్రహ్మణోజాయమానస్య బ్రహ్మత్వంచ తథాభవేత్ 7

తా॥ ప్రపంచమునకుపాదానకారణముబ్రహ్మముతప్ప అన్యమేదియులేదు. బ్రహ్మమునుండియే సర్వ భూతములు ప్రాణులు కలుగుచున్నవి, నామరూపములుగల భూతసమూహమంతయు బ్రహకార్యము బ్రహమునుంచి పుట్టిన ప్రపంచము కూడ బ్రహ్మమే.

ఈవిధంగా కఠ, ప్రశ్న ముండ,మాండూక్య,తైత్తిరీయ ఐతరేయ ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు బ్రహ్మచే జగత్కారణమని చెప్పుచున్నట్లు గమనించితిమి. ఈశ, కేన, వుపనిషత్తులు జగత్కారణవస్తువును స్పష్టంగా బ్రహ్మమనిచెప్ప కపోయిననూ వానిఅభిప్రాయముకూడనంతియే అనుటలో యెట్టిసందియములేదు. మిగతా యుపనిషత్తులు కూడనంతే. బ్రహ్మం జగత్కారణం కాదని ఏ యుపనిషత్తు చెప్పనేలేదు. అసలు బ్రహ్మమునకీయబడిన నిర్వచనము జగత్కారణవస్తువు బ్రహ్మమేయనితెలుపుచున్నది. ఆ నిర్వచనమేదియనగా"యో

ఽఖిలం జగన్నిర్మాణేన బృంహతివర్ధయతిసబ్రహ్మ" అనగా తాత్పర్యము = జగత్తును సృష్టించుటకైయెదివ్యాపకత్వం చెంది విజృంభించినదో అదే బ్రహ్మము.

బ్రహ్మము జగత్కారణమనుటకు శబ్దప్రమాణమే అవశ్యగ్రహణీయమైయున్నది. బ్రహ్మమే జగత్కర్త, భర్త, హర్తయని యెల్లరూ అనుమానప్రమాణముచే నిర్ణయించుచున్నారు కాని అనుమానప్రమాణంమాత్రమాధారంచేసుకొని యెట్టినిర్ణయముచేయుటయు నసంగతమేయగును. ఏలనన అనుమానప్రమాణంమాధారంగాచేసుకొని యూహించు మనస్సుకూడనొక యింద్రియమే. కార్యవస్తుజాలములోనిదే. కార్యము తన కారణమును స్వయంగా గుర్తింపజాలదు. కేవలం అనుమానంచే మాత్రం ఏనిర్ణయమును చేయుటయు న్యాయమున్నూ కాజాలదు. మరియు అట్టినిర్ణయముప్రమాదహేతువున్నూ కాగలదు ఇక ప్రత్యక్షప్రమాణమన్ననో, స్థూలవస్తుసముదాయము విషయంలో మాత్రమేవర్తించగలదు. సూక్ష్మాతిసూక్ష్మరూపమగు బ్రహ్మము ప్రత్యక్షప్రమాణమునకువిషయము కాజాలదు.పోని యితర ప్రమాణములీరెంటినే ఆధారముచేసుకొని ప్రవర్తిల్లినవి, కనుక జగత్కారణ నిర్ణయముపట్ల ఆగమప్రమాణము అనగా శబ్దప్రమాణము అనగా వేదములే పరమప్రమాణములు. అంతకంటె ప్రాచీనమగునదిన్ని ఏదీలేదు."బ్రహ్మనిశ్వసితో వేదాః" అను శ్రుతి వేదములు అపౌరుషేయములు అని చెప్పు

చున్నది. బ్రహ్మము స్వయంప్రకాశమని కీర్తింపబడినట్లే వేదములున్ను స్వతఃప్రమాణములైయున్నవి. అందుకే "శాస్త్రయోనిత్వాత్" అనివ్యాసులు సూత్రీకరించారు. తస్మాత్శాస్త్రం" ప్రమాణంతేకార్యాకార్యవివక్షితౌ" అని గీతాచార్యులన్నారు అందు వేదశిఖలని కీర్తింపబడు వుపనిషత్తులు బ్రహ్మమే జగత్కారణమని నిస్సందేహంగా చెప్పియున్నవి.

ప్రస్థానత్రయమని చెప్పబడు (1) ఉపనిషత్తులు (2) బ్రహ్మసూత్రములు (3) గీత అనుమూటిలో వుపనిషత్తుల అభిప్రాయము తెలిసికొంటిమి.

బ్రహ్మసూత్రములు యీ విషయమున ఏమి చెప్పుచున్నవో పరిశీలింతము.

1-1-2 = "జన్మాద్యస్యయతః" = తా॥ జన్మాదాలు (అనగా సృష్టిస్థితిప్రళయములు) దేనినుండి జరుగుచున్నవో (అదేబ్రహ్మము)

1-3-1 = "ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్" = దివి, భువి మొదలగువాని ఆయనము అనగా ఆధారము బ్రహ్మమే.

1-2-21 = "అదృశ్యత్వాది గుణకో ధర్మోక్తేః" = తా॥ అదృశ్యత్వాది గుణములుగల భూతయోని (సకల సృష్టి కారణము) బ్రహ్మమే.

1-4-16 – "జగద్వాచిత్వాత్ = కర్మశబ్దము జగద్వాచక మగుటవలన. వివరణ: కౌషీతకీ బ్రాహ్మణంలో "యోవైతాలోక ఏతేషాం. పురుషాణాంకరా - యస్యచైతత్కర్మనవై వేదితవ్యం" (ఎవ్వడేపురుషులకు కర్తయో యీప్రపంచమెవనికృత్యమో వాడు తెలుసుకొనదగినవాడు. యీ శ్రుతియందుపయోగింపబడినవేదితవ్యుడు ఏవరు? జీవుడా? హిరణ్యగర్భుడా లేక సగుణరూపమగు బ్రహ్మమా? అను శంకకుత్తరముగా కేవలం సగుణ బ్రహ్మమగు పరమేశ్వరుడే ఆకర్తయని తెలుపుటకై యీసూత్రం ప్రవర్తిల్లెను.

1-4-26 = "ఆత్మకృతే పరిణామాత్" తన్నుదానె ప్రపంచ రూపంగా చేసుకొనియుండుటవలన బ్రహ్మమే యుపాదానకారణమని యీసూత్రాభిప్రాయము అయివున్నది.

1-4-27 = "యోనిశ్చ హిగీయతే" బ్రహ్మమే జగదుపాదానమని వేదమునందు గానము చేయబడుచున్నది.

2-1-25 = "ఉపసంహారదర్శనాన్నేతిచేన్నక్షీరవృద్ధి"(సాధనములు లేని బ్రహ్మము జగత్కారకానేరదు అను ఆక్షేపణకు సమాధానంగా) పాలు పెరుగుగా తన

స్వభావముచేతనే మారునట్లుగా తనయందున్న విచిత్రశక్తియోగమువలన జగదాకారంగా పరిణమించును.

2-1-25 = "దేవాదివదపిలోకే" = దేవతలు మొదలగువారు స్వసంకల్పంచే, ఆపేక్షితవస్తువులు సృష్టించుకొనునట్లుగానే "సర్వశక్తివాన్" అని కీర్తింపబడు పరమాత్మయందు సృష్టిరచనాసమర్ధములఅగు అనంతశక్తులుగలవు.

పైసూత్రములలో యీవిధంగా సృష్టికి బ్రహ్మమే ఆధారము, అధిష్ఠానము అని మొదటి రెండుసూత్రములున్ను, కర్త, కారయిత అనితరువాత రెండు సూత్రములున్ను, ఉపాదానకారణమని అతర్వాత నుదహరించిన రెండు సూత్రములున్ను, పరిణామకారణమని చివరి రెండు సూత్రమున్నూ వివరించుచున్నవి. కనుక బ్రహ్మమే జగత్కారణమని బ్రహ్మసూత్రములున్ను తెలుపుచున్నవి.

ఇక భగవద్గీత:- ఇందు పలుచోట్ల, తనకు తానే తన మహిమచేతనే అవసరానుసారంగా అవతరింతుననిన్ని, సర్వమునకు తానే బీజస్వరూపుడననిన్ని ప్రకృతిని అధిష్ఠించి సర్వమును సృష్టించుచుందుననిన్ని గీతాచార్యుడు పలుచోట్ల

చెపుతూ వచ్చాడు. ఉదాహరణకు యీక్రింది శ్లోకభాగములు లేక శ్లోకములు మాత్రం ఎత్తి వ్రాయడమైనది.

1. బీజమాం సర్వభూతానాం విద్ధిపార్థసనాతనం (7-10)
2. ప్రకృతిం స్వామవష్టభ్యవిసృజామి పునః పునః-
భూతగ్రామమిమంకృత్స్నమవశం ప్రకృ
తేర్వశాత్ (9-8)
3. మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం (9-10)
4. గతిర్భర్తా ప్రభుస్సాక్షినివాసశ్శరణంసుహృత్
ప్రభవః ప్రళయస్థానం నిధానం బీజమవ్యయమ్ (9-18)
5. యచ్చాపిసర్వభూతానాం బీజంతదహమర్జున
నతదస్తివినాయత్స్యాన్మయాభూతంచరాచరం (10-39)
6. మమయోనిర్మహద్బ్రహ్మతస్మిన్గర్భం దధామ్యహం
సంభవస్సర్వభూతానాం తతోభవతిభారత (143)
7. సర్వయోనిషుకౌంతేయ మూర్తయస్సంభవంతియాః
తాసాంబ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదఃపితా(14-4)
8. మమైవాంశోజీవలోకే జీవభూతస్సనాతనః (1-57)
9. అజోపిసన్నవ్యయాత్మా భూతానామీశ్వరోపిసన్ ప్రకృ
తిం స్వామధిష్ఠాయసంభవామ్యాత్మమాయయా 4-64

కనుక బ్రహ్మము సగుణస్వరూపమై జీవజగత్తుల సృష్టికి హేతువగుచున్నదని గీత సృష్టీకరించుచున్నది. ఈప్రస్థానత్రయ నిరూపణ యిట్లుండగా జగత్కారణ వస్తునిర్ణయముపట్ల మతభేదములు ప్రవర్తిల్లినవి.

1. న్యాయదర్శనము:- ఈశ్వరుడు నిమిత్తకారణుడు, కాని వుపాదానకారణమగు పరమాణువులు లేనిచో సృష్టి ఎట్లగును? కనుక పరమాణువులే జగత్కారణము అని అందురు. అయితే పరమాణువులు జడములుగదా! ఈశ్వరునిచే తనసత్తా లేనిచో అవి ఎట్లు సృష్టిప్రవర్తకములు కాగలవు? కనుక యీ వాదమునందు అసంభావనాదోషము కల్గుచున్నది. పరమాణువులు నిత్యము గనుక తత్కార్యరూపమగు జగత్తున్నూ నిత్యమే అని వీరందురు. కనుక వీరికి కార్యసత్యత్వ వాదులు అనిపేరు. ఐతే పరమాణువులు నిరవయవమని అవి భాజ్యమని తార్కికులందురు. కాని నేటి ప్రయోగాత్మక భౌతిక విజ్ఞానరీత్యా యీ వాదన సరిఅయినదికాదని తేలిపోయినది. పరమాణువును భేదించి అందు నిగూఢమైయున్న అపారమగుశక్తిని నేటి విజ్ఞానవేత్తలు ప్రత్యక్షముగా బహిష్కృతమొనర్చుచున్నారు. కనుక పరమాణువులు నిత్యమూ కాదు అవిభాజ్యములున్నూ కావు. అందు సూక్ష్మరూపంగా శక్తిదాగియుండుటచే అవిపరమకారణములున్నూ కావు.

2. వైశేషిక దర్శనము:- ఇది నైయ్యాయికుల వాదమును అంగీకరించును కాని కాలములేనిదే యేకార్యమూ జరుగదంటారు. విత్తనములు మొలచుట, మొలచినవి ఫలించుట కాలనుసారముగానే జరుగుచున్నవి. కనుక కాలము కారణమంటారు. అయితే కాలమునకు స్వతంత్రసత్తాగాని యునికి

గాని లేదు. స్వయంసమర్థము కాజాలదు. ఒక సంఘటన అంటూవుంటే దానిదృష్ట్యా దానికిపూర్వము భూతకాలమని, ఆ సంఘటన అనంతరం భవిష్యత్‌కాలమనీ ఆ సంఘటన కాలము వర్తమానమని అనచెల్లును. సృష్టియే ఆసంఘటన కనుక సృష్టికి పూర్వకాలము, సృష్టికాలము, సృష్టియనంతర కాలము అని అవదగును. అందుచే కాలము సృష్టితోపాటే యుత్పత్తిఅగుచున్నది కనుక కాలము దేనికిన్ని పరమ కారణం కాజాలదు.

3. సాంఖ్యదర్శనము :- తత్వములు (25 లేక 36 లేక 96) యొక్క సమష్టిరూపమగు మూలప్రకృతి, లేక ప్రధానము జగత్కారణముగా సాంఖ్యదర్శనము నిర్ణయించును. కాని పురుషుని సన్నిదానము లేనిచో ప్రకృతి నిరర్ధకము. కార్యకారణ సంబంధమును వీరంగీకరింతురు కనుక వీరిని సత్కార్యవాదులని పిలుతురు. సాంఖ్యవాదమునకు రెండు ఆక్షేపణలుకలవు. 1) ప్రధానము (మూలప్రకృతి) జడముకదా! సృష్టికారణముని యనవచ్చునా? అంటే, జడనుగు పాలవల్ల దూడ యెదుగుట లేదా? వట్టిగడ్డి తల్లియందు పాలగుటలేదా! అని వీరందురు. ఐతే చైతన్యముగల్గి ప్రాణశక్తితో గూడియున్న దూడయే యెదుగుచున్నది. అట్లే చేతనముకల్గిన అవుతిన్న గడ్డియే పాలగుచున్నది. గడ్డియంతయు నొకచో వేసినచో అది పాలుగా మారినదా? చైతన్యములేని దూడ బొమ్మనుచేసి

దాని కడుపులో పాలుపోస్తే అది యెదుగునా? కనుక పాలు త్రాగిన దూడయొక్క జీవచేతనమే దూడను పెంచెననిన్ని, గడ్డితిన్న జంతువుయొక్క జీవసత్తయే పాలుగామారెననిన్ని గుర్తింపదగును.

2) జడమగు ప్రధానమునకు సృష్టికామన యెట్లుకలిగెను? ఎందునిమిత్తమెకలిగెను? పురుషోపభోగార్థమా? లేక మోక్షార్థమా? పురుషుడు నిరతిశయానంద రూపుడున్ను మోక్షరూపుడున్ను అగుట చేయిందేకవిల్పమున్నూ పనికిరాదు. కనుక ప్రధానమునకు సృష్టికామనలేక సృష్ట్యనుకూలప్రవృత్తియే కలుగజాలదు. అందుచే సాంఖ్యులు చెప్పినరీతిగా ప్రధానము సృష్టి కారణమని అనరాదు.

4. యోగదర్శనము:_ హిరణ్యగర్భుడే జగత్కారణమందురు. వీరు సాంఖ్యులవలెగాక యీశ్వరసత్తను అంగీకరింతురు. అనగా సగుణరూపబ్రహ్మమును జగత్కారణముగా అంగీకరించియున్నారు.

5. పూర్వమీమాంసాదర్శనము :_ అదృష్టము లేక కర్మయే జగత్కారణమని అంటారు. కర్మవల్లనే బ్రహ్మాండముత్పత్తిస్థితినాశనములుచెందును. అయితే యీకర్మచేయుటకు కర్తఎవరో వారు వివరించరు. కర్మఫలము లేక అదృష్టము జడముకదా! దానికి సృష్టిసంకల్ప మెట్లుకలుగును? పూర్వమీమాంస, నిత్యప్రళయమగు సుషుప్తినితప్ప, నైమి

త్రిక, అవాంతర, మహా ప్రళయములను అంగీకరించరు. సృష్టి కాద్యంతములు లేవు. జగత్తు నిత్యము అని వీరందురు కనుక వీర్కి సృష్టి విధానమంటూ నిర్ణయమే యుండజాలదు. జీవులు మాత్రం వారివారి పూర్వపూర్వకర్మ సంస్కారబలముచే వుత్తరోత్తర జన్మ పరంపరలకు గురియై సుఖదుఃఖాలనుభవింతురు. మహాభారతములోని, కం॥ కర్మమునబుట్టు జంతువు, కర్మమునను వృద్ధిబొందు కర్మమునజెడున్, కర్మమె జనులకు దైవము, కర్మము సుఖదుఃఖములకు కారణమధిపా॥ అను పద్యము వీరిసిద్ధాంతమును పూర్తిగా ననువదించుచున్నది.

6. ఉత్తరమీమాంస, లేక వేదాంతదర్శనము:- కర్త లేనిచో, కార్యముగాని క్రియగానివుండదు. క్రియాజన్య పదార్థమున్ను వుండజాలదు. ఆకర్త బ్రహ్మమే. యిదియే ముఖ్య నిమిత్తకారణము, యీ బ్రహ్మమే సమస్తకారణములూనై సృష్టిచేయును. అట్లుకాదంటే యితరవస్తువులు వుండవలసి వచ్చి అద్వైతహాని ఘటిల్లును.

అసలు వేదాంతదర్శన మీరీతిగానుండగా యిందనేక భేదములువచ్చి భిన్నభిన్న మతములకు దారితీసినవి. అందు ద్వైతాద్వైత విశిష్టాద్వైతములు ముఖ్యములు ద్వైతవిశిష్టాద్వైతములు సగుణబ్రహ్మమగు ఈశ్వరుడు తన లీలకోసం (కాలక్షేపార్థం, వినోదార్థం లేక విలాసార్థం) యీ సృష్టిస్థితిలయములను చేయునని చెప్పుదురు.

ద్వైతులు:- యీమత ప్రవర్తకులగు మధ్వాచార్యుల వారు పరిణామనామ రూపవికారాదులను అంగీకరించియున్నారు. దృష్టాంతము- మృత్తుఘటమైనట్లు. వీరిప్రకారం జగత్తుసత్యము, కాని జడము అస్వతంత్రము, భగవన్నియమితమూ అయియున్నది మరియు జగత్తు అనంతము అనగా నాశనముపొందదు అని వీరందురు.

విశిష్టాద్వైతులు:- సూక్ష్మచిదచిద్విశేషమున బ్రహ్మము జగత్తునకు నిమిత్తకారణము. అనగా చిదంశ = జీవుడు, అచిత్ జగత్తు. ఈ చిదచిత్తులే సూక్ష్మరూపములో బ్రహ్మమునకు శరీర భూతములుగానున్నవి. అట్టి బ్రహ్మము నిమిత్తకారణము. సంకల్పవిశిష్టవిశేషమువలన ఉపాదానకారణము. అనగా చిదచిద్విశిష్టుడగు బ్రహ్మము అనగా ఈశ్వరుడు నిమిత్తకారణుడై, తన సంకల్పమే కారణద్రవ్యముగాగల్గి సృష్టించును కనుక ఈశ్వరసంకల్పమే ఉపాదానకారణముగాని అన్యము లేదు. కాలాదులు సహాయ కారణములు. వీరున్నూ పరిణామ వాదులేగాని వీరి పరిణామ వాదము అవికృత పరిణామ వాదమని పేరుపొందినది. అవికృత పరిణామవాదమనగా మూలవస్తువునందు యెట్టి వికారములూ, హానివృద్ధులున్నూ, లేకనే పరిణమించును. జగత్తు సత్పదార్థమేగాని మిథ్యగాదు అని యీ మతప్రవర్తకులగు రామానుజలవారి సిద్ధాంతము

అద్వైతమత ప్రతిష్ఠాపనాచార్యులగు ఆదిశంకరుల పరమగురువగు (అనగా శంకరుల గురువుగైన గోవిందభగవ

త్పాదాచార్యులవారికి గురువగు) గౌడపాదాచార్యులవారు రచించిన మాండూక్యకారికలు అద్వైతసిద్ధాంతమునకు మూల స్తంభములుగానున్నవని చెప్పవచ్చును. ఈ కారికలు. స్వల్ప సంఖ్యాకములగు మాండూక్యోపనిషన్మంత్రములకు వ్యాఖ్యాన రూపంగా రచింపబడినవి. ఈ కారికల అభిప్రాయం విపుల ముగా చర్చించుట అప్రస్తుతంకాదు.

గౌడపాదకారికలు

ఆగమప్రకరణం :- (6) ప్రభవస్సర్వభావానాం సతామితి వినిశ్చయః సర్వంజనయతిప్రాణశ్చేతో౽ంశూన్పురుషః సృథక్॥

తా॥ = సర్వభావములు సద్రూపములే అయి వుత్పత్తి చెందుచున్నవి. ప్రాణము సకలమును సృజించుచున్నదీ. పురుషుడు చైతన్యాంశరూపులగు జీవులను వేర్వేరుగా సృజించుచున్నాడు.

అనగా ప్రాణరూపమగు తన ఆవరణముచే స్థూల వస్తు జాతములను, శరీరములను, సృష్టించి సూక్ష్మరూపంగా అనగా జీవరూపంగా తానే అందు ప్రవేశించెను. "తత్సృష్ట్వాత దేవానుప్రావిశత్"అను శ్రుతికి అనుకూల వ్యాఖ్యగానున్నది.

అద్వైతప్రకరణం :- మృల్లోహ విస్ఫులింగాద్యైస్సృష్టిర్యా చోదితా౽న్యథా, ఉపాయస్సో౽వతారాయ నాస్తిభేదః కథంచన॥

తా॥ = మృత్తిక, లోహము, అగ్ని నుండి మిణు
గురులు, యిత్యాదిగా వివిధరూపములుగా సృష్టిని అనువదిం
చుటు, సులభంగా వివిధరూపములుగా సృష్టిని అనువదించుటు,
సులభంగా, బ్రహ్మమును అర్థము చేసుకొనుటకే గాని
భేదములేదు.

శంకరాచార్యులవారి వివరణప్రకారం- ఆ సృష్టి ప్రతి
పాదక శ్రుతులు, సృష్టిని ప్రతిపాదించుచున్నట్లు కనబడు
చున్నవేగాని అవి తదర్థ ప్రతిపాదకములు కావనిన్ని, పార
మార్థికములు కావనిన్ని, నిజముగా సృష్టి ప్రతిపాదకములే
యగుచో, ఆయాశ్రుతులు వివరించిన సృష్టివిధానము ఏక
రూపంగా వుండవలెనేగాని భిన్నముగా నుండరాదనిన్ని
వ్యాఖ్యానించిరి కాని అట్లనుట సమంజసముగాదు రోగనిదాన
విషయములో పలువురు వైద్యులు భిన్నభిన్న అభిప్రాయము
లిచ్చినంతమాత్రాన అసలురోగమే మిథ్య, కాకుంటే భిన్న
భిన్నాభిప్రాయము లెందుకుండును, అని తీర్మానించుట
న్యాయంకాదుగదా! మరియు సృష్టిశ్రుతులను కొంచెము
తరచిచూచిన పరస్పర విరుద్ధము కానరాదు. నిర్గుణ పరబ్ర
హ్మమును కొన్ని శ్రుతులు, మాయాశబలిత బ్రహ్మమును
కొన్ని, హిరణ్యగర్భుని కొన్ని, ఆతని సంకల్పమున జనిం
చిన సూర్యచంద్రులను, పంచభూతములను, కాలకర్మాదు
లను కొన్ని శ్రుతులును సృష్టికారణంగా చెప్పినవి. అన్ని

శ్రుతులు అత్యంతమూలకారణమునే చెప్పక మధ్యగల అవాంతర కారణములను చెప్పుచూవచ్చినవి వేర్వేరు దృష్టాంతములనున్ను చెప్పినవి. అంతేగాని శ్రుతులు పరస్పర విరుద్ధములుగా లేనేలేవు. కనుక సృష్టి మిథ్యయనుటకు శంకరులిచ్చిన యీ వుపపత్తి చాల దుర్బలము సృష్టివుండి కల్గెనా? లేక, లేక నేగల్గెనా? అనివికల్పంచి అలాతశాంతి ప్రకరణం (4)- "భూతంనజాయతే కించిదభూతం నైవజాయతే, వివిదంతేద్వ యోహ్యేత మజాతిం ఖ్యాపయంతితే॥"

తా॥ ఉన్న వస్తువు (సత్పదార్థము) పుట్టదు. లేనట్టి వస్తువు (అసత్ పదార్థము) పుట్టనేపుట్టజాలదు. అని పరస్పరం వాదించుకొనుచు, పుట్టనేలేదు. (సృష్టిఅనేదేలేదు) అనే సిద్ధాంతము (అజాతివాదము)ను సమర్థిస్తున్నారు.

సత్పదార్థమునుండి యేసృష్టి అని (సద్వాదులు అగు సాంఖ్యులు, అనుట (అనగా వున్నపదార్థమే పుట్టుచున్నవనుట) అయుక్తము. అట్లే అసద్వాదులగునైయ్యాయిక వైశేషికాదులు అసత్తునుండే సృష్టి అందురు. అంటే, లేనిదానినుండి సృష్టి యెట్లగును? కనుక వుభయులు పొరబడినట్లే, కనుక పుట్టుకలేదనుట సిద్ధాంతమని గౌడపాదాచార్యులవారు అభిప్రాయపడుచున్నారు.

22- స్వతోవా పరతోవాఽపినకించిద్వస్తుజాయతే
సదసత్సదసద్వాపినకించి ద్వస్తుజాయతే॥

శ్లో॥ ననవలనగాని' యితరమువలనగాని పుట్టుటయే లేదు అట్లే సత్పదార్థముగాని అసత్పదార్థముగాని సదసత్పదార్థము గాని పుట్టుటయే లేదు.

ఇక సృష్టిశ్రుతులమాటయేమి? అంటే, వ్యాఖ్యాతలు చెప్పే సమాధానమేమనగా :- బ్రహ్మమునుండి జగత్తు కల్గిన దన్నచో బ్రహ్మముకంటే జగత్తు భిన్నముకాదు అను జ్ఞానం కల్గి బ్రహ్మమే సర్వమూ అనేభావము స్థిరపడును. కనుక బ్రహ్మము జగత్కారణము అని శ్రుతులుచెప్పినవి గాని అంతకంటె ఏమీలేదు. అని, శ్రుతిప్రమాణమును గూడ త్రోసిపారవేయుటకై ఒకవాదము లేవదీసిరి. కాని బ్రహ్మమే సర్వము. సర్వమున్నూ బ్రహ్మమే, అని చెప్పెడి శ్రుతులు ఏమీలేనియెడల యీవాదము కొంతవరకైనా నిలబడగలి గెడి, "సర్వంఖల్విదంబ్రహ్మ" "నేహనానాస్తి కించన" ఏక మేవాఽద్వితీయం బ్రహ్మ" "బ్రహ్మణోన్యంనకించన" యిత్యాదిగా శ్రుతులనేకములుండగా సృష్టిశ్రుతులు అందుకై కల్పించినారనుట సరికాదు.

శంకరాచార్యులువారు, బ్రహ్మమును వివర్తోపాదాన కారణంగా అంగీకరించినారు. బ్రహ్మైవవివర్తం (లేకచేతన వివర్తము) మాయాపరిణామము, అని అన్నారు. జడమగు మాయ చైతన్యసహాయంలేక పరిణామముచెందదు. బ్రహ్మ మునందెట్టి వికారములు లేకున్ననూ జగదుద్పత్తికి బ్రహ్మ

నుండితీరవలసినచే, ఏదిలేనిచో సృష్టికాజాలదో అదే సృష్టి కారణం, కనుక బ్రహ్మమునకు సాన్నిధ్యమాత్రిక సృష్టి కారయిత్రృత్వమొనుకలవని చెప్పవలసియున్నది. గౌడపాదాచార్యులవారి అజాతివాదమును శంకరులు పూర్తిగా అమోదించినట్టు చెప్పుటకష్టము. అసలు పుట్టనేలేదనే వాదము పూర్తిగా అంగీకరిస్తే ఆయన సృష్టిక్రమము వివరిస్తూ పంచీకరణమేల వ్రాయవలెను? ఆయన శిష్యులగు సురేశ్వరాచార్యులు దానికి వార్తికమేల వ్రాయవలెను? శంకరాచార్యులవారు తాము రచించిన పంచీకరణములో ఏమన్నారో యించుక గమనించదగును.

"స్వచ్ఛబ్దవాచ్యమవిద్యాశబళ్యబ్రహ్మ. బ్రహ్మణోరవ్యక్తమ్. అవ్యక్తాన్మహత్, మహతోఽహంకారః, అహంకాతర్పాంచతన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యః పంచమహాభూతాని పంచమహాభూతేభ్యోఽఖిలంజగత్"॥.

తా॥ సత్ అని చెప్పబడుతూ అవిద్యతో గూడిన బ్రహ్మము, బ్రహ్మమువలన అవ్యక్తము, అవ్యక్తమువలన మహత్తును, మహత్‌వలన అహంకారమును, అహంకారము వలన పంచతన్మాత్రలును, పంచతన్మాత్రలవల పంచమహాభూతములును, పంచమహాభూతములవలన సకల జగత్తును కలిగెను."

యిందు మాయా లేక అవిద్యాశబళితమగు అనగా

చిత్రవర్ణముగా చేయబడిన బ్రహ్మము జగత్కారణముగా చెప్పబడినది. కాని శుద్ధబ్రహ్మము కారణముగా చెప్పబడ లేదుగదా! అని యనవచ్చును. కాని మాయచే లేక అవిద్యచే రంగుపూయబడిన బ్రహ్మము జగత్కారణమన్నపుడు మాయను సహాయముచేసుకొన్నది దన్నప్పటికి, బ్రహ్మమే జగత్కారణమని యనకపత్పదు. మాయజడమని అందరు అంగీకరించిరి మరియు "యామాసామాయ" అని మాయెకు నిర్వచనమున్ను యీయబడినది. అనగా ఏదిలేనిదో అదే మాయఅని అర్థము. కనుక లేనిమాయ స్వయంగా సృష్టి కారణము కాజాలదు. కత్తిసహాయముతో నొకడు శత్రు సంహారముగావించెను. అంటే, ఆ సంహార కార్యకలాపమున కంతటికి కర్త ఆ పురుషుడే యనవలయునుగదా! కత్తి ఎప్పుడును కర్తయనరాదు. కత్తివలె జడమైన మాయయు ఎన్నటికి కర్త కాదు.

శంకరుల, పైపంచీకరణవాక్యమునకు సురేశ్వరులు రచించిన వార్తికమీపిషయమును యింకను స్పష్టము చేయుచున్నది.

శ్లో॥ ఆసీదేకం పరంబ్రహ్మ నిత్యయుక్త మవిక్రియం
తత్స్వమాయా సమావేశాద్బీజ మవ్యాకృతాత్మకం॥

తా॥ నిత్యముక్తము, అవిక్రియము. ఏకము, అగు బ్రహ్మము తనయొక్క మాయయందు ప్రవేశించి బీజమైన

అవ్యాకృతముగా నగుచున్నది. అనగా ఆ బ్రహ్మమే బీజ స్వరూపముదాల్చుచున్నది. అంటే బ్రహ్మమే యీజగత్కార్యమునకు కర్తయు కారణమును అగుచున్నది అని తాత్పర్యము, కనుక అద్వైతసిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్యులయొక్క యుద్దేశములో గూడ బ్రహ్మమే జగత్కారణవస్తువు అని తేలినది. కనుక శంకరులు సృష్టిని అంగీకరించుటయేగాక బ్రహ్మమే సృష్టికారణముగాకూడ నంగీకరించినట్లే, ఏపక్షంలోనూ అజాతివాదమును ఆయన అంగీకరించ లేదనియే అనవలెను.

గౌడపాదాచార్యులవారున్ను వారి వ్యాఖ్యాతలున్ను చెప్పునది ఏమనగా:- "అసలు పుట్టుకయే లేని 'అజమూ' 'అమృతము' అగు బ్రహ్మము మరొకదాని పుట్టుకకు కారణం, అని అనరాదు. మందాధికారుల నిమిత్తమే కారణత్వం చెప్పబడినది" అని నిజమే. అజమూ, అమృతమూనగు బ్రహ్మమునకు సృష్టిశ్రుతులు కారణత్వము చెప్పలేదు. సృష్టికారణమగు బ్రహ్మముగురించియే చెప్పినవి. అది అజమూ అమృతమూ అవునా? కాదా? అనేవిషయం యీ ప్రకరణాంతమున తెలియబడగలదు. బ్రహ్మసూత్రములలో "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని ప్రారంభించిన వ్యాసులు వెంటనే "జన్మాద్యస్యయతః" అను సూత్రీకరించి సృష్టి కారణమును, జిజ్ఞాసితవ్యమును, అగు బ్రహ్మమును గురించి మాత్రమే తాను చెప్పుచున్నట్లు

స్పష్టముచేసినాడు. అది కేవలము అజము, అమృతముకాదు పేలనన అమృతమృత్యు స్వరూపము తానే అయివున్నది. "అమృతం చైవమృత్యుశ్చ సదసచ్చాహమర్జున" అని శ్రీకృష్ణుడు గీతలో తెలవిచ్చినాడు. అది మరియొకదానివలన పుట్టనిమాట సత్యమేగాని తనకుతానే ఆవిర్భవించినది. తనలో యొకభాగము మరొక భాగమునకు కారణమగుచున్నది. కనుకనే స్వయంభూ అన్నారు. తాను పుట్టక యితరమును పుట్టించకయుండేదే కేవలం 'అజము' అనదగును. సృష్టికారణ మగునది అజముకాదు. మందాధికారు నిమిత్తమే సృష్టి శ్రుతులు ప్రవర్తిల్లినవనుటయు సరికాదు. మందాధికారుల నిమిత్తం వేదమాత అసత్యమాడునా?

ప్రత్యక్షముగా గానవచ్చు యీసృష్టి లేనేలేదు. అసలు జగత్తు పుట్టనేలేదు కేవలం జగత్తు అలీకపదార్థమే, అనుట వైజ్ఞానిక దృష్టి కాజాలదు. ముందుగా పంచభూతా త్మకమదు జగత్తుసృష్టిఅయి ఆపిమ్మట పిండాండరూపముగా 84 లక్షల జీవోపాధులున్ను కల్గినవి. ఆ బ్రహ్మాండరూపమగు జగత్తునందు నేనున్నానని నాకు నిశ్చయమేగదా! జగత్తు లేదనుట నాతల్లి వంధ్యఅని నిర్ణయించినట్లేగదా? నాజన్మ రాహిత్యమున కవసరమగుచో, అజమూ అమరమూ అగు కేవల పరిపూర్ణపరబ్రహ్మమునందు నేనేలేనని పూర్ణభావము

పూనుట యుక్తమగునే గాని జగత్ లేదనుటకుగాని అసలు సృష్టియే లేదనుటకుగాని నాకు అధికారము లేదు.

"వాచారంభణం వికారో నామధేయం, మృత్తికేత్యేవ సత్యం" అను శ్రుతి నాధారముగా చేసుకొని, నామరూపాత్మకమగు జగత్తు మిథ్య, వాచారంభణం మాత్రమే, నామరూపాత్మకమగు ఘటాదులు మిథ్య, వానియందలి మృత్తికయే సత్యము, అట్లే జగత్కారణమగు బ్రహ్మము సత్యము, నామరూపాత్మకమగు జగత్తు మిథ్య, అని అందురే కాని నిజముగా యోచించినచో మట్టి సత్యమైతే మట్టితో చేయబడిన ఘటాదులున్ను సత్యమే అనవలయును. అశాశ్వతము అంటే అనవొప్పునే గాని అసత్యమని అనరాదు. మేమైనను ఘటమునందలి నామరూపములు మిథ్య అన్నాముకాని ఘటమునందలి మృత్తికను మిథ్య అనలేదుగదా యని వారు అనవచ్చును. అయితే తిరిగి నామరూపములు వహించు స్వభావమా మృత్తికయందు సత్తారూపముగా నున్నవిగదా! కనుక నీవిధముగా చూచినచో నామరూపములు పారమార్థికము గగూడ నున్నవే యగుచున్నవి. అందుచే నామరూపములనుగూడ మిథ్య అనరాదు. అంతేగాక నామరూపములుగూడ సత్యమే అనుటకు శ్రుతి ప్రమాణమున్ను కలదు "తదేత దమృతం సత్యేనచ్ఛన్నం ప్రాణోవా ఽమృతం నామరూపే సత్యం. తాభ్యామయం ప్రాణశ్ఛన్నః" (బృహ)

"తద్దేం తర్హ్యవ్యాకృత మాసిత్తన్నామరూపాభ్యా
మేనవ్యా క్రియతా సౌనామాయమిదంరూపం-బృహ॥"

తా॥ సృష్టికాలమందా బ్రహ్మమే నామరూపములుగా మారెను. ఆనామరూపములే స్థూలప్రపంచమందు వ్యక్తముగుచున్నవి.

అయితే సృష్టికారణమగు బ్రహ్మము, అజమూ అమృతమూనగు బ్రహ్మము కానేకాదనిన్ని, సృష్టి కారణమగు బ్రహ్మమునకు, కేవల నిరపేక్షక పరిపూర్ణ పరబ్రహ్మమునందు అనగా అజమూ అమృతమూనగు బ్రహ్మమునందు మూలముగాని స్థానముగాని లేదని సిద్ధాంతం చేయుటయే యీ గ్రంథ ప్రవిషయము.

సృష్టివిషయంలో అన్ని శ్రుతులను క్రోడీకరించి శ్వేతాశ్వతరోపనిషత్ చెప్పునదివివరించి పిదప సృష్టినిగురించి చేయబడిన కొన్ని వాదములను స్థాళీపులాకన్యాయముగ వివరించుటయు నవసరమేయగును.

"ఓం బ్రహ్మవాదినోవదంతి, కింకారణం బ్రహ్మ? కుతస్మజాత్మా జీవామకేన? క్వచసంప్రతిష్ఠాః? అధిష్ఠితాః కేనసుఖే తరేషువర్తామహే? బ్రహ్మవిదోవ్యవస్థామ్" (శ్వేతా, ప్రథ, అధ్యాయం 1వ. మం॥

తా॥ (1) బ్రహ్మము జగత్తునకు ఎట్టికారణము? (నిమిత్త, ఉపాదానాది కారణములలో ఏది) యీ ప్రశ్నలో

జగత్తునకు బ్రహ్మము కారణమనుటలో ఎట్టి సందేహము లేదుగాని అది ఎట్టికారణమో ఎరుంగగోరుచున్నాడు.

(2) మనము దేనివలన జన్మించితిమి?
(3) దేనిచేత జీవించుచున్నాము?
(4) ప్రళయకాలమందెచ్చటనుందుము?
(5) మన సుఖదుఃఖములకు ఎవని అధికారము కారణంగానున్నది?....

అనగా యీమంత్రమునందు సృష్టిస్థితి ప్రలయములకు కారణమెవ్వడు? అను ప్రశ్నకు వివరణరూపంగా ప్రత్యుత్తరము కోరబడినది.

"కాల, స్వభావో, నియతి, ర్యదృచ్ఛా, భూతని యోనిః, పురుష, యితిచింత్యం, సంయోగఏషాం, నత్వాత్మభావాదాత్మ౽౽పనీశః సుఖదుఃఖహేతోః॥" శ్వేతా, ప్రథమ – 2వ. మం॥

తా॥ (1) కాలము (కాలవేత్తలు) (2) స్వభావము (లోకాయతికులు) (3) కర్మ (పూర్వామీమాంసకులు) (4) యదృచ్ఛ (నిరీశ్వరవాదులు) (5) పంచభూతములు) (జగన్నిత్యత్వవాదులు) (6) యోని (పకృతి) (శాక్తులు) (7) పురుషుడు అనగా జీవుడు లేక హిరణ్యగర్భుడు (యోగులు) (8) వినిసంయోగము (కొందరు) (9) ఆత్మ

(అని మరికొందరు) అని, నానాప్రకారములుగా నిర్ణయించినారు

3వ సూత్రము- "తేధ్యానయోగానుగతా అవశ్యన్, దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూడాం, యఃకారణాని నిఖిలాని తాని, కాలాత్మయుక్తాన్యధి తిష్ఠ త్యేకః।

తా॥ ధ్యానయోగంతో పైకారణసప్తకము (అనగా, కాల, స్వభావ, కర్మ, యదృచ్ఛ, పంచభూత, యోని, పురుషులు)ను ఎవరు నియమించుచున్నాడో ఆపరమాత్మ తనయందు నిగూఢమైయున్న త్రిగుణాత్మక మాయాశక్తి (దేవాత్మశక్తి) యే సృష్టి కారణమని గుర్తించిరి.

బ్రహ్మమునందలి శక్తి బ్రహ్మభిన్నము గనుక బ్రహ్మమే జగత్కారణము. కారణసప్తకముగానుండిన పై ఏడు పదార్థములలో ఏయొక్కటియు పరబ్రహ్మ సత్తాలేక యీ షణ్మాత్రము ప్రవర్తింపజాలదు. కనుక పరబ్రహ్మమే పరమ కారణమనుటలో సందియంలేదు.

"తేనవినాతృణాగ్రమపిన చలతి" అని శ్రుతి చెప్పుచున్నది. అనగా, ఆ పరమాత్మ సత్తాలేనిచో తృణమైన చలించజాలదుగదా?

"భయా దస్యాగ్ని స్తపతి భయాత్తపతి సూర్యః
భయాదిద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః"

ఈ పరతత్వభయమువలననే అగ్ని మండుచున్నది. సూర్యుడు ప్రకాశించుచున్నాడు. ఇంద్రవాయుమృత్యువులు స్వస్వవ్యాపారనిర్వహణ కుశలులగుచున్నారు.

ఈ క్రింది వాదముల నించుక పరిశీలింతము.

(1) సద్వాదము లేక సత్కారణతావాదము :- విశ్వము కానవస్తూవున్నది. వున్నవస్తువే అనగా సత్పదార్థము మాత్రమే ప్రతీతికాగలదు కనుక విశ్వము సత్పదార్థము "కారణగుణాః కార్యగుణానారభన్తే"

కార్యమగు యీజగత్తు సత్తుకనుక దీనికారణమున్నూ సత్తేకావలెను. యిందుకు శ్రుతి :- "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ ...." 2) "సద్ధిదంసర్వం-"

(2) అసద్వాదం :- విశ్వమంతయు క్షణికం. కనుక అసత్తు దీనికి కారణముకూడ అసత్తేకావలయును.

యిది కర్మవాదము. విశ్వమంతటను చలనరూపమగు కర్మయే గానవచ్చుచున్నది. అంతయుగతిరూపమే, అది యందుగల అసద్రూపకర్మతత్వమునుండి బహిర్గతమగు జగత్తును అసత్తే, కనుక జగత్పదార్థములన్నియు చలనశీలమైనవే. కనుక అంతయు కర్మరూపమే కనుక అసద్రూపమే యిందుకు సమర్థకశ్రుతులు :- (1) "దేవానాం ప్రథమే ౽సతః సదజాయత," (2) "అసద్వాయిదమగ్ర ఆసీత్ -

తతో వై సదజాయత తదాత్మానం స్వయమకురుత .... తస్మా
త్సుకృతముచ్యతే॥"

(4) సదసద్వాదం :- రెండుండనిచో సృష్టియుండజాలదు. ప్రతివస్తువునందును క్షణికమగు అసత్తును,మార్పుచెందని యొకానొక సత్తాయున్ను స్ఫురించుచున్నవి. కేవలము సత్పదార్థమే యగుచో మార్పుండరాదు, కేవలము అసత్తే అగుచో వస్తువు ప్రతీతియే కారాదు. కనుక ప్రతివస్తువు నందును సదసత్తులు రెండునూ కానవచ్చుచున్నవి. కనుక యీజగద్వస్తువునకు కారణస్వరూపవస్తువుకూడా సదసత్ ద్వంద్వస్వరూపము అయివుండవలెను. యిందుకు శ్రుతి :- "అసదేవేదమగ్రసీత్ తత్సదాసీత్ తత్సమభవత్ తదాండం నిరవర్తత."

(5) రజోవాదం :- గుణత్రయములోని రజోగుణమే సృష్టి కారణము. సత్వముజ్ఞానమయము, తమోగుణముజడము కనుక ఆరెండున్నూ సృష్టియందసమర్థకములు, రజోగుణమొక్కటియే క్రియారూపము. లోకములకున్ను రజః అనీ రజాంసి అనీ పేర్లున్నవి. శుక్లశోణితములను రజస్సందురు. సృష్టికామనకు మూలము రజోగుణమే. "కామస్తదగ్రేసమవర్తతాధి. మనసోరేతః ప్రథమం యదాసీత్"

(4) విజ్ఞానేతి వృత్తవాదం : మనచే గుర్తింపబడు సమస్తము నకు మనజ్ఞానమేకారణంగాన్నది. (జ్ఞానసత్తయే వస్తువుయొక్క వునికికి కారణం) జ్ఞానంలేకుంటే పదార్థభావనయెలేదు కనుక స్వప్నములో దోచిన వస్తు ప్రతీతికి స్వప్నముని జ్ఞానము (మనస్సు) కారణమైనట్లుగానే జాగ్రద్వస్తుప్రతీతికి జ్ఞానమే కారణము. కనుక మొత్తము జగత్సృష్టికిగూడ విజ్ఞానమేకారణమన చెల్లును. యిందుకు శ్రుతి :- "విజ్ఞానాద్ధ్యేవఖల్విమాని భూతాని జాయంతే విజ్ఞానేనజాతానిజీవంతి, విజ్ఞానంప్రయంత్యభి సంవిశంతి'' ॥తైత్తి ఉప॥"

(5) వ్యోమవాదం :- స్థూలసూక్ష్మరూపమగు సమస్త సృష్టికి శబ్దతన్మాత్రయే కారణము, చిరకాలముచ్ఛరిరిచినచో శబ్దశక్తిస్థూలరూపము వహించి నేత్రగోచరము కాగలదు. అని నేటివిజ్ఞానశాస్త్రవేత్తలుగూడ నంగీకరించుచున్నారు. "నవ్యాశబ్దమివాస్తి" "సర్వంశబ్దేనభాసతే" అను శ్రుతులున్నకలవు, సకలవస్తువుల బాహ్యాభ్యంతరములందునూ ఆకాశముగలదు. అది భూతములలో మొదటిది. "అకాశాద్యోనేః సంభూతః" అనివ్ని "....ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నిర్యాపః అద్భ్యః పృధ్వీ...." అనిన్ని శ్రుతులుగలవు కనుక అకాశమే సృష్టికారణము.

(6) అపరవాదం :- ప్రత్యక్షముగా గానవచ్చు భూతములు అన్యోన్యసంయోగము చెందుటచే సృష్టి కనుక యీసృష్టికి నిమిత్తకారణరూపుడగు వ్యక్తి యొక డుండవలెననుట యసంగతం కార్యకారణములు రెండునూ అపరమే, ప్రతికార్యమూ మరొక కార్యమునకు కారణమగుచున్నది ఒక టెంకాయలోని జలము విత్తనరూపముగా నుండి వృక్షముత్పత్తి చెంది చివరకు ఫలోత్పత్తి అగుచున్నది విత్తనపుకాయలోని నీరే అందుండి వెడలిన చెట్టుయొక్క టెంకాయలోని జలమునకు కారణమైనది. ఆ చెట్టున కాచిన టెంకాయలోని నీరు తిర్గి వితానరూపము వహించుచున్నది.

స్థూలానిసూక్ష్మాని బహూనిచైవ, రూపాణి దేహీస్వగుణైర్వృణోతి, క్రియాగుణైరాత్మ గుణైశ్చ తేషాం సంయోగహేతుర పరోపిదృష్టః"

(7) అవరణవాదం :- ప్రతివస్తును కొంత స్థలమాక్రమించును. అవస్తువుయొక్క అవరణమంతవరగూ యున్నదన్నమాట దానినావరించి చుట్టునూ మరియొక అవరణతోనున వస్తువుండును. అన్ని వస్తువులు యీవిధముగా ఆవరణకల్గి అవరణమునందేయున్నవి. అకాశమూ అవరమేణ. కనుక అవరణమే సృష్టికారణమూ, ప్రతివస్తు

వున్నా దాని ఆవరణయందే అది పోడముచున్నది. దాని ఆవరణమందే అది స్థితిగల్గియున్నది దాని ఆవరణమందే అది తిరోభావముగాచుచున్నది.

(8) అంబోవాదము :- జలభూతమే సృష్టికారణము. చంద్రుడు జలముయొక్క విశేషావస్థారూపము, సూర్యుడును తేజోమయమగు 'మరీచి' అను యుదకవిశేషము వలన యేర్పడును. ఓషధులు జలమువలననే వృద్ధిచెందును. శుక్లశోణిములు జలసంబంధమే. స్థానవ్యాప స్వభావములనుబట్టి జలమునకు అంభః, మరిచిః, మరః, అపః, శ్రద్ధాఅను వివిధనామములును కల్గినవి, సర్వశరీరములును జలభూతమువలన కలుగుచున్నవి. శరీరాంతర్గత పురుషుడుకూడా జలభూత సంబంధియే, ఎట్లన:- అన్నము, పృథ్వీరూపము. పృథివి జలమునుండికల్గెను. కనుక పురుషడన్న రసమయుడు. "సవాయేష పురుషోఽన్నరసమయః" అన్నముయొక్క సూక్ష్మము మనస్సు, "అపోమయః ప్రాణః". =జలసూక్ష్మము ప్రాణము, మనః ప్రాణ సమష్టిజీవత్వము, కనుక పురుషుడు జలసంబంధియే. శ్రుతి:- "ఆపోవైసర్వదేవతా" "అపోవాఅస్య సర్వస్య ప్రతిష్ఠా." సృష్టి జలభూతమునుండియే అని ఐతరేయపు పనిషత్తు ప్రతిపాదిస్తూవున్నది.

ఇవన్నీ, యింకా మరికొన్నిన్ని, వాదములుగలవు, అన్నివాదములున్నూ సృష్టికారణమును నిరూపించి యున్నను పరమకారణంవరకు విచారించక అవాంతర సృష్టి కారణములమాత్రమే నిర్ణయించినవి. ఈవాదములు నిమిత్త కారణస్వరూపుడగు ఈశ్వరుని సత్తను అంగీకరించక ప్రత్యక్షముగా కానవచ్చు సృష్టిలోని ఒక పదార్థమునే ఎత్తుకొని అదియే సృష్టి కారణమని నిర్ణయించినవి. అనగా వుపాదాన కారణమునుమాత్రమే నిర్ణయించినవి. సత్, అసత్, సదసత్, అనునవి పరమకారణములుగా నిర్ణయించిన వాదములు మూడున్నూ బ్రహ్మపదార్థమును మాత్రము ఎత్తుకొనలేదు అయినను వారు నిర్ణయించిన, సత్, అసత్, సదసత్, అనునవి బ్రహ్మముయొక్క వివిధరూపములు మాత్రమే అని గ్రహించనొప్పును. విజ్ఞానేతివృత్తవాదమునందు అవిజ్ఞానము ఎవరికికల్గుచున్నది? వారు ఎట్లువచ్చిరి? అనువిషయములు గాని జ్ఞానోత్పత్తికి పూర్వదశయందున్న వస్తువు ఎట్లువచ్చినదో గాని వారు వివరింపలేదు. 'ఇది' అను జ్ఞానము కలుగవలెనన్న యావత్వస్తువుల వుత్పత్తి అనంతరమే కలుగగలదు కాని, ముందుగా ఎట్లుకల్గును? జ్ఞానసంస్కారము వస్తూత్పత్తి వల్లనే జరుగుచున్నది, అని అంటూరేకాని ఆ సంస్కారము అంతకు పూర్వము ఆవస్తువును చూచినగాని ఎట్లుగల్గును? పూర్వవస్తువు లేనేలేదు, అనేఎడల నిర్హేతుకముగా అజ్ఞాన

సంస్కారము ఎట్లుగలుగగలదు? కనుక విజ్ఞానమే సృష్టికి పరమకారణము, అన్న వాదము సమంజసముకాదు.

అట్లే సత్, అసత్, సదసత్, రజోగుణము, ఆకాశం పంచభూతములు, ఆవరణము-అమృతమృత్యువులు అహోరాత్రములు యివిఅన్నియు స్వయంప్రకాశవస్తులు కావు కనుక. సృష్టికార్యమునందు స్వయం సమర్థములుకావు. "వీనియందు తెలివి ఏలేశస్వరూపముగానో వున్నదికాని, లేకపోలేదు. కనుక ఆలేశస్వరూపమగు తెలివి సహాయముతో యేలసృకాష్టిరాదు?" అని అనేయెడల అప్పుడు ఆ లేశస్వరూపమగు తెలివియే సృష్టికారణము అని అనదగియుండును. ఏది లేకుంటే సృష్టికాజాలదని తేలినదో అట్టి తెలివియే జగత్ కారణము అనజెల్లునుగాని, పైనచెప్పబడినవి సృష్టి కారణములు కాజాలవని సిద్ధించుచున్నది.

తెలివియే సృష్టికి పరమకారణం అని అన్నపుడు దీనియందొక శంక కలుగుట సహజము. తెలివిరూపమగుదానికి సృష్టికామనగల్గి మిక్కిలి ఆలోచించి, లేక తపించి సృష్టి చేయవలసిన పదార్థజాతమును తన అనంతవూహావాహినిలో ముందుగా భావించుకొనును. అభావనా ప్రపంచము భౌతిక పదార్థరహితముగా, అనగా ఎట్టి ముడిపదార్థము లేకుండానే భౌతికమగు ఈవిశ్వరచన ఎట్లుగావింపగల్గును?? ఈ శంక

సమంజసమైనదే. బాహ్యవస్తుసృష్టికి భావనమాత్రమే చాల దనుట నిర్వివాదము. అయితే సూక్ష్మముగా పరమాణు రూపమున భౌతికము భావనయందుండి ఉండవచ్చునుగదా! పరమాణువునందుగల ప్రచండశక్తికి పరమాణువుకూడ లేని స్థితిలోవుండుటకు ఆశ్రయభూతమగు వస్తువు లేక తత్వము, యీభావనయే, యనక తప్పదు. భావము శక్తికి ఆశ్రయము కాగలదా? అనగా భావనకుకూడ ఒక శక్తియుండునా? ఉన్న దన్నచో ఆశ్చర్యమేమి? తప్పక వున్నది. ఒకనియందు ఒక దుష్టభావన విజృంభించినపుడు భౌతికముగా అతని శరీర మందు మార్పులు అగుపడుటలేదా! భావనతీవ్రమైనాగ్రహరూప మునహిస్తే శాపమైదహించుటలేదా? భావనారూపమైన తప శక్తిచేత బ్రహ్మాండ భాండములు భస్మీపటలములాయె నని ఎన్నియో పౌరాణికగాధలు కలవు. విశ్వామిత్రాదులు తమ భావనాపటిమచే సృష్టికి ప్రతిసృష్టిగావించిరి. కనుక భావనయందు గర్భీకృతమైశక్తికలదని తెలుచున్నది. భావన చేయునది మనస్సు మనస్సుచేతనే సృష్టిఅనుటకు, "మనసా ప్రజాఅసృజంత." అని శృతి నుడువుచున్నది అయితే ఈ మనస్సు ఎవరిది? దాని స్వరూపమేమి? పరబ్రహ్మమందు నిగూఢమైయున్న తెలివియే ఈమనస్సు అయియున్నది. యేదీ కారణమందులేకుంటే కార్యోత్పత్తి కాజాలదో, అదే శక్తి కనుక పరబ్రహ్మమునందుగూడ యిట్టిశక్తిగలదు.

కాని పరబ్రహ్మము వినా ఈ శక్తికి ఉనికిలేదు. "శక్తిమే జగత్తునకు కారణం." అని అన్నవారుగూడ చివరకు బ్రహ్మమే సృష్టికికారణమని అంగీకరించక తప్పదు.

బ్రహ్మచైతన్యాశ్రితమగుమాయ చైతన్యమునువిడచి యుండదు. కనుక చైతన్యమునకే శక్తియనియు, చేతనశక్తి యనియు పేర్లువచ్చినవి. బ్రహ్మమునందు బీజరూపముగా అణగిమణగియున్న సత్వరజస్తమోగుణములు మూడుకలసి త్రిగుణాత్మకమగు మూలమాయగావున్నది. యిందుసత్వ గుణము = శుద్ధమాయ. మహత్తు. జ్ఞానశక్తి లేక చిచ్ఛక్తి అని పిలువబడును. రజోగుణము = మిశ్రమమాయ, మహదహంకారము, యిచ్ఛాశక్తి యనబడును. తమోగుణము = మలినమాయ, పంచతన్మాత్రలు, ఆవరణశక్తి లేక ద్రవ్యశక్తియని అనబడును. గుణత్రయపద్ధతిగాగాక శక్తిని బాహాటముగా రెండు ప్రధానశక్తులుగా చెప్పవచ్చును.

(1) చేతనశక్తి, జీవశక్తి, లేక పురుషశక్తి, యివియే పరాప్రకృతి యనబడును. యిది తెలివిరూపమగు చిచ్ఛక్తి.

(2) అచేతనశక్తి, జడశక్తి, ప్రకృతిశక్తి; యివి అపరాప్రకృతి రూపంగానున్నది. యిది విస్మృతిరూపమగు ఆవరణశక్తి

చేతనశక్తి ప్రాణులయందును, అచేతనశక్తి భౌతిక పదార్థములయందునూ కలవు అచేతనశక్తికి అగ్నియొక్క

దాహకశక్తియు, వాయువుయొక్క చలనశక్తియు ఉదాహరణములుగా నీయనగును. పరమాణువులయందున్నది అచేతనమగు చలనశక్తియే. శక్తియొక్క అచలరూపము పురుషుడనియు, చలనరూపము మాయయనియు లేక ప్రకృతియనియు ననదగును. పురుషప్రకృతులు రెండున్నూ తనయందే గర్భీకృతము చేసుకొనియున్నదే బ్రహ్మము. ఒకే శక్తి చలాచలరూతములుగా నుండి ప్రకృతి పురుషులుగా నున్నది. కనుక బ్రహ్మము తనయందుగల తెలివిరూపమగుచేత నాశక్తిలేక భావనాశక్తిచే సంకల్పించి, తనయందేగల ఆవణశక్తిచే భౌతికపరిణామమునకు కారణముగాయున్నది. ఈ రెండే మరియొక పరిభాషలో ఎరుక,మఱుపులుగా అభివర్ణింపబడినవి. చేతనాధిష్టితమగు అచేతనమె కార్యోత్పత్తికి మూలము. చేతనమందచేతనమున్నూ అచేతనమందు చేతనమున్నూ బీజరూపంగాయున్నవి. కనుకనే చేతనమునుండి అచేతనమగు నఖరోమాదులున్నూ అచేతనమగు గోమయాదులనుండి చేతనమగు వృశ్చికాదులున్నూ వుత్పత్తియగుచున్నవి. ఇందలి చేతనము నిమిత్తకారణము, అచేతనము వుపాదాన కారణము. దేశకాలాదులు సహాయకారణములు, ఐతే దేశకాలాదులు శక్తిద్వయరూపముగానున్న మూల వస్తువునకు భిన్నముగానున్నవా అంటే అట్లనరాదు; ఏలననగా అమూల వస్తువుసర్వతాత్రా నే వ్యాపకమైయున్నది. కనుక

అన్యదేశమే లేదు. రెండుసంఘటనలకు మధ్యగలవ్యవధియే కాలము. లేదా అథమం ఒక్కసంఘటనయైనావుంటే, దానిని పురస్కరించుకొని దానికిపూర్వము భూతకాలము, అది జరుగునపుడు వర్తమానకాలము, దానిఅనంతరము భవిష్యత్కాలము ప్రవర్తిల్లగలవు. సృష్టియే అప్రథమ సంఘటన కనుక సృష్టికి, సృష్టితోయుత్పత్తిఅయిన కాలము, సహాయకారణము కాగల్గునా? మరియు, కాలము అన్ని సంఘటనలకు స్థానమై యున్న బ్రహ్మమునకు అన్యముగాలేదు. కనుక సహాయ కారణములని చెప్పబడే దేశకాలములున్నూ బ్రహ్మస్వరూపనందే యిమిడియున్నవి సృష్టివిషయములో పురాణములు కూడ బ్రహ్మమే జగత్కారణమంటూన్నవి "పురాణం పంచలక్షణం" అన్నారు (1) సర్గము (2) ప్రతిసర్గము (3) మన్వంతరములు (4) రాజవంశములు (5) అనువంశములు, అను యీ ఐదున్నూ పురాణలక్షణములు సర్గప్రతి సర్గములు రెండునూ సృష్టివిధానమునకు సంబంధించినవి అందు సర్గమనగా మొట్టమొదటుగా జరిగిన సృష్టి మహాప్రళయానంతరము తొలిసారిగా జరిగిన సృష్టివిధానము సర్గను, ఇది శ్రీ ఆది శంకరులవారు నిర్ణయించినరీతిగా. బ్రహ్మమునుంచి అవ్యక్తము, మహత్తు, మహదహంకారము, పంచతన్మాత్రలు, పంచమహాభూతములు ఒకదానినుంచి యొకటి క్రమముగా గలిగెను అను సృష్టివిధానమునే అనుసరించినది.

ప్రతిసర్గమనగా....కృత, త్రేత, ద్వాపర, కలి, అను చతుర్యుగములుకలసి నొక మహాయుగము అట్టి యుగ ప్రళయానంతరం జరుగుసృష్టికి ప్రతిసర్గమని పేరు. యీ ప్రతిసర్గరూపసృష్టి యెట్లుజరిగెనో వివరించుకథ యొకటి పురాణములలో కలదు.

ఒకమనువు, చెరువునకు స్నానమునకై పోగా, ఆచెరువునందలి యొక చిన్నచేప రక్షించుమని యాతని ప్రార్థించెను ఆతడాచేపను తన చెంబులోని నీళ్ళలోవేసి యింటికి గొంపోయెను. ఆచేప పెద్దదిగా యెదుగుచూ చెంబు తనకు చాలాయిరుకుగానున్నదవి మొరబెట్టుకొనెను. మనువు దానిని తీసి మొదటవొక పెద్దపాత్రయందును, అదికూడ ఆయెదిగి పోవుచున్న మత్స్యమునకు యిరుకైపోవుటచే తుదకు మహాసముద్రమునందును దానినివైచెను. అంత నాచేప మహామత్స్యముగా మారిపోయెను. సముద్రములు పొంగి అంతయు జలార్ణవమై భూమండలమంతయు మునిగి ప్రాణులన్నియు నశించిపోనున్నవనియు, కనుక, జీవోపాధులలో జాతికొక్కటిచొప్పున వెంటబెట్టుకొనివచ్చి తనపైనెక్కి రక్షణపొందవలసినదిగాను, మనువునాదేశించగా ఆ మహామత్స్యము చెప్పినరీతిగాజేసి మనువు ప్రాణులను కాపాడెను. సముద్రములు తమ స్థానములలోనికి తరలిపోయినపిదప ఆ రక్షింపబడిన ప్రాణులనుండి సృష్టివిజృంభణ జరిగెను. దీనికి ప్రతి

సర్గమని పేరు. కాబట్టి శ్రుతియుక్తి అనుభవపురస్సరముగా ఎంతపరిశీలించినను, సృష్టికారణము బ్రహ్మమే యనక తప్పదు.

బ్రహ్మము సృష్టికారణముకాదు అనుటకు కొందరు ఈక్రింది ఉపపత్తులను చూపుచున్నారు.

(1) బ్రహ్మము సృష్టికారణమని !అంటే, అది సావయవమై యుండవలెను. కానిచో అందుండి సృష్టి ఎట్లుకల్గును!

(2) ఏకమగు బ్రహ్మము నానాప్రకారములు కావలెనంటే తాను ఖండఖండములు కావలెను.

(3) జగత్పదార్థములన్నియు ఖండరూపములుగానేయున్నవి. యివి నిత్యమా? అనిత్యమా? నిత్యమేనంటే, అనేక నిత్యపదార్థములుండుటచే అద్వైత హానిఅగును. అనిత్యములంటే నిత్యమగు బ్రహ్మమునుండి అనిత్యవస్తువులు వ్యుత్పత్తి చెందినవి అనవలెను. లేదా బ్రహ్మమున్ను అనిత్యమేఅని అనవలసివచ్చును. ఏలననగా కార్యములందుగల గుణములు కారణమునందు బీజరూపంగానైనా యురడవలెను.

(4) కార్యమగు అచేతనవస్తువులు తమవ్యుత్పత్తికి పూర్వము కారణమగు చేతనమందు వున్నవని చెప్పవలసివచ్చును. అట్లు చెప్పరాదు. కనుక కార్యోత్పత్తికి పూర్వము అనత్తే

అనగా అభావమేవుండెనని చెప్పవలసివచ్చును. వేదాంతులు సత్కార్యవాదులు (అనగా సృష్టికి పూర్వము సత్ కలదు అనువారు) కదా! కాని వారి సత్ కార్యతావాదమునకు యిపుడు అసత్ కార్యవాదాపత్తి సంభవించుచున్నది.

(౫) సృష్టిని అంగీకరించినచో ప్రళయమున్నూ అంగీకరించవలసినదేకదా! జీవజగత్తులు ప్రళయస్థితియందు బ్రహ్మమే యగునా? తదన్యముగా బ్రహ్మమునందుండునా? బ్రహ్మమేయగునంటే ప్రళయముతోజీవులందరు ముక్తులు కావలసినదే! అపుడుశాస్త్రము, గురువు, ఉపదేశాదులు, సత్ప్రవర్తన అన్నియు వ్యర్థమైపోవును అంతేగాక పునస్సృష్టియందు అట్లుముక్తులైనవారుగూడ తిరిగి జన్మించవలెను. బ్రహ్మమునందే తదన్యముగానుందురంటే అద్వైతహాని మరియు ప్రళయమునందుగూడ జీవజగత్తులు బ్రహ్మమున నిత్యముగా నిలిచియుండునంటే యిక ప్రళయమని దానిని అనవేరాదు! నిజమే. ప్రళయమనరాదు, తిరోభావమనియేయనవలెను. ప్రళయకాలమున ముక్తులుగాక మిగిలినవారు వారివారి సంచితసంస్కారసహితముగ బీజరూపముగా బ్రహ్మమునందే యుండి పునస్సృష్టియందు పూర్వకర్మానుసారం తిర్గి సృష్టయగుదురని సిద్ధాంతం.

(6) పరిణామవాదమంగీకరిస్తే, బ్రహ్మము నిరవయవము గనుక బ్రహ్మమంతయు పరిణమించెననవలెను, అప్పుడు జగద్రూపముగా బ్రహ్మము గానవస్తానేయున్నది దానిని వెతకి తెలుసుకొనవలసిన పనియేయుండదు. "సోఽన్వేష్టవ్యః" "విజిజ్ఞాసితవ్యః" "ఆత్మా వారే ద్రష్టవ్యః" "బ్రహ్మవిదాప్నోతిపరం" "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" "తరతిశోకమాత్మవిత్" యిత్యాది శ్రుతులన్నియు నిరర్ధకములై పోవును. అంతేక "యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహా", నచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి, నోమనః" అను శ్రుతులు బాధింపబడును.

(7) పాదోస్యవిశ్వాభూతాని, త్రిపాదస్యాఽమృతందివిః" "అనేనజీవేనాత్మనాఽను ప్రవిశ్యనామరూపే వ్యాకరవాణి" మొదలగు శ్రుతులున్ను, చెప్పినవిధంగా బ్రహ్మములో కొంతభాగమే పరిణమించినదనిన్ని శేషించినదంతయు అన్వేషవ్యమూ, ప్రాప్యమూ అయిఉన్నదనిన్ని చెప్పుటకుకూడా వలనపడదు, ఏలననగా బ్రహ్మము నిరవయవము, అఖండము అనిచెప్పేడి శ్రుతులు బాధింపబడి బ్రహ్మమునకు సావయవఖండత్వాదులు సిద్ధించుచున్నవి.

(8) బ్రహ్మము వుపాదానకారణమా అంటే అపుడు బ్రహ్మము నిరవయవము అనిచెప్పరాదు సావయవము అందామా?

అంటే, ఏదిసావయవమో అదితప్పక అనిత్యమేయగును. నిరవయవమూ, సావయవమూ రెండూ కూడా అంటే అది అయుక్తము.

(9) వివర్తోపాదాన కారణమంగీకరిస్తే యీ దోషములుండవు కాదా అంటే, బ్రహ్మమునకు సాదృశ్యాది యితరదోషములు సిద్ధించును.

యీవిధంగా బ్రహ్మము సృష్టి కారణమని సర్వోపనిషత్తులు ఒకప్రక్క ఘోషించుచున్నవి. మరొకయెడ బ్రహ్మము జగత్కారణమైతే, యితర శ్రుతిసమన్వయము అగుటలేదు. అంతేగాక బ్రహ్మమునకు ఖండత్వ. సావయవత్వ, అనిత్యత్వ. జడత్వాదిదోషములుసిద్ధించుచున్నవి. దీనికి పరిష్కారమార్గమేదో నిర్ణయించి సిద్ధాంతము చేయుటయే యీ ప్రకరణోద్దేశము.

## సిద్ధాంతము

(1) బ్రహ్మము జగత్కారణమని శ్రుతియుక్తి అనుభవముల వల్ల ఋజువగుచున్నది.

(2) అజమూ, అమరమూ (అనగా పుట్టనిదీ, చావనిదీ,) అఖండమూ, నిరవయవమూ, నిత్యమూ, మొదలగు లక్షణములుండే అట్టి బ్రహ్మమునుండి సృష్టి కాజాలదు.

(3) కనుక ఏ బ్రహ్మము జగత్కారణమని శ్రుతులు చెప్పెనో, ఆబ్రహ్మము ఒకపుడు అఖండమూనిరవయవమూ

నిత్యమూగా గానవచ్చిననూ, మరియొకప్పుడు తద్వ్యతి
రేకలక్షణములుకూడా గల్గిన ద్వంద్వలక్షణములు గలిగిన
సాపేక్షిక వస్తువుఅయియుండవలెను "సర్వధర్మోపపత్తేశ్చ"
బ్ర సూ. 2 1.37 అవి సర్వధర్మములుకలిగి యున్నద
ని తాత్పర్యము. లేనిచో, అవి సృష్టిసమర్థకమే కాజాలను
అట్టి సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, సర్వేశ్వరత్వ, మహామా
యిత్వ, జగత్కర్తృత్వములుగల్గిన బ్రహ్మము "సర్వాశ్చ
ర్యమయే దేవే సర్వం సంఘటితేధృవం" అని కొనియా
డబడుచున్నది. యిదియే స్వప్రకాశచేతన పరబ్రహ్మము.

(4) అజమై, అమరమై, సర్వద్వంద్వవిరహితమై యున్నది.
కేవలము నిరపేక్షకమగు అతీత పరిపూర్ణ బ్రహ్మము,
అవి సృష్టికారణమగు బ్రహ్మముతోగాని సృష్టితోగాని
యెట్టి సంబంధములేక యున్నది.

(5) సృష్టికారణమగు బ్రహ్మము సృష్ట్యాదివ్యాపారమునం
దున్నపుడు తటస్థలక్షణముగల దైవిశ్వగతమును విశ్వాతీ
తమునుగూడనై యున్నది. సృష్టికిపూర్వము
ములను తనయందు దాచుకొని స్వరూపలక్షణముతో స్వ
యంప్రకాశమానమైయున్నదిన్ని అబ్రహ్మమే. అబ్రహ్మ
మే ఆస్వప్రకాశలక్షణము (సంవిత్ లేక చిత్స్వరూపము)గూ
డ మరుగై మరుపురూపమందున్నపుడు ఆతద్వ్యావృత్తిలక్ష
ణముచే నిర్విశేషపరబ్రహ్మముగా కొనియాడబడుచున్నది

యిన్ని మార్పులుగల యీ బ్రహ్మము అజము అమరమూ కాజాలదు.

(6) అజమూ అమరమూ అయిన పరిపూర్ణపరబ్రహ్మము కేవలము అతద్వ్యావృత్తిలక్షణముచే "నేతినేతినేతీతిహో వాచ" అని సర్వాతీతముగనున్నదని చెప్పుటకైనా వలనుపడకయున్నది. ఏలననగా, యిది కాదు కాదనుటకు, ఆ "యిది" అనుదానికి సూదిమోపుటకు కైనా సందులేని పరిపూర్ణపరబ్రహ్మమునందు వునికి ఎట్లుండగలదు? యితర మేదైనదానియందుంటే అది పరిపూర్ణ మనిచెప్పుటకే వీలు లేదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు ఏదీలేనేలేదు. ఇదికాదని, నిషేధించుటకు వస్తువేలేదు. కనుక పరిపూర్ణపర బ్రహ్మము ఏలక్షణచేతను తెలియరానిది. అదిమాత్రము సృష్టికారణంకాదు.

యీపరిపూర్ణబోధసిద్ధాంత (కడపటి ప్రకరణములలో వివరింపబడినది) రీత్యాతప్ప సర్వశ్రుతి సమన్వయం కాజాలదు. సృష్టికారణమగు బ్రహ్మమునకూనూ, అజమూ అమరమూనగు పరిపూర్ణపరబ్రహ్మమునకును ఏలాంటి సంబధమూ లేదని ఋజువగుచో బ్రహ్మము సృష్టికారణమను వాదమునకు పైన పేర్కొనబడిన ఆక్షేపణలుగాని యితరాక్షేపణలుగాని తలయెత్తజాలవు. అట్టిఋజువులు పరిపూర్ణబోధ ప్రకరణములో లభించగలవు. పాంచభౌతికమగు జగత్తుయొక్కసృ

ఏవిధముగా జరిగినది అను విషయమించుక పరిశీలించవలసి యున్నది. దీనికి శాస్త్రములలో కొన్ని వాదములు కనుపించుచున్నవి. అందు యీక్రిందనుదహరించినవి గమనించ దగును.

1. ఆరంభవాదము:- జగత్తుపుట్టెననుట. అనగా తల్లికిపిల్ల కల్గినట్లు యదివరకులేని జగత్తు సత్తునుండియో లేక అసత్తునుండియో కలిగెననుట, బీజరూపంగా నైనా అదివరకు లేని జగత్తు క్రొత్తగా ఎట్లుకలుగును? కనుక సత్తుయందో లేక ఆ అసత్తునందో యిది అదృశ్యరూపంగా అనగా బీజరూపంగా నైనా యుండియుండవలెను.

2. (ఎ) పరిణామవాదము:- పాలు పెరుగైనట్లుగానే బ్రహ్మము మారి జగత్తు ఆయెననుట, పాలు స్వరూపహాని చెందితేనే తప్ప పెరుగుకాదు. అట్లు బ్రహ్మము స్వరూపహాని చెందినదా? అను ఆక్షేపణకలదు.

(బి) అవికృతపరిణామవాదము:- పరిణామవాదమందలి దోషపరిహారార్థం యీవాదము లేవతీయబడినది పరిణామవాదమంగీకరిస్తే, జగదుత్పత్తి యనంతరం యిక బ్రహ్మముండరాదు. ఒకవేళంటేయు జగత్తుయొక్క పరిమాణముమేరకు తరిగిపోయియుండవలెను. అట్లంటే బ్రహ్మమునకు హానివృద్ధులంగీకరించవలసివచ్చును. అవికృతపరిణామవాదమునందు యీ ఆక్షేపణలకు తావు ఎట్లనగా ఆకాశము, వాయ్వా

గ్ని లజప్పృథ్వ్యులుగా పరిణమించిననూ వానియందు అణువ ణువునా ఆయా భూతాదికముల బాహ్యాభ్యంతరములయందు సర్వతా ఆకాశమే యున్నందున ఆకాశము క్షీణవృద్ధులెట్లు పొందలేదో అట్లేబ్రహ్మము, సృష్టికాబడిన సర్వవస్తువుల బాహ్య భ్యంతరములయందు, సర్వత్రా, తానే వ్యాపకమయ్యే వున్నందున బ్రహ్మమంతాగాని కొంతగాని సృష్టివలన యెట్టివికారమునూ చెందలేదు అని యీ వాదముయొక్క సారాంశము.

3. కార్యకారణవాదం :. దీనికేసత్కార్యవాదమనీ, గుణపరిణామవాదమనీ కార్యకారణ సమసత్తాకవాదమనీ మారుపేర్లు, దీనికి దృష్టాంతము:- మన్నుకుండగా మారినట్లు బ్రహ్మము జగత్తుగాఅయెను. కారణలక్షణములు కార్యమందుండుట సమవాయకారణము. మృల్లక్షణములు ఘటమునందున్నట్లే; బ్రహ్మముయొక్క లక్షణములైన సచ్చిదానందములు, లేక అస్తిభాతిప్రియములు జగత్తునందున్నవి.

శ్లో॥ అస్తిభాతిప్రియం రూపం నామచేత్యంశపంచకం
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం
॥ వే. పం ॥

తా॥ అస్తి, భాతి, ప్రియము, నామము, రూపము అను అయిదు అంశములుకలవు. యిందు అస్తిభాతిప్రియములు

బ్రహ్మమునకు సంబంధించి జగత్తునందున్ను యుండి యు
న్నవి. నామరూపములుమాత్రం ప్రత్యేకం జగత్తు లక్షణములు
(4) వివర్తవాదము:- దీనికే అధ్యారోపమనీ, అధ్యాసఅనీ
కూడ పేర్లు, రజ్జువునందు సర్పప్రతీతి, శుక్తియందు రజిత
ప్రతీతి యిత్యాదులు దీనికుదాహరణములు. కారణవస్తువు
నందెట్టి మార్పున్ను కలుగకనే అకారణవస్తువు నందే
అన్యవస్తుప్రతీతి అగుట వివర్తమనబడును.

"స్వరూపాఽపరిత్యాగేన రూపాంతరాపత్తిర్వివర్తః"
అనగా స్వరూపహానిలేకుండా కనుపించే మార్పువివర్తము.
జగత్తునకు బ్రహ్మము వివర్తోపాదాన కారణముగా నున్నద
నుటకు.

శ్రుతి॥ "అవికారీవా అరే అయమాత్మా"
"అవికార్యోయముచ్యతే" భ॥ గీ॥

బ్రహ్మము, లేక ఆత్మయే వికారమును చెందుటలేదు
అని తాత్పర్యము-యీ అన్యవస్తుప్రతీతి యెట్లగుచున్నది?

గుర్తులేనిచో యేవస్తువును గుర్తింపజాలము, పూర్వము
చూచిన కుండయొక్క ఆకారవికారాదులు మనస్సునందుండి
యిపుడు కానవచ్చిన సామాన్యసాదృశ్యాదులుగల వస్తువును
"అయంఘటః" యిది కుండఅని గుర్తించుట జరుగుచున్నది
దీనినే సంస్కారజన్యజ్ఞానమందురు. యిది కేవలము మానసి
కసృష్టి. ద్రష్టయొక్క స్మృతిరూప సంస్కారజన్య జ్ఞానమే

యుపాదానముగా నుండి స్వప్నమునందువలె పదార్థమును భావనారూపముగా మనస్సులు సృష్టించుచున్నది. ఇందు కార్యరూపంగా ప్రతీతి కాబడిన వస్తువునకు సత్యత్వము లేదు కనుక దీనికి కార్యమిథ్యాత్వవాదమని పేరు. త్రాటియందు పాము లేకనే తోచినట్లుల బ్రహ్మమునందు జగత్తు అధ్యారోపింప బడినదనీ, పరిశీలించిచూస్తే నిజమైన త్రాడు యేవిధము గా తెలియబడునో అట్లే విచారించిచూస్తే యదార్థమగు బ్రహ్మమేయుండి మిథ్యాజగత్తు లేకనేపోవుచున్నది.

అని యీవాదము. "అధ్యారోపాఽపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచతే" యీవాదమునందలి గుణదోషములను రాబోవు ప్రకరణములలో చూడనగును.

(5) మాయావాదము:- సృష్టి కేవలము యింద్రజాలమువంటిది, సృష్టికర్త యింద్రజాలకుడు. యిందుకు ప్రమాణములుగా యీ దిగువ వాక్యములున్నవి.

"మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరః"

"మాయాసృజతే విశ్వమేతత్"

యింద్రజాల మిదంసర్వం యథామరుమరీచికాః"

"యింద్రోమాయాభిః పురురూప ఈర్యతే"

ఈ వాక్యములన్నియు, జీవులను ఆకర్షించి సంసారమును బెంచు శబ్దస్పర్శాది విషయములందు వైరాగ్యము, పరబ్ర

హ్మమునందు బోధోపరతులు, పెంపొందించుకొనుటకు మాత్రమే స్వీకరింపదగును. అంతామాయమాత్రమే అని వుపేక్షిస్తే మెట్టవేదాంతమే ప్రబలగలదు.

కనుక వేదాంత శాస్త్రములో జగత్కారణమును నిర్ణయించుపట్లకొన్ని భిన్నాభిప్రాయములు కానవచ్చుచున్నవి

(1) మాయయేకారణము.

(2) మాయాబ్రహ్మలు రెండూకలసి కారణం (అవిద్యా సహిత బ్రహ్మోపాదాన కారణముబ్రహ్మము నిమిత్త కారణము.మాయాశక్తిఉపాదానకారణము. మాయ బ్రహ్మమందేయన్నది కనుక బ్రహ్మము అభిన్న నిమిత్తోపాదాన కారణమన్నారు.

(3) బ్రహ్మము వివర్తకారణము- ఉపాదాన కారణము మాయ.

(4) బ్రహ్మమే యుపాదానకారణము- మాయసహకారి కారణం.

(5) అధిష్ఠానచేతన బ్రహ్మము మాయలో ప్రతిఫలించి ఈశ్వరనామము చెంది జగజ్జీవులయుపాధులను సృష్టించెను.

(6) జీవులు తమజ్ఞానము నే వుపాదానంగాగొని తమ సంస్కారానుసారం జగద్దృశ్యాన్ని కల్పిస్తున్నారు.

విచారించిచూచినచో యీ వాదములయందు పరస్ప

గవైరుధ్యముగానరాదు. యిందు మొదటివాదమున. మాయ జడముగాన స్వయంగా సృష్టిసమర్థకము గాజాలదు. అట్లే చివరనుదహరించిన వాదమునగూడ కేవల విజ్ఞానము, లేక దృష్టి, సృష్టిసమర్థకముకాజాలదు. 2, 3, 4, 5 లలో బ్రహ్మ ము, మాయ, రెండూ యేదో రూపంగాచేరి సృష్టికారణమగు చున్నవి. మాయ, లేనిదే అన్నను బ్రహ్మముయొక్కశక్తియ న్నను, బ్రహ్మమే మాయకాశ్రయమగుటచేత మాయా బ్రహ్మలు రెండూ ఒకటే అనదగియున్నవి. అటులనినచో అద్వైతహానియునుండదు మరియు వాక్యములందుదోచు వైరుధ్యమున్నునుండజాలదు.

విశిష్టాద్వైతమున జీవజగత్తులు బ్రహ్మమునకు శరీర భూతములుగా వర్ణింపబడినవి. అనగా బ్రహ్మము సూక్ష్మ రూపమగు దేహియనియు జీవజగత్తులు ఆ బ్రహ్మమునకు స్థూలావరణరూపమగు పరిణామములనియు చెప్పదగును. బ్రహ్మము ఒక్కటే కేవలపారమార్థికతత్వమైయున్నను. జగత్తు మిథ్యకాదు బ్రహ్మముయొక్క స్థూలరూపం అయి వున్నది. దేహిదేహముల కవినాభావసంబంధమున్నట్లే జగ జ్జీవులుకూడా బ్రహ్మమేఅయివుండి అభివ్యక్తము (manifest) అయినవి. కనుక బ్రహ్మజగత్తులు పరస్పర సాపేక్షికములు, ఈశ్వరతత్వము (విష్ణువే ఆ బ్రహ్మము యొక్క సగుణ స్వరూ పము) చిత్తు లేక చేతనము లేక చేతనులు అన జీవులు, జడ

మగు (అచేతనమగు) జగత్తు, యీమూడున్ను చిదచిత్ ఈశ్వరులు అను తత్త్వత్రయమును విశిష్టాద్వైతులు అనాదులుగా అంగీకరించినందున యీవాదమునకు త్రైతవాదమని పేరు వచ్చినది. ఈశ్వరుడు తన లీలకోసం యీజీవజగత్తులతో గూడి ఈజగన్నాటకమునకు సూత్రధారి అయివున్నాడు. ఆత్మ ప్రకృతులయందు (జీవజగత్తులయందు) నివసించు పరమాత్మ లేక ఈశ్వరుడు యీ కారణంచేతనే అంతర్యామిఅని పిలువబడుచున్నాడు. సృష్టికిపూర్వము నామరూపములచే విభజించుటకు శక్యముగానివై అగోచరములైన జీవజగత్తులను ప్రకటించువాడీశ్వరుడైన శ్రీ మహావిష్ణువే. ద్వైతవాదమందును తదితరవాదములందును ఈశ్వరుడే సృష్టికారణం జీవులు సృష్టిలోనివారా? లేక సృష్టికిపూర్వమందేయుండిరా? జీవబ్రహ్మములకుగల సంబంధమెట్టిది? యిత్యాది విషయములు పరిశీలించనిచో యీసృష్టి మీమాంస సమగ్రముగానుండజాలదు.

ప్రళయకాలమున, జీవులు తమతమ సంచితకర్మ సంస్కారములతో బ్రహ్మమునందేబీజరూపమున అణగి తిరిగి పునఃస్సృష్టికాలమున పూర్వసంస్కారములతో అవిర్భావము చెందుచూ, జన్మరాహిత్యముచేసుకొనేవరకు పుట్టుచు కర్మ చేయుచు, చచ్చుచూ యిట్లునంతజన్మ పరంపరలయందు చిక్కుపడి సంసారమున పరిభ్రమించుచునేయుందురు. కనుక

జీవులు క్రొత్తగా పుట్టుటలేదు. వీరికిని ఆదిలేదు. అనగా మొదలు, మూలములేదు. ముక్తదశయందు బ్రహ్మముతో నైక్యమే అయిపోవుదురనిన్ని కనుక తిర్గియుపాధిపొందరనిన్ని, ముక్తులుకానివారుమాత్రము ప్రళయకాలమున తిరోభావముచెంది సృష్టికాలమున పూర్వకర్మసంస్కారములతో ఆవిర్భావము చెందుదురనిన్ని రజోగుణసంబంధముచే బ్రహ్మమే జీవరూపపరిణామము చెందిననిన్ని, అధిష్ఠానచేతనము జీవచేతనము అని రెండుగా తోచబడిననూ బ్రహ్మచైతన్యముకన్న భిన్నముకావనిన్ని కనుక "జీవోబ్రహ్మైవ" = జీవుడు బ్రహ్మమే, "నాపరః" = యితరముకాదు అనిన్ని అద్వైతము చెప్పుచున్నది. కనుక జీవబ్రహ్మలకు అద్వైతము తాదాత్మ్య సంబంధమును చెప్పును. జీవుడు విభుపును, స్వతంత్రుడును అయివుండియు అవిద్యోపాధ్యుపహితచైతన్యయుక్తుడైనందున మాయకు వశీభూతుడై జననమరణరూపమగు సంసారమున బద్ధుడైయుండును.

విశిష్టాద్వైతమునందు, జీవుడనాదియేగాని అణుస్వరూపుడనియు జగత్తుతోపాటు జీవుడును బ్రహ్మనకు (ఈశ్వరునికి శరీరభూతుడనిన్ని ముక్తదశయందు తనవ్యక్తిత్వము గోల్పోవడనిని, బ్రహ్మమే అయిపోడనిన్ని, కాని బ్రహ్మమున నిమగ్నుడైయుండుటచే బ్రహ్మమునకంటె పూర్తిగా భిన్నుడనికూడా చెప్పరాదనిన్ని, ఆవిధంగాబ్రహ్మ

మునందు స్వగతభేదము కలదనిన్ని, విశిష్టాద్వైతము చెప్పు చున్నవి. జగజ్జీవులను శరీరముతో గూడియుండుటవలన బ్రహ్మము శరీరవిశిష్టుడు కనుక యీ వాదమునకు విశిష్టాద్వైతమనిపేరున్ను వచ్చినది. అనంతకళ్యాణగుణ విశిష్టుడగు విష్ణువే బ్రహ్మస్వరూపము, ముక్తదశయందు జీవులు సాలోక్యముజెంది అనగా వైకుంఠలోకమునందే సామీప్య సారూప్యములు కల్గియుందురేగాని విష్ణువుతో నైక్యమొందరు. జీవుడే కర్తయు భోక్తయు నైయున్నాడు. ప్రకృతినపేక్షించి అనగా ప్రకృతిదృష్ట్యా చూచుకొన్నచో తాను శరీరియై పంచభూతాత్మకమగు శరీరమును ధరించియున్నాడు. ఈశ్వరుని ఆపేక్షించి, ఈశ్వరునిదృష్ట్యా ఈశ్వరుడు శరీరియై యుండి యీవిధంగా తాను ఈశ్వరునికి శరీరభూతుడుగా నున్నాడు; యీ మతప్రవర్తకుడగు రామానుజులవారు జీవబ్రహ్మలకు దేహా-దేహి, సంబంధము ప్రతిపాదించి యున్నారు. ద్వైతము (మధ్వాచార్యులవారి మతము)నందు జీవేశ్వరులు సర్వథా భిన్నులు. జీవులు అణుస్వరూపులు. పరస్పరభిన్నులు, కేవలము అస్వతంత్రులు ద్వైతమత ప్రవర్తకుడగు మధ్వాచార్యులవారు విష్ణువే బ్రహ్మమనియు, సృష్టిస్థితిలయముల కీయన కర్తయనియు, ముక్తిప్రదాత యనియు, చేతనులగు జీవులున్ను, అచేతనమగు జగత్తును ఆయన కధీనములైయుండుననిన్ని ఈయన ఆరెంటికన్నను

సంపూర్ణముగ వేరుగానున్నాడనిన్ని, జగత్తు సత్యమనియు, అనంతరనానియు, జీవజగత్తులకు అవిష్ణువేనియామకుడనిన్ని, బ్రహ్మమునకున్ను జీవునకున్ను సేవ్యసేవక (స్వామి భృత్య- లేక స్వామి కింకర) సంబంధమనిన్ని, జీవేశ్వర్లు భిన్నులు అనిన్ని వారిర్వురకు ఐక్యమెన్నడునుండ జాలద నిన్ని బోధించిరి.జీవులు పరిమిత జ్ఞానముకలవారు, అస్వతం త్రులుమోక్షదశయందు యీశ్వరునిలో సారూప్యతనైనను పొందురు. యీయన మతమున దృశ్యమంతయు సత్యమే: భేదమంతయు నిత్యమే.

వల్లభాచార్యుల శుద్ధాద్వైతము, నింబార్కుని (అనగా భాస్కరాచార్యుల) భేదాభేదము, చైతన్యుని అచింత్యభేదా భేదము, శ్రీకంఠుని శివాద్వైతము, మొదలగునవి కొన్ని యితరవాదములున్నను అవి అన్నియు విశిష్టాద్వైతమునందో ద్వైతమునందో, కించిన్మాత్ర భేదములతో యిమిడిపోవును. జీవుడు పరబ్రహ్మమేగాని అన్యముకాదని అద్వైతమంటే, కాదు, బ్రహ్మముయొక్క అంశమాత్రమని కొన్ని మత ములు అంశాంశీభావ సంబంధము ను నిర్ణయించగా మరి కొన్ని, అజీవ బ్రహ్మలకుండే సంబంధము శక్తి శక్త మత్సంబంధమనియో, గుణగణి సంబంధమనియో, కార్య కారణసంబంధమనియో నిర్ణయించినవి బ్రహ్మముతో ఏదో యొక సంబంధము జీవునికి అన్ని మతములు నిర్ణయించినవి

కాని ద్వైతమతములో మాత్రము ఈశ్వరజీవులకు ఉపాస్యోపాసక సంబంధమేగాని, యితర సంబంధమేదియు ఏ మాత్రము లేదు.

మధ్వప్రతిపాదితమగు బ్రహ్మము నిర్విశేషము కాదు' కేవలము సవిశేషము మధ్వునిమతమందు జీవబ్రహ్మలు రెండున్ను కేవలము భిన్నములు, సగుణబ్రహ్మమగు ఈశ్వరుడు సర్వజ్ఞత్వాదిగుణశోభితుడు. జీవుడల్పగుణవిశిష్టుడు కాని జీవేశ్వరులిర్వురును చిత్స్వరూపులే ఏకజాతికి చెందినవారు, గనుక సజాతీయతమాత్రము గలదు. అద్వైతమున సృష్టికి పూర్వమున్నదొక్క పరబ్రహ్మతత్వమే. కాని ద్వైతమట్లు గాక జీవుడు, జగత్తు, ఈశ్వరుడు అనుమూడున్ను పరమ తత్వములుగాను, అనాదులుగానూ, నిర్ణయించినది. కాని జీవుడణుస్వరూపుడు, ఈశ్వరుడు విభువు లేక సర్వవ్యాప్తి అయిన ప్పటికి జీవుడుకూడా చిన్మయస్వరూపుడైనందున జీవేశ్వరు లిర్వురు దేశకాలాతీతులు అనక తప్పదు. సూక్ష్మస్వరూప మగు జీవుని జ్ఞానము అల్పమైయున్నప్పటికి సర్వతవ్యాప్తి చెందవచ్చును కాని సర్వవ్యాపకత్వముపొందగల్గినను ఈశ్వరునివలె సర్వజ్ఞత మాత్రములేదు అందుకు కారణము వాని సాంద్రత (దళసరితనము) యందుగల భేదము అని మన మను కొనవచ్చును. బాగాతరుచుగా నేసిన దళసరిబట్ట బల మెక్కువగల్గియుండుటయు, అదే నెంబరు నూలుతో నేసిన

తరుచు బహుతక్కువగాయున్న బట్టమన్నిక లేక బంహీనమై యుండుటయు మనము గమనించుచున్నాము.

## ప్ర క ర ణో ప సం హా ర ము

వేదములు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, యితరోపనిషత్తులు, షడ్దర్శనములు, వివిధవాదములు మతములు, యిత్యాదిగాగల వీనియందు చేయబడిన సృష్టి సంబంధిత భిన్నభిన్న వివరణములను కొంతవరకు పరిశీలించినాము. సృష్టి లేనేలేదను వాదమంగీకారము కాదనియు గుర్తించితిమి. సృష్టికి అత్యంతమూలకారణము బ్రహ్మమేనని తెలినది. అట్టి బ్రహ్మము తానుతానై నిస్సంకల్ప స్థితిలో నున్నపుడు సృష్టిలేదు. తనయందు బీజరూపంగా అణగి యున్న గుణత్రియములు అనగా సత్వరజస్తమోగుణముల సామ్యావస్థయే ప్రకృతి అదియే అవ్యక్తము ప్రధానము, మూల మాయ యిత్యాదినామములచే ప్రసిద్ధము. అట్టిగుణములతో గూడినపుడే బ్రహ్మము గుణయుక్తుడగుటచే తన సర్వాతీతస్థితినుంచి చ్యుతుడై సృష్టికామనకు లోనగును. అట్టిసగుణ బ్రహ్మమే సృష్టికారణమని కొందరు, అతని త్రిగుణసమష్టి అగు మాయయే కారణమని కొందరు, యిత్యాదిగా ప్రతిపాదిస్తూవచ్చిననూ మూలకారణము బ్రహ్మమేనని నిర్ధారణ చేయుటలోని ప్రతిపత్తి ఏమియునుండిజాలదు. ఎట్లుకల్గినది

యీసృష్టి అనుటలో భిన్నాభిప్రాయములున్నవి. "అధిష్ఠాన పురుషుడు ఏమైన నెరుగునేమో" అని నాసదీయసూక్తము (ఈగ్రంథము 32 పేజీ చూడుడు). సందేహము వెలిబుచ్చినది కాని విమర్శిస్తే అట్టి సందేహమునకు తావులేదు. కుండలెట్లు చేయబడినవో కుమ్మరికెట్లు తెలియకుండును? కాని ఆదిలో నిస్సంకల్పస్థితిలోనున్న బ్రహ్మమునకు సంకల్పము అనగా ఈసృష్టి కామన యెట్లుకలైను? అనే ప్రశ్నకు "సంకల్పనస్సంకల్పరూపముగానుండు రెండుస్వభావములు తనవే గనుక" అను సమాధానము తేలికగా లభిస్తుంది. అయితే యిట్టిద్వంద్వలక్షణములుగల (అనగా ఈద్వయిదోషముగల) తానెట్లువచ్చెను? దేనినుండి తన సృష్టి ఆయెను? తనకు మూలమేమి? తనస్థానమేమి? అను విషయములుమాత్రము తనకు తెలియరావు అని, ఆసూక్తము చెప్పినదంటేనేతప్ప సర్వజ్ఞత్వాది సకలశక్తులుగల అబ్రహ్మమును కొంచపరచినవారమౌతాము. తనకు మూలమంటూవుంటే ఆసర్వజ్ఞత్వాది లక్షణములుగల అబ్రహ్మమునకు తెలియకుండునా? కనుక దానికి మూలములేదు అని అనవలసియుండును? యిట్లాఅంటే, మూలములేకుండానే ఎట్లురాగలదు? అంటే, తనకుతానే వచ్చినది, అని సమాధానము, తనకుతానే యెట్లు వచ్చును? యిందుకేమైన దృష్టాంతములున్నవా? అసలు మూలములేని వస్తువులు వునికికల్గియున్నట్లు దృష్టాంతము

లున్నవా? యిత్యాదిశంకా సమాధానము లెన్నియో యున్నవి. గురుగోప్యము కానంతవరకు వానిని పరిపూర్ణబోధ ప్రకరణములో చర్చించగలము. అవిఅన్నియు పరిపూర్ణ బోధకు సంబంధించినవి.

ఇక యీ పరిపూర్ణాచల సిద్ధాంతమున సృష్టి విధాన మెట్లు నిర్ణయింపబడినదో సంగ్రహముగా తెలియనగును.

వీరు "తస్మాద్వా, ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః ఆకాశాద్వాయుః వాయోరగ్ని అగ్నేరాపః అద్భ్యః పృథ్వీ. × × × అను శ్రుతి నంగీకరించినారు. "ఆకాశశరీరంబ్రహ్మ" అనురీతిగా ఆకాశమే శరీరముగాగల ఆత్మనుంచి వాయ్వాదులు కల్గి. సమస్త బ్రహ్మాండపిండాండములుకల్గినని. ఈ భావమునే కృష్ణదేశికేంద్రులు "ఆకాశాదిక భూతానీకాత్మకమగుచు ఎరుక ఈజగమయ్యెన్" అని అన్నారు. మరిన్ని "ఎరుకైన భూతములనీవెరుగుము ఆకసము గాడ్పు యింగలము నీళ్ళురవందనేల యని నేనెరిగిన పద్ధతిని నీకెరిగించినాను, ముజ్జగములయ్యెను వీట్లతోనూ"అని అన్నారు. మరిన్ని "ఎరుకైన భూతపంచక మెరుకకు చరణములు కటియు హృదయము గళమున్ శిరమును నయ్యెను క్రమమున ధరణి మొదల్‌చేసి యిట్లు తనయా గుర్తెరుగూ" అన్నారు. పంచభూత పరిణామముచెందిన యెరుకకు అనగా

విశుద్ధచేతనమునకు, ఆపంచభూతములలో పృధివి పాదములు, జలముకటి అగ్ని హృదయము, వాయువుకంఠము, ఆకాశము శిరోభాగముగానూ అయి విరాట్పురుషుని స్థూలదేహ మాయెను.

"ఆకాశము శూన్యంబని లోకులు మొరబెట్టి దానిలో పవనాదుల్, ప్రాకటముగ గల్గినవని చీకాకుగ చెప్పినారు ఛీ వినరాదు" అన్నారు. "ఆకాశం గగనం శూన్యం" అని చెప్పబడుతూ యూహూసామాయ అని అనబడే ఆకాశము సృష్టికారణమనరాదన్నారు. కనుక ఆకాశమే శరీరంగాగల పురుషుడే సృష్టికారణమన్నారు. ఆ ఆకాశము అపురుషుని యొక్క దేహమేగనుక దేహిదేహములుగానున్న అపురుషుడు "ఊర్ణనాభి" = పట్టుపురుగు (లేక సాలెపురుగు) వలె జగద్రచన గావించునన్నారు. ఆకాశాదికము అనగా కూటస్థుడున్ను పంచభూతములున్ను కలసి షట్కోశములు, (లేక షడావర్ణములు) రూపముచెంది ఎరుకే ఈ జగమయ్యెనన్నారు, కనుక ఎరుక అనగా శుద్ధజ్ఞానముయొక్క మారురూపమే జగత్తు కనుక "సర్వంఖల్విదంబ్రహ్మ" "ఏకమేవాద్వితీయంబ్రహ్మ" "ఏకమనేకంభవతి" యిత్యాది శ్రుతులలోనున్న బ్రహ్మ శబ్దమునకు పర్యాయపదముగా అచ్చతెలుగులో ఎరుక అనే శబ్దమును వాడినారు. కారణరూపముగానున్న యెరుకే కార్యరూపమగు ఈ జగత్తు, సృష్టిసంకల్పముకూడా కలుగని

స్థితిలో పరాయెరుక (అఖండయెరుక) అనీ, సృష్టికామనకర్తి వ్యవహరించునపుడు కేవలయెరుక (శుద్ధఎరుక)అనీ, జీవ రూపము చెందినపుడు మిశ్రమఎరుకఅనీ, పంచభూతాత్మక జగత్తుగా పరిణమించినపుడు మలినయెరుకనీ ఒకయెరుకే భిన్న భిన్న నామములతో వ్యవహరింపబడుతోంది (కారణ కార్యములుగా) అధోయూర్ధ్వపరిణామముజెందు వస్తువును యితరులు బ్రహ్మమన్నారు పరిపూర్ణులు యెరుకన్నారు. అంతయు ఎరుకే కనుక సజాతీయ భేదము లేదు. ఈ ఎరుక నానాత్వము చెందుతూ వున్నది కనుక యెరుకయందు స్వగతభేదమున్నది. ఈ ఎరుకకు భిన్నముగా పరిపూర్ణ పర బ్రహ్మమున్నది. కనుక విజాతీయభేదమున్నది. అయితే జగత్తుమిథ్యఅనకుండా బ్రహ్మమున కెంతవిలువనిత్తురో జగత్తుకును అంతేవిలువనిత్తురు గనుక యిది అద్వైతముగాదు. స్వగతభెదమొక్కటే అంగీకరించిన విశిష్టాద్వైతమున్ను కాదు. ఏలననగా ఆ ఎరుక కన్యముగా పరపూర్ణ బ్రహ్మమున్నదం టున్నారు. కనుక విజాతీయభేదమును పరిపూర్ణులు అంగీక రించిరి. పరిపూర్ణ బ్రహ్మముతప్ప అన్యమేమియు లేదం టున్నారు. కనుక ద్వైతమున్నూ కాదు. కనుక సర్వలక్షణ విలక్షణమగు అతీతసిద్ధాంతము. కాని ఆ మతసత్యములను అన్నింటినీ తాము ప్రతిపాదించిన ఎరుక స్వరూపమునందు సరిపుచ్చుకొన్నందున దానికి పరిపూర్ణభావము అని పేరున్నూ

సార్థకమైయున్నది. ఎట్లనగా ఎరుకతో సహాజీవేశ్వర జగత్తు అంతయూ కలిసి ఏకపదార్థముగా ఎరుకయనే పిలువబడుతోంది కనుక యిది అద్వైతమున్ను అగును. జగత్తుఅ ఎరుకయొక్క స్థూలము సూక్ష్మమగు ఎరుకకు స్థూలరూపమగు జగత్తు ఆవరణము లేక శరీరము కనుక దేహిదేహాసంబంధమును గుర్తించిన విశిష్టాద్వైతమున్ను అగుచున్నది. పరాయెరుక రూపంగా విలక్షణంగా తోచబడుతూ మిశ్రమ యెరుక (లేక జీవ) రూపంగా సంసారమున దగుల్కొన్నది. కనుక ద్వైతలక్షణమున్ను కల్గుచున్నది. కాని యిన్ని మతవాదములున్నూ ఎరుకలోనివే అని గుర్తింపనగును. పరిపూర్ణ పరబ్రహ్మమును ఏవిధంగాను వర్ణించరాదు కనుక యీ మత సిద్ధాంతముల కందునవిగాదు. మతములన్నియు ఎరుక నిర్ణయమునందే యిమిడిపోవును కనుక యీ భావమును మతమనుటయే కూడదు

—)o(—

శ్రీ గురుభ్యోనమః

# పరిపూర్ణదర్శనము

## అద్వైత ప్రకరణము

గడచిన ప్రకరణములో సృష్టికారణముగా దేనిని నిర్ణయించితిమో శ్రుతిస్మృతులలో మనోవాక్కుల కందరానిదిగా చెప్పబడిన బ్రహ్మము అదేననీ, అంతకంటె అతీతముగా మరియొకటి ఏమీ లేదనీ, చాలమంది పొరపాటుగా అభిప్రాయపడినారు ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది మతము లన్నియు యీ అభిప్రాయమునే వెల్లడించినవి. అట్లని ఆ మతకర్తలకు సృష్టికారణ వస్తువున కతీతముగా మరియొకటి యున్నదని తెలియనే తెలియదు, అని మనము అనుకొనుటకున్ను సావకాశము లేదు. ఆయా మతములు ప్రతిపాదించిన శంకరరామానుజ మధ్వాదులు మహానుభావులే, ఐనను ఆయా దేశకాలసమాజముల శ్రేయస్సునకై యెంతవరకు ప్రబోధచేసిన సరిపోవునో అంతియే వారు ప్రతిపాదించి యుందురని మనము నిశ్చయించవచ్చును. శంకరాచార్యుల వారు, బౌద్ధమతావలంబకుల బోధచేత నిరీశ్వర నాస్తికవాదములు ప్రబలి ధర్మమడుగంటి అధర్మము విజృంభించిన సంకటకాలములో ఆవిర్భవించి, అద్వైతమతమును వేదోపనిషత్తులనుండి యుద్ధరించి భారతదేశము నలుమూలలా

ప్రచారంచేసి వేదబాహ్యముగు ఆనాటిబౌద్ధమునకు దేశమున స్థానము లేకుండాచేసెను.

శంకరులవారు ప్రతిపాదించిన అద్వైతసిద్ధాంతము, ఆ తర్వాత సిద్ధాంతము చేయబడిన యితరమతములన్నిటి లోను తలమానికమై ఒక్క హైందవదేశమందేగాక యావత్ప్రపంచకమందును తాత్త్వికచరిత్రలో మిక్కిల ప్రసిద్ధి గాంచినది, యీ అద్వైత మతప్రతిష్ఠాపనా సందర్భములో శంకరులవారున్నూ, తదనుయాయులున్నూ, యితర మత వాదములనన్నిటిని పూర్వపక్షము గావించియుండిరి అట్టి అద్వైత సిద్ధాంతము సాకల్యముగా పరిశోధించి తెలుసుకొనుట ప్రథమ కర్తవ్యమైయున్నది. ఆపిమ్మట ఆ అద్వైత మత మందున్న లోపములను గుర్తించి ప్రధాన మల్లనిబర్హణా న్యాయముగా అద్వైతమునుగూడ అతిక్రమించి. అద్వైత మునకంటె అతీతమగు కేవల పరిపూర్ణపరబ్రహ్మ (absolute Brahma) విషయకమగు సిద్ధాంతములను గురించి తెలుసుకొందము.

"అద్వైతము" అను శబ్దార్థమునుబట్టి బ్రహ్మముగాక మరొండువస్తువేలేదనియు నా బ్రహ్మముయున్నదునూ రెండు గామారనిదనియూ మొదలగుభావములు మనకు గలుగు చున్నవి. కాని ప్రత్యక్షముగా మనకు గానవచ్చు (పంచ భూతాత్మకమై భూగోళ ఖగోళములతో గూడిన) యీ ప్రబ

హ్మాండము మాటయేమి? ఇటువంటివే అనంతకోటి బ్రహ్మాం డములున్నవని చెప్పబడుచున్నవే? యీ బ్రహ్మాండమందు 24 లక్షల విధములుగ గానవచ్చు వివిధోపాధులు ప్రతిరకపు యుపాధియందును గానవచ్చు భిన్నప్రకృతులు, స్వగత భేదములు, శబ్ద స్పర్శ రూపరసగంధాత్మకమగు నానాత్వ ములు యిత్యాదిగా శతసహస్రాధికమగు న్యూనాధిక్యతలలో గూడిన విభిన్నతత్వములు మొదలుగాగల సమస్తమును యింద్రియగోచరమై మానవునికి ప్రత్యక్షానుభూతి గలిగిం చుచూ సత్యత్వప్రతీతి గలిగించుచుండగా "బ్రహ్మసత్యం జగన్మిథ్యాజీవో బ్రహ్మైవనాపరః" అను అద్వైత సిద్ధాంతము పరమాశ్చర్య జనకమగుననుటలో సందియమేమియునుండ జాలదు కనుక అద్వైతమత ప్రతిష్ఠాపనాచార్యులగు శంకర సిద్ధాంతముల ననుసరించి బ్రహ్మము, జీవేశ్వరులు, జగత్తు వీనికి పరస్పర సంబంధము గలిగించు మాయావిద్యలు త్రిగుణ ములు మొదలగువానిని గురించి మనము సుస్పష్టముగా నవ గాహన మొనర్చుకొనవలసి యున్నది.

బ్రహ్మము :— నిత్యమై శుద్ధమై ఆదిమధ్యాంతరహి తమై అద్వయమై నిష్క్రియమై నిర్గుణమై స్వయంప్రకాశమై సర్వకారణమై సర్వమునకు ఆధారమును అధిష్ఠానమునూ అయి సర్వవ్యాపకమై సచ్చిదానంద లక్షణములే స్వరూప ముగాగలదై మనోవాగగోచరమై యుండునదే బ్రహ్మము,

అని చెప్పబడును. యిది స్వరూప లక్షణము అనగా సహజ లక్షణము. మొదటి రూపము. ఈ స్వరూపముచగల దొక్క బ్రహ్మమే. కనుకనే "ఏకమేవ" అన్నారు అటువంటిది మరొకటిలేదు గనుకను, ప్రతిలేనిదగుట చేతను, "అద్వితీయం" అని అన్నారు. ఈబ్రహ్మమే సృష్టిస్థితిలయములకు గారణమైనపుడు యీశ్వరుడనిపేరు. ఇది బ్రహ్మమునకు తత్కాలమందు తటస్థించిన లక్షణమగుటచే దీనిని తటస్థ లక్షణమందురు. కాకికూర్చున్నదే దేవదత్తుని గృహము అని చెప్పినచో, కాకియాయింటిపైనుండి మరుక్షణమున యెగిరిపోయినయెడల దేవదత్తుని గృహవర్ణనమెంత యసమగ్రమును ప్రమాదహేతువును కాగలదో. అట్లే తటస్థ లక్షణముచే పరబ్రహ్మమును నిరూపించి జెప్పుటయు నంత యసమగ్రమే గాగలదు. అట్లుగాక యుత్కృష్టప్రకాశము గలవాడు చంద్రుడని చెప్పినయెడల యసంఖ్యాక నక్షత్రముల మధ్యనున్నను యాచంద్రుని తేలికగా గుర్తింపవీలగును. దీనినే స్వరూప లక్షణమందురు. స్వరూప స్వభావములచే మాయాతీతుడై నిర్గుణుడై నిష్క్రియుడైయున్న బ్రహ్మము నిర్గుణబ్రహ్మమనియు, తటస్థభావమున మాయాశబళితమై యున్న బ్రహ్మచైతన్యము (లేక యీశ్వరుడు) సగుణ బ్రహ్మమనియు నందురు.

మాయావిద్యలు :.... శుద్ధబ్రహ్మమును ఆశ్రయించు

కొనియుండి దానినే ఆవరించుకొని అనగా మరుగుపరచుచూ నుండు నొక యనిర్వచనీయమగు అనగా యిదమిద్ధమని నిర్ణయించుటకు వీలుకాని విచిత్ర వస్తువునకు మాయయని పేరు ఇదిగూడ అనాదియనియు కాని సాంతమనియు చెప్పబడెను. ఎట్లన మాయకు శుద్ధమును నిర్వికారమును అగు బ్రహ్మమునందు కాని మాయికార్యమగు జీవేశ్వర జగములందుకాని యుత్పత్తి చెప్పుట విరుద్ధము. ఉత్పత్తిలేనిది గనుక అనాదియని చెప్పబడినది. కాని బ్రహ్మజ్ఞానముచే బాధింపబడును. గనుక మాయకు అంతముమాత్రముగలదు. ఈమాయసత్తునూకాదు అసత్తునూకాదు. బ్రహ్మజ్ఞానముచే బాధింపబడునది గనుక త్రికాలా బాధ్యమైన సత్పదార్థముకాదు అవస్థాత్రయమందునూ మాయాకార్యము ప్రకటమగుటచే అసత్పదార్థమని చెప్పనూవలనుపడదు. పరబ్రహ్మమును ఆశ్రయించుకొనియే యున్నందున బ్రహ్మముకంటె యిది భిన్నమని చెప్పరాదు. బ్రహ్మమును మరుగుపరచుచున్నందున అభిన్నమనియును యనరాదు. దీపముకంటె దీపప్రకాశము భిన్నమనిగాని అభిన్నమనిగాని చెప్పరానియట్లు బ్రహ్మముకంటె యిది భిన్నమనికాని అభిన్నమనికాని చెప్పరాదు. బీజముననున్న అంకురమువలె యీమాయ సావయవమునూకాదు నిరవయవమునూకాదు. జీవునియందు వ్యష్టిస్వరూపముగానూ, యీశ్వరునియందు సమష్టిస్వరూపముగానూ యున్నందున దీనిని

వ్యష్టియనికాని సమష్టియనికాని చెప్పతగదు కాని సర్వద్వంద్వములు మరల తానే అయివున్నది. కనుకనే మాయ అనిర్వచనీయమని శంకరుల యభిప్రాయము. వివేకచూడామణిలో శంకరులీభావమునే "శ్లో॥ సన్నాప్యసన్నాప్యుభయాత్మికానో, భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికానో సాంగాప్యనంగాప్యుభయాత్మికానో, మహాద్భుతాఽనిర్వచనీయరూపా॥ అని చాటినారు॥ ఈమాయను అనిర్వచనీయఖ్యాతి రూపముగా నంగీకరించినమాత్రమున అద్వైతహాని లేదు. ఏలనన సదసత్తులుగాని పదార్థమే మిథ్యయని అద్వైతులమిథ్యాశబ్ద నిర్వచనము. కనుక మాయయు, మాయాకార్యములునుగూడ మిథ్యయే. కనుకనే యా-మా-సామాయ అనగా ఏదిలేనిదో, అది మాయ అనిగూడ మాయానిర్వచనము చేసియున్నారు. చింతించుటకును, వచించుటకును సాధ్యముగాక, యుక్తికి చిక్కకుండుటంజేసియే, దానిని అనిర్వచనీయమనిరి. అందుకే వివేకానందులున్ను మాయను నిర్వచింపజాలనని చెప్పి, మాయాకార్యములకు దృష్టాంతము లిచ్చుటతో తృప్తి పడినాడు.

ఈమాయనే ప్రకృతి అందురు "కలతే పు[illegible] ప్రకృతి" సృష్టికి పూర్వమున్నది. కనుక దీనినే ప్రకృతి అనిరి! అవిద్య అజ్ఞానము మొదలగు పర్యాయనామములు దీని రూపాంతరములు; విద్యవలన అనగా పరబ్రహ్మజ్ఞానముచే బాధనొం

చును. గనుక అవిద్యఅనిపేరు, బ్రహ్మమును ఆవరించి స్వరూపజ్ఞానమును మరుగుపరచి సంశయ, విపర్యయ మిథ్యా జ్ఞానములను కలిగించుచూ బ్రహ్మజ్ఞానమున కాటంకముగ నుండుటచే, మాయనే అజ్ఞానమనిరి. ప్రకృతి అను శబ్దమునకు స్వభావము, స్వలక్షణము, నైజము అను అర్ధములుండుటచేతను, ఉత్పత్తిగాని, ఉత్పత్తిహేతువుగాని లేనందువలననుతన నైజలక్షణముచేతను స్వభావ లక్షణముచేతను యున్నది గనుకను, దీనినే ప్రకృతియని యనిరి. ఈమాయ సత్వరజస్తమోగుణములను త్రిగుణములతో గూడియున్నది, అందు సత్వగుణము ప్రధానమై రజస్తమోగుణముల నణగిద్రొక్కియున్నపుడు ఈశుద్ధసత్వప్రధానమే మాయయనియు రజస్తమస్సులచే నణగద్రొక్కబడి మలినసత్వమగునపుడు అవిద్య అనియు, యీమాయనే వ్యవహరింతురు. వస్తువు ఒక్కటేయైనను స్థితియందును వ్యవహారమందును నామ భేదములు ప్రవర్తిల్లుచున్నవి.

ఈమాయకు ఆవరణము, విక్షేపము నను రెండు శక్తులుగలవు బ్రహ్మస్వరూపమును మరుగుపరచి స్వరూపజ్ఞానముగలుగకుండ చేయుటయే ఆవరణలక్షణము. భ్రమాజ్ఞానమునుగలిగించి దానియందు సత్యత్వబుద్ధిని గలిగించుటయే విక్షేపకార్యము. ఉన్న పరబ్రహ్మను మరుగుపరచి

2. "యదిమన్యసేసువేదేతి దభ్రమేవాపినూనం, త్వంవేత్థ బ్రహ్మణోరూపం" కేన. ఉ.

తా॥ నేనీబ్రహ్మమును చక్కగా తెలుసుకొంటిని అని నీవందువేని, నీవు తెలిసికొన్నది నిశ్చయముగ అల్పమైనదే.

3. "నాహం మన్యేసువేదేతి, నోనవేదేతి, వేద-" (కేవ.ఉన)

తా॥ ఆబ్రహ్మమును నేను తెలుసుకొంటినిగాని తెలుసు కొనలేదనిగాని తలంపను.

4. "అన్యదేవతద్విదితాదథో అవిదితాధధి"-కేన. ఉప.

తా॥ తెలుసుకొన్నదానికంటె తెలియని దానికంటె అది పరముగాయున్నది.

అది యిట్టిది, అట్టిది, ఎట్టిదో చెప్పలేము. మనసుచే నూహించలేము. యిత్యాది వాక్యములచేగూడ నది లక్షింప బడజాలదు. కాన అట్టి నిరపేక్షిక సత్యమగు కేవలత్వమొండు గలదు అనిమాత్రము శ్రుతియుక్తి అనుభవములకు గోచరమగు చున్నది. ఈ నిరపేక్షిక కేవలత్వము (Absolute) నకే అచల ఋషులు కేవలాద్వైతమనీ, మహాద్వైతమనీ, అచలపరిపూర్ణ బ్రహ్మమనీ, పరిపూర్ణపరబ్రహ్మమనీ, పరిపూర్ణపరబయలనీ, ఉత్తబట్టబయలనీ, యిత్యాదిగా పేర్లుపెట్టి వ్యవహరిస్తూ వున్నారు. అచలఋషుల సిద్ధాంతం ప్రకారం సృష్టికి మూల కారణమగు వస్తువు (జగదధిష్ఠానము) కూడా సాపేక్షికమే.

లేనిదానినిగా చేసివేయుట, లేనిపదార్థమున్నట్లుగా భ్రమ రూపజ్ఞానము గల్గించుట అను అపూర్వశక్తిసామర్థ్యములు గల దగుటచేతనే యీమాయ అఘటన ఘటనాపటీయసీయని పేర్కొనబడినది. జ్ఞానముయొక్క అభావమే అజ్ఞానమని అన్య మతస్థులందురు. కాని అద్వైతమున అజ్ఞానము అభావపదా ర్థముకాదు. "అజ్ఞానే నావృతం జ్ఞానంతేనము హ్యంతిజం తవః?" భ గీత॥ (5-15). కనుక జ్ఞానాజ్ఞానములు రెండునూ ఏకకాలమందున్నవన్నమాటే. కనుక ఈ పక్షంలో జ్ఞానము లేకపోవుటయే అజ్ఞానముకాదు.

జీవేశ్వరులు :.... అజ్ఞానము, వ్యష్టి, సమష్టిరూపము లుగా నున్నది. అజ్ఞానముయొక్క అంశమునకు వ్యష్టియజ్ఞాన మనిపేరు. సంపూర్ణ అజ్ఞానంబునకు సమష్టి అజ్ఞానమనిపేరు. అజ్ఞానముయొక్క వ్యష్టిరూపమైన మలినసత్వమునందున్న చేతనాభావమున్నూ ఆయజ్ఞానాంశమునకు అధిష్టానమైన కూటస్థచైతన్యమున్నూ చేరి జీవుడనబడును. కూటస్థునికిన్ని బ్రహ్మమునకున్ను కించిన్మాత్రమగు భేదము మాత్రమే గలదు ఘటాకాశమహాకాశములకున్నంత భేదముమాత్రమే కూటస్థ చైతన్యమన్న (ఉపహితచైతన్యము లేక అవచ్ఛిన్న చేతనము) ఉపాధియందుసాక్షిరూపముగానున్న చేతనమే. ఇదియేప్రతి ఫలించునుగాని బ్రహ్మచేతనము ప్రతిఫలించునని

చెప్పరాదు అంతఃకరణము (లేక బుద్ధి) నందలి చేతనాభాసమును, కూటస్థచైతన్యమున్నూ గూడి జీవుడు అనిగూడ చెప్పెదరు, గాని అట్లు చెప్పుటచే సుషుప్తియందున్న కారణ శరీరాభిమానియగు ప్రాజ్ఞునికి హానికలుగును ఏలనన సుషుప్తి యందు అంతఃకరణము (లేక బుద్ధి) మగ్నత జెందును వ్యష్టియజ్ఞానాంశమందలి చిదాభాసము, కించిజ్జత్వ లక్షణములు మాత్రమే కల్గియుండును. స్వల్పజలమందలి ప్రతిబింబము ఎట్లు చక్కనై యుండదో అట్లేమలినసత్వమగుటవల్ల వ్యష్టియజ్ఞానాంశమందు ఆవరణవిక్షేపములు అధికముగా నుండును. గనుక స్వరూపజ్ఞానము అనగా తాను ప్రత్యగాత్మనను జ్ఞానములేక పోవుటచేతను తనకుపాధియగు యజ్ఞానమునందు తాదాత్మ్య బుద్ధిచేతనూ జీవుడు బద్ధుడై సంసృతి పొందుచున్నాడు.

సమిష్టిఅజ్ఞానస్వరూపమైసత్వగుణప్రధానమైయుండుమాయ యందలి చిదాభాసమును మాయాసహిత చైతన్యమునుగూడి ఈశ్వరుడు అనబడును. సత్వగుణస్వరూపమైయున్న యీశ్వరోపాధియగు మాయయందు అవరణవిక్షేపములు ప్రబలమైయుండనందున యీశ్వరుడు సర్వజ్ఞుడును స్వతంత్రుడును నిత్యముక్తుడున్నూ అయివున్నాడు.

మాయా అవిద్యలచేరికలో పరబ్రహ్మము సోపాధి

కమై జీవేశ్వరనామములను చెందుచున్నది అని సిద్ధించు చున్నది. కనుక జీవేశ్వర బ్రహ్మములకు పారమార్థిక భేదము మృగ్యము కనుకనే 'జీవోబ్రహ్మైవనాపరః' అనగా జీవుడు బ్రహ్మమే యితరముకాదు అని అద్వైతవాదము ప్రవర్తిల్లినది.

జీవుడు నిజముగా సంపూర్ణ స్వతంత్రుడు. విభువు. స్వాత్మస్వరూపమైన బ్రహ్మమే. ప్రత్యగాత్మ స్వరూపమే పరమాత్మ స్వరూపమేగదా! తనకు కారణ శరీరమగు వ్యష్టియజ్ఞాన సంసర్గముచే దేహేంద్రియాదులతో తాదాత్మ్యము చెంది జీవుడని చెప్పబడుచున్నాడు జీవ అనగా ధాతు వ్యుత్పత్తినిబట్టి ప్రాణధారణయని యర్థము పరమాత్మ యొక్క చలనశక్త్యాత్మకమగు ప్రాణసహితుడైయుండుట వలన జీవశబ్దముచే నాతనికి వ్యవహారము ప్రవర్తిల్లినది.

వ్యష్టి అజ్ఞానమే జీవుని కారణశరీరమైయున్నది. ఈ వ్యష్టి అజ్ఞానాలంశము యొక్క చేరిక, లేక సమష్టిఅజ్ఞానమే ఈశ్వరునకు శరీరమగుచున్నది. కాన వ్యష్టికారణ శరీరాభిమానియగు ప్రాజ్ఞునకును ఈశ్వరునకును అవిధముగా భేదము లేదు. కనుకనే మహావాక్య విచారణయందు 'తత్త్వమసి' వాచ్యార్థము వివరించుపట్లతత్ పదమునకు సర్వజ్ఞత్వ విశిష్టుడగుయీశ్వరుడును. త్వంపదమునకు కించిజ్జత్వవిశిష్టుడగుజీవు

డును అర్థముగా చెప్పబడి పిమ్మట జహదజహాలక్షణ (భాగ త్యాగలక్షణ) చే వారి యుపాధులను ఉపాధిధర్మములగు సర్వ జ్ఞత్వ కించిజ్జ్ఞత్వాదులను పరిత్యజించి శేషించిన అధిష్ఠాన చేత నమునకు అసిపదముచే నైక్యము ప్రతిపాదింపబడినది. లక్ష్యార్థ మున ప్రత్యగ్బ్రహ్మైక్యము నిరూపితము, కనుక వాచ్యార్థ మున ఉపాధి విశిష్టమగు ఆత్మతత్వములకు, అనగా జీవేశ్వ రులకు ఐక్యము సిద్ధాంతముచేయబడినది. జీవుడు తాను నిత్యముక్తుడయ్యును బ్రహ్మస్వరూపుడయ్యును, ముక్తిని గోరుట ప్రాప్త ప్రాప్తవ్యము అని వర్ణింపబడినది. అనగా తాను ముక్తుడయ్యును, అనగా ముక్తి యిదివరకే తనచే పొందబడియుండియు, పొందబడనిదిగానూ, ముందు పొంద దగినదిగానూ, యెంచుచుండుట. "కంఠచామీకరవత్" అనగా యొక పసిబిడ్డ తన కంఠముననున హారమును మరచి హారము కావలెనని విలపించుచున్నాడు. అట్లే జీవు డును లేనిబంధమారోపించుకొని ముక్తిని బొందకోరుచున్నా డు. బంధములేనేలేదు. కనుక మోక్షమున్ను లేదు. కనుక బంధముపోవలెననుటయు, పరిహృత పరిహార్యమైయున్నది. తననీడయందొక పిశాచముండి తన్ను వెంబడించుచున్న దనిన్ని దానిని వదలించికొనవలెననిన్ని మూఢుడు ప్రయ త్నించినటులనే లేనిబంధమున్నదని భయపడి బంధమును వదలకోరుటయు నట్టిదే. ముక్తి సిద్ధవస్తువే గాని సాధింప

వలసినదిగాదు కనుక యుపాధిరూపమగు తన యజ్ఞానావరణమును తొలగించుకొనవలెనేగాని, అన్యథా ముక్తి సాధింపవలసిన యగత్యమేమియులేదు. ఈ అజ్ఞాన నాశనోపాయములనన్వేషించుటకు పూర్వము జగత్తునుగురించియు, తన్మిథ్యాత్వమును గురించియు, విచారణ చేయుటవసరము.

జగత్తు:— తమోగుణ ప్రధానమగు ప్రకృత్యోపచ్ఛిన్న చేతనమునుండి వరుసగా ఆకాశాది సూక్ష్మభూతములును, ఆసూక్ష్మభూతములు పంచీకృతమై యొండొంటితో గూడుటవలన స్థూలభూతములును, తద్భూతకార్యములగు సర్వస్థూలోపాధులతో గూడిన జగత్తును, క్రమముగా యుద్భూతమయ్యెను. తమోగుణ ప్రధానమగు ప్రకృతినుండి పరిణమించుటచేసి జగత్తు దృశ్యస్వరూపమును, జడస్వరూపమునై యున్నది.

ఈజగద్రచనకు శుక్తియందు గల్గు రజిత భ్రాంతికిని, త్రాడుయందుగలుగు సర్పభ్రాంతికిని, శుక్తి రజ్జువు లేవిధముగా వివర్తోపాదాన కారణములైనవో, అట్లే బ్రహ్మమందు గలుగు జగద్భ్రాంతికిగూడ, బ్రహ్మము వివర్తకారణము మాత్రమే అయియున్నది. వివర్తమనగా, అధిష్ఠాన వస్తువు నందెట్టి మార్పున్ను లేకనే, దానియందు చూపరులకన్య వస్తుప్రతీతియగుట "బ్రహ్మైవవివర్తం" అనియున్నది. కనుక యీజగత్సర్గమునకు కారణములు బ్రహ్మవివర్త

మున్ను [చేతన వివర్తమున్నూ] మాయపరిణామమున్నూ అయియున్నది. మాయయే తన ఆవరణశక్తిచేత బ్రహ్మమును మరుగుపరచి, విక్షేపశక్తిచే జగత్తును తోపింపచేయుచున్నది. కనుక యీ మాయా విలాపముచే కలిగిన జగత్సర్గమువలన బ్రహ్మము నందెట్టి హానవృద్ధులున్నూ పరిణామ వికారములున్నూ కలుగుటలేదు. బ్రహ్మమెప్పటివలె నిర్వికారమై సాక్షిరూపముగానే యుంటున్నది.

మాయజడముగదా? స్వయముగా పరిణమించగలదా? కర్తయొకటుండవలె. కర్త లేకున్న కార్యమెట్లుసాధ్యము? యిత్యాది సంశయములకు తావిచ్చు మందాధికారుల సుబోధము కొరకు యీశ్వరుడు కర్తయని ఔపచారికముగాచెప్పినారు. ఎట్లన, మాయావిశిష్ట చేతనుడైన యీశ్వరుడు తన చైతన్యమెనిమత్తకారణముగానూ, తనకుపాధియై,వశీభూతమై, మాయయే ఉపాదానకారణముగానూయుండి, జకత్సృష్టి జేయుచున్నాడు. నిమిత్తకారణము కుమ్మరివాడు ఉపాదానకారణము మృత్తు, కార్యముకుండ, తానే నిమిత్తకారణమును యుపానకారణమును కూడ ఈశ్వరుడెట్లగుచున్నాడు? ఊర్ణనాభి అనగా సాలెపురుగు, తానే నిమిత్తకారణమై తన శరీరసంభూతమైన జిగురుపదార్థమే యుపాదానముగా గైకొని దారములు తయారుచేసినట్లు అని యుదాహరణనిచ్చియు

న్నారు. దీనికే శాస్త్రమునందు అభిన్న నిమిత్తోపాదాన కారణమని పేరు.

ఈ దృశ్యమానమగునది నిజంగా ఏవస్తువు? అది బ్రహ్మమే కాని జగత్తుకానేకాదు. రజ్జువునందు తోచబడు సర్పము రజ్జువేకాని సర్పం కానేకాదన్నట్లు మన భ్రాంతి వలన లేక అజ్ఞానమువలన దానిని జగత్తుగా చూస్తున్నాము. కాని ఏభ్రాంతి కలుగుటకైననూ దానికొక అధిష్టానం లేక యాధారముండితీరవలెను. అనగా ఆదేశకాలములయందు నిజముగా ఒక వస్తువు వుండనిచో భ్రాంతి కాధారమే యుండ జాలదు. ఆ అధిష్టానవస్తువు బ్రహ్మమే అవిధంగా బ్రహ్మము నందు దోచు జగజ్జవేశ్వరులకు అధిష్టానస్వరూపమైనబ్రహ్మము వినా యునికిలేదు. సర్వము బ్రహ్మమే భేదము మిథ్య అని, అద్వైతసిద్ధాంతము. "సర్వంఖల్విదం బ్రహ్మ" "ఏకమేవా ఽ ద్వితీయంబ్రహ్మ" "బ్రహ్మసత్యంజగన్మిథ్యా" యిత్యాది శ్రుతుల తాత్పర్యము నిశ్చయముగా అద్వైతమే.

సర్వకారణమును, సర్వాధిష్టానమును, స్వయంప్రకాశమును, అగు బ్రహ్మమొక్కటియే పారమార్థిక సత్యము. దానియందు జగము లేకుండియు నున్నట్లు కనపడుచున్నది, కనుక పారమార్థికముగా సత్యపదార్థముకాదు. ఉత్పత్తి స్థితి లయములుగాని,మార్పుగాని జెందు దేనికిన్ని పారమార్థికముగ సత్యత్వము లేదు. నామరూపములే తారతమ్యముగాని,

ఏ వస్తువును బ్రహ్మముకంటె భిన్నముగాదు. సర్వవస్తువుల యొక్క బాహ్యాభ్యంతరములయందు నా బ్రహ్మమే వ్యాపించి ప్రకాశించుచున్నది.

శ్లో॥ అగ్నిర్యథైకో భువన ప్రవిష్టో రూపం రూపం
ప్రతిరూపోబభూవ। ఏకస్తథా సర్వభూతాంత
రాత్మారూపంరూపం ప్రతిరూపో బహిశ్చ॥
కఠ! ద్వితీయాధ్యాయం॥ద్వితీయవల్లీ॥ 9॥

అగ్ని నానారూపములుగల వస్తువులనుదహించుసమయమునఅయావస్తుఆకారములను( నిడుపు, గుండ్రము మొదలగున వి గ్రహించుచునులఆత్మ సర్వత్రవ్యాపించియున్నది. బ్రహ్మము ఉపాధిరూపముగా గోచరించుచున్న దేగాని, నామరూపములుమిధ్యఅద్వైతమున.మిథ్యావస్తువనగా అత్యంతశూన్యములును,తుచ్ఛములును, అగు వంధ్యాపుత్ర శశ విషాణాదులవంటిదిగాదు ఆపవ్యస్తుల గంధర్వ నగర మృగతృష్ణాదులవంటిదిన్నిగాదు.రజ్జుసర్పముకు కల్పితము; స్వప్నదృశ్యము యిత్యాది ప్రాతిభాసిక సత్తాగల పదార్థమునూగాదూ.ఏలనన ప్రాతిభాసిక సర్పరజితాదులుబ్రహ్మజ్ఞానముయొక్క అవసరము లేకుండగనే అవ్వాని కథిష్ఠానరూపమగు నిజవస్తుజ్ఞానముచేతనే బాధింపబడుచున్నది. జగత్తు యీ మూడురకములగు మిథ్యాపదార్థములలో యే రకము నకును చెందదు ఏలననగా జగత్తు మిథ్యఅని అరూఢమైన

జ్ఞానికిగూడ ప్రపంచము దృశ్యమానమై, శబ్దస్పర్శాది విషయ సంపర్కమువలన సుఖదుఃఖాదులు కలుగుచున్నవి. కనుక జగత్తు వ్యవహారికముగా సత్యమైయున్నది కనుక వ్యవహార సత్తాకమాత్రమే చెందును. బ్రహ్మజ్ఞానమువలన మాత్రమే బాధనొందును. కనుక జగముపారమార్థికదృష్ట్యా మాత్రమే మిథ్యఅనగా దీనికి పారమార్థిక సత్తామాత్రము లేదు. బ్రహ్మ జ్ఞానముచే బాధనొందు పదార్థములే వ్యవహార సత్తాకములు బాధయనగా మిథ్యావస్తువులని రూఢిగా నిశ్చయమగుట, మాత్రమే కానిజగము, విచ్ఛిన్నఘటమువలెఁ ధ్వంసమూ లేక నాశనముపొందదు. జగత్తునకువలెనే జనన మరణములు బంధమోక్షములు, వేదశాస్త్రములు, గురుశిష్యులు, వారి బోధలు, కాలకర్మాదులు, మొదలగువాని కన్నిటికి నిజముగా వ్యవహారిక సత్తాయేగాని పారమార్థిక సత్తాలేదు.

పైన వుదహరింబడినవన్నియుమిథ్యయేయగుచో గురు వేల? శిష్యుడేల? గురుబోధయేల? మరియును మిథ్యాగురువు బోధించిన మిథ్యాబోధచే అఖండ బ్రహ్మాకారవృత్తి యెట్లు కలుగును? బ్రహ్మజ్ఞాన మెట్లుకల్గును? వేదాంత విచారణయే నిష్ప్రయోజనముగదా! అను శంకలుగలుగక మానవుకాని, ప్రత్యగ్బ్రహ్మైక్యము క్రొత్తగా సిద్ధింపవలసిన పనిలేదు. ప్రత్యగాత్మ బ్రహ్మస్వరూపుడయ్యేవున్నాడు. పారమార్థిక

ముగా ప్రత్యగాత్మయనియు, బ్రహ్మమనియు, రెండు లేనే లేవు. అజ్ఞానముయొక్క ఆవరణదోషమువలన అయఖండ జ్ఞానము ప్రకాశించుటలేదు. ఇక వేదాంత విచారణము. గురుశిష్యుల బోధలున్నూ, శాస్త్రమును వ్యవహారికసత్యత్వము మాత్రమేగల మిథ్యాపదార్థములైనను, వ్యర్థములు గావు. ఎట్లనగా:- మిథ్యాసంసారము, మిథ్యా భూతమగు అజ్ఞానకార్యములగు ఆవరణ విక్షేపములచేకల్గి మిథ్యయగు బంధమునకు లోనైనట్లు భ్రాంతికల్గుచున్నది గదా! యీమిథ్యాభ్రాంతిరహిత మగుటకుమాత్రము గురూపదేశాదులుతోడ్పడుచున్నవి. అనగా మిథ్యాబంధము తొలగుననుట. మిథ్యాబంధము మిథ్యాగురూ పదేశాదులచే బాధింపబడునా? అవశ్యము బాధింపబడును. విషమసత్తాకములగు పదార్థము లొండొంటిచేత బాధింపబడవుగాని, సమ సత్తాక పదార్థము లవశ్యము బాధవొందును. ఉదారణకు-స్వప్నములో తన్ను తరుముకొనివచ్చిన (ప్రాతిభాసిక) వ్యాఘ్రమును వధించుటకు స్వప్నములో చెంతనున్న స్నేహితుని చేతిలోనున్న ధనురాభణములే తోడ్పడునుకాని స్వప్నము పొందువాడు నిద్రించిన గదిలో నిజముగా వ్రేలాడగట్టబడియున్న (వ్యవహారిక సత్తాగల) ధనుర్బాణములు వ్యర్థముగదా! అట్లే మిథ్యాబంధమును నివృత్తిచేయుటకు, సమసత్తాకములగు మిథ్యా

స్వరూపములగు వేదశాస్త్రములు, గురువు, గురుబోధ మొద లగునవి యన్నియు సంపూర్ణముగ సహాయకారులు కాగలవు. అందుచే వేదశాస్త్రాదులును గురువును వేదాంత విచారణయు నిష్ప్రయోజనములు మాత్రముగావు.

అపంచీకృత సూక్ష్మభూతములయొక్క వ్యష్టి సమష్టి రూపములగు సత్వరజసాంశములచే, జీవునికి భోగసాధన మును, సంసారకారణమును, సంస్కారముల కాధారమును, అగు లింగశరీరమేర్పడెను. పంచీకృత పంచభూతాంశగుణ ముల చేరికలో స్థూలదేహ మేర్పడెను, వ్యష్టి అజ్ఞానాంశమే కారణశరీరముగాగల జీవుడీ స్థూలసూక్ష్మశరీరాభిమానములచే విశ్వతైజసాభిమానములచే వ్యవహరించబడుచూ దేహత్రయ తాదాత్మ్యాభిమానము చెంది, నేను, నాది, అను వ్యష్ట్యభిమా నము వహించి పూర్వవాసనారూపములగు పుణ్యపాపకర్మ లను చేయుచూ, తత్ఫలితముగ సంసారచక్రమున పరిభ్ర మించుచు, వివిధోపాధులయందు జనన మరణముల చెందు చున్నాడు. ఒక సుడిగాలి, చెత్త చెదారములతో నొకచో నొక సుడిని గల్పించుకొని కొంత తడవుం దాని నచ్చట రాల్చి, స్వవేగమున మరియొకచోట మరియొక ఆకార పరి మాణములుగల వేరొక సుడిని అక్కడనున్న చెత్త చెదార ములతో కల్పించుకొను రీతిని, జీవుడు తన సంస్కార బల

ముచే తత్తత్ఫలముల ననుభవించుటకు యోగ్యమైన యుపాధులను కల్పించుకొనుచూ బోవుచుండును. ఇట్లు సంస్కారములన్నియు నశించువరకు జనన మరణముల పొందుచూ నుండును.

జీవునియొక్క అరోపిత బంధకారణముగూడ మనము విచారించవలసియున్నది. ఆత్మానాత్మల యన్యోన్యాధ్యాసయే బంధకారణము. ఒక వస్తువును జూచి వేరొక వస్తువనుకొనుటయే అధ్యాస. ముత్యపుచిప్పను చూచి వెండియనియు త్రాడును చూచి పామనియు, భ్రమించుట. అట్లే ఆత్మధర్మములు ఆనాత్మయందు అనాత్మధర్మములను ఆత్మయందును ఆరోపించుకొని, యదార్థవస్తువును యెరుంగకపోవుటయే సర్వబంధములకు కారణమైయున్నది. ఆత్మ సచ్చిదానంద స్వరూపము అనాత్మ అనృత జడ దుఃఖాత్మకము. అన్యోన్యాధ్యాసచే నేను మనుష్యుడను, బ్రాహ్మణుడను, సుఖిని, దుఃఖిని, యిత్యాది మోహమునుజెంది యీదేహధర్మములను (అనాత్మధర్మములను) నిజ (ఆత్మయగు తనయొక్క) ధర్మములుగా నెంచి ఆత్మకులేని జనన మరణములు, సుఖదుఃఖములు, ఆకలిదప్పులు, తనవిగా యెంచుటచేతనే, జీవుడు పరతంత్రుడును దుఃఖియు నగుచున్నాడు.

ముక్తి:- ముక్తిపొందుటకే సాధనయున్నా అవసరము

లేదు. అది సిద్ధవస్తువు ప్రాప్తమయ్యేవున్నది. పారమార్థికకముగా బంధము మిథ్యగనుక ముక్తియును, మిథ్యయే, నేను బ్రహ్మస్వరూపుడను, నిత్యముక్తుడను, అను అఖండజ్ఞానమారూఢ పడవలెనేగాని, ఎక్కడనో, ఎప్పుడో, పొందదగినదిగాదు, శంకరుల అభిప్రాయానుసారము ప్రతిజీవియు క్రమోన్నతిని బొంది చివరకు స్వరూపజ్ఞానముబొందితీరును. స్వరూపజ్ఞానమారూఢమగుచో తత్కాలమందే యాతడు ముక్తుడు. దిన, పక్ష, ఉత్తరాయన, సంవత్సరాభిమాన దేవతలచే ఎటుకెటుకో గొంపోబడుట మొదలగు ఉత్క్రాంతిని అద్వైతులు, జ్ఞానివిషయములో, అంగీకరింపరు. నేను నిజముగా బ్రహ్మస్వరూపుడను, నేనే సర్వస్వరూపుడను, నేనొకడనే పారమార్థిక సత్యస్వరూపుడను మిగతా సర్వమునకువ్యావహారికసత్యత్వమేగాని పారమార్థిక సత్యత్వములేదు. కనుక అవి మిథ్యాభూతములు. అవి సత్యములనునది భ్రాంతియే. యీ భ్రాంతి బ్రహ్మస్వరూపుడగు నాకు కల్గినదనుట గూడ భ్రాంతియే. నాకు బంధము లేనేలేదు. నేను నిత్యముక్తుడను, అసంగుడను నాకు జననమరణములు లేనేలేవు. నాకు నరకభయమేల? పునర్జన్మ భయమేల? పుణ్యపాపముల భయమేల? నేను నిర్భయుడను. నేను సాక్షిస్వరూపుడను, ఆనందస్వరూపుడను, యిత్యాది అఖండజ్ఞానముచే ఆరూఢత చెందుటయే

అద్వైత సిద్ధి. జీవన్ముక్త లక్షణము.

ఇట్టి అద్వైతసిద్ధిలేక, జీవన్ముక్త లక్షణము కలుగుటెట్లు? కర్మవలనా? జ్ఞానమువలననా? జ్ఞానకర్మసముచ్చయము వల్లనా? అజ్ఞానము, తమః ప్రధానమగు ఆవరణముచే స్వయంప్రకాశనుగు బ్రహ్మమును మరుగు పరచునని గమనించితిమి. దీనికే మూలావిద్య అనిగూడ పేరు. ఈఅజ్ఞానము తొలగుటకు జ్ఞానమే సాక్షాత్ సాధనమని స్పష్టమే అయినను కర్మవలన ఎందుకజ్ఞాననివృత్తి గాజాలదు అనియన్నచో కర్మయొక్క ఫలములకు అజ్ఞాన నివృత్తియందు సామర్థ్యములేదు, ఎట్లన కర్మఫలము నాలుగు విధములుగానున్నది. 1 ఉత్పాద్యము=ఉత్పత్తి, అనగా యిదివరకులేని వస్తువు పుట్టుట నిత్యమైన పరబ్రహ్మమునుగాని, నిత్యసిద్ధమైన ముక్తినిగాని, క్రొత్తగా యుత్పత్తిచేయుట హాస్యాస్పదము మరియు పరబ్రహ్మమే సర్వకారణము, కనుక దాని నుత్పత్తిచేయు కారణవస్తు వుండజాదు. 2. ఆప్యము= పొందనగునది. పొందువాడు. పొందదగినది. అను భేదము లేదు. ఏలనన యీ బ్రహ్మము పొందువానియొక్క స్వరూపమే అయివున్నది. 3. సంస్కారము=సంస్కరించుట లేక చక్కజేయుట. నిత్యశుద్ధమైన పరబ్రహ్మమునకు సంస్కారక్రియ ఎట్లు పొసగును? దోషమేలేదే! దోషము సంభవించు

టకు అన్యవస్తు సంపర్కముకావలె. అన్యవస్తువే లేదే! దోష వర్జితమైనను తైలమునకు సుగంధము కల్పించునట్లు గుణా ధానము కలుగవచ్చుననుటకును సాధ్యముకాదు. అది సగుణ వస్తువులయెడ మాత్రమే సాధ్యము.

4. వికార్యము = మార్పుగలిగించుట. సావయవము లగు పాలు మొదలగునవి పెరుగు మొదలగు పదార్థములుగాం పరిణతి చెందవచ్చును. నిరవయవ స్వరూపమగు బ్రహ్మము. దేనిచే నెట్లువికారము చెందును? యీ భావములనన్నిటిని శంకరులొక్క శ్లోకమున యిమిడ్చినారు. శ్లో॥ నైతదన్యతరం బ్రహ్మకథాభవితుమర్హతి। స్వతస్సిద్ధం, సర్వదాప్తం, శుద్ధం, నిర్మల మక్రియం॥ కనుక బ్రహ్మముగాని బ్రహ్మైక్య జ్ఞానముగాని కర్మసాధ్యము కానేరదు. మరియు "యత్కృతకం తదనిత్యం" అనగా కర్మఫల మెప్పటికిని అనిత్యమే. మరియు 'కర్మతంత్రం శుభాశుభం' అనగా శుభాశుభఫలము లాసించినదానికే కర్మ అపేక్షణీయం. శుభకర్మ అనగా పుణ్యకర్మ దాని ఫలమగు స్వరాదులుగూడ అనిత్యములే "క్షీణేపుణ్యం మర్త్యలోకం విశంతి." పుణ్యక్షీణముతో స్వర్గం నుండిచ్యుతిగల్గును. కనుక జ్ఞానసిద్ధికి కర్మ నిష్ప్రయోజనము. కర్మఫల మనిత్య సంసారమున్ను, జ్ఞానఫలము మోక్షసామ్రాజ్యమున్ను, గాన రెంటికిని విరుద్ధము. కనుక జ్ఞానకర్మస

ముచ్ఛయమునూ నిరర్థకము. కర్మోపాసనలు. పరంపరా సాధనములుగాని సాక్షాత్సాధనములుగావు. జ్ఞానమే సాక్షాత్సాధనము. అందుకే శంకరులు "శ్లో॥ ప్రత్యగ్బ్రహ్మవిచారపూర్వభముయోరేకత్వబోధార్థినా। కైవల్యంపురుషస్యసిధ్యతిపరబ్రహ్మాత్మతాలక్షణం।నస్నాన్నైరపి,కీర్తనైరపిజపైర్నో కృచ్ఛ్రచాంద్రయణైర్నో వాస్యధ్వరకృత్యదాననిగమైర్నో మంత్రతంత్రైరపి" యనియు శ్లో॥ జ్ఞానదేవతుకైవల్యమితిశ్రుత్యానిగద్యతే। జ్ఞానస్య హేతుత్వమన్య వ్యావృత్తిపూర్వకం" అనియు శంకరవచనము.

"జ్ఞానాదేవతుకైవల్యం" అని శ్రుతి, ఐనను శంకరుల దృష్టిలో జీవన్ముక్తిపొందినవారికే" కర్మోపాసనలనవసరములుగాని, తదితరులవిషయంలోమాత్రం అవఅన్నియు అవసరములేయని గ్రహింపవలయును. అంతఃకరణశుద్ధికి (అనగా ఆవరణరహితమునకు) సత్కార్మానుష్ఠానమున్నూ ఏకాగ్రతకు (అనగా విక్షేపరహితమునకు) ఉపాసనయున్నూ కావలసినవేనని యీక్రింది శాంకరవాక్యములవలన తేటతెల్లమగుచున్నది, "వేదోనిత్యమధీయతేం త్వదుదితం కర్మస్వనుష్ఠీయతాం అని కర్మవిషయములోనున్ను, "మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవగరీయసీ" అనిన్ని, భక్తివిషయములలోనున్నూ, శంకరులే అన్నారు. కనుక కర్మోపాసనలు కేవలం నిషేధములుగా యెంచరాదు జ్ఞానమునకు అధికారి:— సాధన

చతుష్టయ సంపన్నుడు. అనగా నిత్యా నిత్యవస్తు వివేకము, (ఆత్మానాత్మలను రెంటి విషయము తెలుసుకొనుట.) యిహా ముత్ర ఫలభోగ విరాగము (యీలోకసుఖములను, పరలోక సుఖములను కోరకుండుట) శమాది షట్కసంపత్తి (సర్వేంద్రియ నిగ్రహము ఓర్పు, శ్రద్ధ. దృశ్యవస్తువుల పరిత్యజించుట మొదలగునవి.) ముముక్షత్వము తీవ్రమైనమోక్షాసక్తి) అను యీనాల్గునూ గలవాడే జ్ఞానమార్గమున ప్రవేశించుటకు తగినవాడు. యీజ్ఞానమార్గమునకు, ప్రత్యక్బ్రహ్మైక్యజ్ఞానము) గలుగునుపాయముల నన్వేషించుటయే విషయము. యిందుకు ప్రయోజనము:- అనర్ధనివృత్తియు, పరమానంద ప్రాప్తియు, పరమ ప్రయోజనములు. జ్ఞానము(ప్రత్యక్బ్రహ్మైక్యజ్ఞానము) అవాంతరప్రయోజనము. అధికారి నిరూపణలో శంకరులు 'ఉపరతి' శబ్దార్ధమును వివరించుచూ ఆశబ్దమునకు దృశ్యవస్తు పరిత్యాగము ముఖ్యార్ధమనియు, కర్మసన్యాసము గౌణార్ధమనియు, వివరించినారు. "సన్యస్యశ్రవణంకుర్యాత్" అని కూడనున్నది. నివృత్తిమార్గమే శరణ్యము కనుక సన్యాసియే పూర్ణాధికారి. అట్టి పూర్ణాధికారి శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు సద్గురు సన్నిధానమున మహావాక్యార్థము శ్రవణము చేయవలెను. విన్న విషయములు ధృఢమగుటకు అనుకూలమగు అన్వయ వ్యతిరేక యుక్తుల నాలోచించుకొని

సరిపుచ్చుకొని, పదేపదే మననము చేయవలెను. సంశయ విపర్యయములన్నియు నశించినపిదప, యామహావాక్యలక్ష్యార్థమగు ప్రత్యగ్బ్రహ్మైక్యమును, అవిచ్ఛిన్న తైలధారరీతి నిధిధ్యాసజేయవలయును. ఇట్లొనరించుట వలన అఖండబ్రహ్మాకార వృత్తి గల్గి జీవన్ముక్తుడు గాగలడు.

అనధికారులైనవారు, నిష్కామ కర్మాచరణచేత్త చిత్తశుద్ధి జేకూర్చుకొని ఏకాగ్రత లభించుటకొరకు యుపాసన గావించవలెను.ఉపాసనత్రివిధము. 1.అంగాంగబద్ధము అనగా చేయుచున్న యజ్ఞాది కర్మలయందు బ్రహ్మబుద్ధిపూనుట. 2. ప్రతికోపాసన, అనగా విగ్రహారాధన లేక దేవతారాధన. 3. అహంగ్రహోపాసన అనగాకేవలాత్మ చింతన. ఆత్మపాద చతుష్టయనబడు విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్యగాత్మలకును. బ్రహ్మపాద చతుష్టయమనబడు విరాట్,హిరణ్యగర్భ, అవ్యాకృత,పరమాత్మలకును, ప్రణవపాదచతుష్టయమనబడుఅకార ఉకార, మకారఅర్ధమాత్రలకును పరస్పర సమీకరణకావించుకొని ఆత్మచింతను మొనర్చుటయే అహం గ్రహోపాసన యుత్తమము. పైవిధముగా చిత్తశుద్ధియు ఏకాగ్రతయు సిద్ధించిన పిదప శ్రవణాదులొనర్చుటకు అధికాగలడు. పిదప నతనికిని యఖండబ్రహ్మకారవృత్తిగలుగ గలదు.

బ్రహ్మము యింద్రియగోచరము కాదుగదా! స్వరూప సాక్షాత్కారమెట్లు చేకూరును? వస్తు సాక్షాత్కారవిషయ

మున వృత్తివ్యాప్తి, ఫలవ్యాప్తి అను రెండు భేధములుగలవు. ఫలవ్యాప్తి అనగా వస్తువు, యెదుటనున్న ఘటమువలె కనుల కగుబడును. ఘటజ్ఞానముచే చిత్తమునందు ఘటాకారవృత్తి కలుగును. ఘటము కనబడగనే అంతఃకరణ ప్రతిబింబితుడగు చిదాభాసుడు దానిని "యిది ఘట" మని ప్రకాశింపచేయును. బ్రహ్మము విషయములో, యిట్టివృత్తి గలుగుటలేదు గాని మనస్సునందు వస్తువిట్టిదనిమాత్రము గోచరించును. దీనినే వృత్తివ్యాప్తియందురు. శ్రుతి:-ఏషసర్వేషు భూతేషు గూఢోత్మాన ప్రకాశతే, దృశ్యతేత్వగ్ర్యయా బుద్ధ్యాసూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥ కఠ॥తృతీ ॥ 12॥అను శ్రుతిబ్రహ్మము సూక్ష్మబుద్ధిచే మాత్రమే తెలుసుకొనదగినదనిచాటుచున్నది.

బ్రహ్మము అవాఙ్మానస గోచరమే యగుచో, శాస్త్రమెట్టుదీని ప్రతిపాదించగల్గినది? ఆత్మయున్నది అనగా నేనున్నాను. అనువిషయమున ఎవరికిని సందేహము లేదు. అందరిలోనున్న ఆయాత్మయేబ్రహ్మమంటే యికశాస్త్రమెందులకు? నిజమే. కాని ఆయాత్మ ఏదియో తెలిసినకదా! ఆయాత్మను నివరించిచూసి "అయం ఆత్మా, బ్రహ్మ" అనిఅపరోక్షజ్ఞానము గల్గించుటకే, శాస్త్రము ప్రవర్తిల్లినది "నేతి, నేతి"యని నిషేధపూర్వకముగాఅనాత్మ వస్తువులను వేరుపరచి మిగిలించినవస్తువే ఆత్మయనినిర్దేశింపబడినది అవస్థాత్రయములను విమర్శించి

అన్వయ వ్యతిరేకములు విచారించి అనువృత్తముగాయామూ డవస్థలయందుండు నేను అనుజ్ఞానమే ఆత్మయనియు, అట్లుం డనివి అనాత్మ అనియు చెప్పబడినది. 'నేను' అనునది తనువో బహిరింద్రియము లో, ప్రాణమో, మనస్సో, బుద్ధియో, అహంకారమో యని మానవుడు తలంచుచూ వచ్చినాడు. ఇవేవియు నాత్మకాదని చెప్పుటకు శంకరులు ముఖ్యముగా ఆగమ ప్రమాణము, లేక శబ్దప్రమాణము ను యుపనిషత్తుల నుండి గైకొని అందుకు తగిన యుక్తులచే సిద్ధాంతముచేసి నాడు. వాక్కులకందదుగదా! బ్రహ్మము శబ్దప్రమాణమున కెట్లులోబడును? అనగా అవిద్యా కల్పిత భేదమును నివృత్తిచే యుటకు శ్రుతిప్రమాణ ముపయోగించును. బ్రహ్మమొక్క టియే శేషించును. అవిద్యాకల్పితమగు భేదతిరస్కారమే అద్వైత సిద్ధిగదా!

శంకరుడు, కేవలము శ్రుతి ప్రమాణము నే ఆధారము గా తీసుకొని అద్వైత మతమును సిద్ధాంతీకరించెను ఏలనన, శ్రుతివాక్యములయొక్క సత్యత్వమునందు మహర్షులకు ప్ర త్యక్షానుభూతిగలదు. కనుక శ్రుతులే నిజమగు ప్రత్యక్షప్ర మాణములని శంకరుని అభిప్రాయము. రామానుజ మధ్వుల వలె, స్మృతి పురాణేతిహాసముల నాతడు ప్రమాణముగ గైకొ నలేదు. అనుమాన ప్రమాణము ప్రమాద హేతువు గనుక

శబ్దప్రమాణమును బలపరచు నంతవరకే గ్రాహ్యముగాని సర్వతా గ్రహణీయముగాదు. వేదప్రమాణము నంగీకరించని మతవాదములను ఖండించుపట్లమాత్రమే ఆయన అనుమాన ప్రమాణమును గైకొనియుక్తులను సమకూర్చుకొన్నాడు. ఇంద్రియ జన్యజ్ఞానము, దేశకాలవస్తువుల సాపేక్షతోగూడిన దగుటచే నది ప్రత్యక్షమనుటతగదు. ఏలనన గుడ్లగూబకంటికి సూర్యప్రకాశమునందు అంధకారము ప్రత్యక్షముగానున్నది. కామెర్లరోగము గలవాని కన్నులకు తెల్లని శంఖము పచ్చగా నుండుట ప్రత్యక్షము. ఏవర్ణములులేని నిరామయమగు అవకాశ స్వరూపమగు ఆకాశమునకు నీలవర్ణము ప్రత్యక్షము. అనేక శతయోజన విస్తీర్ణముగల సూర్యబింబమునకు, అరచేతి మాత్రమగు వైశాల్యమే ప్రత్యక్షముగా గనబడుచున్నది. కనుక మహర్షుల దివ్యానుభూతిలో, ప్రత్యక్ష స్వరూపముగా నుండిన శ్రుతివాక్యముల సత్యత్వమే ప్రత్యక్షమనజెల్లును. గాని దేశకాలవస్తు సాపేక్ష గల్గిన ఇంద్రియ జన్యజ్ఞానము ప్రత్యక్షమనతగదు. దేశకాల వస్తువుల హద్దులను దాటినది బ్రహ్మజ్ఞానము. అట్టి జ్ఞానము కల్గించుటకు శ్రుతిప్రమాణమే శరణ్యము.

ఆత్మ సచ్చిదానంద స్వరూపమును, త్రికాలాబాధ్యమును, సాక్షిస్వరూపమును, అద్వితీయమును. కేవలబ్రహ్మ స్వరూపమును అయియున్నది. అందుకే మహావాక్య లక్ష్యార్థ

మున, ప్రత్యగాత్మా బ్రహ్మముల కేకత్వము ప్రతిపాదింప బడినది. ఆత్మ జ్ఞానస్వరూపమైనది. నిరపేక్షకము, నిర్విశేషము తాను బ్రహ్మస్వరూపుడే, గనుక అపేక్షింపదగినదియు కోర దగినదియు వేరొండులేదు. తనకన్యము మరొండులేదుగనుక అది అద్వితీయము, నిర్విశేషమునూ అయివున్నది సవిశేషుడు అగుచో మూర్తమును, మూర్తనుగుచో పరిణామ వినాశములు గలవాడును, గావలసివచ్చును. జ్ఞాతృజ్ఞానజ్ఞేయములలో పరస్పర భేధము వ్యవహారికము. కనుక ఆత్మ జ్ఞేయవస్తువని యు చెప్పదగుదు, జ్ఞేయత్వము చెప్పినచో, దృశ్యత్వ, జడ త్వాదులుగూడ సంభవమగును. ఐతే ఆత్మ శూన్యమా అను శంకగలుగును. అందుకే "తత్వమసి" మహావాక్యము త్వంప ద లక్ష్యార్థమగు నీప్రత్యగాత్మ స్వరూపమే బ్రహ్మము అని, చెప్పుచున్నది. బ్రహ్మము శూన్యముగాదు! ఆత్మబ్రహ్మలకు భేదము లేనేలేదు.

ఆత్మాను సంధానమున్నూ, అభేదదృష్టియూ మాత్రమే, నిజముగుభక్తి. శ్లో॥ మోక్షసాధన సామగ్ర్యాంభక్తి రేవగరీయసీ, స్వస్వరూప సంధానం భక్తిరిత్యభిధీయతే॥ అని శంకరునియభిప్రాయము. సేవకా భావమును, దాసత్వమునూ భక్తిగాదు. నేనే బ్రహ్మము గనుక ఎవర్కి సేవచేయవలెను? ఎవరిగూర్చి ధ్యానోపాసనాదులు గావించవలెను. నేనే

సర్వస్వరూపుడను. సర్వమునూ బ్రహ్మస్వరూపమే "సర్వం ఖల్విదం బ్రహ్మ నేహనానాస్తికించన" అని, శ్రుతి ఘోషించుచున్నది. కనుక నిరస్తసమస్తోపాధికమును, నిత్య శుద్ధ, బుద్ధ ముక్తస్వభావమును అగు బ్రహ్మమే నారూపము.

తెలుపు, చల్లదనము, ద్రవత్వము యీ మూడునూ జలగుణములు నిడుపుగానుండు రూపము, తరంగము ను నామము, యీరెండునూ తరంగలక్షణములు. ఈ అయిదు లక్షణములున్ను కలదానినే తరంగమని వ్యవహరించు రీతిని,

శ్లో॥ అస్తిభాతిప్రియం రూపం నామచేద్యం శపంచకం॥
ఆద్యత్రియం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం॥

లోకులు నామరూపపాత్మకమగు జగమునే చూచున్నారుగాని, అధిష్ఠానమగు అస్తిభాతి ప్రియములను, బ్రహ్మలక్షణములను గమనించుటలేదు. పరబ్రహ్మమే యేకైకసత్యమై సర్వవ్యాపకమై యున్నది. రెండావ వస్తువు కలదనుటయే కల్ల. యీ విశ్వమే యొకనికి దుఃఖరూపమగు నరకమైయున్నది. మరియొకనికి సుఖస్వరూపమగు స్వర్గమై యున్నది. బ్రహ్మజ్ఞానానికి, సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మమే అయివున్నది. "సర్వం ఖలిద్వం బ్రహ్మ" అహం బ్రహ్మాస్మి!! బ్రహ్మైవాహమస్మి!!!

—)o(—

# పరిపూర్ణదర్శనము.

## మహావాక్య వివరణ ప్రకరణము

మహావాక్యమనగా నేమి ? మహావాక్యములేవి ? అవి యెందుండి గైకొనబడినవి? యిత్యాదులను మనము ముందుగా దెలిసికొని పిదప వాక్యార్థ విచారణచేయుట సమంజసము అక్షరములొకటిగాని అంతకన్న యెక్కువగాని చేరినచో ఒక మాట లేక పదమగును అట్టి మాటలు, లేక పదములు కొన్ని చేరివాక్యమగుచున్నవి. ఉపనిషద్వాక్యములనేక పేర్లతో నున్నవి. అవి, విధివాక్యములు, బంధమోక్షవాక్యములు, అవిద్యానిందా వాక్యములు, జగన్మిథ్యా వాక్యములు, ఉపదేశవాక్యములు. జీవన్ముక్తి ఉపాయ మననవాక్యములు, జీవన్ముక్తి వాక్యములు. స్వానుభూతివాక్యములు, సమాధి వాక్యములు, అష్టవిధ స్వరూపవాక్యములు, ఫలస్వరూప వాక్యములు, విదేహముక్తి వాక్యములు, మహావాక్యములు, అని వివిధనామములచే పేర్కొనబడుచున్నవి. అందు జీవస్వరూపమును మాత్రము దెలుపునవి కొన్ని, ఈశ్వర స్వరూపమును గూర్చి కొన్ని, జగత్స్వరూపమును గూర్చి కొన్ని బ్రహ్మస్వరూపమును గూర్చి కొన్ని, జీవేశ్వరులకు, లేక జీవబ్రహ్మలకు యైక్యమును భోధించున్నవి గొన్ని, విధినిషేధములను నిర్ణయించునవి గొన్నియు, నై యున్నవి. అందు

అఖండార్థ ప్రతిపాదకములైన వాక్యములే మహావాక్యములు పదములచేత జెప్పబడే విశేషణాంశములను పరిత్యజించి, ప్రధానమైన విశేష్యమును మాత్రము జెప్పుటనట్టి వాక్యములు, అఖండార్థకవాక్యములు. జీవ బ్రహ్మైక్యమును గూర్చి జెప్పు నీ యఖండార్థకవాక్యములనే, మహావాక్యములని చెప్పవలయును. మిగిలినవన్నియు అవాంతర వాక్యములని యే చెప్పవలెను.

ఋగ్యజుస్సామాథర్వణ వేదములనుండి యీ మహావాక్యములు గైకొనబడినవి. ఋగ్వేదములోని, ఐతరేయోపనిషత్తు నుండి, "ప్రజ్ఞానం బ్రహ్మ" అనువాక్యమును. యజుర్వేదమందలి బృహదారణ్యకోపనిషత్ నుండి "అహం బ్రహ్మాస్మి" అనువాక్యమును, సామవేదాంతర్గతమగు ఛాందోగ్యపనిషత్తునుండి "తత్వమసి" యను వాక్యమును, అథర్వణవేదమందలి మాండూక్యోపనిషత్తునుండి 'అయమాత్మా బ్రహ్మ' యనువాక్యమును, గైకొనబడినవి. ఈ నాలుగే మహావాక్యములు.

ఈ మహావాక్యములు అఖండార్థమైన జీవ బ్రహ్మైక్యము లేక ప్రత్యక్బ్రహ్మైక్యము మాత్రమే ప్రతిపాదించుచున్నవను విషయము, షడ్విధలింగ విచారణచే సిద్ధించుచున్నది. ఏమహావాక్యము ఏప్రకరణములో గాన వచ్చునో,

ఆ ప్రకరణముయొక్క ముఖ్యాభిప్రాయము షడ్విధ లింగ విచారణచే, అఖండార్థమునే ప్రతిపాదించుచున్నదో, లేదో, మనము గమనించవలసి యున్నది. ఉదాహరణకు 'తత్త్వమసి' అను మహావాక్యమును తీసికొందము. షడ్విధలింగము లేవియన (1) ఉపక్రమోప సంహారము (2) అభ్యాసము (3) అపూర్వము (4) ఫలము (5) అర్థవాదము (6) ఉపపత్తి, అను ఆరున్న షడ్విధలింగములైయున్నవి. "తత్త్వమసి" మహావాక్యముగల ఛాందోగ్యపనిషత్ నందు, "సదేవ సోమ్యేదమగ్రఆసీత్ ఏకమేవాఽ ద్వితీయమ్" అనేవాక్యముపక్రమవాక్యము: ఇది సజాతీయ, విజాతీయ, స్వగతభేద శూన్యమైన పరమాత్మను చెప్పుచున్నది, అన్నారు. కనుక అద్వైతమును మాత్రమే భోధించుచున్నది. 'ఐతదాత్మ్యమిదం సర్వం' అనేవాక్యముపసంహార వాక్యము. ఇది యీ ప్రపంచమంతయు బ్రహ్మాత్మకమని చెప్పుచున్నందున, ఇదియు నఖండార్థమునే ప్రతిపాదించుచున్నట్లే. కనుక ప్రథమ లింగ విమర్శచే ప్రకరణముయొక్క ముఖ్యాభిప్రాయము ప్రత్యక్బ్రహ్మైక్య విషయకమే అనుట స్పష్టము. అట్లే "అభ్యాసము" అను ద్వితీయలింగ విమర్శచేతను మిగతా వానిచేతనుగూడ సిద్ధించుచున్నది. ఎట్లన, అభ్యాసమనగా మాటిమాటికి చెప్పుట. "తత్త్వమసి" అనువాక్య మీప్రకరణ

మున, తొమ్మిదిపర్యాయములు చెప్పబడినవి. కనుక నీమహా వాక్యమునకు ప్రత్యగ్బ్రహ్మైక్యము తాత్పర్యమనదగును. (3) అపూర్వము — ప్రత్యగ్బ్రహ్మైక్యము ప్రత్యక్షాదిప్రమాణములచే ప్రతిపాదింపబడనిదై యుండుటవలన, అపూర్వమై యున్నది. కనుక తత్వమసి వాక్యమునకు ఐక్యమునందే తాత్పర్యము కలదనదగును. (4) ఫలము — యిట్టి జీవ బ్రహ్మైక్య జ్ఞానము కలవానికి విదేహకైవల్యము కలుగుట నిశ్చయము: (5) అర్థవాదము అనగా ప్రతిపాదింపబడు అర్థమును విశదీకరించుటకు చెప్పుకథ "పంచభూతములను సృష్టించి, పరమాత్మ అభూతములందును అభూతకార్యములగు సర్వోపాధులయందును, జీవరూపముగా తానేప్రవేశించి, నామరూపములను ప్రకటించెను" యిది కథ. ఈ కథవలన జీవాత్మ పరమాత్మలకు భేదములేదని తెలియబడుచున్నది. (6) ఉపపత్తి:— అనగా ఋజువుచేయుయుక్తి. "యథాసోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం, విజ్ఞాతస్యాత్ వాచారంభణం వికారో నామధేయం, మృత్తికేత్యేవ సత్యం" మృత్పిండమునందు కల్పింపబడిన ఘటాదులు మృత్పిండమునకంటె భిన్నములు కానట్లే, పరమాత్మయందు కల్పింపబడిన ప్రపంచము. పరమాత్మకంటె వేరుకాదు. కనుక పరబ్రహ్మమద్వితీయము. ఈ విధమైన షడ్విధలింగ విచారణచే ప్రకర

ణముయొక్క ఆది మధ్యాంతములయందు, ప్రత్యగ్బ్రహ్మై క్యమేసిద్ధించుచున్నది. కనుక తత్వమసి మహావాక్యమును గ్లేక మిగిలిన మూడు మహావాక్యములును ప్రత్యగాత్మా పరమాత్మల కేకత్వమునే ప్రతిపాదించుచున్నవి.

(4) పదములయొక్క చేరికయే వాక్యము గనుక వాక్యార్థ మెరుంగుటకుముందు, వాక్యమునందుగల పదపదార్థములను తెలసికొనవలసి యున్నది. అయినను కొన్ని యెడల వాక్యార్థమెరంగినగాని పదముల యర్థము అన్వయము కాజాలదు ప్రత్యగ్బ్రహ్మైక్యమునే. మహావాక్యములు ప్రతిపాదించుచున్నట్లు షడ్విధలింగ విచారణచే తెలుసికొంటిమి. మహావాక్యమునందలి పదపదార్థములచే నీ యఖండార్థ మెట్లు సిద్ధించుచున్నదో, యిక మనము తెలిసికొనవలసి యున్నది.

(5) పదమునకు పదార్థమునకు (పదముయొక్క అర్థమునకును) గల సంబంధమునకు వృత్తియనిపేరు. అనగా శబ్దమునకర్థమును బోధించు వ్యాపారమే వృత్తి ఇది త్రివిధము (1) శక్తివృత్తి; దీనినే ముఖ్యవృత్తియనిగూడ అందురు. శబ్దమునగల అర్థమును గ్రహింపజేయు సామర్థ్యమునకు శక్తియనిపేరు. అనగా పదమును విన్నమాత్రమున యే ప్రసిద్ధార్థము స్ఫురించునో అది పదశక్తి యనబడును. మరియును

యేపదమున కే అర్థశక్తియున్నదో, ఆపదమునకా యర్థము 'శక్యము' అని తెలియవలసియున్నది. యీశక్యార్థమునే వాచ్యార్థమనియు, అభిధేయార్థమనియు, ముఖ్యార్థమనియు, గూడచెప్పెదరు. అనగా శబ్ద, శబ్దార్థములకు గల సాక్షాత్సంబంధమే శక్తివృత్తి.

(6) లక్షణావృత్తి:- అనగా మాటలాడువక్త అభిప్రాయమాతడు ప్రయోగించిన పదమువలన సాక్షాత్తుగా తెలియబడకపోయినను, ఆపదమునకు గల శక్యార్థము లేక వాచ్యార్థమునకు సంభంధపడి అన్యార్థమును ద్యోతక మొనర్చుచు వక్తయొక్క నిజాభిప్రాయమును వెల్లడించు వృత్తికి లక్షణావృత్తియనిపేరు. అనగా శక్యార్థముద్వారా శబ్దమునకు అర్థముతో గల్గిన పరంపరా సంబంధము లక్షణావృత్తియనబడును. అనగా ఏయర్థము పదశక్తివలన తెలియబడక లక్షణమువలన తెలియబడుచున్నదో, అది పదము యొక్క లక్ష్యార్థము. ఉదాహరణ = "అయోదహాతి" (యినుముకాల్చుచున్నది) అను వాక్యములో యినుము ముఖ్యార్థమును యినుముతో సంబంధపడిన (యినుము యెర్రగా కాల్చిన) అగ్నిలాక్షిణికార్థమును, ఆయివున్నవి. ఇనుము అనుముఖ్యార్థమును గ్రహించిన యెడల అర్థము పొసగదు ఏలననగా యినుమునకు తనంత తానుకాల్చుశక్తి యెందునులేదు. కనుక యీవాక్యమునకు

లక్షణావృత్తి చేతనే అర్థమేర్పడుచున్నది. అస్మిన్సుషుప్త్యావస్థాయాం నదునాహమజ్ఞాశిషం (నేనుయెఱుగను) అనుచోట, అహంశబ్దము హంకారము అర్థముగానన్వయింపజాలదు. ఏలనన సుషుప్తియం దహంకారము లేదు అందుచే అహంశబ్దమునకు లక్ష్యార్థముచే ఆత్మ యను అర్థము నే గ్రహించవలసియున్నది. ఇచ్చట అహం శబ్దము ఆత్మను లక్షించి లక్షణచే ప్రయోగగింపబడినది.) ఈ లక్షణ మూడువిధములుగా ప్రసిద్ధమైయున్నది. (1) జహత్తు (2) అజహత్తు (3) జహదజహత్. (1) జహల్లక్షణ:- శక్యార్థము లేక వాచ్యార్థమును సంపూర్ణముగ పరిత్యజించి, వాచ్యార్థమునకు సంబంధించిన అన్యవిషయమును గ్రహించుట జహల్లక్షణ యనబడును. ఉదాహరణ:- "గంగాయాంఘోషః" అను వాక్యమునకు. గంగయందు గొల్లపల్లెవున్నది యనియర్థము యేర్పడుచున్నది. ఈ అర్థ మంగీకరించనచో ప్రత్యక్షవిరోధార్థమేర్పడుచున్నది. ఎట్లన "గంగ" అనుపదమునకు గంగా ప్రవాహము ముఖ్యార్థము. ఐతే ప్రవాహమునందు గొల్లపల్లె యెట్లుండగలదు? అసంభవము. కనుక "గంగ" యను పదమునకు గంగాప్రవాహమును ప్రసిద్ధార్థమును సర్వాత్మనావిడచిపెట్టి. ఆప్రవాహముతో గూడుకొన్న గంగాతీరమునే గ్రహించి యాతీరము గొల్లపల్లెయున్నదని లక్షణచే గ్రహించుటయే జహల్లక్షణ (లేక ప్రసిద్ధార్థమును విడచిన లక్షణము) అని చెప్పబడును.

"గోడలకు చెవులున్నవి" యను వాక్యము జహల్లక్షణకు మరియొక దృష్టాంతము. (2) అజహల్లక్షణము,- ప్రసిద్ధార్థమును విడువని లక్షణము. ఉదాహరణము "మంచాః క్రోశంతి" = మంచెలు అరచుచున్నవి. అనుచోటు మంచెలు అను వాచ్యార్థమును గ్రహించినచో ప్రత్యక్షవిరుద్ధము. ఏలనన, జడములగు మంచెల అరువవు. కనుక మంచెలుపైనున్న మనుష్యుల కేకలు వేయుచున్నారు, అను అర్థము లక్షితమగుచున్నది. ఇట ముఖ్యార్థమును విడువక, ముఖ్యార్థమునకు సంబంధపడిన వేరొక అర్థము సూచింపబడినది. టోపిలు పోవుచున్నవి యనువాక్యము అజహల్లక్షణకు మరియొక యుదాహరణ. (3) జహదజహదల్లక్షణము:- అనగా ప్రసిద్ధార్థమును విడిచి విడువకుండుట అనగా కొంత విడిచి కొంత విడువకుండుట దీనినే భాగత్యాగ లక్షణ అనిగూడ అందురు ఉదాహరణ:- సోయందేవదత్తః = ఇతడే ఆదేవదత్తుడు. అను వాక్యమునందు చిన్ననాడు 5 సంవత్సరముల వయస్సులో రామేశ్వరమునచూచిన ఆదేవదత్తుడు 50 సంవత్సరములవయస్సులో కాశీక్షేత్రమున యీరూపమునగన్పించగా, ఆదేశము ఆకాలము, యీదేశ యీకాల యీరూపములు, గాకపోయినను, ఏతద్దేశ; రూప; కాలదులనువిడిచిపెట్టి; తద్దేవదత్తుడే యీదేవదత్తుడని, ఏకపిండమందు (అనగా ఏక దేహమందు)

లక్షించిగ్రహించినట్లు ఇట దేశ కాలరూపములనెడి భాగము ను విడిచిపెట్టి దేహమును మాత్రముగ్రహించుట అయినది. ఇదియే జహదజహల్లక్షణము లేక భాగత్యాగ లక్షణము అని చెప్పబడును.

4 గౌణవృత్తి:- అనగా గుణసంబంధముచేత బోధించు నది ఉదాహరణ:- "సింహోదేవదత్తః" అనువాక్యమునందు దేవదత్తుడు సింహమగునా? సింహము దేవదత్తుడగునా? అసంభవము. కాని దేవదత్తునికి సింహమునకున్న గుణము (పరాక్రమము) గలుగుటచే గుణవిశేషముచేత సింహోదేవదత్తః అని చెప్పబడినవి. అట్లే ఆత్మయును, అహంకారమును గుణవృత్తిచే సమాన ధర్మములు గలవైయుండుట వలన, అహంశబ్దము గౌణవృత్తిని అవలంబించి ఆత్మను చెప్పుచున్నది. రెండున్ను అత్యంత అంతరములు. రెండున్నూ బహుసూక్ష్మములు, నేతినేతి అని రెండున్నూ బుద్ధిచే అన్నమయకోశము మొదలు విచారింపబడుచున్నవి.

ఈ వృత్తులయందు, ఏవృత్తినవలంబించి మహావాక్యములకు అఖండార్థము నిర్ణయమగునో విచారింపవలసియున్నది. శక్తివృత్తి నవలంబించినచో వాక్యమునందు పదములకుగల వాచ్యార్థములకు ఏకత్వసిద్ధి గలుగదు. కాగా ప్రత్యక్షవిరుద్ధము ద్యోతకమగుచున్నది. లక్షణావృత్తి చేతనే

ప్రత్యగ్బ్రహ్మైక్యము సిద్ధించి యఖండార్థము కల్గుచున్నది. కాని, అందు జహల్లక్షణచేగాని, అజహల్లక్షణచేగాని, ఈ అఖండార్థము సిద్ధించదు. ఒక్క జహదజహల్లక్షణచేతనే అఖండార్థము సిద్ధించగలదు. అది యెట్లో ముందుముందు విమర్శింతము

9 ఇక తత్వమసి యను ఉపదేశవాక్యమునగల, పద పదార్థములను తెలిసికొని జహదజహల్లక్షణచే యీ మహా వాక్యము ప్రత్యబ్రహ్మైక్యమును యెట్లు బోధించుచున్న దియో గమనింతము. తత్వమసియను వాక్యమున మూడు పదములు గలవు. (1) తత్ (2) త్వం (3) అసి

10. ఈ 'తత్' అను పదమునకు ముందుగా మనము వాచ్యార్థలక్ష్యార్థము లెరుంగవలెను. తత్పదమునకు వాచ్యార్థము యీశ్వరుడు మాయ మాయ యందలి చిదాభాసము మరియు తదధిష్ఠానమైన బ్రహ్మము యివన్నియు చేరినచో యీశ్వరుడు సర్వజ్ఞత, సర్వశక్తిత్వము, వ్యాపకత, ఏకత, స్వతంత్రత, సమర్థత, పరోక్షత, మాయోపాధి, మొత్తం యీ ఎనిమిదిన్ని ఈశ్వర ధర్మములు. ఈసర్వ ధర్మసహితముగ, మాయ మాయయందలి చిదభాసము, యామాయాధిష్ఠానమైన బ్రహ్మము, యివన్నియు చేరిన యీశ్వరుడు తత్పదమునకు వాచ్యార్థమైయున్నాడు. ఇక తత్పద లక్ష్యార్థమేమనగా సకల ధర్మ సహితముగ మాయా చిదాభాసుల రెంటిని జహ

దజహల్లక్షణచే పరిత్యాగము చేయుగా పరిశేషమైన మాయాధి ష్ఠానమైన ఈశ్వరసాక్షియైన బ్రహ్మమే తత్పద లక్ష్యార్థము.

11. 'త్వం' పదవాచ్య లక్ష్యార్థము లెట్లనగా:— అల్ప శక్తి, అల్పజ్ఞత, పరిచ్ఛిన్నత, అనేకత పరాధీనత, అసమర్థ త, అపరోక్షత, అవిద్యోపాధి, యీ ఎనిమిదిన్ని జీవ ధర్మములు. అవిద్య, అవిద్యయందలి చిదాభాసము, కూటస్థుడు యీ మూడున్ను చేరి జీవుడనబడును. యీ జీవుడే "త్వం" పద వాచ్యార్థము, భాగత్యాగలక్షణచే సహపరివారముగా అనగా సకలజీవవర్గ సహితముగ అవిద్యయునందలి చిదాభాసము ను పరిత్యాగము చేసినచో పరిశేషమైన కూటస్థాత్మయే "త్వం" పదమునకు లక్ష్యార్థము.

12 "అసి" అను పదమునకు అయితివి అని అర్థము కనుక "అసి" అనుపదము "తత్" త్వం, పదములకు ఐక్యత ను కల్పించుచున్నది. తత్వమసి అనువాక్యమునకు "అదినీవై తివి" అని వాక్యర్థము. కించజ్ఞత్వ, అపరోక్షత్వాది ధర్మములు గల జీవుడుసర్వజ్ఞత్వపరోక్షాది వ్యతిరేక ధర్మములు గల యీశ్వరుడెట్లగును? కనుక ప్రసిద్ధార్థము (వాచ్యార్థం) అం గీకరించినచో వాక్యర్థము సమన్వయమగుటలేదు. విరుద్ధ ధర్మమములు గల రెండు తత్వములకు ఏకత్వమెట్లు పొస గును? అప్పుడు తత్వమసి వాక్యార్థము అగ్ని శీతలమై యున్న

దను వాక్యార్థముతో తుల్యమగును. వాచ్యార్థమునందు విరుద్ధము ప్రసిద్ధమై యున్నందున లక్షణావృత్తిచే విచారించి ననే యీ విరోధము పరిహారమగును. మహావాక్యము నన్వయించుపట్ల జహల్లక్షణగాని అజహల్లక్షణగాని ప్రయోజనకారి కాజాలదు. ఏలనన, జహల్లక్షణచేతత్పదవాచ్యార్థమైన ఈశ్వరుని, త్వంపదవాచ్యమైన జీవుని పూర్తిగావిడిచిన యెడల యికఐక్యతదేనికి? అపుడు జీవేశుల కల్యముగాదోచు, అసజ్జడదుఃఖరూపదేహప్రపంచములను గ్రహించుటవలసివుండును. కను కజహల్లక్షణ వర్తించదు అజహల్లక్షణయందు, వాచ్యార్థము నంతేమియు త్యాగముగాక పోవుటచే తత్, త్వం పదముల యందలి విరోధార్థములున్నూ పరిహారముగాక యట్లే నిలిచి పోవును. అనగా జీవేశ్వరుల విరుద్ధధర్మములైన సర్వజ్ఞత్వ-అల్పజ్ఞత్వములు, పరోక్ష అపరోక్షములు కూడ, విడువబడుక పోవుటవలన వాక్యమునకు సమనన్వయము కుదురదు. కనుక మహావాక్యమునందు, జహదజహల్లక్షణచేతనే పదద్వయమునకు ఐక్యతసిద్ధించగలదు. ఎట్లనగా "తత్" "త్వం" పదముల యందలి విరోధిభాగమునకు త్యాగమున్ను ఆవిరోధిభాగమునకు గ్రహణమున్ను, అగుట వలన పదార్థములకైక్యతచేకూరును.

13. కనుక "తత్" పదవాచ్యమైన ఈశ్వరునియందు

ఆభాససహితమాయయు, మాయవలనగల్గిన సర్వజ్ఞత్వ సర్వ శక్త్యాదులున్ను త్యాజ్యాంశములు. అట్లె త్వంపదవాచ్య జీవునియందు ఆభాససహిత అవిద్యాంశమును, యావిద్యవలన గల్గిన అల్పశక్తి యల్పజ్ఞత్వాది ధర్మములున్నూ త్యజింపదగినవి. ఇక జీవేశ్వరులయందలి అధిష్ఠాన చేతనాంశమొక్కటియే గ్రాహ్యాంశమై యున్నది. జీవేశ్వరులయం దీ యధిష్ఠానచేతనమే సమానధర్మమై యున్నది. సమానమనగా రెండు గాదు. ఏకమేనని తత్వమాసి మహావాక్యము బోధించుచున్నది

14. తత్వమసి మహావాక్యమున యీఅఖండార్థము, (1) పదములయొక్క సమానాధికరణ్య సంబధముచేతను. (2) పదార్థములయొక్క విశేషణ విశేష్య భావసంబంధముచేతను. (3) ప్రత్యగాత్మ పరమాత్మలయొక్క లక్ష్యలక్షణ భావసంబంధముచేతను సిద్ధించుచున్నది. ఎట్లన (1) సమానాధికరణ్యసంబంధమనగా ప్రత్యేకార్థముతో రెండు భిన్నపదములొక్కటె వస్తువును గుర్తించుట. ఉదాహరణ:_ సోయందేవ ఆత్తః = ఆ దేవదత్తుడే యీ దేవదత్తుడు. ఈ వాక్యమునద దేశకాలములతో గూడిన దేవదత్తుని గుర్తించునది 'ఆ' యును ఈదేశకాలములతో గూడిన దెవదత్తుని గుర్తించుపదము "ఈ" యును యును ఒకేశరీరమును గుర్తించుచున్నందున సమానాధికరణ్య సంబంధము సిద్ధించుచున్నది. అట్లే "తత్

పదమును" "త్వం" పదమును లక్షణచే, ఒకే అధిష్ఠాన చైతన్య మును గుర్తింపచేయుచున్నవి. కనుక సమానాధి కరణ్య సం బంధముచే మహావాక్యమునందు అఖండార్థము సిద్ధించుచున్నది

15. (2) విశేషణ విశేష్యభావ సంబంధము :- వివరించి చూపుట విశేషణమున్నూ అట్లు వివరించబడి కనబడునది విశే ష్యమున్నూ అయివున్నవి. "అతడేయితడు" అను వాక్యము నందు యితడు అను యీ దేశకాలములతో గూడిన దేవదత్తు డు,అతడుఅనుఅదేశకాలాదులతోగూడిన దేవదత్తునికంటె భిన్న డు గాదనిభావము. "ఇతడు" అను శబ్దార్థమునందుగల భేద మును "అతడు" అను శబ్దార్థమునగల యర్థము వేరుపరచి వివరించి గూపుచున్నది. కనుక అతడు అనునది విశేషణము. అతని లక్షణములుగల యితడు అనినట్లే. కనుక అతడు అను మాట యితడు అను శబ్దమునకు విశేషణము అయివున్నది. ఇత డు అనునది విశేష్యము అట్లే "ఇతడే అతడు" అనుటలో "యి తడు" విశేషణమున్నూ "అతడు" విశేష్యమున్నూ అయివున్న ది. అట్లు "తత్వమసివాక్యమున" "త్వం" పద ధర్మములగు, అపరోక్షత్వ కించిజ్ఞత్వాదులతోగూడిన చైతన్యము, సర్వజ్ఞత్వ పరోక్షత్వ ధర్మములతోగూడిన తత్పదమునందలి చైతన్యము కంటె వేరుకాదు. త్వం పదార్థమునగల భేదమును, "తత్" శబ్దార్థము వేరుపరచి వివరించి చూపుచున్నది. కనుక "తత్"

పదము విశేష్యణమున్నూ "త్వం" విశేషణమున్నూ అగుచున్నది. అట్లె త్వందసి అనుచోట "త్వం" విశేణము "తత్" విశేష్యము. యీ విధముగా తత్, త్వం పదములు పరస్పరము విశేషణ విశేష్యములై యుండుటవలన విశేషణ విశేష్యభావ రూపసంబంధము సిద్ధించుచున్నది. దేహేంద్రియాదివిశిష్టమైద చైతన్యము 'త్వం' పదమునకును, అద్వితీయ సచ్చిదానంద స్వరూపమైనపరబ్రహ్మమే తత్పదమునకును తాత్పర్యములైయున్నవి. 'త్వం' పదార్థమునకు తత్ పదార్థము విశేషణము కాగానే త్వం పదార్థమునందు తోచబడు దుఃఖత్వము నివర్తించును. ఎట్లన "పరమానంద స్వరూపమగు బ్రహ్మవు నీవు" అనుటలో జీవునియందు తోచబడు దుఃఖత్వమునకిక తావుండదు. అట్లే "త్వంతదసి" =నీవేఅది అది అయితివి అనుచో తత్ పదార్థనుందు తోచబడు పరోక్షత్వము నశించును. ఆ విధముగా విశేషణ విశేష్యభావ సంబంధముచే "తత్వమసి (త్వమేవతదసి)" అనువాక్యమునందు అఖండార్థమే ప్రతీతి యగుచున్నది.

16. (3) లక్ష్యలక్షణభావ సంబంధము:— అసాధారణ ధర్మమును ప్రతిపాదించునవి లక్షణము, ఆ లక్షణముచే ప్రతిపాదింపబడునదే లక్ష్యము. ఇచట మహావాక్యమున విరుద్ధధర్మముల కేకత్వముప్రతిపాదించుట లక్షణము విరుద్ధ ధర్మ పరిత్యాగము (భాగత్యాగము) చేసి వస్తువుయొక్క ఐక్య

తను సాధించుట లక్ష్యము. ఇదియే లక్ష్యలక్షణ భావ సంబంధము "తత్" "త్వం" పదార్థములలో విడవబడిన విరుద్ధాంశ భాగంబులందు లక్షణమున్ను, అఖండ చైతన్యమునందు లక్ష్యమున్నూ సిద్ధించుచున్నది.

17. బుద్ధి జడమున్నూ స్వయంజ్ఞాతృత్వము లేనిదిన్నీ అయివున్నది. కాని యీ బుద్ధియందు కూటస్థ చైతన్యము యొక్క అభాసవలన జ్ఞాతృత్వముగల్గి అహంబుద్ధితో భాసించుచున్నది. అందువలన జ్ఞాతృత్వ అహంత్వములచే కూటస్థాత్మయే లక్షింపబడుచున్నది. కనుక బుద్ధివిశిష్టమైన ఆత్మ అనగా జీవుడు "త్వం" పదమునకు వాచ్యార్థమున్నూ లక్షణమున్నూ అయివున్నది. దానిచేత లక్షింపబడుచున్న కేవల శుద్ధ చైతన్యము అనగా ప్రత్యగాత్మ లక్ష్యమని చెప్పబడుచున్నది. అట్లే తత్పదమందును, పరోక్షత్వము, సర్వజ్ఞత్వముగల ఈశ్వరుడు వాచ్యార్థమున్నూ లక్షణమున్నూ అయివుండివున్నాడు. ఇది లక్షణ. దీనిచేత లక్షితమగు లక్ష్యమేదనగా:- సృష్టికి పూర్వము, ఏకమై, అద్వితీయమై, నామరూప రహితమై, సత్ అని ఏది మనకుతోచునో అట్టి అఖండమైన పరబ్రహ్మమే లక్ష్యము. ప్రత్యగాత్మకంటె భిన్నమై, అజ్ఞానకల్పితమైన అహంకారమెట్లుత్యాజ్యమై అనగా విడువదగినదై యున్నదో అట్లే పరమాత్మయందు కల్పితమైయున్న సర్వశక్తి

సర్వజ్ఞత్వాదులున్నూ, త్యాజ్యములే. ఈ లక్ష్యలక్షణ భావసం బంధముచే మహావాక్యమునందు ప్రత్యగ్బ్రహ్మైక్యము తాత్ప ర్యమగుచున్నది.

18 ఇక, నీప్రత్యగ్బ్రహ్మైక జ్ఞానము ముముక్షువున కెట్లారూఢమగునో యాతని కవిద్యా నివృత్తియెట్లు చేకూరునో యోచింపవలసియున్నవి. విచారణకు పూర్వము దేహేంద్రి యాదులాత్మగా పరిగణింపబడుచుండును. అన్వయవ్యతిరేక యుక్తులచే విచారించిన జిజ్ఞాసికి. ఆత్మదేహేంద్రియాదులన్ని టికంటె విలక్షణుడని తెలియబడును. కాని యిదమిద్ధమని మాత్రమాయాత్మస్వరూపస్థితి తోచబడక కేవలము లేనిదాని వలె దోచబడుచుండును. "దేహాదులు నేనుగాను, వానికంటె విలక్షణుడను, కాని నేనెవడను?" అని విమర్శించువానికి మ హావాక్యములు, నీవు సాక్షాత్తుగా పరబ్రహ్మవేయని బోధిం చుచున్నవి. కనుక అపరోక్షజ్ఞానము గలుగవలెనన్న అన్వయ వ్యతిరేకముల నాలోచించి, దేహాదిబుద్ధిపర్యంతము ఆత్మకాద ని నిరసించి, వానికి సాక్షియగు ప్రత్యగాత్మను గుర్తెరిగి, ఆ ప్రత్యగాత్మయే అద్వితీయ పరబ్రహ్మమని తత్వమస్యాది మహావాక్య విచారణచే తెలిసికొనవలసియున్నది. కనుక అన్వయవ్యతిరేకములచే పద-పదార్థముల యదార్థజ్ఞానము తెలి సినగాని వాక్యార్థ అపరోక్షజ్ఞానము కలుగదు. కనుక ఆత్మ

నాత్మ వివేకముగల్గి, అన్వయవ్యతిరేక యుక్తులచే "త్వం"
పదలక్ష్యమైన ప్రత్యగాత్మను ముందుగా తెలిసికొనవలెను.

19. ఆత్మానాత్మ వివేకము:- యాజ్ఞవల్క్య జనకునకు
నొక్క వాక్యములో యీ ప్రత్యగాత్మ స్వరూపమునుతెల్పిన
యీదిగువ బృహదారణ్యశ్రుతి వాక్యమును విమర్శించుట
యవసరము. "యోయం. విజ్ఞానమయః ప్రాణేషుహృ
ద్యం పర్జ్యోతిః పురుషః" యోయం విజ్ఞానమయః ప్రాణేషు=
అని చెప్పుటవలన ఆత్మ విజ్ఞానమయుడు, యింద్రియముల
యందును, ప్రాణములయందును, యున్నవాడని చెప్పినం
దున యింద్రియములు ఆత్మకాదని తేలుచున్నది. "హృది"
- అన హృదయమునందు అనుటవలన, యింద్రియాధిష్ఠాన
దేవతలుగారని తేలుచున్నది. ఏలనన యింద్రియాధిష్ఠాన దే
వతలు ఆ యా యింద్రియముల యందుందురు. గాని హృ
దయమందుండరు. అంతః - అనగా హృదయములోపల;
అనుటచే విజ్ఞానమును శబ్దముచే చెప్పబడిన బుద్ధియునుగాదు
ఏలనన బుద్ధి హృదయమందేవుండును గాని, హృదయము
లోపలనుండదు. "జ్యోతిః"- అనిచెప్పుటవలన, దేహాది
యాది జడపదార్థముల కన్నిటికి వుపాదాన కారణమైన అవ్యా
కృతము ఆత్మకాదు, ఏలనన అవ్యాకృతము సర్వకారణము
న్నూ సర్వాంతరమున్నూ అయినప్పటికి జడమైనందున ప్ర

కాశరూపమైన ఆత్మకాదు. "పురుషః" అని జెప్పుటవలన సర్వ దేహములయందు వ్యాపించియున్న పరిపూర్ణుడు అనుట సిద్ధించును కనుక అంతఃకరణయందు ప్రతిబింబించి పరిచ్ఛిన్నతవెంపిన చిదాభాసుడున్ను పూర్ణుడుకాడు గనుక యీ చిదాభాసుడున్ను ఆత్మకాదు. కనుక దేహేంద్రియాదులకంటె తదధిష్ఠానదేవతలకంటె, బుద్ధికంటె, అవ్యాకృతముకంటె, చిదాభాసునికంటె విలక్షణమై సర్వపరిపూర్ణమై, సర్వప్రకాశమై, స్వభావముగా అవిద్యాకామకర్మవాసనాది సర్వబంధశూన్యమైన చిద్ధాతువు మాత్ర మాత్మయని నిశ్చయింపదగియున్నది.

20. (2) అనయవ్యతిరేకయుక్తులచే యీ ప్రత్యగాత్మస్వరూపమునుజిజ్ఞాసి యింకను సన్నిహితమొనర్చుకొని దానిని యపరోక్షముగా గుర్తించవలసియున్నది. అన్వయవ్యతిరేకములనగా అనువృత్తార్థ వ్యావృత్తార్థములు ఇవిపద-పదార్థములను ఆశ్రయించుకొని యుండును. పదార్థము (శబ్దార్థము) అనేక అంశములతో గూడియుండును. ఆయంశములలోయెల్లప్పుడును తెలియబడునది అనువృత్తార్థము:-చీకటిలో నొక త్రాడునుచూచినయెడల యిదిసర్పమా? ఇదినేల పగులా? ఇది నీటిజాడయా? ఇదికర్రయా? అనుకల్గుననేక సంశయములలోనూ, "ఇది" అనుమాట సమానాంశము

గానున్నది. ఈ "ఇది" అనునదే అనువృత్తార్థము. అట్లుగాక, సర్పము, నేలపగులు, నీటిజాడ, కర్రయిత్యాది వాక్యాంశము లు భేదించుచున్నది. ఈ యంశములే అనగా ఆసర్పాదులు వకప్రత్యయమునందె వ్యవహరింపబడి, మిగిలినవానిలో వ్యవహరింపబడనందున: వ్యావృత్తార్థములనబడను. ఇట్లే సర్వ కాల సర్వావస్థలయందున్నూ అనుస్యూతముగానుండు అను వృత్తార్థము ఆత్మవస్తువు.

21. అహంకారమే వ్యావృత్త వస్తువు ఏలనన యిది సర్వావస్థలయందును లేదు. జాగ్రత్స్వప్నములలో మాత్రమాత్మతో గలసి వ్యవహరించుచున్నది. సుషుప్తి మరణ, మూర్ఛాద్యవస్థలలో లేదు, కనుక నీ యహంకారము నాత్మయనిగాని యాత్మధర్మమనిగాని జెప్పవలనుపడదు. అనువృత్త వ్యావృత్తార్థముల విమర్శచే (అనగా అన్వయ వ్యతిరేక యుక్తులచే) ఆ నీత్మ పదార్థమగు అహంకారమును ఆత్మనుండి విడదీసి ఆత్మ పదార్థమును గుర్తించవలెను. ఈ అహంకారమే ఆత్మానాత్మల గ్రంథి. చిదాత్మయందుఅన్నిటికన్న ముందీ యహంకారమే కల్పింపబడెను. ప్రత్యగాత్మతో తాదాత్మ్య సంబంధముగల్గి తప్తాయః పిండము (కాలిన యినుపబంతి) వలె నున్నది. విమర్శించనివాడు దానిని జూచి అగ్ని యనుకొన్నరీతిగా యీ యహంకారమాత్మయేనని అజ్ఞాని భ్రమించుచు

న్నాడు. చిదాత్మకు పిదప నీ యహంకారమే సర్వాంతరమై యున్నది. మరియును "అహం" శబ్దముచేతనే ఆత్మ పదార్థ మున్ను పిలువబడి లక్షణావృత్తిచే ఆత్మ పదార్థమును, వుపల క్షితము జేయుచున్నది కారణమేమనగా ముఖ్యవృత్తిచే ప్రత్యగాత్మను నిరూపించు పదము లేదు. శబ్దప్రవృత్తికి కారణములైన (1) సంబంధ (2) గుణ (3) క్రియ (4) జాతి (5) రూఢులు, అను నీ యైదున్నూ ప్రత్యగాత్మయందు లేక పోవుటయే ఇందులకు కారణము. కనుక ప్రత్యగాత్మను ముఖ్యవృత్తిచే దెలుపు పదములు లేవు. ఈ ఆత్మ స్వరూపము ను బోధించుటయందు "త్వం" (నీవు) "అహం" (నేను) అను పదములు మాత్రమేగలవు. ఇవి గుణవృత్తిచే ఆత్మను బోధించి అర్థమును సన్నిహిత మొనర్చుచున్నవి.

ఈ అహంకార మాత్మను విడచియుండదు, నశించదు. ఆత్మయందే నశించును. అహంకారము ఆత్మయందుననే కల్పించబడినందున ఆత్మనాశ్రయించి స్థితినాశములజెందును గాని, స్వతంత్రముగా నుండనేరదు. కనుక "అహం" శబ్దము అహంకార విశిష్టమైన ఆత్మను ముఖ్యవృత్తిచే చెప్పుచున్నది. లక్షణావృత్తి గౌణవృత్తులచేత శుద్ధమైన ఆత్మను జెప్పుచున్నది "ఘటమహంజానామి" _నేను ఘటమును తెలియుచున్నాను. అనుచోటు యహంకార విశిష్టమైన యాత్మయే

అహంశబ్దమువలన వుపలక్షితమగుచున్నది. 'అహం బ్రహ్మాస్మి' నేను బ్రహ్మనైతిని అను వాక్యమునందు అహంశబ్దముచేత ప్రత్యగాత్మ లక్షింపబడుచున్నది. అందుచే వాక్యార్థ ప్రతిపత్తి కొరకు అహంశబ్దముయొక్క ముఖ్యార్థము త్యజింపబడి లక్ష్యార్థమగు ప్రత్యగాత్మ గ్రహింపబడుచున్నది.

(1) "నేను బలసియున్నాను లేక నేను ఘటమును గుర్తెరుగుచున్నాను" అను వాక్యమునందుస్థూలదేహమే నేననియును

(2) నేను సుఖిని లేక దుఃఖిని అనుచోట సూక్ష్మశరీరమే నేననియును

(3) సుషుప్తియందు నేనేమియు నెరుగను అనుచోట కారణశరీరమే నేననియును

(4) "నేనే బ్రహ్మమును" అను వాక్యమున మహాకారణశరీరమగు ప్రత్యగాత్మయే నేననియు చెప్పినట్లయినది. ఈ నాల్గు వాక్యములలో బలసియున్నాను లేక ఘటాదుల గుర్తెరుగుచున్నాను అని, యే నేను గుర్తించుచున్నానో, ఆ నేనే సుఖదుఃఖములకును సుషుప్తియందలి యజ్ఞానమునకును సాక్షినైవున్నానని ప్రత్యభిజ్ఞతచేత, ఏనేను వకటిగా గుర్తించితినో, అదియే అనువృత్తవస్తువు. ఘటపటాదులు, సుఖదుఃఖములు, జ్ఞానజ్ఞానములు వ్యావృత్తవస్తువులు. అట్లే,

స్థూల సూక్ష్మ కారణ శరీరములు జాగ్రత్స్వప్న సుషుప్తులు విశ్వ తైజస ప్రాజ్ఞులు, వ్యావృతవస్తువులు, కూటస్థాత్మయే యనువృత్తవస్తువు. అదియే త్వం పదలక్ష్యము.

సూర్యప్రకాశ మాకాశమందంతటను వ్యాపించి యున్నప్పటికిని భూత అద్దమునందు (lense) ప్రవేశించి దుర్నిరీక్షమైయుండి అగ్ని నుత్పత్తిచేసి యనర్థ కారణమైనట్లు ఆత్మ సర్వవ్యాపకమై యున్నప్పటికి, అహంకారముతో సంబంధించినపుడే, సంసార కారణముకల్గి అనర్థదాయకమగు చున్నది. అట్టి అనర్థదాయకమగు నీయహంకారమును త్రోసివేసి నిష్కళంకమగు ప్రత్యగాత్మను గుర్తెరుగవలసి యున్నది.

నేను నేను అను వ్యవహారమునకు ఆధారమెవ్వడో, అతడే ప్రత్యగాత్మ. సర్వేంద్రియ వ్యాపారమునకు నాధార భూతమగు జ్ఞానమెద్దిగలదో అదేనేను. ఈనేనే సర్వేంద్రియములను, వానివాని వ్యాపారములను సాధనాంతర సహాయము లేక ప్రకాశింపజేయును. ఈనేనే ప్రత్యగాత్మ, మనో బుద్ధ్యాదులనాశ్రయించి ప్రపంచమన్నది. అవి మగ్నత చెందిన సుషుప్తియందు ప్రపంచములేదు. జ్ఞానభిన్నమగు స్వరూపము ప్రపంచమునకారీతిగా లేద నిస్పష్టమగుటవల్ల జ్ఞానస్వరూపుడగు ప్రత్యగాత్మయే ప్రపంచమునకు సత్త ను·

గర్జించుచున్నాడు. అని విజ్ఞానవాదము. ఈ వాదమును శంకరాచార్యులవారు పూర్తిగా ఆమోదించకున్నను "ఏది లేకుంటే ప్రపంచమునుగుర్తింపవీలులేదో అదే ప్రత్యగాత్మ" అని "ఏదివుంటే ప్రపంచము ప్రకాశింపబడుతోందో అదే ప్రత్యగాత్మ యని అన్వయ వ్యతిరేకములచే ప్రత్యగాత్మను తెలియగలము ఆవిధంగా విజ్ఞానవాదముగూడ మనకాత్మ నిర్ణయముపట్ల తోడ్పడుచున్నది. సర్వచిత్తవృత్తులకు ప్రత్యగాత్మ సాక్షి స్వరూపుడగుటచేత, యింద్రియాదుల వికారములుగాని, సుఖదుఃఖాదులుగాని, మనోబుద్ధులకుగల సత్వరజస్తమో గుణాత్మకమగు ప్రకాశ (జ్ఞాన), ప్రవృత్తి, మోహములుగాని, యాతనికి గల్గవు. లోకమునగల ప్రకాశమంతయు ఆత్మ ప్రకాశమే అన్యప్రకాశములేని స్వప్నావస్థయందు, ఎవనిప్రకాశమువలన సర్వము గుర్తెరుగబడునో, అతడే ప్రత్యగాత్మ. జాగ్రదావస్థ యందువలె స్వప్నావస్థయందు ఆత్మకనేక ఆవరణములుండక బుద్ధ్యపాధి మాత్రముంటును. బుద్ధియందు వ్యాపించిన జ్ఞానశక్తిచే సర్వవిషయములు ప్రకాశించును. కనుక వివేకముచే బుద్ధిని వేరుచేసి చూచిన ఆత్మయొక్కడే శేషించును. పిండియును చక్కెరయును చేర్చి వండిన మిఠాయినుండి చక్కెరను వేరుచేయుట కష్టమేగాని వివేకదృష్టిచే మిఠాయిలోని తీపిమాత్రము

చక్కెరనియు మిగిలినది పిండియనియు గుర్తెరుగవచ్చును అట్లే, ఆత్మ జ్ఞానస్వరూపమును గనుక, స్వప్న పదార్థమును స్ఫురింపజేయు వస్తువు మాత్రము ఆత్మయనియు, దానిచే. ప్రకాశింపబడుచు వ్యవహరించునది బుద్ధియనియు, గ్రహింపనగును. సుషుప్తియవస్థను, విమర్శించినచో ప్రత్యగాత్మను గుర్తెరుగు టింకను సులభము. అప్పుడు అనగా సుషుప్త్యవస్థయందు యే యుపాధియులేక ఆత్మ ప్రకాశించును. "నేను సుఖముగ నిద్రించితిని." "అన్యమునెరుగను" అని మెలుకువ రాగానే చెప్పును. అనుభవములేక స్మృతియుండదు. గాన సుషుప్తియందుదు నిరుపాధితుడై జ్ఞానంద రూపములతో ఆత్మ ప్రకాశించుచుండునని చెప్పనొప్పును. మరియు అహంకార సాక్షి ప్రత్యగాత్మ: అహంకార ప్రతిబింబుడు (లేక విశిష్టుడులేక అవచ్ఛిన్నుడు) జీవుడు. అహంకారమాత్మకత్యంత సామీప్యమున నుండుటచే (దాసాను కుసుమ సమీపమున సట్ఫికమున్నపుడువలె) ఆత్మ ధర్మము లహంకారమందును, అహంకారధర్మము లాత్మయందును అన్యోన్యధ్యాస జెందుటచే అహంకారమే ఆత్మయేమోనని, భ్రాంతికల్గుచున్నది. కనుక యీఅహంకార విశిష్టమగు సోపాధికాత్మనుండి యుపాధియగు నహంకారమును వేరుచేసి, ప్రత్యగాత్మను గుర్తెరుగవలెను. ఈవిధమగు విచారముతోగూడిన అన్వయ

వ్యతిరేకయుక్తులను విమర్శించి త్వంపద లక్ష్యార్థమగు ప్రత్యగాత్మను గుర్తెరిగిన వానికే మహావాక్యమగు తత్త్వమసి, ప్రత్యగాత్మ స్వరూపుడవగు నీవే తత్పద లక్ష్యార్థమగు బ్రహ్మ స్వరూపుడవని, యుపదేశించినది.

త్వం పదలక్ష్యార్థమును పైవిమర్శచే యెట్లు సన్నిహితముగా గుర్తెరిగితిమో, అట్లే తత్పదలక్ష్యార్థమును గూడ శోధించి తెలిసికొనవలెను. నేత్రముగ్రహించు పదార్థమునకు సూర్యప్రకాశ మాధారమైయున్నది గదా? అట్లే సూర్యుని ప్రకాశింపజేయు స్వయంప్రకాశవస్తువున్న యొకటుండి తీరవలెను. అదియే చిత్స్వరూపము. అదియేపరబ్రహ్మము. ఏపదార్థమును గుర్తెరిగినయెడల రెండవపదార్థము లేకపోవుటచే మరియొకదానినిచూచుట, వినుట, మొదలగునవి లేకుండునో, అదియే పరబ్రహ్మము. ఆకాశమున్నది. వాయువున్నది. అను మొదలగువ్యవహారములచే సర్వపదార్థములు యున్నవని తెలియబడు సత్త (యునికి) ఆ బ్రహ్మమునకు స్వరూపము.

త్వం పదలక్ష్యార్థమైన ప్రత్యగాత్మయే, తత్ పద లక్ష్యార్థమైన బ్రహ్మము అని తత్త్వమసి మహావాక్యముపదేశించుచున్నది. అయితే యీ మహావాక్య శ్రవణమువల్ల అహం బ్రహ్మాస్మి అనుజ్ఞానముకల్గి యీ జ్ఞానము ముముక్షు

వునకేరీతిగా అవిద్యానివృత్తిచేయునో యించుక విమర్శింతము రజ్జువునందు భ్రాంతిచే తోచబడిన సర్పము రజ్జుజ్ఞానము కలుగుట కాధారమగుచున్నది. రజ్జుజ్ఞానము కల్గిన సమకాలమందే సర్పమను మిథ్యాజ్ఞానమునశించు చున్నది. ప్రకాశముగా గానవచ్చు సర్పమునుగూర్చి విచారించనియెడల, ఆ ప్రకాశ రూపములోనిజముగానున్న రజ్జుప్రతిపత్తి కలుగుటకే సావుకాశములేదుగదా? అట్లే అహంకారమునకు, లక్ష్యార్థమైన ప్రత్యగాత్మతో సంబంధము లేకున్నను, యా లక్ష్యార్థజ్ఞానముచే బాధింపబడునదైనను, తన కధిష్ఠానమైన ప్రత్యగాత్మకు లక్షణమైయున్నది. ఆరోపితమై ప్రకాశముగాతోచబడుచున్న యహంకారమును యనువదించనియెడల, అప్రకాశముగానున్న ప్రత్యగాత్మ స్వరూపము వాక్యముచే తెలియబడదు. "సర్పోరజ్జుః" (సర్పమే రజ్జువు) అనే వాక్యార్థములో, సర్పమును అనువదించుటచేతను సర్పమును బాధించుట చేతను, యేవిధంగా రజ్జుజ్ఞానము సిద్ధించుచున్నదో అట్లే "అహంబ్రహ్మ" అను జ్ఞానము అహంకారము ననువదించిబాదించుటచే తనే కల్గుచున్నది. ఈఅహంకారముకూటస్థాత్మయందు కల్పించబడినది గనుక యా ప్రత్యగాత్మజ్ఞానముకల్గిన సమకాలమునందే బాధనొంది నశించిపోవుచున్నది. భ్రాంతిసిద్ధములగు అయదార్థవస్తువులు అందుకు

సంబంధించిన యదార్థవస్తుజ్ఞానముచే నశించుట "బాధ" యనబడును. కనుక యీ అహంకార మెందునూ లయము కానూకాదు. ఎచ్చటకునుతొలగనూ తొలగను. కాష్టాదుల ధ్వంసముకాబడు యదార్థఘటాది వస్తువులు నశించి. కారణ స్వరూపంతో నిలచును. కాని ఆరోపిత పదార్థములు మాత్రము తమ యధిష్టాన భూతములగు పదార్థములను మరియొక విధముగా భాసింపజేయుటయే స్వరూపముగాగలవైయున్నం దున, యదార్థజ్ఞానముకల్గిచి, యా తత్సమకాలమునందే యవి బాధనొందును. అట్లే కూటస్థాత్మకు ఉపలక్షణమైన యహంకారము, లక్ష్యస్వరూపజ్ఞానమును గల్గించి, యా సమ కాలమునందేతానుబాధింపబడును. ముముక్షువు అహంబ్రహ్మా స్మియును అఖండైకరసమైనపరబ్రహ్మమును అహంకారము నవలంబించియే తెలిసికొనును. అహంకాధీరముకానుబాంప బడియే బ్రహ్మస్వరూప ప్రతిపత్తికికారణమగుచున్నది. అందు చేత బుద్ధిసహిత చిదాభానునికి బ్రహ్మతో బాధ సమానాధి క రణము మాత్రమే. అయితే జీవత్వమున కథిష్ఠానమగు కూట స్థునికి మాత్రము బ్రహ్మతోముఖ్యసమానాధికరణము కలదు.

దేహాది విలక్షణమైన స్వస్వరూపమును నిర్ణయించుట కొరకు తత్వమసి వాక్యమపేక్షింప బడుచున్నది. నేతి, నేతి యని యెన్ని వస్తువులెర్గి వానిని నిరసించినప్పటికి యదార్థ

అన్ను వస్తునిశ్చయ జ్ఞానము కల్గినట్లుకాదు కదా! కేవల వివేకజ్ఞానము చేతనే మోక్షము కలుగదాయనుచో, కలుగ దనియే చెప్పి తీరవలెను. ఏలనన ఆత్మానాత్మ లత్యంతభిన్న ములనియు అవిపరస్పరమొకదానియందు మరొకటిలేదనియు నెరిగినవివేకజ్ఞానము స్వరూపజ్ఞానముకాదు. అందుచేవాక్యార్థ జ్ఞానమువలె యిది పరమార్థ జ్ఞానముగాక కేవలభ్రాంతి జ్ఞానము మాత్రమే అయివున్నది. యిదిగాక వివేకజ్ఞాని, ఆత్మానాత్మల భేదదృష్టితోనే నిలచియుండును. అభేదదృష్టి లేనిచో సంసారము నివర్తింపజాలదు. అఖండైకరస బ్రహ్మ స్వరూపము అపరోక్షము గాజాలదు. కనుక మహావాక్యము అవిద్యానివృత్తి కవసరమైయున్నది. అయితే ఆత్మానాత్మ విచారణచే దేహాదులులాత్మకాదని నిరసించి, వానికివిలక్షణమై వానికి సాక్షియైయున్న ప్రత్యగాత్మను తెలిసికొని, పిమ్మట మహావాక్యార్థజన్య జ్ఞానమువలనప్రత్యగ్బ్రహ్మైక్యస్థితినెరుం గుట క్రమమైయున్నది.

వాక్యములన్నియు మిథ్యయే. మహావాక్యములున్ను మిథ్యయే కాగా, అట్టిమిథ్యావాక్యము చేవాస్తవపరబ్రహ్మార్థ జ్ఞానమెట్లు సిద్ధించునని యొకశంక జనియించుచున్నది. అసత్యమైన ప్రతిబింబము బింబజ్ఞానము కల్గించుటలేదా? మరియు అసత్యములైస్వప్నమునదోచు వ్యాఘ్రశర్పాదులు

సత్యమైన భయకంపాదులను కలిగించుటలేదా? అంతేగాక స్వప్నమునవచ్చిన వ్యాఘ్రమును స్వప్నమందుగల ఆయుధముల చేతనే వధింపనగును గదా! అట్లే మిధ్యారూప జగత్తునందలి జలమును సేకరించుటకై మిథ్యాకార్యముగు కల్పితమగు ఘటాదులుపయోగపడుటలేదా? కనుక విషయ సత్తాకములగు పదార్థములు అన్యోన్య బాధకములు గాజాలవు. అందుచే మిథ్యా సంసారము మిథ్యా వాక్యార్థజ్ఞానము చేతనే నశించును అనుట సిద్ధించుచున్నది.

మహావాక్యముయొక్క శ్రవణ మనననిధి ధ్యాసలచే తత్వజ్ఞానోత్పత్తికి ప్రతిబంధకములగు అజ్ఞాన, అసంభావనా, విపరీతభావనలు నశించును. అట్లే ప్రసంఖ్యానము వలన (అనగా ఆవృత్తి లేక జపమువలన) చిత్తైకాగ్రత మాత్రము సిద్ధించును. మరియు ప్రతిబంధములునశించును. కానిశ్రవణ మనన, నిధిధ్యాసల వల్లను, ప్రసంఖ్యానము వల్లను, సమ్యక్ జ్ఞానము సిద్ధింపజాలదు. సాధన చతుష్టయ సంపత్తి గల్గి అధికారియై, అమానిత్వము, అదంభిత్వము, అద్వేష్టృత్వము, సర్వభూత మైత్రి మొదలగు గుణములుగల వానికే తత్వం పదార్థ వివేచనచే తత్వజ్ఞాన ముదయించునని యందురు. మరియును, ఈశ్వర కృపా=(సద్గురు ప్రాప్తి) (2) వేదకృప = శాస్త్రార్థధారణాశక్తి (3) గురుకృప=శాస్త్రానుగుణ్య

మును స్వానుభవానుసారమును యగు యదార్థోపదేశము (4) స్వాంతఃకరణకృప (అనగా) సాస్త్ర వచనానుసారముగ సాధనములను సంపాదించుట' అను నాల్గుకృపలున్నూ అత్యంతావసరములు.

ఇక మిగతా మూడు మహావాక్యార్థములను క్లుప్తంగా తెలిసికొందము. జ్ఞానేంద్రియాములద్వారా బహిర్గతమగు అంతఃకరణ వృత్తితోగూడిన ఏజ్ఞానంచేత పురుషుడు రూపాదులను చూచునో, శబ్దములను వినునో, గంధము నాఘ్రాణించునో, రసము గ్రహించునో, అటులే దేహములోపలనున్న అంతఃకరణమును, వాని వృత్తులను, ప్రాణాదులను, ప్రాణధర్మాలైనక్షుత్పిపాసాదులను మిగతా అన్నింటిని'సాక్షిరూపమైన యే జ్ఞానంచే యెరుగుచున్నాడో, అజ్ఞానము ప్రజ్ఞాన పదానకు లక్ష్యార్థము. అంతఃకరణమున్నూ, దాని వృత్తులున్నూ, దేహేంద్రియాదులునూ, త్యజించి లక్ష్యార్థముచే సాక్షిరూపజ్ఞానమే గ్రహించవలెను. పిపీలికాది బ్రహ్మ పర్యంతముగల దేవ మనుష్య తిర్యగ్జంతువులయొక్క సకలోపాధులయందును, యే అద్వితీయచైతన్య మనుస్యూతమైయున్నదో,అదియే బ్రహ్మము. సకలోపాధులున్నూ భాగత్యాగ లక్షణచే త్రోసివేయగా శేషించిన చైతన్యమే నాయందును మిగతా జీవులయందునూ యున్నది. అదియే

ప్రజ్ఞానము కనుక ప్రజ్ఞానమన్నా, చైతన్యమన్నా, బ్రహ్మ మన్నా, ఆత్మయన్నా పేర్లు మాత్రమే వేరుకాని వస్తువు మాత్రము ఒకటేయని నిశ్చయించుకొనవలెను. ఇదియే ప్రజ్ఞానం బ్రహ్మ అను ఋగ్వేదమునందలి ఐతరేయో పనిషత్తులోని మహా వాక్యమునకు లక్ష్యార్థము.

యజుర్వేదీయ బృహదారణ్యక మందలి అహం బ్రహ్మాస్మియను మహావాక్యమునగల "అహం" "బ్రహ్మ" "అస్మి" అను మూడు పదములలోను "అహం" అను పదము ముఖ్య వృత్తిచే జడమైన అహంకారమును, గౌణవృత్తి చేతను లక్షణావృత్తిచేతను, బుద్ధికిసాక్షిగావుండి "నేను" "నేను" అని స్ఫురించు ప్రత్యగాత్మను, సూచింపుచున్నదని యిదివరకే గమనించితిమి. వాచ్యార్థమైన జడమగు అహంకారమును త్రోసివేసి లక్షణావృత్తిచే కూటస్థ చైతన్యమునే గ్రహించ వలసివున్నది. స్వతఃపూర్ణమైయున్న పరమాత్మయే బ్రహ్మ మను పదమునకు లక్ష్యార్థము, బుద్ధివృత్తులకెల్లను సాక్షియై యుండు కూటస్థాత్మయగు నేనే బ్రహ్మమును "అస్మి" అనగా అయితిని అని "అహం బ్రహ్మాస్మి" యను మహావాక్యము నకు లక్ష్యార్థము.

అథర్వణవేదీయ మాండూక్యోపనిషత్తు నందలి "అయమాత్మబ్రహ్మ" యను మహావాక్యము నందలి అయం

ఆత్మ అను రెండు పదములను అన్వయ వ్యతిరేక యుక్తులచే పదపదార్థముల విమర్శించినమీదట త్వంపదలక్ష్యార్థమగు ప్రత్యగాత్మ అపరోక్షమగును. అదియే "అయం" అని చెప్పుటకు యోగ్యమైయున్నది. కనుక దేహేంద్రియ ప్రాణ మనోహంకారము లన్నిటికంటె విలక్షణమై సర్వాధారమై స్వయం ప్రకాశమై సర్వమును గుర్తెరుగు ప్రత్యగాత్మయే అయం శబ్దలక్ష్యార్థమై యున్నది. ఆవిధంగా యీ ఆత్మయే బ్రహ్మము అని యర్థము సిద్ధించుచున్నది.

ఈనాల్గుమహావాక్యములున్నూ లక్ష్యార్థముచే ప్రత్యగ్బ్రహ్మైక్యము నే ప్రతిపాదించుచున్నవి. కాని సర్వ వేదాంత శాస్త్రములు తత్వమసివాక్యము నే విపులముగా చర్చించినవి గాని మిగత మూడు వాక్యములను అంతగా విమర్శించక పోవుటకు కారణమేమనగా "తత్వమసి" వాక్యము గురూపదేశ వాక్యమైయున్నది. మిగతామూడున్నూ శిష్యానుభవ వాక్యములైయున్నవి. మహావాక్యములను 'ప్రజ్ఞానంబ్రహ్మ' తత్వమసి "అయమాత్మబ్రహ్మ" అను క్రమములోనే సర్వులును చెప్పుట పరిపాటి అయినది, ఋగ్యజుస్సామాథర్వణ వేదములనుండి యీమహా వాక్యములు గైకొనబడుటచే, యీ వేదక్రమములో నేమహావాక్యములున్ను చెప్పబడియుండ వచ్చును. కాని "తత్వమసి" (నీవేబ్రహ్మమయితివి) యని

గురుముఖతః మహావాక్యమును శ్రవణముచేసిన శిష్యుడు తానువిన్న విషయమును ఏరీతిగా మననము చేయవలెను? "అహంబ్రహ్మాస్మి" (నేనే బ్రహ్మనై యున్నానా లేదా?) అనియే మననము చేయవలెనుగదా! కొంతకాలమట్లు మనన ముచేయగా తనయందు అహం ప్రత్యయ రూపముగనున్న యీ ప్రత్యక్చైతన్యము మిగతా జీవోపాధులయందును ఆకాశాది భూతములయందునూ మాత్రముండదా? వుండి తీరును. కనుక ప్రజ్ఞానస్వరూపంగా తనయందునూ నిఖిల భూతముల యందునూ వెలుగొందు చైతన్యమే బ్రహ్మము యను జ్ఞానోదయమగుచున్నది. అదియే ప్రజ్ఞానం బ్రహ్మ అను వాక్యముచే సూచింపబడినది. "అహంబ్రహ్మాస్మి" అను మహావాక్య మననముచే "ప్రజ్ఞానంబ్రహ్మ" అను అనుభవము కలుగుచున్నది. "ప్రజ్ఞానంబ్రహ్మ" యనినిధిధ్యాస చేయగా చేయగా శిష్యునికి "అయామాత్మబ్రహ్మ" (ఈ యాత్మయే బ్రహ్మము) అనిఅపరోక్షజ్ఞానము సిద్ధించుచున్నది. అందుచే "అయమాత్మా బ్రహ్మ" దర్శన వాక్యము (సాక్షాత్కార వాక్యము) ను, 'తత్వమసి' యుపదేశ వాక్యమును (అనగా శ్రవణవాక్యము) "అహంబ్రహ్మాస్మి" మనన వాక్యమును "ప్రజ్ఞానంబ్రహ్మ" నిధిధ్యాస వాక్యమును అయి వున్నవి. శ్రుతి:- ఆత్మా వారేదష్టవ్య శ్రోతవ్యో, మంతవ్యో, నిధి ధ్యాసితవ్యః" అను వాక్యము విధివాక్యములలో పేర్కొ

నబడినది. ఆత్మయే చూడదగినది. వినదగినది. మనననిధిధ్యా సలు చేయదగినవి అని యీవాక్యము విధించుచున్నది. కనుక తత్వమసి, అహం బ్రహ్మాస్మి, ప్రజ్ఞానం బ్రహ్మ, అయమాత్మ బ్రహ్మ అను క్రమము ననుసరించుటయే సాధకుని దృష్ట్యా సమంజసమై యున్నది.

ఈమహావాక్య విచారణవల్ల జ్ఞేయబ్రహ్మముయొక్క స్వరూప మపరోక్షమై తానే యా బ్రహ్మస్వరూపుడనను యఖండజ్ఞానము (శ్రవణ మనన నిధిధ్యాసలరీత్యా) జిజ్ఞాసికి సిద్ధించుచున్నది. కాని జ్ఞాతృ, జ్ఞాన జ్ఞేయరూప త్రిపుటి కతీతమై మనోవాగగోచరమై "యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ" యని యుపనిషత్తులుగూడ మౌనము వహించిన, యా నిష్ప్రతియోగిక పరమసత్య స్వయంసార మగు పరిపూర్ణపరబ్రహ్మము మాత్ర మీ విచారణకు దూర మయ్యే వున్నది.

—()o()—

# పరిపూర్ణదర్శనము

## అద్వైతమందలి అసామాన్యోపదేశ ప్రకరణము

గడచిన ప్రకరణములలో అద్వైత స్వరూపమును, మరియు ఆ అద్వైతమును అనగా ఏకత్వమును నిరూపించి, ప్రత్యగ్బ్రహ్మైక్యమును సాధించుటకై మహావాక్యముల కేరీతిగా నన్వయము చేకూర్చబడినదో గమనించితిమి. అద్వైతమత ప్రతిష్ఠాపనాచార్యులగు ఆదిశంకరుల గ్రంథములు మహావాక్యార్థ ప్రతిపాదనతో సమాప్తియగుచూ వచ్చినవి. కారణము? నాటి బౌద్ధవాదము ఆత్మబ్రహ్మల యాస్తికక్యతనునిరాకరించి, సంఘమునందొక యరాచకస్థితిని తెచ్చిపెట్టిప్రజలకుపాపభీతినిలేకుండాచేయుటయే! "ప్రత్యక్ష ప్రమాణమే అంగీకారముగాని యితర ప్రమాణములను మే మంగీకరింపము. ఆత్మబ్రహ్మల కునికియే వున్నచో వానిని ప్రత్యక్షముగా చూపవలెను" అని, బౌద్ధులు సవాలు చేయుచూ వచ్చిరి. ఆత్మబ్రహ్మల యునికిని యొకవిధముగ ప్రత్యక్షముగానిరూపించినచో శంకరులపని తీరినట్లే. కనుకనే తత్వమస్యాది మహావాక్యార్థములచే బ్రహ్మ పరోక్షజ్ఞానము కల్గించుటయే వారి పరమావధి. అందుచేతనే వారి రచనలన్నియు మహావాక్య విచారణతో పరిసమాప్తి చెందినవి.

కాని వారిమతానుయాయుల తత్వమీమాంస అంతటితో నాగలేదు. అందు సురేశ్వరులు గురువును మించిన

శిష్యులై శాంకర సిద్ధాంతమును యింకనూ విస్తృతపర చుచూ వివరణ గ్రంధములు రచించిరి. యీ వివరణ గ్రంధ ములకే వృత్తియను నామాంతరము కూడ కలదు. సురేశ్వరు లకు వార్తిక కారులని పేరుగూడ ప్రసిద్ధికెక్కెను.

వార్తికమనగా వృత్తి అనగా మూలగ్రంధస్త విషయ ములను విశదపరచి విపులీకరించు గ్రంధమునకు వార్తిక మని పేరు. ఆ గ్రంధకర్తను వార్తిక కారుడని అందురు. ఒకే మూలగ్రంధమునకు అనేక భాష్యములు, లేక వివరణ ములు లేక వృత్తులు వుండవచ్చును. లేక అనేక గ్రంధము లకు వివిధములగు వృత్తులున్నూ యుండవచ్చును. కాని యీ అతీతాద్వైత సిద్ధాంత సూత్రము లాయా వివరణ గ్రంధములన్నిటియందునూ గానరాకపోవచ్చును. ఐనను వార్తిక కారుడని ప్రసిద్ధిగాంచిన సురేశ్వరాచార్యులు రచిం చిన జీవన్ముక్తి ప్రకాశిక అను గ్రంధములో, శ్లో॥ నైష్క ర్మ్యేణ నతస్యార్థో తస్యార్థోఽస్తి తత్కర్మభిః । నసమాధాన జప్యాభ్యాం యస్యనిర్వాసనం మనః॥ అను శ్లోకతాత్పర్యము గమనించ దగును. తాత్పర్యము:- ఎవనిమనస్సు నిర్వాస నమైయుండునో, అతనికి కర్మ సన్యాసముతోగాని, తదనుష్ఠా నంతోగాని సమాధితోగాని, మంత్ర జపంతోగాని, కొంచ మైనా ప్రయోజనం లేదు.

కనుక యీశ్లోకము "నిర్వాసనా మౌనముద్రానిష్ఠా" అను స్థితిని సూచించుచున్న దనవచ్చును.

ఈ నిర్వాసనా మౌనముద్రా నిష్ఠాస్థితి ప్రతిపాదించు గ్రంథమునకు వేదాంత వార్తికమని పేరు. కనుక యీ గ్రంథము ఏ అద్వైత మూలగ్రంథమునకున్ను వివరణరూప గ్రంథము కాకపోయినను మొత్తము వేదాంతమునకే (బ్రహ్మవిద్య కంతటికి) యిది వార్తికము అనగా వివరణ గ్రంథము అయివున్నదని అనవచ్చును. యిది అద్వైతము నందు సామాన్యభావమును వివరించి విమర్శించి అతీతాను భవ ప్రాప్తిగల్గించునందురు. పరమానంద యతీంద్రుడను పేరుగలయోగి (ఈయన ఏకాలమువాడో తెలియదు) అద్వైత ముక్తాకలాపము వేదాంత వార్తికము అను పేరుతో 1912 సం॥రంలో, చెన్నపట్టణం శ్రీలక్ష్మీనృసింహ విలాస ముద్రాక్షరశాల యందు ముద్రించి యున్నారు. యీ గ్రంథమునందు, తారక సాంఖ్యామనస్కములు, కర్మ, భక్తి, జ్ఞాన మార్గములు తెలియపరచుచూ చివరకు యీ అతీత సిద్ధాంతమును 5 పేజీలలో మాత్రం స్వల్పముగ వివరించి యున్నారు. యిది దత్తాత్రేయ, దక్షిణామూర్తి, సనకాదుల మార్గమని గ్రంథకర్త పేర్కొనుటయేగాక శుకసప్త గీతాసహస్రిక అను గ్రంథమొకటి యున్నట్లు వ్రాసినారు.

కాని ఆ గ్రంథమెందేని లభ్యమగునేమో తెలియకున్నది. పైన వుదహరించిన వేదాంత వార్తిక గ్రంథమునకు చివర గ్రంథకర్త వ్రాసుకొన్న "కం॥ పరమానంద యతీంద్ర స్థిర దత్తాత్రేయ యోగి శిష్యుడి, యోగస్ఫురణానుభవుడ, నీ కృతి సరసముగ రచించినాడ సర్వజ్ఞుడనై॥" అను పద్యమును బట్టి అయన దత్తాత్రేయ సాంప్రదాయకుడని అనుకోవచ్చును.

యీ వేదాంత వార్తిక గ్రధమునందు శ్లో॥ విద్యాంతం, బ్రహ్మవిద్యాంతం, వార్తికాంతమ గోచరం సాంప్రదాయ రహస్యంతం, మౌనం నిర్వాసనంహితత్॥ అను శ్లోకమొకటున్నది. తా॥విద్యాంతమనగా 64విద్యలు, బ్రహ్మవిద్యాంత మనగా వేదముల యొక్క అంత్యమందు గల వేదాంతము. యీ రెంటి యొక్క సంపూర్ణత్వమువందు యున్న వార్తికము తెలియబడనిది. సాంప్రదాయ రహస్యమైనది. అది నిర్వాసనా మౌనమని చెప్పబడినది. దీనికే,అఖండ బ్రహ్మకారవృత్తి అనీ, బ్రహ్మవిద్వరిష్ఠ బ్రాహ్మిస్థితి అని కొందరందురు అద్వైత సిద్ధాంతమును కేవలము శ్రవణ మాత్రంగా నవగతము చేసికొని యూరకొన్నవారవలె గాక, ఏతత్సిద్ధాంతలక్ష్యమునుసాధించి. అరూఢత చెంద వలెననువార్కి ఉపదేశ రూపముగా గురువులు బోధించి

వారిచే ఆచరింపచేసి అద్వైత్వసిద్ధి కల్గించుటయు కలదు. ఈ ఉపదేశ క్రమము అధికారి తారతమ్యము ననుసరించి సామాన్యోపదేశము అనియు అసామాన్యోపదేశ మనియు రెండు విధములు.

అద్వైతుల సామాన్యోపదేశ విధానము

సమస్త గ్రంథస్థ విషయములను అటుంచి అనుభవ రూపముగా శిష్యునికి బ్రహ్మ పదార్థమును తెలియచేయు విధానము, ఉపదేశపద్ధతియందే సాధ్యము. ప్రతి ఒక్కనికి అత్యంత సన్నిహితమైన వస్తువు తన స్థూలదేహమేకనుక స్థూలదేహముతో విచారణ ప్రారంభమగును. పిండ బ్రహ్మాండములయందున్న నామరూపాత్మకమగు సమస్త జడపదార్థములను నిషేధిస్తూ, అనగా యిది ఆత్మ కాదు. యిదికాదు, యిదికాదు అని ఒక్కటొక్కటియే నిరసించుచూ రాగా చివరకు ఆత్మవస్తువు శేషించును.

ఎట్లనగా ప్రత్యక్షముగా నశించు స్వభావముగల యీ స్థూలదేహము జడము. దేహమును చూచునవి కన్నులు. గోళకములైన కన్నులు మరణ దేహమునకున్ను గలవు. కాని దృశ్యములను చూడజాలవు.కనుక గోళకములద్వారా చూచునది మరియొకటుండవలెను. అది ఏది? చక్షురింద్రియము. ఇది లేనిచో చక్రములవలె కన్నులున్ననూ నిరర్థ

కనే గదా! అయితే పుట్టంధుడుకూడా ఏదోవిధముగా ప్రాపంచక వ్యవహారములు జరుపుకొనుచున్నాడు వస్తువులను గుర్తించుచున్నాడు. కనుక చక్షురింద్రియముగాని, అట్లే మిగతా యింద్రియములుగాని ఆత్మకాదు. సర్వేంద్రియముల ద్వారాను బహిర్గతమై శబ్దాది విషయములను గుర్తించునది. అంతఃకరణ ప్రకాశము. సుషుప్తియందీ అంతఃకరణము సహితము అవిద్యయందు మరుపుయాపము చెందుచున్నది. కాని ఏది నిద్రించినా తాను నిద్రించక ఉఛ్వాస నిశ్వాస రూపముగా ప్రాణము మాత్రము ఒక యంత్రమువలె పని చేయుచున్నది. ఈ యంత్రమునకు సత్తా యిచ్చుచూ పని చేయునదియేది? అదియే ఆత్మ, లేక ద్రష్ట అనగా చూచువాడు. యితరేంద్రియములద్వారా వ్యవహరించునపుడాతడే, శ్రోత, మంత, యిత్యాది యితరనామములను చెందుచున్నాడు, ఏ యింద్రియముద్వారా ఏ విషయమును తెలుసుకొనుచున్నప్పటికీ మొత్తముమీద అన్నిటిని తెలుసుకొనువాడితడే గనుక యితనిని ఒక్కమాటలో "జ్ఞాత" అని పిలువదగును. లేక వ్యక్తిభావన విడచినచో యితనినే దృక్ అని పిలువనగును. ఆపుడు "దృక్" చే తెలియబడు దానికి దృశ్యము అని పేరిడిరి.

శ్లో॥ దృగ్దృశ్యౌద్వౌపదార్థౌ తా పరస్పర విలక్షణౌ

దృగ్బ్రహ్మ దృశ్యంమాయేతి సర్వ వేదాంతనిశ్చయః॥

తా॥ దృక్కు, దృశ్యము అనే రెండు పదార్థములు. అవి రెండూ పరస్పర భిన్నములై యున్నవి. అందు దృక్కు బ్రహ్మము, దృశ్యం మాయ, అని వేదాంతము నిశ్చయించుచున్నది.

దృక్కే బ్రహ్మమనుట ఏట్లు? దృక్కు అశాశ్వతము శాశ్వతముఅని రెండు విధములు. నేత్ర శ్రోత్రాదులద్వారా విషయగ్రహణచేయునది అశాశ్వత దృక్కు. యిది అంతఃకరణపరిణామమునకు లోబడి జ్ఞానేంద్రియములద్వారా విషయ పంచకము నెరిగి నానాత్వముచెంది బంధకారణమగుచున్నది. పిండ బ్రహ్మాండముల యుత్పత్తిస్థితి నాశనములను చక్కగావిచారించి, వ్యష్టిసమిష్టులయందు, శరీరత్రయ, అవస్థాత్రయ, అభిమానత్రయములనెరిగి, ఈ అన్నిటియందునూ అనువృత్త స్వరూపుడుగా తానేయున్నానని గ్రహించి, యింద్రియములు తన్ను ప్రకాశింపచేయజాలవని, ఆయా యిందిర్రియములనే గాక సూర్యచంద్రాగ్నులను సహితము ప్రకాశింపజేయుస్వయం ప్రకాశమూర్తియే తానని, గుర్తించు తెలివియే శాశ్వత దృక్కు.

"తమేవ భాంతమను భాతిసరం తస్యభాసాస్సర్వమిదం విభాతి"॥

తా॥ అదియే స్వయం ప్రకాశమగు వస్తువు. దాని ప్రకాశములోనే యీ సర్వమూ ప్రకాశించుచున్నది.

సర్వజీవ వ్యవహారమునకునూ స్థూలదేహ మాధారముగా యున్నదేగాని

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహు, రింద్రియేభ్యః పరంమనః,
మనసస్తు పరోబుద్ధి. ర్యోబుద్ధి పరతస్తుసః ॥భ॥గీ॥ 3-42

తా॥స్థూలదేహముకంటె యింద్రియములు, యింద్రియములకంటె మనస్సును, మనస్సుకంటె బుద్ధియును, బుద్ధికంటె ఆత్మయునూ వుత్తరోత్తర గొప్పవై అతీతముగా యున్నవి.

ఇక్కడ బుద్ధికికూడ ఆత్మపరమని చెప్పుటలో నేను నాదియని అహంకరించు అహంకారమున్ను, అంతఃకరణమున్ను, అందలి చిదాభాసుడున్నకూడ, ఆత్మకాదు అని చెప్పినట్లేనని గ్రహించనగును. మరియు పిండమందేగాక బాహ్యమందు గల బ్రహ్మాండమందు తెలియబడు సమస్తము నాచే తెలియబడుచున్నది. గనుక అవి ఏమియు నేనుగాను. "ద్రష్టుర్ యోగ్యం దృశ్యం" కనుక అవి అన్నియునాచే చూడదగిన దృశ్యములు మాత్రమే కనుక అవి నేనుగావు. "యద్దృశ్యం తన్నశం" కనుక అవి అన్నియు నశ్వరములు. నేనో? వానియన్నిటినాశమునకుగూడ నేనుసాక్షినై యున్నా నేను శాశ్వతుడను. దృశ్యములు మారుచున్నవి. కాని

దృశ్యరూపుడనగు నేను మారుటలేదు. ఖండ ఖండములుగా నేను తోచబడుచున్నానేగాని నిజముగా సాశ్వరూప మఖండమే. దృశ్యములనేకములుగాని ద్రిష్టలేక దృక్కుమాత్రము ఏకరూపము. సకల దృశ్యములకు నేను ద్రిష్టగా, సాక్షిగానున్నానేగాని నాకు మరొక సాక్షిలేడు నన్ను గుర్తించునది తెలిసికొనునది మరొకటిలేదు. నాతో సమానమైనదిగాని నాకంటె అధికమైనది గాని మరొకటిలేదు, అన్నియు నాకంటె హీనములే. నాయందేఅవియున్నవి. అవి అన్నియు నీయంశములుమాత్రిమే కనుకనన్నవి ప్రికాశింపజేయలేవు. మిణుగురుపురు గెన్నడైన సూర్యుని ప్రికాశింపచేయజాలునా? మరియును దీపముచే ప్రికాశింపబడు వస్తువులు దీపమునె ప్రికాశింపచేయగలవా? దృష్ట యెన్నడైన దృశ్యముచేత చూడబడునా? అంతేగాక ప్రిమాణములకు పూర్వమే వునికి గల్గి ప్రిమాణములనుకూడ ప్రికాశింపచేయు ఆత్మస్వరూపుడనగు నేను ప్రిమాణగమ్యముడను కాగలనా? (చక్షులాదీంద్రియములద్వారా విషయములను గుర్తించు అంతఃకరణవృత్తులే ప్రిమాణములనబడును.)

సర్వేంద్రియములద్వారా విషయ గ్రిహణ చేయు అంతఃకరణము ఆ యింద్రియములకు ద్రిష్టగా చెప్పబడినది గాని అ అంతఃకరణమునకు కూడ నేనే ద్రిష్టను. అతఃకరణ

సాక్షిని గూడ నైయున్నాను కనుక నేనే సర్వసాక్షిని నాకు మరొకసాక్షి యున్నాడని చెప్పునెడల ఆ సాక్షికి మరొకసాక్షి, ఆ మరొక సాక్షి కింకొక సాక్షి చెప్పవలసి వచ్చుటచే అనవస్థాదోషము సిద్ధించును. కనుగ నాయునికినీ సర్వరూపమునూ గూడ తెలుసుకొనువాడను నేనే. ఆకాశము వలె సర్వత్రా బాహ్యాభ్యంతరములయందు నేనే యున్నాను గాని ఆ ప్రపంచ వికారములేవియు నన్ను బాధింపవు, నేనే సచ్చిదానంద స్వరూపుడను. "సఏషనేతినేత్యాత్మా" అను శృత్యానుసారముగా మూర్తామూర్తములన్నిటిని సర్వనిషేధావధి రూపముగా "నేతి" "నేతి" అని నిషేధించుచూపోగా, చిన్మాత్రముగా ఏ జ్ఞానము శేషించునో అదియే దృక్ స్వరూపముగా నిర్ణయించి "దృగ్బ్రహ్మ" అని యన్నారు.

"దృశ్యంమాయ" ఇంతప్రత్యక్షముగా గోచరించుచూ, మానవుని సుఖదుఃఖాదులకు కారణమైన దృశ్యరూప ప్రపంచమంతయు మాయయని ఎట్లు విశ్వసించవచ్చును? శబ్ద స్పర్శాది గుణములతోగూడిన వస్తుసముదాయము శబ్దాది పంచవిషయములు, వానిని గుర్తించే సాధనములైన యింద్రియములు (జ్ఞానేంద్రియములు) శరీరములను ధరించి భరించు ప్రాణపంచకము, యింద్రియములద్వారా బహిర్గతమై, వస్తు సముదాయమును ప్రకాశింపచేయు అంతఃకరణ ప్రకాశము,

యీ అన్నింటినీ "నేను" "నాది" అని అభిమానించు అహంకారము, ఇవన్నియు దృశ్యములే, యిదియేగాక నాకన్యమై బ్రహ్మాండము నందుండి దానిని ధరించి భరించు సమిష్టి ప్రాణము, సూర్యచంద్ర నవగ్రహనక్షత్రాదులు, పంచభూతములు, యివన్నియు నాచేగుర్తించబడి దర్శించబడుచూ వున్నందున "దృష్టుర్ యోగ్యం దృశ్యం" అనేన్యాయంగా దృశ్యకోటిలోచేరిపోవుచున్నవి. యివన్నియు మాయయేనా? అంటే, సృష్టి సృష్టికానేలేదు, సృష్టిలేనేలేదు, ఉన్నట్లు తోచబడుట మాత్రమే, అందురు. దీనికే వివర్తవాదమని పేరు వివర్తమనగా, యదార్థమై నిలచియున్న ఒక వస్తువు నందు యెట్టి మార్పున్ను కలుగకున్నప్పటికీ తానుగా నట్టిమరొక వస్తువుగా భాసించుట, వివర్తమనబడును. త్రాటియందు పాము, ముత్యపుచిప్పయందువెండి, నిజముగా యెన్నడును లేకపోయినప్పటికిన్ని, ఒకప్పుడు తోచబడినట్లే బ్రహ్మమునందు ఏకాలమునందునూ లేని యీ ప్రపంచము తోచబడినదని చెప్పెదరు. విచారణాప్రారంభకాలమునందు, ఆరోపించి వాదనార్థము జగత్తును అంగీకరించి చివరకు జగత్తు లేనేలేదని స్థిరపరతురు. యిదియే అధ్యారోపాపవాద మనబడును. జగత్తునందుతోచెడి సకల పదార్థములు ఏకదేశీయములు, మితపరిమాణములు, క్షణికములు, అనృత

జడదుఃఖ స్వరూపములు, నామరూపపాత్మకములు అయి వున్నందున యివి, పారమార్థికముగ లేనివే గనుక మిథ్య. "యామాసామాయ" అనునిర్వచనానుసారందృశ్యంమాయేతి అనిచెప్పబడినది. ఐతే మూర్తామూర్తములన్ని పరబ్రహ్మమే అను (1) "సర్వంఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంతవుపాసీత" తా॥ దేనినుంచి సృష్ట్యాదులుగలిగెనో ఆ బ్రహ్మయే యీ సమస్తమును అయివున్నది. (2) "నేహనానాస్తికించన" = నానాత్వము లేనేలేదు. (బృహ. 4-4-19) (3) "బ్రహ్మణోన్యం నకించన"= బ్రహ్మము వినాగా మరొకటి కొంచమైన లేదు. (4) "నాన్యొ౽తోస్తిదృష్టా" = దృష్టకు అన్యముగా మరొకటి లేదు. (5) "యద్యద్పశ్యతి చక్షుభ్యాం తత్తదాత్మేతి నిశ్చయా, యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాంతత్త దాత్మేతి నిశ్చయా—" యీ శ్రుతిమాట ఏమి ?

"మీయతే అనేనయితిమాయ" = మితిలోనికి తెచ్చునది మాయ, యను నిర్వచనానుసారంగామాత్రమే పైనవ్రాయ బడిన 1, 2, 3, 4, 5, శ్రుతులను సమన్వయింపనగును. ఎట్లనగా సర్వమును బ్రహ్మస్వరూపమే అయివున్నపుడు, ప్రతీతి అగుచున్న అన్యవస్తువుల నామరూపములుమాత్రము పారమార్థికములుగాలేవు, అని అనవలసివున్నది. యామా సామాయ అనగా ఏది లేనిచో అదిమాయ అన్నపుడు నామ

రూపాలకే ఆ మాయాశబ్దము వర్తించును.

"మీయతే అనేన యితిమాయ" అని నిర్వచించినప్పుడు, మితిలోనికి తేబడిన బ్రహ్మముమాత్రమే వస్తువుగా భాసించుచున్నది. వస్తువు మిథ్యగాదు, అది బ్రహ్మమే. కాని దాని నామరూపాలు మాత్రము సత్యమని యనరాదు. అని సిద్ధించుచున్నది. కనుక దృశ్యం మాయ అని అనవలసి వచ్చినది.

కనుక అద్వైతుల సామాన్యోపదేశ విధానమందు దృగ్దృశ్య వివేకముచే శిష్యునికి బ్రహ్మ సాక్షాత్కారము కల్గింతురు. యీవిధానమునందు అధ్యారోపాప వాదములు, మననమూ, ధ్యానాదికములూ, చతుర్విధ సమాధులూ యిత్యాదులన్నియూ అవసరము. తనయందునూ ఎనుబది నాల్గువలక్షల జీవోపాధులయందునూ సమస్తమును గుర్తెరుగు ఏ తెలివి యున్నదో అదే శాశ్వతదృక్కు అనీ ప్రజ్ఞానమనీ పిలువబడును. ఈప్రజ్ఞానమే బ్రహ్మమని ఐతరేయోపనిషత్ లోని "ప్రజ్ఞానంబ్రహ్మ" అను మహావాక్యము తెలుపుచున్నది. కనుక అద్వైతమందలి సామాన్యోపదేశము మహావాక్యార్థ జ్ఞానము ఆరూఢపరచుటతో సమాప్తి జెందుచున్నది. ఈ ఆరూఢావస్థయే తురీయమనబడును.

అద్వైతుల అతీత భావము - తురీయా తీతమార్గము.

## వార్తిక సిద్ధాంతమన పేరుపొందిన నిర్వాసనామౌనముద్రా నిష్ఠా స్వరూపము.

మహావాక్యార్థమును అవగతముచేసికొని అన్వయ వ్యతిరేక యుక్తులచే ఆరూఢత చేకూర్చుకొన్నవాడే యీ అతీత భావమును యుపదేశముపొందుట కధికారి. తొలుతనే యీ భావమును ఉపదేశింపరు. ఉపదేశించినచో శూన్య భావాత్తి తప్పదు. మరియు కర్మ బ్రహ్మోభయ భ్రష్టుడై చెడిపోవును. వేదాంతము వ్యవహార జ్ఞానశాస్త్రమున్నూ వాక్యార్థమున్నూ అయివున్నది. వార్తికము పరమాత్మ జ్ఞానశాస్త్రమున్నూ లక్ష్యార్థమున్నూ అయివున్నది. ఈ లక్ష్యార్థము పారంపర్యముగా గురు సాంప్రదాయోపదేశము చేతమాత్రమే గ్రహింపనగును. గురువైతేనే వస్తు నిశ్చయ రూపంగా గుర్తెరిగింపగలడు. ఇది యేగ్రంథములవలననూ తెలియదగినదికాదు. గ్రంథములున్ను అంతగాలేవు ఈ వేదాంత వార్తికసార సంగ్రహమునకే, అశ్రుతార్థోపన్యాస మనీ, యేకార్థోపన్యాసమనీగూడ పేర్లున్నవి.

ఈ సిద్ధాంతము క్రమపద్ధతిలో మాత్రమే గ్రహింప దగినది. అనగా తారక, సాంఖ్య, అమనస్క, మహావాక్య ముల నెరిగినవాడే, యీ నిర్వాసనమౌనముద్రా నిష్ఠామార్గ మును యుపదేశము పొందుటకర్హుడు. ఈ క్రమపద్ధతిననుస

రించినచో శిష్యునిస్థితి "యతో భ్రష్టస్తతో భ్రష్టః" అగును. కనుక సామాన్యోపదేశ పద్ధతిలో దృక్స్వరూపస్థితి సాధించినవాడే, యీ మార్గమునకుత్తమాధికారి.

ఈ సిద్ధాంతమును తురీయాతీత మార్గమని అన్నారు. ధర్మోపదేశము పొందునపుడు జాగ్రితలో సుషుప్తియనియూ, తారకము సాధించుపట్లు జాగ్రతలో స్వప్నమనియూ, సాంఖ్యము విచారించునపుడు జాగ్రితలో జాగ్రితయనియూ అమనస్క మభ్యసించుపట్లు జాగ్రితలో తురీయమనియూ, నిర్వాసనా మౌనముద్రానిష్ఠాభ్యాసము జాగ్రితలో తురీయాతీతమనియూ, చెప్పుచూ' దీనిని తురీయాతీత మార్గమన్నారు. సాధారణముగా యీ అవస్తలు జాగ్రత్స్వప్న సుషుప్తితురీయములను క్రమములో చెప్పబడుటవలన, జాగ్రితనుంచి స్వప్నం, స్వప్నమునుంచిసుషుప్తి, సుషుప్తినుంచి తురీయము కల్గును. అని కొందరు పొరబడుచున్నారు. అది సరిగాదు అట్లు చెప్పినచో సుషుప్తినుండి తురీయమున్న మిగతా అవస్తలవలెనే ఏ ప్రియత్నం లేకనే అందరికిన్నీ లభించవలె తురీయమును అసలు అవస్త అనియే చెప్పరాదు. ఏదేని యొక సాధనచే పొందబడు స్వస్వరూప సాక్షాత్కారస్తితియే తురీయము. అట్టి తురీయము పశుపక్ష్యాదులకు సహితం లభించే అవస్థాత్రియమువంటిదికాదు. స్వరూపసాక్షాత్కా

రానుభవము గురు శాస్త్ర వైరాగ్య బోధో పరతల సహాయముచే సాధింపదగినది మాత్రమే. కనుక తురీయ స్థితి సాధించవలెనంటే జాగ్రదవస్థనుంచే పోవలసియున్నది ఈ అవస్థా పంచకమును (అవస్థాత్రయమున్నూ తురియ తురీయాతీతములను అతీతావస్థలు రెండున్నూ కలిపి ఒక క్రమములో చెప్పవలెనంటే, సుషుప్తినుంచి స్వప్నము, స్వప్నమునుంచి జాగ్రత, జాగ్రతనుంచి తురీయము, తురీయమునుంచి తురీయాతీతము అనవలసియుండును.

ఈ అతీతమార్గమున ప్రధానాంశములుగా గమనించ దగినవి ఏమనగా (1) అధ్యారోపాపవాదనిరసన, (2) శ్రవణ మనన విధిధ్యాసరాహిత్యము. (3) కర్మత్రయ రాహిత్యము (4) గురుశిష్యరహితము (5) వాసనాక్షయము, మనోనాశము, సర్వసమాధ్యభావము యిది దత్తాత్రేయులవారి మార్గము అని అన్నారు. మరియు దక్షిణామూర్తి యీ మౌనముద్ర చేతనే సనకాదులసంశయములను నివర్తించిరి అని శ్లో॥ చిత్రం వటుతరోర్మూలే వృద్ధాశిష్యాః గురుర్యువా, గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తుచ్ఛిన్న సంశయః॥ మౌనవ్యాఖ్య గనుక నే యిది "అశ్రుతార్థోపన్యాసం"అని అనబడినది. అన్నిటికీప్రమా ణమైన వేదోపనిషత్తులేదీనికిన్ని ప్రమాణం. వేదశాస్త్రములు చెప్పినవికొన్ని చెప్పనవికొన్ని తప్పుగాచెప్పినవికొన్ని

(అనగా చెప్పిదానననిబట్టితార్కికంగా నిశ్చయించినవి కొన్ని) యీవార్తికమునందు చెప్పబడినవి.

శ్లో॥ ఉక్తానుక్త దురుక్తానాం చింతాయత్రప్రవర్తతే. తదేవవార్తికంప్రాహు ర్వార్తికం చమహర్షయః॥ వేదము చెప్పినదిఏమి? చెప్పనిదిఏమి? తప్పుగాచెప్పినదిఏమి అని విచారించినయెడల (1) వేదాంతమునందు మహావాక్యార్థానుసారంగా బ్రహ్మస్వరూప మపరోక్షం గావింపబడెను. (2) కాని అబ్రహ్మమే తానైనిలచియుండు విధానముబోధింపబడలేదు. (3) శ్రవణమనన నిధిధ్యాసలచే సాధ్యముకాకపోయినప్పటికి దానినే యుపదేశించినది ఫీనినన్నిటిని విమర్శించి వివరించి సిద్ధాంతము చేయునదే వార్తికమని మహర్షులు చెప్పియున్నారు.

## అధ్యారోపాపవాద నిరసన.

అధ్యారోపమనగా, ఒకానొక యదార్థ వస్తువునందు, మరియొక యదార్థ వస్తువును ఆరోపించుట, అనగా లేకపోయిననూ వున్నదని కల్పించుట లేక భ్రమించుట అధ్యారోపము దీనికే అధ్యాస అనీ. వివర్తమనీ మారుపేర్లున్నవి. అపవాదమనగా ఆరోపితమగువస్తువు, అధిష్ఠానవస్తువునందున్నదో లెస్సగా విమర్శించి తెలుసుకొని, అపిమ్మట యదార్థమగు అసలువస్తువు ఏదో అదిమాత్రమేయున్నదనీ

ఆరోపితమగు వస్తువు అసలువస్తువునందు ఏకాలమునందును లేనే లేదనియు నిరసించుట- అపవాదమనబడును.

వేదాంత శాస్త్రమునందు, రజ్జుసర్పము: శుక్తిరజితము, నీలాకాశము మొదలగువానిని అధ్యారోపమునకు దృష్టాంతములుగా యిచ్చియున్నారు. "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచతే" అని సూత్రీకరించినారు. వార్తికమిా అధ్యారోపాపవాదము సరిగాదు అని దృష్టాంత సహితముగా ఈవాదమును తిరస్కరించుచున్నది.

(1) బ్రహ్మము స్వయం ప్రకాశము. ప్రపంచమన్ననో. తమోగుణ ప్రధానములూ జడములూనగు పంచభూతములచే నేర్పడినది. శ్లో॥ తమః ప్రధానః పకృతేస్తద్భోగాయేశ్వరేచ్ఛయ। వియత్పవచతేజోంబుభువో భూతాని జజ్ఞిరే॥ తమోగుణ ప్రధానమగు ప్రకృతినుండి యీశ్వరుని భోగము కొరకు అతని యిచ్ఛచే యేర్పడిన యీ ప్రపంచము తమోగుణ ప్రధానమైనది. యిట్టి ప్రపంచమును స్వయం ప్రకాశమగు బ్రహ్మమునం దారోపించుటయే పనికిరాదు. కనుక అపవాద ప్రసక్తియే లేదు, మధ్యం దినమార్తాండబింబమునందు కారుచీకట్లను ఆరోపించతగునా? ఆరోపించి పిదప లేదనుటకంటె మొదటనే లేదని చెప్పరాదా? లిప్తమల ప్రక్షాళనాత్తదస్పర్శనమేవవరమ్," అనగా మలము పూసు

కొని పిదప కడుగుకొనుటకంటె ఆ మలమును ముట్టకుండుటె మంచిదికాదా!

(2) రజ్జుసర్పమును దృష్టాంతముగా గైకొన్నచో, రజ్జువునుచూచి పాము అని ఒకానొకడు భ్రమించిన రీతిగా, బ్రహ్మమునుచూచి ప్రపంచమని భ్రమ కల్గినదన్నచో ఆ వెంటనే అనేక ప్రశ్నలుదయించును.

(a) భ్రాంతి పొందినవారెవరు? బ్రహ్మమా, జీవుడా?

(b) ప్రపంచ బ్రహ్మముల రెంటినీ అతఃపూర్వమే ఆ వ్యక్తిచూచి జ్ఞప్తియందుంచుకొని యుండెనా?

(c) రజ్జు సర్పములు రెండునూ యదార్థవస్తువులేకదా? అట్లే ప్రపంచబ్రహ్మలు రెండునూయదార్థములేనా?

(d) రజ్జు సర్పములకు గల సాదృశ్య సారూప్యాది దోషములు ప్రపంచ బ్రహ్మములకున్ను గలవా?

(e) భ్రాంతి కారకములగు ప్రమాతృ ప్రమాణ ప్రమేయాది దోషములు ప్రపంచభ్రాంతికాలముననున్న వా?

(f) దృష్టాంతమున రజ్జు సల్పములు సాకార సమసత్తాకమగు పదార్థములుగా నున్నట్లుగా దార్ష్టాంతికమునందు ప్రపంచ బ్రహ్మములు సమసత్తాకములు సాకారములు కావలసియుండనక్కరలేదా?

(g) "నతుదృష్టాంత బావాత్" అనురీతిగా యీ భ్రాంతి

కల్గుననుటకు ఒక్క దృష్టాంతమైన కలదా?

యింద్కు అద్వైతులీయగల సమాధానములు యెంత వరకు అంగీకార యోగ్యములో యించుక పరిశీలింతము

(a) బ్రహ్మము తన్ను తానే చూచుకొని ప్రపంచమని. భ్రమించెననరాదు. అఖండ చిద్ఘన స్వరూపమగు బ్రహ్మమునకు భ్రాంతి జ్ఞానము కల్గిన దనరాదు. సూర్యుడెన్నడైన తా నంధకార స్వరూపుడనని భ్రమించెనా? తనయందెన్నడైన అంధకారమును చూడగల్గునా? దృష్టాంత మందుకూడ రజ్జువును చూచి మరియొకడు అది పాముని భ్రమించెనేగాని తానే పామునని త్రాడు ఎన్నడూ భ్రమించజాలదు కదా!

ఇక జీవుడే భ్రమించెనని, అనవలసియున్నది - యిటు లంటే దీనికి పెక్కు ఆక్షేపణలు తలయెత్తుచున్నవి.

(1) బ్రహ్మముసర్వవ్యాపకమైయుంటేతానుఎక్కడనుండి చూచెను?

(2) భ్రాంతి కాలమున తాను భ్రాంతిచెందున్నట్లు ఆత డెరుగడు. యెరిగియేవుంటే భ్రాంతి లేనేలేదు. ఎరుగక వుంటే నిజమైన ప్రపంచమునే తాను చూచుచున్నట్లు ఏంచును. కనుక భ్రాంతియను శబ్దమే పనికిరాదు "లేదు,

నీవు నిజమగు ప్రపంచమును చూచుటలేదు. నీవు చూచునది బ్రహ్మము ప్రపంచమని భ్రాంతి చెందుచున్నావు” అని భ్రాంతియని స్థిరపరచినవాడు మరియొకడుండవలెను అత డెటనుండెను?

(b) ప్రపంచము, బ్రహ్మమూ, యీ రెండూ అతడతః పూర్వమే చూచియుండవలెను. అద్వైత సిద్ధాంతం ప్రకారం యదార్థమగు ప్రపంచము లేనేలేదు. యదార్థమగు ప్రపంచమే లేనపుడుదానిస్మృతి జ్ఞానమాతనికి యెట్లుండగలదు? దృష్టాంతమందు నిజమగు పాము వున్నది. దార్ష్టాంతికమందు నిజమగు ప్రపంచ మెన్నడూ లేనేలేదు. మరియును అతడు బ్రహ్మమును గూడ అంతకు పూర్వమే చూచియుండవలెను. ఎందువలన ననగా, భ్రాంతి విమోచన కాలమందు_ “అయ్యో నేను భ్రాంతిచెందితిని. యిది బ్రహ్మము, ప్రపంచము కాదు” అని చెప్పుస్థితిలో నుండవలెను అనగా బ్రహ్మసాక్షాత్కారమైనవానికికూడ తిర్గి పునర్జన్మ కలిగెననిన్ని, పూర్వదృష్ట మిథ్యా ప్రపంచ స్మృతి అతనికి యింకనూ శేషించియుండెననిన్ని, బ్రహ్మమును చూచినప్పటికి మరల భ్రాంతిపరంపరల కాతడు లోనుగావలసియే యుండుననిన్ని సిద్ధించుచున్నది. యిది ఎంత అసంగతము?

(c) యదార్థమైన రజ్జువున్నూ యదార్థమైనసర్పమున్నూ వున్నవి గనుక ఒకదానినిచూచి మరియొకటిఅనుకొని భ్రాంతి చెందవచ్చును. ప్రపంచ బ్రహ్మములలో ప్రపంచము మిథ్య బ్రహ్మ సత్యము. అని అద్వైత సిద్ధాంతము కనుక భ్రాంతికి సావకాశమే లేదు.

(d) రజ్జు, సర్పములు రెండున్ను సరూపములు, సన్నంగా పొడవుగా, వంకరగా, తిరిగియుండును. గనుక ఒక దానిని మరియొకటిగా మందాంధకారములో భ్రమింపవచ్చును. యిక దార్ష్టాంతములో చూచినచో? బ్రహ్మ మసదృశమైనది. బ్రహ్మమువంటిది బ్రహ్మమే గాని మరొకటి లేనేలేదు. రజ్జువునందు సర్పసాదృశ్య దోషమున్నది. అనగా సర్పాధ్యారోపకశక్తి రజ్జువుకు కలదు. కనుక త్రాడునందు పామే తోచినది కాని గోడలు, మేడలు తోచలేదు. బ్రహ్మమునకట్టి సాదృశ్యదోషము కలదనిగాని, బ్రహ్మమునందు ప్రపంచాధ్యారోపకశక్తి గలదనిగాని భావించరాదు.

(e) రజ్జువున్ను సర్పమున్ను దృష్టాంతములో సగుణములు సాకారములు. గాని రజ్జువువలె బ్రహ్మము సగుణము గాని సాకారముగాని కాదు. ఆకారమే లేని బ్రహ్మమును ఏవిధంగా యేయింద్రియముతో చూచును?

అంటే "బుద్ధిగ్రాహ్యమతీంద్రియం" అనవచ్చును. బుద్ధియొక్క యింద్రియ లక్షణముల నన్నిటిని మీరి అతీంద్రియమొనర్చి స్వరూపమును సంధానము గావించినచో బుద్ధియే బ్రహ్మాకారమగును. యీవిధంగా మాత్రమే చూచుటయగును. చూచే బుద్ధియే బ్రహ్మాకారము వహించినచో యిక బ్రహ్మమును చూచి ప్రపంచమని భ్రాంతి చెందేది ఏది? లేక బ్రహ్మమునుచూచి తదాకారము వహించిన నిరింద్రియమగు బుద్ధి తిర్గి తనయింద్రియ రూపమును చేకొన్నపిదప, నేను చూచినది ప్రపంచమేనని యనుకొనునా?

(f) దృశ్యమైన సాకారమగు వస్తువునందే అధ్యారోపమునకు సావుకాశముకలదుగాని అదృశ్యము, నిరాకారమునగు చిన్మాత్ర బ్రహ్మమునందు అధ్యారోపమే అసంగతము. కనుక రజ్జుసర్పదృష్టాంతమునిరర్థకము శంకరాదులు దీనికి సమాధానంగా "సాకారమగు వస్తువునందే అధ్యారోపము సాధ్యము అనే విషయం సరికాదు. కనులకుకానరాని నిరాకారమగు ఆకాశమునందు నీలిమ అధ్యారోపమగుటలేదా?" అని రజ్జు సర్పదృష్టాంతమునకు స్వస్తిచెప్పి ఆకాశదృష్టాంత

మును ప్రతిపాదించినారు. ఈ ఆకాశదృష్టాంతము యొక్క ఔచిత్యమునుగూడ యించుక పరిశీలింతము.

(1) ఆకాశమునందు తోచు నీలిమవుండి తోచుచున్నదా, లేక, లేక తోచుచున్నదా? లేక తోచినయెడలనే అది అధ్యారోపమగును. వుండియే తోచినచో భ్రాంతియని యననేరాము. సత్యమే అనవలెను. ఆకాశమనగా అవకాశము గదా! కనుక యీ అవకాశరూప ఆకాశము దగ్గరలోను దూరమందునూ సర్వత్రా వ్యాపకమై యున్నదిగదా? దగ్గరగానున్న అవకాశరూప ఆకాశమునందు యీ నీలిమ తోచుటలేదు. దూరదేశముననున్న అవకాశమునందే యీ నీలిమ తోచుచున్నది. కారణమేమి? సూర్య ప్రకాశము నందుగల సప్తవర్ణములలో నీలిమ యొకటి. దూరదేశమున వ్యాపించిన సూర్యప్రకాశములోని సప్తవర్ణములలో నీలి వర్ణము మాత్రమే దృగ్గోచరమగును. యితర వర్ణములు ప్రయోగాత్మకముగా సూర్యకాంతిని విశ్లేషించిననేగాని గానరావు దూరముననున్న పర్వతములుగూడ నీలిమగా గానవచ్చుటకిదియే కారణము. కనుక నీలిమవర్ణమువుండియే కానవచ్చుచున్నది. గాని పాములె లేక తోచుటలేదు. కనుక ఆకాశ దృష్టాంతము వర్తించదు.

(2) ఆకాశము కంటికి కానరాదేగాని యితరప్రమాణము

లకు గోచరము. ప్రమాణముల కందనిది పరబ్రహ్మము. ఒకటి ప్రమేయం. మరొకటి అప్రమేయం. అందువలన కూడ ఆకాశ దృష్టాంతము వర్తించదు.

(3) నీలిమవర్ణముగానున్న ఆకాశమును చూచి నీలాకాశమని నీలిమతోపా ఆకాశమునుగూడ ఏకకాలమున గుర్తించుచున్నాము. అధ్యారోపమునందు యదార్థ వస్తువు మరుగుపడి ఆరోపితవస్తువే తోచునట్లుగా ఆకాశము మరుగుపడి నీలిమమాత్రమే గోచరించుటలేదు. కనుక అధ్యారోపము, అపవాదము, భ్రాంతి, భ్రాంతిరహితము అనువానికి ఆకాశదృష్టాంతములో అవకాశమేలేదు. భ్రాంతి కాలమున రజ్జువు మరుగుపడి పాపే ప్రకటమగుచున్నందున ఆకాశ దృష్టాంతముకంటె రజ్జు సర్పదృష్టాంతమే ఒక విధంగా మేలు అని అనవచ్చును.

(g) అధ్యారోపమునకే గాక అపవాదమునకును సరియగు దృష్టాంతములేదు. ఏలననగా దృష్టాంతములో రజ్జువు వున్నంతవరకు సర్పము తోచుచునే యుండును. త్రాటిని కనుపించకుండా అవల పారవేసిననే సర్ప భ్రాంతి కత్యంత నివృత్తి గల్గును. కనుక ప్రపంచ భ్రాంతి తిరిగి కలుగకుండా పోవలెనంటే అధిష్టాన బ్రహ్మమును తొలగించవలసి యుండును.

కనుక సరియగు దృష్టాంతం లేకపోవుటవల్ల "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచతే" అనే సిద్ధాంతానికి నిలువ దిగజారిపోయినది. దృష్టాంతంలేని వాదమంగీకారం కాదని గౌడపాదాచార్యులవారు "అజాద్వైజాయతేయస్య దృష్టాంతస్య నాస్తికై" అని మాండూక్యకారికలు iv-13 లో చెప్పియున్నారు. అట్లే శంకరులుగూడ తను సూత్ర భాష్యంలో "నతుదృష్టాంత భావాత్" 2-1 అను సూత్రానికి వ్యాఖ్యానిస్తూ దృష్టాంతం లేనివాదన అంగీకారం కాదన్నారు. ఉపమాన ప్రమాణాన్ని కూడా వేదాంత మంగీకరిస్తూన్నది. కనుక నిర్గుణ నిరాకార వస్తువు సగుణ సాకారవస్తు రూపంగా కానరావచ్చును అనుటకు తగిన దృష్టాంతమే లేదు కనుక అధ్యారోపాపవాద సిద్ధాంతం నిలువజాలదు.

కనుక నిత్య నిరంతర నిష్ప్రపంచాద్వయాఖండైకరస బ్రహ్మమునందు కాలత్రయమునందు కాలత్రయముతోసహా లేని మాయా ప్రపంచమును అరోపించనే కూడదు. ఆరోపణేలేదు గనుక అపవాద ప్రసక్తి లేనేలేదు.

శ్రవణ మనన నిధి ధ్యాస రాహిత్యము

శ్రు॥ ఆత్మావారె ద్రష్టవ్య, శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః॥ అని విధి వాక్యము విధించు చున్నది.

తా॥ ఆత్మ చూడదగినది, వినదగినది, మననముచేయతగినది నిధిధ్యాస చేయతగినది కనుక మహావాక్యార్థమును శ్రవణ మనననిధిధ్యాసలొనరింపుము అని శ్రుతి విధించుచున్నది. కాని యీ శ్రవణాదులవల్ల బ్రహ్మ౭ పరోక్ష సాక్షాత్కారము కలగజాలదు.

అ బ్రహ్మము :- నైన మాత్మాప్రవచనశతేనాపి లభ్యతే నభహుశ్రుతేవ, నబుద్ధి జ్ఞానేన, నశ్రుతేన॥

తాత్పర్యము :- ఆత్మనూరువాక్యములచేగాని, శ్రుతివాక్యములచేగాని, నీ శ్రోత్రముచేగాని, బుద్ధిచేగాని, జ్ఞానముచేగాని, తెలియరానిది.

(2)"నతత్ర చక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి,నోమనో...." కేన-

తా॥ నీ చక్షువుగాని మనోవాక్కులుగాని అక్కడకు (బ్రహ్మ పదార్థమును) సమీపించి చూచుటకుగూడ అసమర్థములు అని ఈ శ్రుతి నొక్కి చెప్పుచున్నది.

బ్రహ్మమునుగూర్చి సాక్షాత్తుగా చెప్పగల వాక్యము లుండుటకే వీలులేదు. కనుక ఆ బ్రహ్మమును అశ్రుత్యర్థము అని అన్నారు. అట్టి బ్రహ్మమును శ్రవణముచేయుటెట్లు? అట్టి బ్రహ్మమును గురించిన వాక్యములే లేనిచో దేనిని మననము చేయవలెను? ఆ బ్రహ్మము అమనస్క రూపమై మనస్సుచే తెలియరానిదియునై యున్నది కనుక దానిని

మననము చేయుటయే సాధ్యముగాదు. శ్రవణమననములు చేయరాని దానిని నిధిధ్యాసయు చేయజాలము. తానే, ఆ బ్రహ్మము అని మహావాక్యములు ఘోషించుచుండగా, ఆ బ్రహ్మమును తన శ్రవణమనన నిదిధ్యాసాదులకు విషయము గావించుటయు పొసగదు. కనుక శ్రవణాది సాధనలు ఆ బ్రహ్మము విషయమై నిరర్ధకమగుచున్నవి.

కర్మత్రయ రాహిత్యము

కర్మ మూడు విధములు (1) సంచితము, (2) ప్రారబ్ధము (3) ఆగామి.

(1) సంచితమనగా :- గడచిన జన్మ జన్మాంతరములలో చేయబడిన కర్మలయొక్క పుణ్యపాప ఫలములు, అనుభవించుచూ రాగారాగా యీ జన్మలో అనుభవించుటకు నిర్ణీతమైనదికూడా పోను, శేషించిన కర్మఫల రాశియే సంచితమనబడును.

(2) ప్రారబ్ధమనగా :- తల్లి గర్భమందు పడినదాది దేహమునువీడి మరణించు పర్యంతము అనుభవించుటకు నిర్ణీతమైన సుఖదుఃఖరూప కర్మఫలము ప్రారబ్ధమని యనబడును.

(3) ఆగామియనగా :- జన్మాది మరణ పర్యంతము యీ జన్మలో చేయబడుతూవున్న కర్మలయొక్క పుణ్య పాప రూప అదృష్ట ఫలము ఆగామీ యనబడును. దృష్టఫలము

మాత్రము యీ జన్మలోనే అనుభవించుట ప్రత్యక్షముగా చూచుచునే యున్నాము.

జ్ఞానిఅయినవానికి ఆగామి సంచితములు రెండున్నూ జ్ఞానోదయ సమకాలమునందే నశించుననిన్ని, ప్రారబ్ధం మాత్రము అనుభవించినగాని పోదనిన్ని, కొందరందురు. కాని

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిః సర్వ కర్మాణి భస్మసాత్కురుతే తథా।
భ. గీ. 4-27.

తా॥ మండుచున్న అగ్ని కట్టెలనన్నిటిని యెట్లు భస్మ మొనరించునో, అట్లే జ్ఞానాగ్ని సమస్త కర్మలను భస్మము చేయును.

ఇందు "సర్వకర్మాణి" అను శబ్దమునకు పూర్తిఅర్థము నీయవలెనంటే యీ కర్మత్రయములో దేనికిన్ని మినహాయింపులేదు. కనుక జ్ఞానికి ఆగామి సంచిత ప్రారబ్ధములలో యేదెన్ని లేదని పై శ్లోకమున చెప్పినట్లు. మరియు కర్మలకు కారణమగు మూలాజ్ఞానము జ్ఞానికి రహితమయ్యెనుగదా! యికనా అజ్ఞాన కార్యములగు ఆగామి సంచిత ప్రారబ్ధముల మూటిలోనూ రెండుమాత్రముపోయి ఒకటినిలచియుండునా? మరియును ఒకానొక రాజు మరణించినచో అతని ముగ్గురు

రాశులలో నొకతెమాత్రం ముత్తైదువుగా నుండజాలునా? అట్లే కర్మత్రయ నిక్షేపమునకు స్థానమై వ్యష్టిసమష్టిరూపంగా నుండు అంతఃకరణము నశించినచో ఆగామిసంచిత ప్రారబ్ధములు మూడున్నూ అంతఃకరణతోపాటే నశించుచున్నవి గాని అందే యొక్కటియు నిలచియుండజాలదు.

యిందుకు శంకా సమాధానములు :- కుండకు కారణమగు మృత్తిక లేదని స్థిరపడినను, మృత్కార్యమగు ఘటము లోని మృత్తిక ఘట ధ్వంసమగు పర్యంతము వుండును గదా! అట్లే ప్రారబ్ధరూప శరీరమునకూ, ఆ శరీరమనుభవించు కర్మకూ కూడ కారణ స్వరూపమగు మూలజ్ఞానము నశించినను, ప్రారబ్ధరూప శరీరమును దానియొక్క కర్మానుభవమున్నూ నిలచియుండుననుట అసంగతము కానేరదు. ఏలననగా సంచిత కర్మరాశినుండి కొంతకర్మ తీసుకొని దాని ననుభవించుటకు శరీరమును గైకొని వచ్చినాడు శరీరపరిగ్రహముతో ప్ర + ఆరబ్ధము = ప్రారబ్ధము. చక్కగా ఆరంభింపబడినది అని అర్థము. విల్లువిరిగిపోయినను వింటిని అంతకు పూర్వమే విడచిపోయిన బాణము దానివేగమున్నంత వరకు పోవలసినదే గాని మధ్య నాగదుగదా! మరియును, అనుభవములో మహాజ్ఞానులగు రామకృష్ణ పరమహంస రమణ మహర్షి మొదలగువారు శారీరకములగు బాధలనుభ

వించినట్లు స్పష్టంగా గానవస్తూయుంటే జ్ఞానికి ప్రారబ్ధము గూడ లేనేలేదనుట యెట్లు? అని శంకలు సహజంగా గల్గును.

సుఖదుఃఖము లనుభవించునది ఏది? మనస్సుగదా? స్థూల దేహమునందు యెట్టి వ్రణాదులుకల్గినను వానిబాధ ననుభవించునది స్థూలదేహము గాదు. మనస్సే. అందువల ననే నిద్రాకాలమందునూ మత్తునిచ్చిన పిమ్మటనూ స్థూల దేహమున్ను అందున్న దుఃఖకారణములగు వ్రణాదులున్ను యుండిననూ దుఃఖము మాత్రము కల్గుటలేదు. సుఖదుఃఖాదు లనుభవించు మనస్సు తత్కాలమందు పని చేయక మగ్నత చెందియుండుటయే యిందులకు కారణము. కనుక జ్ఞాని జాగ్రదవస్థయందున్ననూ, తన ఆత్మ నిశ్చయ మును వీడక, స్వరూపలక్షణమందే యుండుటచే దుఃఖాదు లాతడనుభవించుటయే లేదని చెప్పనగును. దుఃఖకారణము లాతని శరీరముపైన ప్రత్యక్షముగా గానవచ్చుటచూచి అవి ఆతనిని బాధించుచున్నట్లు లోకులు తలంచుట మాత్రమే గాని, నిజముగా యోచిస్తే ఆగామీ సంచితములతోపాటు జ్ఞానికి ప్రారబ్ధముకూడ లేదు.

ఇక మరికొందరు శ్లో॥ ప్రారబ్ధం భోగతోనశ్యేత్, తత్వజ్ఞానేన సంచితం॥ ఆగామీ ద్వివిధం ప్రోక్తం తద్వేషి ప్రియవాదినౌ॥ అంటారు. ఇదియును సరిగాదు. జ్ఞానికి అను

భవమువల్లనే ప్రారబ్ధముపోనక్కరలేదు. జ్ఞానాగ్నిచే దగ్ధము కాగలదనీ, ఆతనితోసంబంధించినంతవరకు ప్రారబ్ధానుభవమే లేదనీ, గ్రహించితిమి. తత్త్వజ్ఞానముచే సంచితము పోవునని యెల్లరూ అంగీకరించినదే. కాని ఆగామీ కర్మఫలమునందు పుణ్యఫలమును, ఆ జ్ఞానినిభూషించిన వారున్నూ, పాపఫలమును ఆతనిని దూషించిన వారున్నూ పంచుకొందురు, అని యీశ్లోకము చెప్పుచున్నది. ఈభావము చాలా విచిత్రముగా నున్నది. ఏలననగా జ్ఞానికి జన్మరాహిత్యము కలుగవలెనంటే, కర్మత్రయము పూర్తిగా నిశ్శేషముగా నశించిననే గాని కలుగదుకనుక ఆతనిని భూషించువారున్నూ దూషించువారున్నూ విధిగా యుండవలసి వచ్చుచున్నది. దేహము చాలించువరకు ఏదో కర్మచేయకతప్పదు. కనుక అంతపర్యంతమూ ఆతనిని భూషించువారున్నూ దూషించువారునూ యుండవలసినదే, జ్ఞానియొక్క ముక్తిపరులపై నాధారపడియున్నది. అని అనవలసివచ్చుచున్నది. కనుక యీశ్లోకార్థమును అంగీకరించరాదు. మరియు గీతలో శ్లో॥ ఉద్ధరేదాత్మనాత్మానం ఆత్మానమవసాదయేత్ ఆత్మైవహ్యాత్మనో బంధురాత్మైవరిపురాత్మనః. భ. గీ. 4-5.

అని, నిన్నునీవే యుద్ధరించుకొనవలసియున్నది. కాని నిన్నుద్ధరించువారు మరియొకరు లేరు అని చెప్పుచున్నది.

శ్లో॥ కర్మణ్యకర్మయః పశ్యేత్, అకర్మణిచకర్మణి
సబుద్ధిమాన్మనుష్యేషుసయుక్తః కృత్స్నకర్మకృత్॥
భ గీ. ॥ 4-18

తా॥ కర్మయందకర్మను, అకర్మయందు కర్మనూ చూచుచూ కర్మ చేయువాడే బుద్ధియోగమును తెలిసిన యోగి. బుద్ధియోగమనగా జ్ఞానయోగమే.

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభేసుకృత దుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వయోగః కర్మసుకౌశలం॥
2-50 (గీత)

తా॥ బుద్ధియోగముతో గూడినవాడీ లోకములోనే పుణ్యపాపములను రెంటినీ విడచుచున్నాడు. అందువలన నీవట్టి యోగమునకై సిద్ధపడుము. కర్మయందు కుశలత్వమే యోగము. కర్మ చేయుటలో నేర్పుసంపాదించినవాడేయోగి.

కనుక బ్రహ్మాఽపరోక్షజ్ఞానము చెంది, కర్మయందకర్మను చూడగల్గిన నేర్పుతో కర్మచేయు యోగియే జ్ఞాని, అట్టి జ్ఞానిచేయుకర్మ అగామిరూప కర్మఫలమును యుత్పత్తియె చెయజాలదు. కనుక అట్టి జ్ఞానివిషయంలో ఆగామిరూప కర్మఫలమున్నూ లేదు. కర్మత్రయమునుండి విడువబడిన వాడై అట్టిజ్ఞానియే జన్మరాహిత్యము నుపొందగల్గుచున్నాడు. కనుక వార్తిక మీ కర్మత్రియ రాహిత్యమును ప్రతిపాదించుచున్నది.

## గురుశిష్యోభయరహితము

అఖండ బ్రహ్మాకారవృత్తి పొందుటే అద్వైతమందు పరాకాష్ఠ. అఖండ బ్రహ్మాకారవృత్తి యనగా "నిరంతరా విచ్ఛిన్న తైలధారావత్" (అనగా నూనెను ఒక పాత్రనుండి యెంత సన్నని ధారగాపోసినను తెంపులేక ఆనూనెధార తీగవలె సాగునేకాని నీటివలె చుక్కచుక్కలుగాపడదు) తెంపులేని నూనెధారవలె బ్రహ్మానుసంధానము యెడతెగక సాగుటే అఖండ బ్రహ్మాకారవృత్తి సాధకుని అంతఃకరణము బ్రహ్మాకారము వహించి తన్మయమై వుండుటచే, అప్పుడు "బ్రహ్మణోన్యంనకించన" అనుస్థితి సార్థకమై యుండును. ఆస్థియందు, గురుపుగాని, శిష్యుడుగాని, గురువుదెల్పు బోధగాని, ఆపిమ్మట శిష్యుడుచేయు సాధనగాని, ఏమియును లేవు. కనుక యీ వార్తిక మట్టి గురుశిష్యోభయరహిత స్థితినిగూర్చి చెప్పును.

## మనోనాశము, వాసనాక్షయము, సమాధ్యభావము.

మనస్సు వ్యష్టిరూపముగా జీవునియందును, సమష్టి రూపంగా యీశ్వరునియందు నూయుండూయున్నది. వ్యష్టి సమష్టియను భేదమును గోల్పోయి సృష్టికి పూర్వమందునూ ప్రళయానంతరమందునూ, కేవలమఖండరూపమై స్వప్రకాశ చేతన బ్రహ్మమందు సాక్షిరూపము వహించుచున్నదియునూ

యీ మనస్సే అపుడుదానికి స్వోవశీయ మనస్సు అనిపేరు కనుక జీవేశ్వరబ్రహ్మస్థానములమూటియందునూ నశించిననే మనోనాశనమైనట్లు. కాని ఏస్థానమందు యేకొంచెము మిగిలినా మనస్సునశించినదనరాదు. వ్యష్టియందు జీవునియందుండి జాగ్రదవస్థలో 25 యింద్రియములద్వారాను స్వప్నావస్థలో 17 యింద్రియములద్వారాను, సుషుప్త్యావస్థయందు స్వస్థానమైన అంతఃకరణయందు అజ్ఞానావస్థలోనూ వుంటూవున్నది. మనస్సు ప్రాణముతోగూడి తల్లిగర్భమందుచేరి బిడ్డయందు క్రమశః వికాసము చెంది తిరిగి మరణమందు యుదానవాయువుతో గూడి శరీరమునుండి బహిర్గతమై బ్రహ్మాండమందు చేరి పిదప వ్యష్టి దేహమునందు చేరువరకు యుండేయుంటున్నది. ఆవిధంగా వ్యష్టి మనస్సు అవస్థాత్రయములందునూ జననమరణములందునూ తిరుగుచున్నది.

సరమ్మూ మనస్సే. శ్లో॥ శ్రుణుష్వ విద్వన్, మనఏవ జీవో, మనఏవ విశ్వం, మనఏవ ఈశః। మనఏవ మాయా మనఏవబంధో, మనోలయే ముక్తిరయం యదార్థః॥

(జీవన్ముక్తి పత్రికాళిక)

తా॥ మనస్సే జీవుడు. మనస్సే విశ్వము, మనస్సే యీశ్వరుడు, మనస్సే మాయ, మనస్సే బంధము, మనస్సు లయమైనచో ముక్తి, యిదియదార్థము

అట్టి మనస్సును ఏస్థానమందుకూ లేకుండా చేయుటయే అమనస్కము ధ్యానపద్ధతిలో అనగా అన్యవస్తు చింతనలేక మనస్సు నేకాగ్రమొనర్చుటవలన మనోనాశమందురు. కాని తురీయావస్థ అనిచెప్పబడే సమాధియందుగూడ యీ మనస్సు రహితమగుటలేదు. నిర్విషయరూప విశ్రాంతి సుఖమునకు సాక్షిగానుండి తిర్గి వ్యుద్ధాన దశయందు జాగ్రతలో సంపూర్ణ స్వరూపము చెందుచున్నది.

శ్లో॥ విక్షిప్తోవా సమాధిర్వా మనసస్స్యాద్వికారిణః
వేదాంతపంచదశి.

కనుక సమాధియందుగూడ మనస్సున్నది. ఇక యీశ్వరస్థానములో, సమిష్టి సూక్ష్మ శరీరాభిమానియగు హిరణ్యగర్భునియందుండి ప్రళయోదయములు అనగా తిరోభావావిర్భావములు చెందుచూయున్నది. సృష్టికి పూర్వము తాను తానుగా, అనంతరమందు అధిష్ఠాన స్థానమందు సృష్టిస్థితి లయరూపములకు సాక్షిగా నుంటున్నది.

మనస్సు వాయురూపము; అంతేగాక "వాయుర్గంధానివానిచ" అనగా గంధమును వాయువు మోసుకొని పోవుచున్నట్లు మనస్సుపనిచేయుటకు ప్రయాణము సాగించుటకును కూడ ప్రాణము ముఖ్యావసరము. ప్రాణచలనము లేనిదే మనస్సు కదులదు. కనుక మనః ప్రాణములు రెండూ

యెటుబాటు చెంకదకుండా అవస్థాంతరములు చెందుచూ కలిసి వుటూవున్నవి. ఇదే లింగశరీరమనీ జీవుడని పిలువబడును. అన్ని సంకల్పములకు వృత్తులకు యీ మనస్సే బీజము నిధానము. మనస్సు యణగిన వృత్తులణగును. సమాధియందు వృత్తులనన్నింటినీ నిరోధించినను వ్యుద్ధానదశయందు తిరిగి వృత్తులు గలుగుచున్నవి. వార్తిక పద్ధతియగు అఖండ బ్రహ్మాకార వృత్తియందు మనస్సు తన స్వరూపమును గోల్పోయి కేవలమూ బ్రహ్మాకారముగనే నిలచియుండుటచే మనస్సు స్వరూపహాని చెందినదనవచ్చును.

శ్లో॥ అధ్యాత్మ యోగాధిగమేన దేవం
మత్వా ధీరో హర్షశోకౌ జహాతి॥

తా॥ పరమాత్మ యందలి యవిచ్ఛిన్న ధ్యానముచే తత్వజ్ఞుడు హర్షశోకాదిబంధములనుండి విడువబడుచున్నాడు.

మనస్సు లేనిచో సర్వవాసనలకు స్థానముగు అంతఃకరణముగూడ లేనిదేయగును గనుక మనోనాశనముతో పాటు వాసనాక్షయమున్ను అయినట్లే.

శ్లో॥ దృఢభావనయా. త్యక్త్వా పూర్వాపరవిచారణం
యదాదానం పదార్థస్య వాసనాసాప్రకీర్తితాః॥

అని వాసనకు నిర్వచనమీయబడినది. అనగా గుణదోషములను, యుక్తాయుక్తములను, పూర్వోత్తరములను

యోచించుటకైన వ్యవధినీయకుండాచేసి, హఠాత్తుగాగల్గు క్రోధాదివృత్తులకు కారణమై, చిత్తమందుండు నొకానొక సంస్కార విశేషము వాసన యనబడును. పూర్వాపూర్వ భావనా బలము లేక అభ్యాసపటుత్వముచే చిత్తమందు తిష్ఠవేసుకొని స్థిరముగా వసించుచున్నందున వాసన యనిపేరు దానికి సార్థకమైయున్నది. దుష్టరూపమగు మలినవాసనలు, అసురసంపత్తినిగల్గించును. మరి పుణ్యరూపశుద్ధవాసనలులేక శుభ వాసనలు, సురసంపత్తి లేక దైవీ సంపత్తును గల్గించును. ఈ సురాసుర సంపత్తులను గురించి భగవద్గీతలో దైవాసుర సంపద్విభాగ యోగమను 16వ అధ్యాయమునందు విపుల ముగా చెప్పబడినది.

మరియు "యాదృశీ భావనాయత్ర తాదృశీభవతి నిశ్చయం" అని యున్నది కనుక తీవ్రమగు భావనచే పురుషుడు తనశీలమును రూపొందించుకొనుచున్నాడు. కనుక శుభాశుభ వాసనలచే పురుషుని శీలమేర్పడుచున్నది. భావనా బలముచే వాసనలున్ను, వాసనాబలముచే ప్రవృత్తి నివృత్తులున్ను దైవాసురసంపత్తులున్ను కల్గుచున్నవి ఆయావాసనల బలముచే మానవుడు పరవశుడై ఏవస్తువును చూచునో ఆవస్తువునందు ఆయా గుణదోషములను ఆరోపించుకొని రాగద్వేషములను పొందుచున్నాడు. వాసన వాసితమగు

నాతనిమనస్సు యదార్థమును గుర్తింపజాలక సర్వపదార్థము లను విపరీతముగా, అనగా మంచివిచెడ్డగాను, చెడ్డవిమంచివి గాను, చూచుచుండును. ఆతని అంతఃకరణమున ఎట్టివాసన లుండునో అట్టి కోరికలనే కోరును. ఎట్టికోరికలు కోరునో అట్టిపనులనే చేయును. ఎట్టిపనులు చేయునో అట్టిఫలితమునే పొందును. ఎట్టిఫలితమును పొందునో అట్టిఫలమనుభవిం చుటకుయోగ్యమైన జన్మయే అతనికి సిద్ధించును. కనుక యీ వాసనలు జన్మకారణముగా నున్నవని చెప్పుటలో సందియమే యుండజాలదు. మలినవాసన, అసుర స్వభావముగల సర్ప వ్యాఘ్రాది నీచజన్మలకు కారణభూతమగుచున్నది. శుద్ధ వాసన యుత్తమ జన్మలకును స్వర్గాది పదవులకున్ను కారణ మగును. నీచజన్మ పరంపరలకు కారణమై బంధకారణమగు మలినవాసన యినుప సంకెళ్లుగాను, స్వర్గమోక్షాదులకు కారణమగుశుద్ధవాసన బంగారపుసంకెళ్లుగాను, పోల్చనగును బంధ మోక్షములు లేనిదే వాస్తిక పద్ధతి. గనుక శుభాశుభ వాసనలన్నియు నిశ్శేషముగా నశించవలెను. లేనిచో జన్మ రాహిత్యము లేదు. లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన యివి వాసనాత్రియముగా ప్రసిద్ధికెక్కినవి. దంభదర్ప అహంకారాదులు గుణరూప వాసనలు. శబ్దాదులయందలి కోర్కెలు విషయ వాసనలు. యివన్నియూ మలినవాసనలు.

ముదిత, కరుణ, మైత్రి, యుపేక్షలు జ్ఞానియొక్క ఆచరణకు యోగ్యములైన శుభవాసనలు, మైత్రి ముదిత యిత్యాది శుభ వాసనలుపూని చిన్మాత్రవాసనాభ్యాసము సర్వ వాసనా క్షయమగువరకు జ్ఞానిసాధనచేయవలసియుండును. చిన్మాత్ర వాసనాభ్యాసము మనోసహితమనీ, మనోరహితమనీ, రెండు విధములు.

(1) మనోసహిత చిన్మాత్ర వాసనాభ్యాసము:- చిజ్జడములుగా ఒకేసిద్ధాతువు రెండుగా తోచబడుచున్నది. కనుక ప్రథమంలో జడమును పేక్షించి చిత్తునందే చిత్తమునుచేర్చి యుంచు నభ్యాసము చేయవలెను. మనస్సు జ్ఞానమునకుసాధనముగా అనగా పనిముట్టుగా యున్నది. బుద్ధి జ్ఞానమున కాశ్రయమైయున్నది. బుద్ధియే అహమనే కర్తగూడనై యున్నది. ఏకాగ్ర చిత్తముతో, యీ మనోబుద్ధులతో గూడి సర్వము చిన్మాత్రముగా ధ్యానము చేయుటయే మనోసహిత చిన్మాత్ర వాసనాభ్యాసము.

(2) మనోబుద్ధులను త్యాగముచేసి (అనగా కర్తృత్వ కరణత్వములు వీడి) చిన్మాత్ర వాసనాభ్యాసముచేయు నెడల రాగద్వేషములు రహితమై ఆత్మనిష్ఠకుదురును, అప్పుడు శుద్ధ వాసనలు సహితం రహితమగును. అవుడే మనస్సు నిర్వాసన మగును ఇక యాతనికి యే సాధనాంతరములతోను పనిలేదు.

ఇట్టి జ్ఞాని రాగశూన్యమగుబుద్ధితో శేషజీవితము పాలించును. కనుక ప్రారబ్ధ మనుభవించు చున్నాడనియు అనరాదు. ఆతడు కృతకృత్యుడు. దేనినాశించి అతడే కర్మ చేయవల యును? యదృచ్ఛాలాభ సంతుష్టి గల్గియుండునేగాని, దేనిని అతడు కోరనైనకోరడు. యిట్టి మనోరహిత చిన్మాత్ర వాసనా భ్యాసముచే వాసనాక్షయ మగుటయే గాక ఆతని మనస్సు నిరింద్రియమైపోవుచున్నది. అనగా మౌనము చెందుచున్నది. ఆమౌనము, స్థూలశరీరమును నిశ్చలత్వము గావించిన కాష్ఠ మౌనముగాని, వాక్కును బంధించిన వాఙ్మౌనముగాని, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములనరికట్టిన అక్షమౌనముగాని, కాదు అది మహామౌన మనబడును. యీవిధముగా వాసనా క్షయముగావించుకొని మనస్సును మహామౌనము గావించిన నిష్ఠకే నిర్వాసన మౌనముద్రా నిష్ఠాస్థితియని పేరు.

ఈ నామము యీస్థితికి సరిపోవునా? అంటే సరిపో దనియే చెప్పవలెను. లేని ప్రపంచమును లేనట్లుగానే చెప్పు దుముగదా ! యిక ప్రపంచమే లేనపుడు వాసనలూ లేవు ఏతత్క్షయమూ లేదు. కనుక నిర్వాసనయను పేరు పనికిరాదు. మౌనమను మాటయును పనికిరాదు. ఏలననగా శబ్దముఆకాశ గుణము. ఆకాశమేలేనపుడు శబ్దమౌనము అనగా వాఙ్మౌన ము న్నా యుండజాలదు. అట్లే దేహేంద్రియములు లేవు

గనుక కాష్ఠమౌనము, అక్షమౌనమూ రెండూ వుండనేరవు. పోనీ మహామౌనము (మనస్సును సంకల్ప రహితము గావించుట) మాత్రమే, మౌనమున కర్థముగా గ్రహించవలె నన్ననూ, కేవల మనస్క రూపమైన (మనస్సే లేని) బ్రహ్మ మునందు మనస్సును మౌనమొనరించుట అనగానేమి? అట్లే నిష్ఠయని పేరున్నూ పనికిరాదు. పారమార్థికముగా చలించుట అనే లక్షణమే లేని వస్తువునందు నిష్ఠయొకటి క్రొత్తగా తెచ్చి పెట్టవలసిన అవసరము లేదు. కనుక యీ తార్కికపద్ధతికి నిర్వాసన మౌనముద్రానిష్ఠయని పేరుపెట్టరాదు. కాని వ్యవహారార్థమేదో యొకపేరు పెట్టవలెను, కనుక పెట్టిరి, అని వారందురు.

సమాధియనగా బుద్ధిని నిశ్చలత్వము గావించుట మాత్రమే, మనస్సు నిశ్చయస్థితికి వచ్చినచో దానికి బుద్ధి యని పేరు. మనోనాశనమైన అఖండ బ్రహ్మాకార వృత్తి యందు బుద్ధియూ నుండజాలదు. కనుక యీనిర్వాసనమౌన ముద్రా నిష్ఠాస్థితిని సమాధి యనరాదు. అంతేకాక అందు సర్వసమాధ్య భావమే సిద్ధించుచున్నది.

ఈఅఖండ బ్రహ్మాకార వృత్తియందు సంపూర్ణముగా మూలాజ్ఞానం నశించుచున్నది. కనుక అజ్ఞాన కార్యరూపు లగు జీవేశ్వరులున్ను లేరు. అట్లే బంధ మోక్షములున్నూ లేవు.

అజ్ఞానము సమూలముగ నాశనమైపోయినా, తత్కార్యములు నిలచియున్నవనుట, మిట్టమధ్యాహ్న కాలమందు సహితము అంధకారము మిగిలియున్నదని చెప్పినట్లే యగును. కనుక బంధమోక్షములకున్ను తావులేదు. శ్రు॥ మోక్షాపేక్షోహి బంధః॥ అని నిరాలంబోపనిషత్ చెప్పుచున్నది. మరియు అజ్ఞానకార్యమైన బంధము పారమార్థికముగా లేనేలేదన్నపుడు, యిక మోక్షప్రసక్తియుండ జాలదు. బ్రహ్మముతప్ప అన్యము లేనేలేదు. త్రికాలములయందున్నూ ప్రపంచము లేనేలేదు. దేహమేలేదు కనుక జీవన్ముక్తివిదేహముక్తులున్నూ లేవు. నిత్యముక్తియను మాటకూడ ఔపచారికముగ మాత్రమే అంగీకారము.

ఏపేరుతో పిలచినా, యిదే వేదాంత వార్తిక సిద్ధాంతము. ఇదే నిర్వాసనామౌనముద్రానిష్ఠా. యిదే అద్వైత మున అసామాన్యోపదేశ విధానము. అతీత వేదాంతము. ఇదే అద్వైత సిద్ధాంతములో పరాకాష్ఠ, చరమస్థితి, లేక చివరిమాట.

ఐతే యీనిర్వాసనామౌనముద్రానిష్ఠా సిద్ధాంతమునకు, ప్రమాణ గ్రంథములేమైన నున్నవా? సర్వసిద్ధాంతములకు ప్రమాణములుగానున్న శ్రుతిస్మృతులే దీనికిన్ని ప్రమాణం. ఈ మార్గమునకు శ్రుతిప్రమాణము లేజోబిందూపని

షత్తున్ను, స్మృతిప్రమాణ ముత్తరగీతయున్ను న
వచ్చుచున్నవి.

తేజోబిందూపనిషత్ లో "యత్కించిద్యన్నకించిచ్చ సర్వంచిన్మాత్రమేనహి" మరియు "చిదిహాస్తీతి చిన్మాత్ర మిదం చిన్మయమేవచ, చిత్త్వంచిదహమేతేచలోకాశ్చిదితి భావయ" (వరాహ-అ. 2) అని సర్వము చిన్మాత్రంగా అవిలో నిరూపించినది.

అనగా ప్రపంచము అనునదంతయు బ్రహ్మమేనని తెలియవలెను. ఆపిమ్మట అజ్ఞానముచే దోచిన ప్రపంచ భావనను విడువుమని శ్రుతి బోధించినది. ప్రపంచమును నిషేధిస్తే నేను మిగిలియున్నాను గనుక ఆ నేనుకూడ బ్రహ్మమేనని "అహం బ్రహ్మాస్మి" అను భావన దృఢపరచుకొనుము.
శ్లో॥ సర్వవ్యాపార ముత్సృజ్య అహం బ్రహ్మేతిభావయ అహంబ్రహ్మేతి నిశ్చిత్య త్వహం భావం పరిత్యజ అని శ్రుతి విధించుచున్నది. అభావ మారూఢమైన పిమ్మట, ఆ నేనను అహం భావనను గూడ విడువవలెను. స్వాతిరిక్తముగ బ్రహ్మమున కన్యముగా నేను లేను. "అహం" "బ్రహ్మ" అని రెండు యెన్నడూ లేవు. కనుక "అహం బ్రహ్మాస్మి" అను వాక్యము, వున్న బ్రహ్మమును సరిగా అనువదించుట లేదు. మహావాక్యముల ప్రత్యగ్బ్రహ్మైక్యము

నకు ఆవిలో అవసరమైనను బ్రహ్మమును సరిగా ననువదించ జాలవు. కనుకనే,

శ్లో॥ ప్రజ్ఞాన వాక్యహీనాత్మా, అహం బ్రహ్మాస్మి వర్జితః
తత్వమస్యాది హీనాత్మా అయమాత్మేత్యభావకః॥
తే. బిం॥ 3 అధ్యా.

శ్లో॥ మహావాక్యార్థతో దూరో బ్రహ్మాస్మీత్యతిదూరతః
తచ్ఛబ్దవర్జస్త్వం శబ్దహీనో వాక్యార్థవర్జితః॥
తే. బిం॥ 4 అధ్యా.

మరియును,

శ్లో॥ కేవలంతుర్య రూపోస్మి తుర్యాతీతోస్మి కేవలం
కేవలాకారరూపోస్మి శుద్ధరూపోస్మ్యహంసదా ॥తేజో॥
3 అధ్యా.

శ్లో॥ ఆత్మేతిశబ్దహీనోయం, ఆత్మశబ్దార్థవర్జితః
సచ్చిదానంద హీనోయం ఏషైవాత్మా సనాతనః॥
తే. బిం. 4 అధ్యా.

నందు చెప్పబడియున్నది. ఈనిర్వాసనా మౌనము దాంనిష్ఠా గమ్యస్థానము పూర్ణమో శూన్యమో, ముందు విచారింతము. ఈ బ్రహ్మానుభవస్థితి యందునాల్గు మహావాక్యములు లేనేలేవు. ఆ బ్రహ్మము, ఆత్మ అనుశబ్దము నకును దానియర్థమునకును, అందరానిది. అందు సత్,

చిత్, ఆనందములున్ను లేవు అని మహావాక్యాలను సహితం నిరసించుచున్నది.

శ్లో॥ తూష్ణీమేవస్థితం తూష్ణీం, తూష్ణీం సత్యం నకించన॥తేజో॥ తా॥ నిర్వాసన మౌనమే సత్యం. అదియే పరమార్థముగ నిర్వికల్పముగనున్నది. దానికన్న యితరము కొంచమైననూ లేదు శ్లో॥ తుర్యతుర్యః పరానందో వైదేహీ ముక్త ఏవసః॥ తా॥ తురీయమునకు తురీయమైనవాడు తురీయాతీతుడు. వాడే విదేహముక్తుడు. శ్లో॥ యస్యప్రపంచ భానంనబ్రహ్మాకారం నచాపిహి॥ అతీతాతీతభావో యోవై దేహీ ముక్తయేవసః॥ తా॥ బ్రహ్మ ప్రపంచ భావములు రెండున్నూ లేక సమస్తమునకతీతమైన తురీయమునకతీతమైనవాడు ఎవడో అతడే విదేహ ముక్తుడు.

ఉత్తరగీత : ఉల్కాహస్తోయథాకశ్చిత్ ద్రవ్యమాలోక్య తాంత్యజేత్

జ్ఞానేనజ్ఞేయమాలోక్య పశ్చాద్జ్ఞానం పరిత్యజేత్

ఉ॥గీ॥ 1-20.

తా॥ చీకటిలోవున్న వస్తువును దీపసహాయముతో వెదకి తెలుసుకొన్న అనంతరం యెట్లా దీపము విసర్జింపబడునో అట్లే అజ్ఞానాంధకారమును పోద్రోలుటకై జ్ఞానదీపమును సహాయముగా గొని, జ్ఞేయరూపమైన బ్రహ్మవస్తువును

దెలిసికొని,పిమ్మట జ్ఞానముగూడపరిత్యజింపవలెనని భావము

శ్లో॥ ఖమధ్యేకురుచాత్మాన మాత్మమధ్యేచఖంకురు
ఆత్మానం ఖమయంకృత్వానకించిదపిచింతయేత్॥ ఉ॥గీ॥

తా॥ ఆకాశ మందంతటను వ్యాపించిన దానిగా ఆత్మనులగించి ఆ యాత్మయందంతటను వ్యాపించియున్న దానిగా ఆకాశమును ప్రతిష్ఠించి (అనగా రెండింటి నొకటి చేసి) ఆ పిమ్మట యితరమైన దానిని కొంచమైనను తలంచకుము. అపుడు స్వస్వరూపముతో స్తబ్ధచిత్తుడవైనిలచిపోదువు

శ్రుతి! "వృక్షఇవ స్తబ్ధోదివితిష్ఠత్యేకస్తేనేదం పూర్ణం పురుసేనసర్వం" తా॥ పూర్ణత్వరూపుడై ఏపురుషుడున్నాడో, అతడు ఆకాశమునందు, వృక్షమువలె స్థాణువుగా నిలచి యున్నాడు.

మరియు "ఖ" శబ్దముచే బ్రహ్మము చెప్పబడినది (ఖంబ్రహ్మ అని ఆకాశశ్శరీరం బ్రహ్మ అని శ్రుతులున్నవి) ఆత్మ శబ్దముచే జీవుడు చెప్పబడెను. జీవ బ్రహ్మలనేకముగా గుర్తెరిగి ధ్యానింపుమని యీ వుత్తర గీతాశ్లోకమున ప్రకారాంతరముగా నర్థము చెప్పనగును.

నీకుబయటనున్న ఆకాశమేశరీరముగాగల బ్రహ్మమునందు, నీ మనోరూప జీవాత్మను లగ్నము చేసినను సరే-లేదా, నీ లోపలనున్న మనోరూప జీవాత్మయందు ఆత్మను

ప్రతిష్ఠించినను సరే, అని చెప్పుటకై "ఖ వ ధ్యేకురుచాత్మా నం" అని అగకుండా "ఆత్మ మధ్యేచఖంకురు" అని యీ శ్లోకము చెప్పుచున్నది. మరిన్ని ఆత్మయందాకాశము ఆకాశ మునం దాత్మయు ఓతప్రోతమై (అనగా ఆత్మాకాశములు ఒక వస్త్రమునందలిపడుగు పేకలవలె) నున్నవి అని గ్రహింప వగును.

శ్లో॥ ఆకాశంమానసంకృత్వా, మనః కృత్వానిరాస్పదం
నిశ్చలస్తం విజానీయాత్సమాధిస్తలక్షణం॥
ఉ గీ॥ 1-32.

తా॥ ఆకాశమును మనస్సుగా నొనరించి, మనస్సును నిరాస్పదమైన దానినిగాచేసి (శూన్యరూపంగావించి) నిశ్చలత్వమును గుర్తెరుగుటే సమాధి అని దీని భావము.

శ్లో॥ ప్రభాశూన్యం, మనశ్శూన్యం, బుద్ధిశూన్యం నిరామయం సర్వశూన్యం, నిరాభాసం, సమాధిస్తస్యలక్షణం త్రిశూన్యం యోవిజానీయాత్ సద్యోముచ్యేత బంధనాత్ ॥

తా॥ ప్రభాశూన్యమనగా ప్రకాశశూన్యం, మనశ్శూన్యమనగా అన్యసంకల్పశూన్యం. బుద్ధిశూన్యం అనగా శేషించినదే బ్రహ్మము అని నిశ్చయించిన బుద్ధియొక్కశూన్యత్వము. ఎవడు జ్ఞానమనోబుద్ధులచే తెలియఁగిన దానిని

(జ్ఞాన వస్తువును) తెలుసుకొని ఆమూటి శూన్యత్వమును తెలుసుకొన్నాడో అతడు వెంటనే సర్వబంధముల నుండి ముక్తిని జెందుచున్నాడు. ఈజ్ఞానమనోబుద్ధుల మూటిని శూన్యత్వముచేసి యుండుటయే నిర్వాసనామౌనముద్రా నిష్ఠాస్థితి.

శ్లో॥ ఊర్ధ్వశూన్యం, మధశ్శూన్యం, మధ్యశూన్యం యదాత్మకం సర్వశూన్యం తదాత్మేతి సమాధిస్తస్య లక్షణం॥ ఉ. గీ. 1-34

తా॥ మీదను, క్రిందను, మధ్యను, శూన్యమై సర్వశూన్యమైన యే యాత్మయున్నదో దానిని గుర్తెరుగుటే సమాధి.

మరియు "శూన్యభావితభావాత్మా పుణ్యపాపై ప్రముచ్యతే" అని యుత్తరగీత చెప్పుచున్నది. ఉత్తరగీత చెప్పు యీశూన్య సమాధినే నిర్వాసనమౌనముద్రానిష్ఠాస్థితి సూచించుచున్నది. ఈ వేదాంతవార్తిక పద్ధతని ఒక్క మాటలో చెప్పవలెనంటే "జ్ఞానేనజ్ఞేయమాలోక్య, పశ్చాద్ జ్ఞానం పరిత్యజేత్" అనగా "జ్ఞేయ బ్రహ్మస్వరూపమును, జ్ఞానముచే గుర్తెరిగి ఆపిమ్మట ఆజ్ఞానము విడువుము," అని చెప్పవలెను. ఈ విషయమును కొంచెము పరిశీలించవలసి యున్నది.

ఇంద్రియరూపమైన జ్ఞానమునకు బ్రహ్మము విష

యం కాజాలదు. ఏలననగా జ్ఞానమునకు అదిభౌతికము ఎరుగుట. దేనిని? అనగా శబ్దాది విషయపంచకమునుగదా! విషయపంచకమునుండి మరలించినచో ఆ జ్ఞానమే శుద్ధజ్ఞాన మనబడును అట్టి శుద్ధజ్ఞానముచే సృష్టకిపూర్వమువుండే వస్తువును లేక తత్వమునుగురించి ధ్యానించినచో ఆ జ్ఞానము (నిరీంద్రియ రూపమగు మనస్సు) జ్ఞేయ స్వరూపమును పొందుచున్నది "మనోహిజతువత్" అనగా మనస్సు లక్క వంటిది. ఏమూసలో లక్కను కరిగించిపోస్తే ఆ రూపమే ఆ లక్క వహిస్తున్న విధముగా ఆ శుద్ధజ్ఞానము లేక నిరింద్రియమనస్సు అట్లు జ్ఞేయాకారమును వహించుటే ఆజ్ఞేయబ్రహ్మమును ఆలోచించుట ఆపిన్మటు జ్ఞానమును వదలివేయుట లేక శూన్యమును గావించుట అనుటలో అర్ధమేమి? జ్ఞానము జ్ఞేయాకారము వహించినపుడు

శ్లో॥ సముద్రోప్రైయథాతోయం, క్షీరేక్షీరం, జలేజలం.
భిన్నే కుంభేయిథాకాశం, తథాత్మా పరమాత్మని॥

అనిగురుగీత్

తా॥ నదులనీరు సముద్రములో కలిసినట్లు, పాలలో పాలు నీటిలోనీరు, బ్రద్దలైపోయిన ఘటములోని ఘటాకాశము, మహాకాశములోనూ కలసినట్లు ఆత్మ పరమాత్మలో ఐక్యమగును. మరియు

శ్లో॥ జ్ఞేయం సర్వమతీతంచ, జ్ఞానంచమన ఉచ్యతే,
జ్ఞానం, జ్ఞేయం సమంకృత్వా యథానాన్యద్వితీయకం॥
గురుగీత.

తాత్పర్యము :- జ్ఞానమున్ను, అన్నిటికి అతీతమగు జ్ఞేయమున్ను, రెండున్ను మనస్సుగానే చెప్పబడుచున్నవి. అవి రెండూ భిన్నములు గాకుండా ఒకటిగా ఆయెనేని రెం డవదియే లేదు. (అనగా ద్వైతము నశించి అద్వైతమగుచు న్నది.) ఆ విధంగా ఒకటిగానై పోయిన వానినుండి జ్ఞాన మును విడదీయ నగునా ? తన జ్ఞానము జ్ఞేయాకారము వహించిన పిదప జ్ఞానము వదలివేయవలెనని సంకల్పము కలుగుటకు అపుడు తనకు వేరేమరొక జ్ఞానము లేక మనస్సు వుండునా ? వుండనిచో వదలివేయుట యెట్లు ?

వాదనార్థము, ఏదోరీతిగా జ్ఞేయమును గావించిన పిదప జ్ఞానమును వదలివేయుట సాధ్యమని అంగీకరించినామను కొనుడు. జ్ఞానము జ్ఞేయమే అయిపోతేనే తప్ప జ్ఞేయము తెలియబడదు. కనుక జ్ఞానమును వదలుట యనగా జ్ఞేయము నుకూడా వదలుటయే యగునుగదా! దీపమును ఆర్పివై చినచో ఆదీప ప్రకాశమింకనూ నిలచియుండుట ఎందైన సాధ్యమా ? జ్ఞాతృజ్ఞాన జ్ఞేయ త్రిపుటిలో ఏది లేకపోయినా మిగతా రెంటికీ యునికియే లేదు గదా ! ఆ పిమ్మట యిక

మిగులునది ఏమి ? శూన్యమే. అనగా జ్ఞేయ బ్రహ్మము గూడ లేకుంటే శేషించునది అసత్తే. ఈ అసత్తు నుంచే "సత్" కల్గినదని "అసద్వాయిదమగ్ర ఆసీత్ తతోవైసద జాయిత" అని శ్రుతి చెప్పుచున్నది. కనుక అద్వైత సామాన్య సిద్ధాంతము నందు సద్రూపమగు బ్రహ్మమున్ను, వేదాంత వార్తికము ప్రతిపాదించిన అతీతాద్వైత సిద్ధాంతము నందు అసద్రూప బ్రహ్మమున్ను ప్రతిపాదింపబడినవన్న మాట. మొత్తముమీద అద్వైతమతము సదసద్రూపద్వంద్వ వస్తువును దాటలేదు. అసత్ అనగా శూన్యము. ఈ శూన్యమును తెలిసినవారే బంధమునుండి విముక్తి చెందుదురని పైన వుదహరించిన "ప్రభాశూన్యం మనశ్శూన్యం" అనే శ్లోకములోనున్నూ, అసర్వశూన్యమే సమాధి లక్షణమని "ఊర్ధ్వశూన్య మధశ్శూన్యం" అనే శ్లోకములోనున్ను, యిట్టి శూన్యభావనచేతనే నరుడు పుణ్య పాపములనుండి ముక్తి చెందుచున్నాడని "శూన్యభావిత భావాత్మా పుణ్యపాపైః ప్రముచ్యతే" అను శ్లోకములోనున్ను ఉత్తరగీత చెప్పుచున్నది.

ఏ సూత్రము ననుసరించి యీ సిద్ధాంతము ప్రవర్తింపచేయబడెను? అనగా, వేదాంతమునందు ముఖ్య సమానాధికరణమనిన్ని బాధ సమానాధికరణమనిన్ని సమా

నాధికరణ సంబంధము రెండువిధములు. అద్వైత సామాన్య భావమునందు దృక్కునకును బ్రహ్మమునకును ముఖ్య సమానాధికరణ సంబధముచే ఏకత్వము ప్రతిపాదింపబడినది. సమానాధికరణ సంబధమనగా, వేరువేరు అర్థములుకల్గియున్నప్పటికీ, యేరెండు పదముల లక్ష్యార్థము ఒకేవస్తువునందు పర్యవసించునో ఆ రెండు పదములకు సమానాధికరణ సంబంధము చెప్పబడును. దృగ్దృశ్య వివేకములో సర్వదృశ్యనిషేధ రూపముగ దృక్స్వరూపస్థితి గల్గినమీదట ఆ సర్వదృక్కే పరబ్రహ్మమని కూటస్థ బ్రహ్మములకు ఏకత్వమును ప్రతిపాదించుట ముఖ్య సమానాధికరణము. అద్వైతుల అతీతమార్గమగు నిర్వాసనా మౌనముద్రా నిష్ఠామార్గములో బాధ సమానాధికరణ సంబంధముచే బ్రాహ్మీస్థితి యుపలబ్ధముకాగలదని తెలియవలెను. జ్ఞానముచే జ్ఞేయవస్తువును తెలిసి, ఆతెలిసికొన్న జ్ఞానము విడువబడినచో (అనగా బాధింపబడినచో) అప్పుడుద్వైత దృష్టి పూర్తిగా బాధింపబడి బ్రహ్మము నిర్విశేషరూపముగా, రెండవది లేనిదై అనగా అద్వైతమై భాసించును. అని యీసిద్ధాంతము కనుక యీ అతీత సిద్ధాంతవాదులు బాధ సమానాధికరణ సంబంధమును గ్రహించిరని చెప్పవలసియున్నది.

ఈ నిర్వాసనామౌనముద్రానిష్ఠ కేవల మనుభవైక వేద్యము అని వీరందురు. అనుభవమనగానేమి ? యించుక విమర్శించవలసి యున్నది. అను + భవము = అనుభవము కనుక, భవమును అనగా పుట్టినదానిని అనుసరించునదే అనుభవము అని శబ్దార్థము వలన తెలియనగును. పుట్టినదిగిట్టక తప్పదు కనుక భవమును అనుసరించుట యనగా పుట్టుట గిట్టుట గల్గియున్నవాని సహాయముతో, పుట్టని గిట్టని బ్రహ్మ పదార్థము (శ్లో॥ నజాయతే మ్రియతేవాకదాచిన్నాయం భూత్వాభవితావానభూయః ॥భ. గీ॥ 2-20) ఎట్లు అవగతము కాగలదు ? కనుక అది అనుభవయోగ్యముకాదు. అనుభవము యొక్క పరిధిలోనికి అదిరాజాలదు. "అనుభూతిపరం తస్మాత్సారం బ్రహ్మేతి కథ్యతే" అన్నపూర్ణోపనిషత్ ॥. అనుభవమునకుకూడా చిక్కనిదేదో అదే అత్యంతాతీత శాశ్వతమగు పరిపూర్ణ పరబ్రహ్మము.

"నిర్వాసనా మౌనముద్రా నిష్ఠాస్థితి, సర్వసంపూర్ణ శబ్దచలన రహితముగు అతీతస్థితి," అని వారందురు. కాని యిదియూ సరిగాదు. పర, పశ్యంతి, మధ్యమ, వైఖరీ రూపంగా గానవచ్చే శబ్దచలనము ప్రత్యక్షముగా పిండోపాధులయందు గానవస్తూనున్నది.

శ్రుతి :- యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ

మృత్యోస్సమృత్యుమాప్నోతియయిహనానేవపశ్యతి॥

తాత్పర్యము :- ఏది యిక్కడ (పిండాండమందు) వున్నదో అదే అక్కడ (బ్రహ్మాండమందు) వున్నది. అక్కడనున్నదే యిక్కడున్నది. యిది గుర్తించనివారు జననమరణములు పొందుచునే యుందురు. కనుక పిండ బ్రహ్మాండములయందు సర్వత్ర పర పశ్యంతి, మధ్యమ, వైఖరీ, వాక్కులున్నవనక తప్పదు. శబ్దము (1) ధ్వన్యాత్మకము (2) వర్ణాత్మకము అని ద్వివిధము. అధిష్ఠాన చేతన బ్రహ్మమందు ధ్వన్యాత్మకమగు పరావాక్కు మాత్రమే లేశరూపంగా యున్నది. నిర్వాసనామౌనముద్రానిష్ఠాస్థితియందు గూడ బ్రహ్మము, ఆ బ్రహ్మమునందలి పరావాక్కూ యున్నవని చెప్పి తీరవలసినదే.

శ్లో॥ ఆకాశోహ్యవకాశశ్చ ఆకాశవ్యాపితంచయత్
ఆకాశస్యగుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే॥

ఉత్తర గీత-

బ్రహ్మము నిశ్శబ్ద స్వరూపముగాదా? అని శంకించవచ్చును. నిశ్శబ్దము అనగా శబ్దము అసలు ఏమాత్రమూ లేనేలేదని అర్థము కాదు. గాలియెక్కడా లేదన్నపుడు, గాలి అసలు లేనేలేదని అర్థముకాదు. గాలి వీచుట లేదని మాత్రమే అర్థము. అట్లే "నిశ్శబ్దము" అన్నపుడు

గూడా శబ్దచలనము, ఆ చలనమువలన కలిగేశక్తి, యిత్యాదులు లేవని మాత్రమే అర్థము. కాని అసలు శబ్దమేలేదని అర్థముచేసుకొనరాదు. శబ్దమున్నచో అది యెప్పుడో యొక్కప్పుడు చలనముపొందకతప్పదు. కనుక తత్కాలమందు మాత్రము శబ్దచలనము లేదని మాత్రమే అర్థము చేసుకొనవలసియున్నది. బ్రహ్మమునందున్న పరావాక్కునే నిశ్శబ్దమని వర్ణించియున్నారు అని గ్రహించవలెను. ఈ పరావాగ్రూపమగు శబ్దమును, శబ్దచలనమును గల్గించ గల శబ్దబీజమును వికాసముచెంది అవచ్ఛేదకమై శబ్దశక్తి ప్రవర్తించును.

"యత్కించిత్పదార్థానవచ్ఛేదకావచ్ఛిన్నే శబ్దస్య శక్తిః" అని సూత్రీకరింపబడినది. కనుక అవచ్ఛేదక స్థితి పూర్వదశయందున్నప్రడు శబ్దరహితము అనరాదు. శబ్దము బీజస్వరూపంగానున్నదని మాత్రమే అనవలసియున్నది.

"వేదశాస్త్రములయందు అవాఙ్మానస గోచరముగా యే అతీతాత్యంత కేవల పరబ్రహ్మము అభివర్ణింపబడినదో ఆ బ్రహ్మమే మానిర్వ్యాసనా మౌనముద్రా నిష్ఠానుభవస్థితి. అది "అస్తీత్యేలోపలబ్ధవ్యః" అనిమాత్రమే గ్రహింపనగును మరొక రీత్యా అనుకొనుటకే వీలులేదు" అని యీ సిద్ధాంతపరులందురు. కాని సత్యమగు నా కేవల బ్రహ్మము అస్తి అని కూడా చెప్పుటకు వీలుకానిది ఏలననగా అస్తి-నాస్తి అను

పదములు రెండునూ సాపేక్షికములే. అస్తిపదార్థమొక టున్నది అంటే "నాస్తి" అని చెప్పదగ్గ పదార్థములున్నూ వున్నవనవలసివచ్చును. కనుక నిర్వాసనా మౌనముద్రా నిష్ఠానుభవ గమ్యమగు బ్రహ్మముకూడా అస్తి నాస్తులుగాని నిరపేక్షక పరిపూర్ణ పరబ్రహ్మము (Absolute Brahman) కాదు. అని తేలుచున్నది.

కాని మేము ప్రతిపాదించునది సాపేక్షికం కానేకాదు కేవలనిర్విశేష పరబ్రహ్మ వస్తువును మేము ప్రతిపాదించు చున్నాము కనుక అది నిరపేక్షక పరిపూర్ణ పరబ్రహ్మమే అని విరందురు. ఈనిర్విశేషమేమో యించుక పరిశీలించినచో అది నిరపేక్షకమో సాపేక్షికమో తేలగలదు. స + విశేషము =సవిశేషము అగును కనుక అన్ని విశేషములతోగూడియున్న వస్తువు సవిశేషమనదగును. నిర్ + విశేషము=నిర్విశేషము అనగా ఏవిశేషములతో గూడనిది అని అర్థము. విశేషములు అనగా క్షరాక్షరులు, ప్రకృతిపురుషులు, క్షేత్ర క్షేత్రజులు, త్రిగుణములు, పంచభూతములు, జీవేశ్వర్లు, నవగ్రహనక్ష త్రాదులు, 84 లక్షల జీవోపాధులు, యీ పిండబ్రహ్మం డాది సమస్త దృశ్యాదృశ్య పదార్థములు, తత్వములు మొదలగునవన్నియు విశేషములే. సృష్టియనంతర మీ విశే షములన్నియు గోచరించుచున్నవి. సృష్టికి పూర్వము తన

స్వరూప లక్షణమందున్న అధిష్ఠాన చేతన బ్రహ్మమునందు యీ విశేషము లేమియు కానవచ్చుట లేదు. అయినను దాని యందే యివన్నియు కారణ స్వరూపములో బీజరూపంగా యున్నవి. ఈ స్థితియందా అధిష్ఠాన చేతన బ్రహ్మము నిర్విశేషమని వ్యవహరింపబడుచున్నది. యీ విశేషములన్నియు బహిర్గతములై వికాశము చెందియున్నపుడు ఆ బ్రహ్మమే తటస్థ లక్షణముచే అభివర్ణింపబడినదై సవిశేషమని వాకొనబడుచున్నది. అంతియేకాని నిర్విశేష స్థితియందు విశేషమేమియు అంత్యంతాభావరూపముగ లేకపోవుట లేదు. ఆ భావము నాలుగువిధములు (1) ప్రాగభావము = అనగా కుండ తయారుకాకపూర్వము కుండయొక్క అభావమున్నది. కాని కుండకు ఉపాదాన కారణమైన మట్టి వుండనేవున్నది. (2) ప్రధ్వంసాభావము=అనగా కుండ పగిలిపోయినతర్వాత కుండయొక్క అభావమున్నది. కాని యిందుకూడ కుండకుపాదానకారణమగు మృత్తిక పగిలిన కుండపెంకులయందుండనే యున్నది. (3) అన్యోన్యాభావము. అనగా రెండు వస్తువులను తీసుకొని రెంటిని పరిశీలించి యొకదానియందు మరొకటిలేదు అనిచెప్పుట అన్యోన్యాభావము. యిందుకు దృష్టాంతముగా ఘటమునందు పటములేదు. పటమునందు ఘటములేదు. కనుక ఘటమందు పటాభావము. పటమందు

ఘటాభావము చూచుట అన్యోన్యాభావము. ఘటమునందు పటము, పటమునందు ఘటము వస్తురూపముగా మాత్రమే కనబడుటలేదు. కాని రెంటియొక్క మూలకారణ వస్తువు ఒకటియే అయివున్నందున రెండు వస్తువులున్నూ వున్నవే యగుచున్నవి ఎట్లనగా ఘటకారణమగు మృత్తిక పృథ్వీ భూతములోనిదేకదా ? అట్లే పటకారణమగు, నూలు, పత్తి ప్రత్తిచెట్టు, ఓషధులన్నిటికీ మూలకారణమగు పృథ్వీ, యివి వుత్తరోత్తర మూలకారణములగుచున్నవి గనుక మౌలికముగ ఘటపటముల రెంటికీకారణము పృథ్వీభూతమే అగుచున్నది. కనుక అన్యోన్యాభావముగూడ కేవలాభావ సితికాదు. (4) అత్యంతాభావము=వస్తువునకత్యంత మూల కారణమగు వస్తువు అసలు లేనేలేనప్పుడే అత్యంతాభావము అని చెప్పనగును. కనుక వీరు నిర్విశేషమని వర్ణించేవస్తువు నందు సర్వవిశేషములు, అత్యంతాభావ రూపముగ లేనే లేవని చెప్పరాదు. ఈ నిర్విశేషమే సృష్టికి మూలకారణమగు బ్రహ్మముగానున్నది. దీనినుండే జీవేశ్వర జగత్తులు ఆవిర్భావ తిరోభావములు చెందుచున్నవి. కనుక యీ బ్రహ్మము ఒకప్పుడు (సృష్టికి పూర్వం) నిర్విశేషముగాను సృష్ట్యనంతరం సవిశేషంగానూ వర్ణింపబడుచున్నది. సవిశేష, నిర్విశేషములు ప్రతియోగి శబ్దములు. పరస్పర సాపేక్షిక

ములు కనుక వీరి నిర్వాసనా మౌనముద్రా నిష్ఠాగమ్యము అత్యంతాతీత కేవల నిరపేక్షక బ్రహ్మము (Absolute Brahman) కాదు.

శ్రుతి : "రసోవైసహ........" ఈ నిర్విశేష పర బ్రహ్మము కేవలము రసస్వరూపము. కనుక నిరపేక్షకమై యున్నది అని కొందరనవచ్చును. కాని అదియునుసరికాదు. రస, బలములు రెండునూ సాపేక్షిక పదములు. కేవల రసమున కునికియున్నట్లు చెప్టుట సరిగాదు. రసగర్భమున బీజరూపముగా బలమును, బలగర్భమునబీజరూపంగారసమున్ను వుంటూనే వున్నవి. మరియు రసమునకు బలము స్థూలమై ఆవరణముగా యుంటూవున్నదే గాని రసము కేవలం నిరావరణముగాలేదు. కనుకనే

శ్రుతి :- "నాయమాత్మా బలహీనేన లభ్యః"

తా॥ రసస్వ రూపమనదగిన ఆత్మ "బలము" (ఆవరణము) లేకుండా యెన్నడూవునికిగలిగియుండజాలదు. కనుక రసబలములు రెండూ ఒకదానియందొకటి ఓతప్రోతమై (వస్త్రమునందలి పడుగు పేకల రీతిగా) నున్నవి. మరియు "అంతరం మృత్యోరామృతం, మృత్యోరామృతమాహితం" అను వాక్యంగూడ దీనినే బలపరచుచున్నది. కనుక నిర్విశేషము రసస్వరూపము. సవిశేషము బలరూపము; నిర్విశే

షము అసద్రూపము సవిశేషము సద్రూపము. మరియు

(1) "సఏకాకీనరమతే" :- తా॥ ఒక్కడై అతడు ఆనందించుచుండెను. యిది నిర్విశేషమును సూచించుచున్నది.

(2) (a) సోఽకామయతబహూస్యాం ప్రజాయేయ

(b) తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్

తా॥ అతడనేకులుగా కావలెనని కోరెను. వానిని సృష్టించి వానియందు తానను ప్రవేశము గావించెను. యిది సవిశేషమును సూచించును. మరియు "మీాయతే అనేన యితిమాయా" అను నిర్వచనానుసారంగా, ఒక మితిలోనికి అనగా ఒక ఆవరణములోనికి తీసుకొనివచ్చునది ఏదో, అదే మాయ. ఈ మహామాయచే సీమాబద్ధం చేయబడని స్థితిలో "సఏకాకీనరమతే" = అతడొక్కడూ ఆనందించుచుండెను. సీమితం చేయబడిన పిదప "సోఽకామయత బహూస్యాం ప్రజాయేయ" = అనేకము కావలెనని అతడు కోరెను. ఆ మహామాయా ప్రభావమింకనూ అంటని స్థితిలో నిర్విశేషము. దానిప్రభావమునకు లోబడినచో అదియే సవిశేషమగుచున్నది. కనుక సవిశేష నిర్విశేషములు రెండూ ఒక్కటే.

ఏ భావములూ కలుగని స్థితియందే దానికి నిర్విశేషమని పేరువచ్చినది, అని పైచర్చవలన తేలినది. కాని దాని

స్వభావము మాత్రము దానికుండనేయున్నది. అది (అనిర్విశేష బ్రహ్మము) తాను తానై ఏమార్పునకూ గురికాకుండా వుండుటయు, పిదప మార్పుకు గురియగుటయూ, దానిస్వభావము. స్వ + భావము = స్వభావము = తనయొక్క సహజమగు లేక నైసర్గికమగు పద్ధతి. ఇందు "స్వ" మాత్రము స్థిరముగా నున్నదికాని భావము మార్పు చెందుచున్నది. భావము ఏకరూపంగానుండక సృష్ట్యాది కామనలు కలుగుచున్నవి. ఆ విధముగా భావన లస్థిరములై మార్పు చెందుచూ వున్నను "స్వ" ను విడచి వానికి యునికి లేదు. మరియును ఏదో యొకభావన యెప్పుడును "స్వ" నుపట్టియే యుండును. సాక్షి భావము, సృష్టి మొదలగు భావనలు, ఒకటి విడచి మరొకటి దానికి కలుగుచున్నవి. సాక్షి భూతముగనుండుట గూడ కర్మయే. కాని అది గతి (చలనరూప) మగు కర్మ మాత్రము కాదు. అది స్థితిరూప కర్మయని మాత్రమే అనవలసి వచ్చుచున్నది. ఈ నిర్విశేషబ్రహ్మమే ఒకప్పుడు నిస్సంకల్ప స్థితియందునూ మరియొకప్పుడు సంకల్ప స్థితి యందునూ యుంటూ యున్నది. కనుక అది ద్వంద్వ లక్షణములు గల్గియున్నదే గాని ద్వయదోషవిదూరమైనది కానేకాదు. ఈ నిర్వాసనా మౌనముద్రానిష్ఠానుభవమును అమనస్కమనియున్నూ అనరాదు. ఏలననగా

శ్రుతి :-"ఆత్మా ఉ ఏకస్సన్ ఏతత్త్రియం" ఛాం॥ఉ॥ అనగా సత్ రూపమగు ఒక్కటైన ఆత్మ మూడువిధములుగా నున్నది. "సత్" అనగానేమి ? శ్రు॥ "మనః ప్రాణవాచా సంఘాతంసత్తా" = మనః ప్రాణవాక్కులే సత్ స్వరూపము. మరియు "సవాఏష ఆత్మా మనోమయః, ప్రాణమయః, వాంగ్మయః, అని మరియొక ఛాందోగ్యశ్రుతి చెప్పుచున్నది యివన్నియు విశేషములే. కనుక యీ విశేషములు లేనిదే నిర్విశేషంగదా! మనః ప్రాణవాక్కులు సత్ అయితే దానిని మీరినది యిక అసత్తే అనక తప్పదు. ఈ అసద్గర్భ మున బీజరూపముననున్న సత్, మనః ప్రాణవాక్కులుగా వున్నందున అసత్ గర్భమున కూడ ఆ మనః ప్రాణవాక్కు లున్నట్లే. కనుక అసత్ స్వరూపము నందున్న మనోబీజ ములున్నవనక తప్పదు. కాబట్టి నిర్వాసన మౌన ముద్రా నిష్ఠాస్థితియందు మనస్సున్నది కనుక అది అమనస్కమనిన్ని అనరాదు.

ఈ సవిశేష నిర్విశేషములనే సధర్మకమనీ, నిర్ధర్మక మనీగూడ పర్యాయ పదములచే వాడవచ్చును. కూటస్త మునధర్మకము. కూటస్త వ్యాపకము నిర్ధర్మకము. కూటస్థ మునే "సర్వధర్మోపపన్నశ్చ" అన్నారు. అనగా సర్వధర్మ ములతో గూడియుండును అని అర్థము. అంటే యేధర్మ

ముతోనూగూడా నది కూడకనూ యుండవచ్చును. అని ధ్వనివల్ల గ్రహించనగును. "సర్వధర్మోపపన్నశ్చ" అను స్థితియే సత్ స్వరూపము. నిర్ధర్మకస్థితియే సర్వసమాధ్యభావరూపనుగు నిర్వాసనా మౌనముద్రానిష్ఠ. ఇది అసత్ స్వరూపము. ఒకప్పుడు సద్రూపముగానూ మరొకప్పుడు అసత్ రూపంగాను యుండు యీ రెండు రూపములే వరుసగా అద్వైతుల సామాన్య, అతీత సిద్ధాంత గమ్యములై యున్నవి. ద్వంద్వ స్వరూపముగానుండునదియే మాయ అని ఆదిశంకరులు వివేకచూడామణిలో

శ్లో॥ సన్నాప్యసన్నాప్యుభయాత్మికానో
భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికానో . సాంగాప్య
నంగాన్యుభయాత్మికానో, మహాద్భుతాఽనిర్వ
చనీయరూపా॥

అను శ్లోకముద్వారానిర్వచించియున్నారు. కనుక అనిర్వచనీయము, మహాద్భుతమూనగు మాయాప్రభావమున కివి లోబడినవిమాత్రమేననకతప్పదు మరిన్ని నిర్విశేషమని పేరు పెట్టబడిన యీ బ్రహ్మమునకు కేవల అచలలక్షణమున్ను లేదు. కనుక దానిని అచల శబ్దముచే వాడరాదు నిర్విశేషమగు ఆ బ్రహ్మము, తాత్కాలికముగ స్థితిరూపముగ చలించకయున్న కాలమున,దానియందే,బీజరూపముగ నణగి

యున్న గతిరూపచలనము కానరాదు. అంతమాత్రముచే యెన్నటికీ చలించని అచలలక్షణము దానికిలేదు. అపుడ చల రూపముగనున్న ఆ నిర్విశేషమే, యిపుడు చలనరూప సవి శేషమగుచున్నది. యీ చలాచల ద్వంద్వలక్షణములు గల బ్రహ్మమును ఈశావాస్య శృతియట్లు వర్ణించుచున్నది. శృతి॥ తదేజతి, తన్నైజతి, తద్దూరే తద్వదంతికే, తదంత రస్యసర్వస్య తదుసర్వస్యాస్యబాహ్యతః బాహ్యతః॥ తా॥అది చలించును, అదిచలించదు, అది దూరముగ నున్నది మరియు అది దగ్గరగనూయున్నది. అది సర్వాంతరముగ నున్నది. సర్వమునకు బాహ్యమునగూడనదియున్నది.

కనుక తాత్వికముగ నిష్పక్షపాతముగ విమర్శించినచో నిర్వాసనా మౌనముద్రా నిష్ఠారూప వేదాంతవార్తిక సిద్ధాం, తముగూడ ద్వంద్వస్వరూప లక్షణములుగల మాయాబ్రహ్మ మునే ప్రతిపాదించుచున్నది. "అస్తి-నాస్తులు" రసబలములు సదసత్తులు, భావాభావములు, స్థితిగతులు లేక చలాచలములు మొదలగు ద్వయదోషములకెల్లనది యాలవాలమైయున్నది. మరిన్ని తుట్టతుదకు అసద్రూపమగుశూన్యస్థితినే అనుభవము నకు తెచ్చుచున్నది. కాని నాసదాసీన్నో సదాసీత్తదానం అని ఋగ్వేదాంతర్గత నాసదీయ సూక్తంలోనూ "నసత్త న్నాసనుచ్యతే" అని భగవద్గీతలోనూ చెప్పబడిన "సదసద్రి

హితమయి" నట్టిన్ని సర్వద్వంద్వాతీతమైనట్టిన్ని నిరపేక్షక కేవల పరిపూర్ణ బ్రహ్మమును **(Absolute Brahman)** యుపలక్షించుటలేదు. తాము ప్రతిపాదించే నిర్విశేష బ్రహ్మమే యీ సదసద్రహిత కేవల పరిపూర్ణ బ్రహ్మమనీ తాము చెప్పే నిర్వాసనా మౌనముద్రా నిష్ఠారూపమగు యీ వేదాంత వార్తికమే అత్యంత చరమసిద్ధాంతమని యీ సిద్ధాంతపరులు పొరబడుచున్నారు. నిరపేక్ష కేవల పరిపూర్ణ బ్రహ్మ విషయకమగు అతీత శ్రుతులను యేరి, వానిని సంకుచితపరచి అనగా మట్టుగించి, అవి తాము ప్రతిపాదించే నిర్విశేష పరబ్రహ్మమునే సూచించుచున్నవి. అని వీరు సరిపెట్టుకొన్నారు.



శ్రీ గురుభ్యోనమః

# పరిపూర్ణదర్శనము

## పరిపూర్ణబోధ ప్రకరణము

అద్వైతసిద్ధాంతమును బహుక్లుప్తంగా చెప్పాలంటే "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః" అని అంటారు. అట్లానే ఒక్కముక్కలో యీసిద్ధాంతమును తెలియపరచాలంటే "పరిపూర్ణమునూ, లేనెరుకనూ, యెఱిగి యెరుకను మానుము" అని యీసిద్ధాంతం చెపుతుంది. ఇదే భావము. "అశరీరం సర్వదా అస్తి, శరీరరహితం సదా ఆయమేవ సద్యోముక్తి రన్యథాభ్రమకారణం" అనే శ్లోకం వల్ల వ్యక్తమౌతోంది. ఈ ఒక్కవాక్యములో తాత్విక నిర్ణయంతోపాటు కర్తవ్యంకూడా వుపదేశింపబడుతూన్నది (1) పరిపూర్ణము (2) లేనెరుక, యీరెంటినీ గురుముఖంగా విచారించితెలిసుకోవడం తాత్వికపరిశోధనకు సంబంధించినది తదుపరి ఆరెంటినీ యేయెరుకచే గ్రహించితివో ఆ యెరుకను వదలివేయుమని కర్తవ్యోపదేశం చేయబడుతోంది.

పరిపూర్ణ పరబ్రహ్మమనీ, బయలనీ, బట్టబయలనీ ఉత్తబట్టబయలనీ,పరమపదమనీ, గురుగుహ్యామనీ, అనంతమనీ స్థిరమనీ అచలమనీ మొదలగుపేర్లు నిరపేక్షక కేవల

బ్రహ్మము (Absolute Brahmam) నకు వ్యవహారార్థం కల్పించబడ్డాయి. నామరూపాలు మిథ్యఅనీ, కల్పితములనీ, కేవల బ్రహ్మమొక్కటే సత్యమనీ, శాస్త్రము ఉద్ఘోషిస్తున్నాయి. కనుక ఏ నామమున్నా పనికిరాదు. ఐనా అచలము, బయలు, బట్టబయలు, ఉత్తబట్టబయలు, పరిపూర్ణము అని యీ సాంప్రదాయమునందు ఆ కేవల బ్రహ్మమును వాడుచున్నారు. కాని అందందు, అచలము, బయలు, పరిపూర్ణము, అనే మాటలు భిన్నభిన్నార్థములలో వాడబడ్డాయి. పరిపూర్ణమనేమాట ఒక్కటే, కేవల బ్రహ్మమును సూచించుటకు వాడబడింది. కనుక ఆ ఒక్కమాటలోనే దానిని వాడుతున్నాము.

## పరిపూర్ణము.

ఈ సిద్ధాంతమును ఉద్ధరించిన శ్రీ శివరామదీక్షితుల వారు దీనిని యీ క్రిందివిధముగా వివరించారు.

"పుట్టనిదీ-చావనిదీ, రాకడ-పోకడ లేనిదీ, సకల దేశాలయందు, సర్వకాలాలయందు, సమస్తమైన వస్తువుల యందు, మొదలు కొన లేక, చలించక, వక్కతీరుగా, తనకు తానే స్వతస్సిద్ధమై, యున్నది."

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"

అనగా, వాంగ్మనస్సులు దేనిని తెలియక వెనుకకు మరలినవో, అట్టి పరిపూర్ణబ్రహ్మమునుగూర్చి చెప్పాలంటే, యింతకంటే సమగ్రంగా చెప్పటం కష్టం.

ఈ వాక్యం కూడా శిష్య ప్రబోధార్థం చెప్పిందే కాని మరోకటికాదు. యిదియొక నిర్వచనం మాత్రంగాదు. ఎందుకంటే, యిందలి శబ్దాలన్ని ప్రతియోగి శబ్దాలను అపేక్షిస్తున్నాయి. కనుక సాపేక్షిక (Relative terms) శబ్దాలు మాత్రమే అయివున్నాయి. పుట్టందీ-చావందీ, అంటే పుట్టేదీ-చచ్చేదీ, వుందన్నమాట. అట్లే మిగతా శబ్దాలు కూడానిజంగాచూస్తే, నిరపేక్షక శబ్దాలంటూవుండడానికే వీల్లేదు. అన్ని సాపేక్షిక పదాలే. తల్లి అనగానే బిడ్డమాట గుర్తుకొస్తుంది. తల్లీ, బిడ్డా అనే రెండుమాటలూ ఒకేసారి పుడతాయి. తల్లి అంటే బిడ్డవున్నదన్నమాటే. బిడ్డవున్నదంటే తల్లి యున్నదన్నమాటే. ఇవే సాపేక్షిక పదాలు. పరిపూర్ణబ్రహ్మము కేవలం నిరపక్షేకమైనది. అట్టి దానిని సాపేక్షిక శబ్దాలచే చెప్పడమేతప్పు. అయినా చెప్పటం అవసరమై యేదోరీతిగా చెప్పేరన్నమాట. ఎట్లాచెప్పేరంటే "నేతినేతినేతీతిహోవాచ" అనగా యిదికాదు. యిదికాదు అంటూ, కాని దానిని వివరించిచూపి, యితి అనిచెప్పడానికి వీలులేనిదిన్ని, "యితి" అను యేవస్తువున్ను, తనయందుకల్గి వుండనిదిన్ని, అగు పరిపూర్ణముయొక్క వునికిని వుపలక్షింపచేసారన్నమట.

పరిపూర్ణ పరబ్రహ్మము, పలుకున పలుకగరానిది. తలపులకందనిది, సర్వనిరపేక్షకమైనదనీ అంటే, సర్వలక్షణ విలక్షణత్వమే దానిలక్షణమనాలి. అది భావపదార్థమా అంటే భావించేవస్తువుయొక్క రహితమందే అది స్వతస్సిద్ధం. అభావపదార్థమా అంటే భావపదార్థమొకటుండి దాని లేని స్థితిని చెప్పదలచినపుడు దాని అభావమును నిర్ణయిస్తారు. భావాభావములొకదానిపైనొకటి ఆధారపడినశబ్దాలు కనుక ఆ రెంటి రహితమునందే పరిపూర్ణ పరబ్రహ్మ నిశ్చయము. పోనీ శూన్యమా? అంటే. శూన్యమని గుర్తించుటకు గుర్తించే వాడూ, వాని గుర్తూ, కూడా లేనిస్థితి అది కనుక శూన్యమున్నా కాదు. ఏమని అందామన్నా, అనేవ్యక్తీ, ఆతనివాక్కూ, రెండూ లేనిస్థితిఅది. కనుకనే, అది ఏమనీ అనరానిదని, వూరుకొన్నారు. చివరకు "అస్తీత్యే వోపలబ్ధవ్యః" అని దానిని అస్తిపదార్థమని అందామా? అంటే అస్తీ అనేపదము "నాస్తి" అనేపదాన్ని, అపేక్షిస్తూంది. కనుక అది అస్తినాస్తులు కానిది ఐనను "అస్తీతిబ్రువతోఽన్యత్ర కథంతదుపలభ్యతే" అనగా "అస్తి" అని చెప్పుటకంటె. అనగా అదివున్నది, అని చెప్పుటకంటే మరొక విధంగా ఎట్లుద్యోతకపరచాలి? కనుక సాపేక్షికపద మైనా మరొకగతి లేక "అస్తి" అని దానిని వాడినారన్న

మాట. అట్లే సదసత్తులు, విద్యావిద్యలు, అమృతమృత్యువులు, ప్రకాశాప్రకాశములు, జ్ఞానాజ్ఞానములు, దక్దృశ్యములు, చిజ్జడములు యిత్యాది సర్వద్వంద్వములు కానిది. అట్లే జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు, అనే అంతరత్రిపుటి, ద్రష్టా దృక్దృశ్యములు అనే మధ్యత్రిపుటి, కర్త కర్మ క్రియలనే బాహ్యత్రిపుటి, ఏమీలేనిది. అట్లే సద్ఘనము, చిద్ఘనము ఆనందఘనమున్నూ కాదు. సచ్చిదానందములు. అనృత జడదుఃఖములకు, ప్రతియోగి పదార్థములై సాపేక్షికములై యున్నందున, అది సచ్చిదానంద వస్తువున్నూ కాదు. అది ప్రజ్ఞానఘనమూ, చిన్మాత్రమూ కాదు. ఏలననగా దానికి యెరుక (తెలివి, జ్ఞానము, గుర్తు యిత్యాదులు) లేనే లేవు. వ్యష్టియందు వ్యవహార భేదమునుబట్టి యీ యెరుకే జ్ఞాన మనోబుద్ధిచిత్తాహంకారములుగా యున్నది. యిందు మనస్సు ("మనోహిజతువత్") లక్కలాంటిది. లక్క కరిగించియే మూసలో పోస్తే, తదాకారమును వహిస్తుంది. మనస్సున్ను అట్టిదే. తెలియబడే ప్రతిపదార్థమునకున్ను పరిమితి, లేక ఆవరణము వుంటుంది. ఆవస్తువును తెలుసుకొనేతెలివి లేక మనస్సు తదాకారమునుధరిస్తుంది. అపుడే ఆవస్తువు తెలియబడింది అవుతోంది. తెలివి ఆవిధంగా వస్తురూపంవహించి నపుడే "తన్మయం" అవుతుంది. అంటే తదాకారంగా

పరిణమిస్తుంది. అదే వస్తుసాక్షాత్కారమంటే అపుడు అన్య వస్తుగ్రహణముండదు ఐతే, ఒకేకాలమందు అనేక వస్తువులు కనబడి గ్రహింపబడుటలేదా? అని శంకింపవచ్చు. కాని ఆవిధంగా అనేకవస్తువులు ఏకకాలమందు తెలివిచే గ్రహింప బడినపుడు, ఏవస్తువున్నూ, సమగ్రంగానూ, సంపూర్ణంగానూ మాత్రం గ్రహింపబడటంలేదనిగుర్తించాలి. అణుప్రమాణం, మధ్యప్రమాణం, మహత్ ప్రమాణం, అని ప్రమాణం మూడువిధములు. అన్ని వస్తువులూ ఏదోయొక ప్రమాణంలో వుండడంతప్పదు. కనుక అయావస్తువులను గుర్తెరుగునపుడు తెలివికూడా ఆయా ప్రమాణాలనువహిస్తూ. గొప్ప కురుచలు అవుతూంటుంది. కనుకతెలివి ఆయా మార్పులుచెందుతూ వుందన్నమాట. ఖండఖండములుగా గానవచ్చే యీ వ్యష్టి తెలివియే, సమష్టియందు అఖండరూపమగు తెలివి, లేక ప్రజ్ఞా నము, గాయున్నది. కాబట్టి, యీ వ్యష్టి సమిష్ట్యాత్మకమగు ఆ తెలివి, ఏమార్పులూ యెన్నడూ యెరుగక ఒక్కతీరుగా వుండే, పరిపూర్ణ పరబ్రహ్మము యెన్నటికీ కాజాలదు.

మరిన్నీ తెలివి వుపాధివుంటేనేగానివుండదు. తెలివీ దేహాల్లో ఓదాన్నివదలి మరోటివుంచదు. తెలివిసూక్ష్మము దేహము స్థూలము. స్థూలముంటేనే దాని సూక్ష్మరూపమైన తెలివి దానియందు వుంచడానికి అవకాశముంటుంది.

ఏవస్తువుయొక్క సూక్ష్మమైనా, ఆ వస్తువుయొక్క స్థూలమందే సాధారణంగా వుంటుంది సాధారణంగా అని ఎందుకనవలసి వచ్చిందంటే, ఆకాశము అన్నిటి కంటె సూక్ష్మము ఆయివుండి, అన్నివస్తువుల భాహ్యా భ్యంతరములయందు వుండివున్నది. అట్లే ఆత్మయున్నూ పరిపూర్ణ పరబ్రహ్మం స్థూలమూకాదు, సూక్ష్మమూకాదు. మరొకటిలేదు. అనేది సిద్ధాంతం (బ్రహ్మణోన్యంనకించన) కనుక పరిపూర్ణము దేనికిసూక్ష్మము? దేనికి స్థూలము? అని అనాలి? కనుక పరిపూర్ణ పరబ్రహ్మమునకు స్థూలరూపంగా గాని సూక్ష్మరూపంగా గాని తెలివి (యెరుక) లేదు.

వస్తువన్న ప్రతీది ఒక అవరణకల్గి వుంటుందికదా! అట్టిప్రతిదానియందూ తెలివివున్నదా? అని ప్రశ్నరావచ్చు. ఏదో ఒకరూపంగా ప్రతిదానియందూ, (ఒక్క పరిపూర్ణ పర బ్రహ్మమునందు తప్ప- పరిపూర్ణము వస్తువేకాదు) తెలివి వుందనే అనాలి. ఉదా:- ఒక యిటుకముక్కయందుకూడా దాని అణువులను అన్యోన్యంచేర్చి పట్టుకొనే శక్తిరూపంగా, తెలివివున్నదనే. అనాలి అపమేపగాంవాక్కనబడును. కనుక కేవలం చేతనమునిగాని. కేవలం జడమనిగాని, ఏవస్తువునూ అనరాదు. పరిపూర్ణపరబ్రహ్మమీ చిజ్జడములలో, యేదీ కాదు. ఆరెండింటి యేకరూపమున్నూ కాదు. కనుక

పరిపూర్ణ పరబ్రహ్మమునందు తెలివి (లేక యెరుక) గాని, దాని పరిమాణరూపమగు మరుపుగానిలేదు. ఎరుక మరుపులులేనిదే పరిపూర్ణ పరబ్రహ్మము.

(1) "పరిపూర్ణము పుట్టనిదీ, చావనిదీ" :- ఒకపుడు లేకుండావుంటే పుట్టిందనాలి, లేక చచ్చిందనాలి, కాని, ఎప్పుడూ (సర్వకాలములయందూ) వున్న దానికి పుట్టుకేమిటి? చావేమిటి? పుట్టినది ప్రతీదీ చస్తుందికదా! పుట్టనిదంటే చాలదా? "చావనిది" అనికూడా ఎందుకనాలి? చాలదు ఎందుకంటే- మాయ అనాది అన్నారు. అనగా "ఆది" (పుట్టుక) లేనిదనికదా అర్థం? కాని బ్రహ్మజ్ఞానంవల్ల మాయ నశిస్తోంది కనుక పుట్టుకలేనిదైనా నాశనమౌతోంది. ప్రాగ భావ, ప్రధ్వంసా భావములను విచారిస్తే, యింకా యీవిష యం బాగాస్పష్టపడుతుంది. వస్తూత్పత్తికి పూర్వమావస్తువు లేదనుట ప్రాగభావము. యీ అభావమునకు దృష్టాంతము. ఘటోత్పత్తికి పూర్వం ఘటములేదు అనుట. ఈ అభావము నకు ఆది ఎప్పుడు? అంటే ఎవరూ చెప్పలేరు. కాని కుండ తయారగుటతోనే యీఅభావము అంతమగుచున్నది. కనుక ఈ ప్రాగభావము అనాదియేగాని, సాంతము, అనగా నాశ నముకలది. ప్రధ్వంసా భావమనగా వస్తునాశనమైన పిదపకలు అభావస్థితి. అనగా ఘటనాశముతో యీ అభావస్థితిపుట్టి

అనంతంగా యీ అభావమట్లనే యుంటున్నది. అనగా ప్రధ్వంసాభావము పుట్టుతోంది కాని చచ్చుటలేదు. అట్లే "సత్కార్యత్సంజాయతే జ్ఞానం" అని జ్ఞానమునకు పుట్టుక నిర్ణయించినారు. ఐతే "జ్ఞానాదేవతు కైవల్యం" అనగా అజ్ఞానము పరబ్రహ్మమే కనుక, దానికి నాశనము లేదని యితరులంటూ వున్నారు. ఆదిసాదికాని అనంతము. అనగా పుట్టునుగాని గిట్టదు. కనుక అతివ్యాప్తి, అవ్యాప్తి దోషపరిహారార్థం. పుట్టదు, గిట్టదు అని రెండుమాటలచే చెప్పబడినది.

తాను పుట్టనిదీ చావనిదీ కనుక పరిపూర్ణపరబ్రహ్మము యితరమును పుట్టింప జాలదు. గిట్టింప (చంప) నూ జాలదు. ఏలననగా విచారించి చూస్తే సృష్టిలో పుట్టుక వున్న ప్రతీ జీవి తనవంటి మరొకటి జీవిని ఉత్పత్తిచేయటానికి సమర్థత కలిగివున్నది. ఉదాహరణ :- వృక్షబీజములు. యివి పరస్పర కార్యకారణములుగా వుంటూవున్నాయి. పుట్టేటప్పుడే కార్యకారణ రూపంగా పుడుతున్నాయి. పోయేటప్పుడు కూడా కార్యమును తనయందిముడ్చుకొనే కారణం పోతూవున్నది.

"సతోహి మాయయా జన్మ యుజ్యతేనతు తత్వతః
తత్త్వతో జాయతే యస్య జాతం తస్యహిజాయతే"
(మాండూక్య కారికలు వైతథ్య ప్రకరణము 27.)

అనగా పుట్టనిదానినుండి ఏదియు పుట్టజాలదు పుట్టినదానినుం డియే మరొకటిపుట్టును. దీనినే అన్వయ వ్యతిరేకంగా చెబితే పుట్టించుటు కారణమైనదేదో అనగా సృష్టికారణమైనదేదో అది పరిపూర్ణపరబ్రహ్మం కాదు. అని అనకతప్పదు. కనుక పరిపూర్ణపరబ్రహ్మమున కన్యముగాతోచబడు వానిలో దేని కిన్ని పరపూర్ణ పరబ్రహ్మము మూలముకాదు. అని సిద్ధించు చున్నది. కాబట్టి పరిపూర్ణ పరబ్రహ్మము తాను పుట్టలేదు. యితరమును పుట్టించలేదు. పరిపూర్ణపరబ్రహ్మము మాత్రమే, అజమూ-అమృతమూ, (అనగా పుట్టనిదీ- చావనిదీ) అయి వున్నది. సృష్టికారణమైనదానిని, బ్రహ్మము (అనగా బృహత్పదార్థము భూమీ పదార్థము, గొప్పపదార్థము) అని, వాడినా, అది అజమూ అమరమూనగు, పరిపూర్ణ పర బ్రహ్మముమాత్రం కాదు.

2. "రాకడా పోకడా లేనిది" :- అనగా, పరిపూర్ణము నకు గమనాగమనములు, ఆవిర్భావ తిరోభావములు లేవు అని అర్థము. సకల దేశములయందున్నది గనుక ఎక్కడ నుంచి రాగలదు ? మరెక్కడకు పోగలదు ? మరియు ఏక రూపంగా వున్నదానికి, ఆవిర్భావం (కనబడటం), తిరోధానం (మరుగుపడటం) వుండవు. దానికి స్వయంగా ఆవిర్భావ తిరోభావములు లేనప్పటికీ, మరొకదానివల్ల దాని

కట్టిస్థితి కలుగకూడదా? అంతే, మరొకవస్తువు లేనేలేదు. "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన్యముహ్యంతి జంతవః" (గీత-" జ్ఞానమును, అజ్ఞానము ఆవరించినట్లుగా పరిపూర్ణపరబ్రహ్మ మును ఆవరించువస్తువేదియూలేదు. దానియందు ఆవరణ విక్షేపశక్తులున్నూ లేవు. అది "నిశ్శక్తి నిర్మలంపూర్ణం. అని చెప్పబడుతోంది. ప్రాణముంటేతప్ప చలనముండదు ప్రాణరూప చలనముంటేగాని శక్తిన్నీ యుండదు. రజోగుణ ముంటేగాని యీ రెండూ వుండవు. గుణత్రయముగాని, ప్రాణముగాని; శక్తిగానిలేని పరిపూర్ణపరబ్రహ్మమునకు రాకపోకలు వుండుటకెట్టి సావకాశమూలేదు. యితరులు చెప్పినసృష్టికారణమగుబ్రహ్మ పదార్థమునందు, యివన్నీ యు న్నవి. కనుకనే సృష్టిప్రళయములనే ఆవిర్భావ తిరోభావ ములకు కారణమగుచున్నవి. చలనకారణమగు రజోగుణమూ బ్రహ్మనందు బీజభావముననున్నది కనుకనే, తన అఖండ స్వరూపస్థితినుండి చ్యుతమై "బ్రహ్మణోరవ్యక్తాన్ అవ్య క్తాన్మహత్.... ...." అని శంకరాచార్యులవారు చెప్పిన రీతిగా రూపాంతరాలు పొందుతోంది. తాను తానై నిలచిన స్థితియందు బ్రహ్మమనిన్నీ, దానిప్రథమ చలనరూపమైన స్థితికి అవ్యక్తమనిన్నీ, నామకర్ణంచేసారు. అవ్యక్తమే మూల ప్రకృతిఅనిన్నీ, ప్రధానమనిన్ని, నామాంతరములచేవ్యవహ

రిం బపడుతూ జడవస్తువుగాకూడా యెంచబడుతోంది. కనుక యీఅవ్యక్తస్థితియందు బ్రహ్మముతన చిత్స్వరూపమునుండి దిగజారి, అఖండజ్ఞానమునను గోల్పోయి, అజ్ఞానరూపమై పోయింది. అంటే యీబ్రహ్మమునకు రాకపోకలున్నవనే చెప్పాలి. వ్యష్టియందు పరిశీలించిచూస్తే యీవిషయం మరీ సువ్యక్తమౌతోంది. ఎట్లనగా జాగ్రదవస్థయందున్న పరిపూర్ణ జ్ఞానము, స్వప్నావస్థయందుక్షీణించి, సుషుప్త్యవస్థయందు పూర్తిగా మరుగగుచున్నది. కనుక జ్ఞానరూపమైన యితరులుచెప్పే బ్రహ్మవస్తువునకు ఆవిర్భావ తిరోభావములు, వున్నవని తెలుస్తోంది. రాకడపోకడలు లేనిదొక్క పరిపూర్ణ బ్రహ్మమే.

ఐతే అద్వైత సిద్ధాంతములో, అవ్యక్తం, మూల ప్రకృతి, అని, చెప్పబడేది మాయగా నిరూపించారనిన్ని అధిష్ఠాన పరబ్రహ్మము మాయగా (అవ్యక్తంగా) మారనే లేదనిన్ని "యామాసామాయా" అనగా ఏది లేనిచో అదే మాయ అనిన్ని, కనుక అద్వైతులునిర్ణయించిన పరబ్రహ్మ వస్తువునకుకూడా రాకడపోకడా లేవనిన్ని, శంకింపవచ్చును. కాని యీ పూర్వపక్షమెంత సమంజసమో కొంచెం విమర్శించిచూడాలి. బ్రహ్మమే జగత్కారణమని శ్రుతిస్మృతులు ఘోషిస్తున్నట్లు, మనం సృష్టివిజ్ఞాన ప్రకరణంలో తెలుసు

కొన్నాము. అద్వైతులు మాత్రం. జగత్తు బ్రహ్మ వివర్తమనీ మాయాపరిణామమనీ, అంటారు. మరిన్నీ మాయ కాశ్రయమైనవస్తువేది? అంటే బ్రహ్మమేననిఅంటారు. అయి నప్పటికిబ్రహ్మంస్వగతభేదములేనిదిఅంటారు. మళ్లీఈమాయ బ్రహ్మముయొక్కశక్తి అంటారు. యీవాక్యాలన్నిటి సమా హారమందు ఒకేఒకనిర్ణయం తప్పనిసరిఅవుతూంది. ఆనిర్ణ యమేమంటే :- ఆబ్రహ్మమే మాయ, మాయయే బ్రహ్మము. ఈరెండూ ఓతప్రోతమై అవినాభావసంబంధం కల్గియున్నవి. వస్తునిశ్చయ జ్ఞానం కల్గినవారికీవిషయం అనుభవగమ్య మౌతోంది. కనుక అద్వైతసిద్ధాంతమునందు బ్రహ్మవస్తువు అని అనబడేదానికికూడా, రాకడపోకడలుకలవనే అనాలి. ఈ మాయబ్రహ్మల సమిష్టిరూప ఏకైకవస్తువునే పరిపూర్ణ భావజ్ఞులు "లేనెరుక" అని నామకరణంచేసారు.

3. "సకల దేశాలయందు, సర్వకాలాలయందు, సమస్త మైన వస్తువులయందు" :- దేశమనగా ప్రదేశము, లేక చోటు **(Space)** సకల దేశాలయందూ వుందంటే అదిలేని చోటంటూ లేనేలేదన్నమాట. వస్తువును ద్రవ్యముఅంటారు. వైశేషికదర్శనము, నవవిధద్రవ్యములను నిర్ణయించినది. పృథివ్యాది పంచభూతములు, కాలము, దిక్కులు మనస్సు' ఆత్మ, అనునవే నవవిధ ద్రవ్యములు. ప్రతిద్రవ్యమునకూ

ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ, అభావములనే యేడులక్షణాలుంటాయి. పరిపూర్ణ పరబ్రహ్మమునందు యీనవవిధ ద్రవ్యములుకాని, వానిలక్షణములుకాని లేవు. అది ద్రవ్యనుకానేకాదు. ద్రవ్యములన్నియు ఆ పరిపూర్ణ పరబ్రహ్మమునందు అభావస్థితిని పొందుచున్నవి. ఐననూ వస్తువు లేక ద్రవ్యము ఒక ప్రదేశమును ఆక్రమించినట్లు గోచరిస్తూయున్నది అవకాశరూపమైన ఆకాసము వస్తువుయొక్క బాహ్యాభ్యంతరములయందున్ననూ, స్థూల దృష్టికి వస్తువు వల్ల అఖండరూపమైన ఆ ఆకాశము ఖండఖండములైనట్లుగానూ, వస్తువునందు లేనట్టుగానూ, గోచరిస్తూవున్నది. గనుక సకల దేశములయందుఅని ఆగక, "సమస్తమైన వస్తువులయందు" అనికూడా చేర్చినారు. వస్తుజాతముచే ఖండములైనట్లు ఆకాశము కానవస్తూవున్నందుననే సకల దేశాలయందు అనిబహువచన ప్రయోగమున్ను చేయబడింది. కనుక వస్తురూపంగా తోచబడేవాని అన్నిటి బాహ్యాభ్యంతరములయందూ, పరిపూర్ణ పరబ్రహ్మమే నిండివున్నది అని సిద్ధిస్తోంది.

పోతే, యితఃపూర్వము, వస్తువుయందే వస్తువుయొక్క సూక్ష్మము, శక్తిరూపంగానో, తెలివిరూపంగానో వుంటుందని అన్నాము. కనుక సమస్తమైన వస్తువులయందు

పరిపూర్ణము వుందంటే, పరిపూర్ణము ఆయావస్థలయొక్క సూక్ష్మమైనగుణము, చేతనము, శక్తి, లేక తెలివిఅనేదే అవుతుందేమోఅని, అపోహపడవచ్చును. అదిసరికాదు. వైశేషికులన్న రీతిగా, ఆత్మకూడాద్రవ్యకోటిలోనికే చేరిపోయినది. "వస్తువు" లోనే వస్తువుయొక్క స్థూల, సూక్ష్మ, కారణ,మహాకారణములుకూడయిమిడియున్నవి సకలదేశములయందుసను స్తవస్తువులయందు అని రెంటినీకలిపి చదివితే వస్తువుయొక్క స్థూల ,సూక్ష్మకారణ మహాకారణములు, బాహ్యాభ్యంతరములయందు పరిపూర్ణ పరబ్రహ్మమేనిండివున్నది అనాలి. యిక వస్తువుకు స్థానమేది ? కనుక పరిపూర్ణదృష్ట్యా చూస్తే వస్తువు లేనేలేదనాలి. యిదే పూర్ణదృష్టి. యిది అమృతదృష్టికాదు. మృతదృష్టికాదు. అమృతదృష్టిఅనగా "సర్వం" ఖల్విదం బ్రహ్మ" "మహాత్మా సర్వభూతాంతరాత్మా" ఇత్యాది రూపమైన ఆత్మదృష్టి. లేక తాత్వికదృష్టి. ఇందు వస్తువునూ వస్తుగుణమునూవిడచి, వస్తువుకు మూలకారణమైన ఆత్మ స్వరూపమునుమాత్రమే తత్వవేత్త దర్శిస్తాడు.

శ్లో॥ ఏషుభూతేషుసర్వేషుగూఢోత్మానప్రకాశతే,
దృశ్యతేత్వగ్ర్యయాబుద్ధ్యాసూక్ష్మయాసూక్ష్మదర్శిభిః

అని కఠోపనిషత్. ఆత్మదృష్టిగలవాడే సూక్ష్మదర్శిభిః అని చెప్పబడ్డాడు. మృతదృష్టి రెండువిధములు (1) వస్తుదృష్టి=

అనగా కేవలము బాహ్యదృష్టి. యిందు వస్తువుయొక్క బాహ్యలక్షణములైన వర్ణ, ఆకార, స్పొష్టవాదులు మాత్రం దర్శిస్తారు. (2) గుణదృష్టి=వస్తువుయొక్క బాహ్య రూపమైన అకారములను లక్షింపక వస్తువుయొక్క సూక్ష్మ రూపమగు వస్తువుయొక్క నాణ్యము, గుణము, ఫలము యిత్యాదు లీదృష్టికి గోచరిస్తాయి. వస్తుదృష్టి, గుణదృష్టి ఆత్మదృష్టి అను యీత్రివిధదృష్టులయందునూ అజహల్లక్ష ణము (అనగా విడువనిలక్షణము) జహదజహల్లక్షణను (విడచీవిడువని లక్షణము లేక భాగత్యాగలక్షణము) మా త్రమే అనువర్తించుచున్నవి. కాని వస్తువునుమాత్రము పూర్తిగా వదలినదృష్టి - జహల్లక్షణము - లేదు. ఒకవిధ ముగాచూస్తే పూర్ణదృష్టి జహల్లక్షణమని చెప్పదగును. ఏల ననగా వస్తువు, దాని స్థూల, సూక్ష్మ కారణ మహాకారణ ములనహా పరిత్యజించి, యీ అన్నిటి రహితస్థితియందు పరి పూర్ణ పరబ్రహ్మమును నిశ్చయించుకొనేవిధాన మీ పూర్ణ దృష్టియందే కలదు. సాధకులకు సులభగ్రాహ్యమగుటకు మాత్రమే జహల్లక్షణ గ్రహించవలెనని చెప్పితిమి. సిద్ధాంత రీత్యా ఏలక్షణమున్ను చెప్పకూడదు.

ఐతే యితరులుమాత్రం తాము నిర్ణయించుకొన్న బ్రహ్మము సర్వవ్యాపకము అని అనడంలేదా? దానికే మీరు

పరిపూర్ణ పరబ్రహ్మమని నూరుపేరెట్టారేమో? అని సందేహం కలుగవచ్చును. అది సరికాదు ఎట్లనగా :- ముఖ్యంగా అద్వైత పద్ధతియందు "జ్ఞానం బ్రహ్మ" "జ్ఞానాదేవతుకైవల్యం" సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" "నిత్యం విజ్ఞానమానందంబ్రహ్మ" యిత్యాదిశ్రుతుల రీత్యా బ్రహ్మము జ్ఞానరూపమని నిర్ణయించబడింది. ఈ జ్ఞానరూపమైన బ్రహ్మము సకలదేశాలయందూ సమస్తమైన వస్తువులయందు వున్నదా? కొంచెం విచారించవలసి యున్నది. ఈ జ్ఞానము ఏవస్తువుయందు పర్యవసించునో ఆవస్తువే గోచరిస్తోంది. కాని తత్కాలమందన్యవస్తుగ్రహణం కలుగుటలేదు. సర్వత్రావుంటే సర్వవస్తువులు ఏకకాలమందే గోచరించాలి. చూద్దామంటే అట్లా గోచరించుట లేదు. నీవ్యష్టిజ్ఞానము నీయందు మాత్రమే సర్వత్రావుంటుందిగాని నీకు బయట వుంటే ఒకేసారి ప్రతివాడూ సర్వేంద్రియ విషయములన్నీ ఏకకాలమందే గ్రహింపగల్గాలిగదా? మరిన్నీ "అస్తిభాతి ప్రియంరూపంనామచేత్యంశపంచకం ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపంతతోద్వయం" అని వేదాంతపంచదశిలో చెప్పబడుతోంది. కాని అస్తి, భాతి, ప్రియరూపమైన బ్రహ్మము (లేక జ్ఞానము) నామరూపాలున్నచోటనే ప్రకటమౌతోంది. మరిన్నీ సర్వాధిష్ఠానమైన జ్ఞానమునకు తెలియ

చేయుసత్తామాత్రమే యుందని చెప్పబడుతోంది. ఈశ్వర స్థానమున యీ యేకరూపతెలివి పంచవిధములై, సృష్టి, స్థితి, లయవిసీర్ణ అకర్షణములనే పంచకృత్యములు జరుపుతూవున్నది. వ్యష్టి పంచవింశతి (25) యింద్రియములద్వారా విషయగ్రహణ చేయుచున్నది. ఈవిధంగా స్థానభేదముచేతను ఉపాధిభేదముచేతను మార్పుపొందే జ్ఞానము, సర్వత్రా ఏకరూపముగా వుందనుటయెట్లు ? కొన్ని యెడల సామాన్య జ్ఞానముగాను, కొన్నిచోట్ల విశేషజ్ఞానముగానూ యుంటూ యున్నది.

అంతేకాకుండా జ్ఞానానికూడా ఒకపరిమితి లేక ఆవరణవుంది. ఎట్లంటే - అంతఃకరణ వృత్తిరూపమైన జ్ఞానము నేత్రేంద్రియంద్వారా బహిర్గతమై యెదుటి వస్తువులను గుర్తిస్తోంది. కాని కొంతదూరంలోవున్న వే కనుపిస్తాయి కాని, అంతకంటే దూరంలోనున్న వస్తువులు (మధ్యలో అవరోధాలు యేమీ లేకపోయినా) కానరావు. కారణము ? దృగ్రూపజ్ఞానానికొక పరిమితి అంటూ వుండటమే. ఈపరిమితే, అదృగ్రూపజ్ఞానానికి ఆవరణము లేకపరిధి యిట్లేమిగతా యింద్రియాల విషయంలోనూ జరుగుతోంది. ఈ ఆవరణకావలఅజ్ఞానం పనిచేయుటలేదు. కనుక జ్ఞానము తన ఆవరణలోనే వుంటుంది కాని సర్వత్రావుండదనిసిద్ధ

స్తోంది. అదిపనిచేయకపోవచ్చునుగాని లేదనటంఏలాగు? అంటే, జ్ఞానమునకు ఆదిభౌతికం తెలిసికోవటం. అది తెలిసికొనే పనిచేయకపోతే దానిని జ్ఞానమని ఎందుకనాలి? అజ్ఞానమనో లేక మరుపనో అనాలి, ఆవిధంగా దానిపేరే మాసి పోతోంది. అగ్నికి. వేడి వెలుగు లక్షణాలు అరెండూ లేక పోతే దానిని అగ్నికణం అంటామా? మసిబొగ్గు అనే అం టాము. నష్టే తెలిసికోజాలని జ్ఞానాన్ని అజ్ఞానమని అనాలి. అంటె జ్ఞానరూప బ్రహ్మమునకు అజ్ఞానస్థితికూడావుందనాలి యిట్లా దంద్వలక్షణం చెపితే అద్వైతహాని అయిపోతుం దైహో అని చెప్పటం మానివేస్తే యెట్లు? కనుక జ్ఞానము తన అవరణయందే వుంటుంది. గాని సర్వత్రా లేదు. వ్యష్టి జ్ఞానమును ఉదాహరణగా తీసుకొనరాదనిన్నీ. బ్రహ్మము సమష్టిరూపమైన అఖండజ్ఞానమునిన్నీ, దానికి సర్వజ్ఞత్వ లక్షణాలున్నాయనిన్నీ, పూర్వపక్షం రావచ్చును కాని లక్షణం విచారించుచోట వ్యష్టిసమష్టుల భేదం అంతరిస్తోంది అద్వైతపద్ధతియందు మహావాక్య విచారణచే (ముఖ్యంగా "ప్రజ్ఞానంబ్రహ్మ") వ్యష్టిసమష్టుల కభేదం ప్రతిపాదింప బడింది. ఒకబస్తాలోని పంచదారలో ఒక పలుకును పరీక్షిస్తే మొత్తం పంచదారకంతకు అదేలక్షణం నిర్ణయించవచ్చును గదా? "అణోరణీయాన్ మహతోమహీయాన్" అని

చెప్పబడిన ఆత్మ వస్తువునకు అణువునందు లేక మహత్తునందు కూడా సమానలక్షణములే యుండాలి. (What is true of the microcosm is also true of the macrocosm and vice Versa )

శ్లో॥ యదేవేహతదముత్ర యదముత్ర తదన్వివహ
మృత్యోస్సమృత్యు మాప్నోతి య ఇహనానేవపశ్యతి
॥కఠో॥

తా॥ యిక్కడేమున్నదో, దీనికి (యీ పిండాండమునకు) బయట (అనగా బ్రహ్మాండమందు) అదే యున్నది. యీవిధంగా గమనించనివానికి జన్మపరంపరలు తప్పవు. కాని వక్కటిమాత్రం సత్యం. పిండ బ్రహ్మాండములయం దెక్కడ పరీక్షిస్తే అక్కడ యీ జ్ఞానరూపమైన యెరుక వున్నట్లు తెలియబడుతోంది. ఎట్లాగంటే :- పిండాండమందు నేత్రమో, భ్రూమధ్యమో, హృదయమో, సహస్రారమో ఆత్మస్థానమని చెప్పబడుతూవున్నప్పటికి (యీ స్థానములు ఎక్కువగా ఆత్మయొక్క అభివ్యక్త స్థానములు) దేహమంతటా, రక్తమాంసములున్న ప్రతిచోటా, వాటిసూక్ష్మాంశ రూపాలైన ప్రాణప్రజ్ఞల సమష్టిరూపమైన గుర్తు ఏస్థానంలో పరీక్షించి చూస్తే, ఆస్థానంలోనే భాసిస్తూవుంది. యిదే యింటిలోవుండే చిత్రం ఎక్కడ చూచిన వున్నది. కాని

ఏక కాలమందు మాత్రం అంతటా లేదు. ఏలాగంటే ఒక మనిషికి కాలు నొప్పిపెట్టింది. అదే సమయంలో పుప్పిపంటి బాధ విపరీతమైంది. అంతకుపూర్వం కాలునొప్పి మాత్రం, గుర్తించి బాధపడుతూవున్నవాడు పంటిబాధ యెక్కువవటం తో, అతని గుర్తు, కాలునొప్పి వున్నస్థానంలో తప్పుకొని, పుప్పిపంటి స్థానమందు కేంద్రీకృతమైంది. కాలు నొప్పి అప్పట్లో అతన్ని బాధించలేదు. మధ్యమధ్య కాలునొప్పి కన్పిస్తూన్నా ఒకేఒక క్షణంలో రెండూ మాత్రం అతడు గుర్తించటంలేదు. యీ రెండు జ్ఞానములకున్ను అధమం ఒక క్షణమైనా వ్యవధి ఉండకతప్పదు. అట్లే బ్రహ్మాండం లోకూడా. ఉదా:- మద్రాసులోనున్న నాకుమార్డు జ్ఞప్తికి వచ్చి వానితో ఏదో నేను మాట్లాడుతూవున్నట్లు పగటికల కంటున్న సమయంలో నాకట్టెదుట నిలబడ్డ వ్యక్తి నాకు కనపడడు. అతనిమాట నాకు వినబడదు. అనగా ఆసమ యంలో నాగుర్తు, మద్రాసులోని నా కుమారుని రూప నామ క్రియలయందు లగ్నమై తన్మయం అవుతుంది. అప్పుడు నా స్థూలదేహేంద్రియాదులున్న స్థానమున నా గుర్తు లేదనకతప్పదు. కనుక ఒకేసమయంలో జ్ఞానరూప మైన. యితరులు చెప్పే బ్రహ్మమంతటా కలదనరాదు.

(4) "సర్వకాలాలయందు" అన్న మాటలు కొంచెం విమ

గ్రిద్దాం. "కాలమును" నిర్వచించాలంటే, రెండు సంఘటనల మధ్యనున్న వ్యవధి యొక్క ప్రమాణము, లేక పరిమితియే కాలమనవచ్చును. ఉదా:- సూర్యోదయ సూర్యాస్తమయముల మధ్య వ్యవధి, పగటికాలము. పరిమితితో నిమిత్తం లేకుండాకాలాన్ని నిర్దేశించాలంటే, ఒక్క సంఘటనైనా యుండక తప్పదు. ఒక సంఘటన యుంటే దానికిపూర్వము భూతకాలమనిన్నీ, దాని అనంతరం దానిదృష్ట్యా భవిషత్కాలమనిన్నీ, ఆసంఘటన జరుగు కాలము వర్తమానమనిన్నీ, అనవచ్చును. ఏసంఘటనా లేకుంటే కాలమునకు ఉనికియే లేదు. పరిపూర్ణపరబ్రహ్మము ఎప్పటికీ ఏమార్పులు లేకుండా ఏకరీతిగా నున్నది. దానియందెట్టి సంఘటనలుండటానికి అవకాశమే లేదు కనుక పరిపూర్ణదృష్ట్యా కాలమనేది లేనేలేదు. "కాలము" పుట్టకపూర్వము, కాలమున్నపుడు, కాలము పుట్టినతర్వాత కూడా పరిపూర్ణ పరబ్రహ్మమే యున్నది. అని చెప్పుటకే సర్వకాలాలయందు అన్నారు అని గ్రహించవలెను. అట్లాగే కాకుంటే త్రికాలములయందూ అని చెప్పితే సరిపోతుందిగదా!

ఈ సందర్భంలో కాలమును గురించి యితరులు ఏమన్నారో కొంచెం విమర్శించాలి. కాలమే బ్రహ్మమని కొందరన్నారు. "కాలోస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో...."

అని గీతలో భగవానుడన్నాడు. ఒక దేహముయొక్క జీవితకాలమును ముగింపుచేసి, జీవులకు మరణము కల్గించు యమధర్మరాజునకు కాలుడని పేరు పెట్టారు. కాలమనేది అనంతము అన్నారు. కాని కాలమన్నది ప్రథమ సంఘటనతో యుత్పత్తియై అనంతర సంఘటనతో పరిమితి లేక ప్రమాణము నేర్పరచుకొని, ప్రతిక్షణమూ వృద్ధిఅవుతోంది. మార్పు చెందుతూవుంది. "యమాసామాయ" అనే సర్వ చనానుసారం కాలమును గూడ మాయాకార్యముగా, లేక అందలి భాగంగా గుర్తించవలసియున్నది. కనుక కాలము ఉత్పత్తి స్థితి ప్రవృద్ధులు లేని పరిపూర్ణ మెన్నడూ కాదు. పరిపూర్ణము కాలముతో నేవిధంగానూ సంబంధపడను లేదు. సృష్టి అనే సంఘటన పురస్కరించుకొని, సృష్టికి పూర్వమనీ, సృష్టియున్నపుడనీ, ప్రళయానంతరమనీ, కాలమును నిర్దేశిస్తున్నాము. అద్వైత పద్ధతియందు బ్రహ్మమునకు సృష్టి స్థితి లయములు తటస్థ లక్షణముగా చెప్పబడినవి కాలముకూడా యీ తటస్థ లక్షణముతో జతపడియున్నది. అంతేకాని కాలమనేది అస్తిసిద్ధపదార్థమేకాదు, కేవలము భాతి సిద్ధపదార్థమే. సూర్యాది గ్రహ గతిభేదముచే, వాతావరణమందు వచ్చే మార్పులనుధ్య నుండే. వ్యవధికి వేసవికాలము, వర్షాకాలము, శీతాకాలము, అని

పేర్లు పెట్టబడినవి. మరిన్ని భూత భవిష్యత్ వర్తమాన కాలములుగా కాలము విభజింపబడినది. నిజంగా వర్త మానకాలమనేదాని పరిమితి ఒక లిప్త గూడా యుండదు. ఎందుకనగా మరుక్షణములోనే అది భూతకాలములో చేరి పోవుచున్నది. ఏమైననూ కాలత్రయములనేవి నిర్ణయ మైనాయి. ఈ కాలత్రియములయందు మాత్రిమే గాక "కాలము" నకు పూర్వోత్తరమధ్య కాలములయందున్నూ యెట్టిమార్పు లెరుంగని పరిపూర్ణ బ్రిహ్మ మొక్కటియె కాలమును మీరినది అగుట చేతనూ కాలనిర్ణయమే లేనిద గుటచేతను అది కాలాతీతము అని అనదగియున్నది.

ఇతరులుచెప్పే బ్రిహ్మము కాలత్రియాబాధ్యమని, కనుక సత్పదార్థమని, కొనియాడుదురేగాని, అది కాలత్రియ ములయందు నొక్కరీతిగాలేదు. ఎట్లనగా :- (1) సృష్టికి పూర్వము "సదేవసోమ్యేఽదమగ్రఆసీత్"- సృష్టికిపూర్వం ఆ బ్రిహ్మము సత్పదార్థముగానుండెను. (2) అనంతరము "సోఽకామయతబహుస్యాంప్రిజాయేయ"-అబ్రిహ్మమే అనే కముగా కావలెననికోరెను. కోరి "ఏకం అనేకం భవత" అ యొక్కటియే అనేకమాయెను. తత్సృష్ట్వాతదేవాఽనుప్రా విశత్"- ఆపిమ్మట తానే అందు అనుప్రివేశముగావించెను

"యయేకోజాలవాన్ఈశత ఈశనీభిః,

సర్వాన్‌లోకానీశతయీశనీభిః,
యఏవైక ఉద్భవేసంభవేచ,
యయేతద్విదురమృతాస్తేభవన్తి"

(శ్వేతా। ఉ। 3 అధ్యాయం 1 వ మంత్రం) తా॥ అబ్రహ్మమే. తనశక్తులచే సర్వమును నియమించుచున్నాడు. సృష్టిస్థితి లయములు చేయుచున్నాడు. "భీషాస్మాద్వాతఃపవతి, భీషో దేతిసూర్యః, భీషాస్మాదింద్రశ్చాగ్నిశ్చ, మృత్యుర్ధావతి పంచమః," సూర్యాగ్నియింద్ర వాయుమృత్యువులు భయముచే అతనిఆజ్ఞకులోబడి వర్తిస్తున్నాయి." ఇట్లుసర్వనియంతగా వర్తించుచుండియు, తస్యకర్తారమపివిధ్యకర్తారమవ్యయం" (గీత) యిన్నిటికి కర్తయయ్యును, అకర్తగా అనగా కేవల సాక్షిగాకూడా అబ్రహ్మమే యుంటూయున్నది.

3. పిదపలీలముగించి సర్వమును తనలోనికుపసంహరించుకొంటూంది. కనుక సృష్టికి పూర్వముయొక రీతిగా, సృష్టికాలమునందొకరీతిగా సృష్ట్యనంతరమందొకరీతిగా, ప్రళయానంతరం మరొకరీతిగా, వివిధనామరూప క్రియాత్మకముగా వుంది. కనుక కాలానుసారం మార్పులు చెందుతూవుందనే అనాలి. కాలత్రయా బాధ్యమనరాదు.

పిండాండమునందు విచారించిచూస్తే కాలాన్ననుసరించి గల్గుయీమార్పులు మరీ ప్రస్ఫుటంగాకనుపిస్తున్నాయి

తల్లిగర్భంలో పిండరూపంగానున్నప్పుడు, పుట్టినపిదప, శైశవావస్థలో, బాల్యయౌవనకౌమార వార్ధక్యములయందు జ్ఞానమెన్ని మార్పులు చెందుతోందో! జాగ్రదాద్యవస్థలయందు ఏమార్పులు పొందుతూవుందో గమనిస్తే, జ్ఞానరూపమైన బ్రహ్మము దేశకృత, కాలకృత, వస్తుకృత పరచ్ఛేదములు లేనిదో, అట్టి పరిచ్ఛేదములు కల్గివున్నదో తెలియదగును. ఈత్రివిధ పరిచ్ఛేదరహితమైనదొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే

యిక్కడమనం మరొకమాటకు సరిగా అర్థం తెలిసికోవలసియున్నది. సకలదేశాల యందు, సర్వకాలా యందు, సమస్తమైన వస్తువుల యందు. అంటూ, సప్తమీవిభక్తి ప్రత్యమముపయోగించినారు. గాని, "లో" అని షష్ఠీభక్తి నుపయోగింపలేదు. దీని తార్యతమ్యము చక్కగా గుర్తింపవలసియున్నది. "అందు" "లో" అనుమాటలకు స్థూలంగా చూస్తే అంతతేడాయేమిన్ని గాన్పించదు ఉదా:- పెట్టెలో బట్టలు లేవన్నా, పెట్టె యందు బట్టలు లేవన్నా సమానార్థకముగానే తోస్తుంది. కాని ఈక్రింది మరిరెండు వాక్యములను తీసుకొంటే భేదము తెలియవస్తుంది. (1) కుండయందెక్కడ చూచినా మట్టేగాని, కుండ"లో" మాత్రము మట్టిలేదు. అంటే, కుండకునానారూపాలు కల్పించినమట్టి, కుండపెంకు యందెక్కడచూచినా వున్నది. కుండలోపలి భాగంలో మాత్రం మట్టిలేదు. (2) కుండయందంతటానున్నదే ఘటా

కాశము. అనగా ఏ అవకాశరూపమైన ఆకాశము కుండ లోపలి ఆవరణమునందున్నదో, అయాకాశమే, కుండపెంకు నందుగూడ వుండనేవున్నది. దానినే ఘటాకాశమందురు. కనుక సకలదేశాలయందు, సర్వకాలాలయందు, సమస్తమైన వస్తువులయందుఅనుటలో దేశకాలవస్తువుల బాహ్యాభ్యంతరములయందు, ఆదిమధ్యాంతములయందు, సర్వత్రా, ఘటాకాశమువలెనున్నది అని అర్థముచేసికొనుటకై "యందు"అను శబ్దము వుద్దేశపూర్వకముగా ప్రయోగింపబడినదని తెలియువలెను.

(5) మొదలూ కొనా లేక:- అనగా కొలతకు లొంగునదిగాక. యని అర్థము. మొదలు అనగా కొలత ప్రారంభించినకొస కొన అనగా కొలత ముగించిన కొస. అంటే పరిపూర్ణ బ్రహ్మమునకు కొసలు లేవు. కొలతలు కొలుచుటకు, ఎట్టి ఆవరణము, పరిధి, పొడుగు, వెడల్పు, దళసరి, యిత్యాది ప్రమాణములు ఏమిన్నీ లేవన్నమాట, కనుకనే ఆది యింత, అంత అనరాదని అన్నాడు. అణుప్రమాణము వుండజాలదు.

(6) చలించక అనగా కదలిక అని అర్థము. కదలికనాటు, మహత్ ప్రమాణమున్నా, అది ఏకదేశీయమే అవుతుంది. సకల దేశమ్ములయందూ వున్నదానికి ఏ ప్రమాణమూ

అనునది ప్రాణలక్షణము. కదలిక లేనిచోట శక్తి యుత్పత్తి కాజాలదు. పరిపూర్ణ పరబ్రహ్మమునందు చలనాంశ స్వరూపమైన ప్రాణము లేదు. శక్తిన్ని లేదు. కనుక అది చలించజాలదు. అందుచే అచలమని కొందరు పేరు పెట్టారు. ఆ పేరు పరిపూర్ణ పరబ్రహ్మమునకు సరిపోదు. ఎందుచేతనంటే చలాచలా లక్షణములు రెండూ ఎరుక లక్షణములే కదలికయే సహజలక్షణముగాయున్న యెరుకకు అచలస్థితికూడా వుంది. గడియారముయొక్క లోలకం ఎడతెరిపి లేకుండా చలిస్తూవున్నట్టు తోచినప్పటికీ ముందుకుపోయి తిరిగి వెనుకను వచ్చే స్థానములయందు ఏ అత్యల్ప కాలమైనసూ అచల స్థితి గల్గివున్నది, అట్లే జాగ్రదవస్థయందు చలన రూపంగా యున్న యెరుక (జ్ఞానము) సుషుప్తి సమాధ్యాది అవస్థలయందు అచలస్థితిలో వుంటోంది. సృష్టి స్థితి లయ కాలములయందు చలనరూపం వహించిన బ్రహ్మము సృష్టికి పూర్వదశయందున్నూ ప్రళయానంతర మందున్నూ అచలముగానే వుంటుంది. కనుక ఈశావాస్యోపనిషత్తు "తదేజతి తన్నైజతి, తద్దూరే తద్వదంతికే, తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః" అని అంటోంది. యిందుక్క తాత్పర్యము- అది కదలను. అది కదలదు. అది దూరమునందున్నది. దగ్గరలోనూ యున్నది అది లోపలనూయున్నది.

అది సర్వమునకూ బాహ్యమునందునూ యున్నది. కనుక చలనముగల యెరుక అచలముగానూ వుంటూవున్నది. చలాచలములు రెండూగానిదే పరిపూర్ణ పరబ్రహ్మము. ఐతే- "సృష్టి స్థితి ప్రళయ వ్యవహారం కాలములయందు కూడా బ్రహ్మము నిశ్చలముగానూ నిష్క్రియంగానూ మాత్రమే వుంటోంది. దాని సన్నిధిలో మాయయే చలన రూప వ్యవహారం అంతా చేస్తూవున్నది. కాని బ్రహ్మము మాత్రం ఎప్పుడూ అచలంగానే వున్నది" అని యితరులంటారు. కాని వారు మాయ జడమనీ బ్రహ్మముయొక్క సత్తాచేత దాని సాన్నిధ్యంలో సృష్టి స్థితి లయాలు జరిగిస్తుందని కూడా అంటారుగదా! సూదంటురాయి యొక్క చలనం బాహ్యమున కనబడుట లేదుకాని, దాని సన్నిధానంలో నున్న సూదిని చలింపచేస్తూ సూదిని తనవంకకు లాగుకొనుచున్నది. సూదిని లాగితే సూది కదులుచున్నాదా? లేక సూది తనంత తానే పరుగెత్తుచున్నదా? సూది తనకు తానే పరుగెత్తుచున్నదని ఎవరైనా అనగలరా? అదే నిజమైతే అన్ని రాళ్ళవైపునకు ఎందుకు పరుగెత్తదు? కనుక చలనమునకు కారణ కర్తృత్వములు సూదంటురాయివే, అట్లే బ్రహ్మముయొక్క సన్నిధానంలో పరిణమించుచున్న మాయావిషయంలో కూడా కారణ కర్తృత్వ

ములు బ్రహ్మమునకే యున్నవని చెప్పనగును. అందుకే "తేన వినాతృణాగ్రమపి నచలతి" బ్రహ్మము కదలించనిచో తృణాగ్రమైన కదలజాలదని శ్రుతి చెప్పుచున్నది. ఈ చలనశక్తి బ్రహ్మమునందే బీజరూపంగా నున్నది. సృష్ట్యనంతరం బ్రహ్మమే, సకల చేతనా చేతనములయందూ సూక్ష్మరూపముగా అచల వస్తువులా తోచబడుతూవున్నది. సృష్టికి పూర్వం అచలరూపంగా, సృష్టికాలమునందు చలనాత్మకంగా, తిర్గి ప్రళయానంతరం అచలరూపంగా వున్నదీ బ్రహ్మమె. మరియు సర్వోపాధుల అంతరమునందు వుండి తాను చలించక దేహేంద్రియాను లన్నిటినీ చలింపచేయుచూవుండేది యిదే. కనుకనే "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని, యంత్రారూఢాని మాయయా॥" గీత॥,18 అ 61. మరియు విశ్వమందు దోచు సర్వ చలనమునకూ ఆధారముగానూ అధిష్ఠానముగానూ వున్న యీ బ్రహ్మము చలాచలరూపంగా నున్నదేగాని కేవలం అచలంగా లేదు. పరిపూర్ణ పరబ్రహ్మ మొక్కటే "నిత్యస్సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః" అని గీత పేర్కొన్నట్లుగా ఎప్పటికీ తాను చలించక యితరమును చలింపచేయక విశ్వ, విశ్వాంతరశముల యందలి చలనములకు ఆధారముగాని అధిష్ఠానముగాని గాక. కేవలము

అచలముగా యున్న దేపరిపూర్ణం.

(7) ఒక్క తీరుగా అనగా ఎట్టి మార్పులూ యెన్న డూలేకుండా వున్నది. పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఎప్పుడూ ఏమార్పులూ లేవు అది పుట్టదు పుట్టింపదు. గిట్టదు గిట్టింపదు. పుట్టి చచ్చేవానికి సాక్షిగా కూడా నుండదు. సాక్షిగానుండుటకు దానియందు తెలివే లేదు.

ఇతరులు నిర్ణయించిన బ్రహ్మము ఒక్క తీరుగా లేదు. "ఏకం అనేకం భవతి" అనగా ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనబడు ఏకవస్తువే సంచర పద్ధతియందు అధోరూప పరిణామము (evolution) చెంది అనేక నామరూపాత్మక వస్తువులుగా మారింది. అట్లే "అనేకం ఏకం భవతి" అనగా నామారూపాత్మకముగా నానాత్వము చెందిన వస్తువులన్నియు ప్రతి సంచరపద్ధతియందు పూర్ధ్వరూప పరిణామం (involution) చెంది తిర్గి ఏకత్వం వహిస్తోంది. లేక ఆరంభ పరిణామాది యితరవాదము లంగీకరించినా ఒక్కటగు బ్రహ్మమునందు అనేక మార్పులు జరుగుతున్నాయి. మరిన్ని యీ బ్రహ్మము సాక్షిగా వర్ణింపబడుతోంది. దేనికి సాక్షిగా వుంది? అంటే జీవేశ్వర జగత్తుయొక్క ఉత్పత్తి స్థితి నాశనముల కనాలిగదా! అయితే సృష్టి లేనప్పుడు సాక్షి కాదు గదా! కనుక ఒకప్పుడు సాక్షిగావుండి మరొకప్పుడు అట్లుం

డుటు లేదుగదా! కనుక ఆ బ్రహ్మము కేవలం సాక్షిగా వుందని యన్నా, మార్పుకు లోబడింది. అనే అనాలి. కనుక యీ బ్రహ్మ ముక్కతీరుగా లేదు. భగవద్గీతలో విభూతి యోగము చూస్తే ఎన్ని తీరులుగావుందో కొంచెం తెలియపడుతుంది. పరిపూర్ణ పరబ్రహ్మ మెప్పటికీ వక్క తీరుగానే అనగా తలంచుటకును, చెప్పుటకును, అలవిగాని తీరుగా వున్నది.

(8) తనకు తానే స్వతస్సిద్ధమై యున్నది:- పరిపూర్ణ పరబ్రహ్మము ఎప్పటికీ తనకు తానే యున్నది. గాని అది ద్వంద్వ రూపంగాని అనేక రూపంగాని ఎన్నడూ కాలేదు. కాబోదు. తన వునికికి అన్యవస్తు సాపేక్ష యీషణ్మాత్రం లేదు. కనుక స్వతస్సిద్ధమైయున్నది. ద్వంద్వ రూపంగా గాని అనేకంగా గాని అయ్యే లక్షణమున్నూ దానియందు లేదు.

యితరులు నిర్ణయించిన బ్రహ్మవస్తువు ద్వంద్వరూప ఏకంగా వున్నది. అనగా ఒకటిగా తోచబడినా అది నిజముగా రెండుగా యుంటుంది. "ప్రజ్ఞానం బ్రహ్మ" "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "నిత్యం విజ్ఞానమానందం బ్రహ్మ" యిత్యాది శ్రుతులను పురస్కరించుకొని బ్రహ్మము జ్ఞానరూపమని నిర్ణంచినారు. అజ్ఞానమునకు

ఒక ఆవరణ ముంటుంది, అని యిదివరకే గుర్తించినాము. ఆయావరణమే యీ జ్ఞానమునకు జ్ఞేయ వస్తువుగానుండి, జ్ఞేయ బ్రహ్మముగానున్నది. ఒక దీపమునకు ఆదీప ప్రకాశ మావరణగా యున్నట్లే, జ్ఞానమునకు దాని జ్ఞేయరూపమే, ఆవరణగా యుంది. యీ జ్ఞాన జ్ఞేయములే నేను మేనులు. వ్యష్టి సమష్టుల యందెక్కడ విచారించినా నేను "జ్ఞాన రూపముగానూ దాని ఆవరణ రూపమైన మేను జ్ఞేయరూపం గానూ, యున్నాయి. నేను వల్ల మేనూ, మేనువల్ల నేనూ, యుత్పత్తి చెందుతున్నాయి. పిండాండమందు (వ్యష్టియందు) విచారిస్తే యిది సులభ గ్రాహ్య మౌతుంది. ఎట్లనగా శుక్ల శోణితములు ఏర్పడిన స్త్రీ పురుషులకే తెలివి (నేను) యొక్క పరిణామ రూపమగు యిచ్ఛ కల్గుచున్నది. యీ యిచ్ఛ పరాకాష్ఠ చెందినపుడు వారి శుక్ల శోణితములు ద్రవీభూతములై స్థూలాకృతి వహించి యొకచో గూడు చున్నవి. దీనివల్ల నేను మేనుల కలయికతో గూడిన పిండ మేర్పడుచున్నది. యిచ్ఛ సూక్ష్మరూపము. శుక్లము స్థూల రూపము. శుక్లమువల్ల యిచ్ఛ పుట్టుచున్నది. యిచ్ఛ శుక్లముయొక్క యుత్పత్తికి కారణంగా నున్నవి. కనుక నేను (తెలివి, జ్ఞానము, యిచ్ఛ) అనే సూక్ష్మము, మేను అనే స్థూలావరణము యొక్క యుత్పత్తికి పైన వివరించిన

విధముగా కారణమై యున్నది. మేను అనే స్థూలదేహము నందు (లేక శుక్ల శోణిత రూపస్థూల పదార్థమునందు) తెలివి యిచ్ఛ యిత్యాదులు పుట్టి స్థూల మభివృద్ధి అయినకొలది వృద్ధి చెందుచున్నవి. బీజవృక్ష న్యాయముగూడా యిట్లే యున్నది. బీజమువలన వృక్ష ముత్పత్తి అవుతోంది. తిర్గి వృక్షమువల్ల బీజముత్పత్తి అవుతోంది. కనుక నేను మేను లేక జ్ఞాన జ్ఞేయములు ఒకదానిపై నొకటి ఆధారపడియున్నవి. యిందేదియు తనకు తానే స్వతసిద్ధమై వుండలేదు. "నాయ మాత్మా బలహీనేన లభ్యః" కేన॥ఉప॥ తాత్పర్యము:- ఈ ఆత్మ (రసబలములు రెండు కలసి) బల వర్జితముగా లభ్యముకాదు. బలమును విడచి రసముండుటకు సావుకాశం లేదు. మరిన్ని "పాదోస్య విశ్వా భూతాని, త్రిపాదస్యాఽ మృతందివి" అని చెప్పబడిన రీతిగా బ్రహ్మమందొక భాగం విశ్వమున్నూ మిగతా మూడు భాగములు అమృతస్వరూప మున్నూ, దివ్యమున్నూ, అయివున్నవి అనుటలో తనకు తానే స్వతస్సిద్ధంగా లేదనుట స్పష్టము. పరిపూర్ణ బ్రహ్మము ద్వయదోష వర్జితం. దాని యందు ద్వంద్వమునకుగాని, అనేకత్వమునకు గాని ఏమీ తావులేదు. తనను ప్రకటుపరిచే సత్తాగాని, "స్వేమహిమ్ని ప్రతిష్ఠితః" అనే స్వంత మహిమ గాని, మరుగుపరచే (అజ్ఞానేనావృతం జ్ఞానం, తేనము

హ్యాంత జంతవః" అను ఆవరణ శక్తిగాని అన్యథా జ్ఞానము కలిగించే విక్షేపశక్తి గాని, లేశమైనా దానియందు లేదు. కనుక పరిపూర్ణ పరబ్రహ్మము తనకు తానే స్వతస్సిద్ధమై యున్నది. అని చెప్పబడింది.

కనుక పుట్టనిదీ, చావనిదీ, రాకడా పోకడా లేనిదీ. సకల దేశాలయందు, సర్వ కాలాలయందు, సమస్తమైన వస్తువులయందూ, మొదలూ కొనా లేక. చలించక, పక్క తీరుగా, తనకు తానే స్వతస్సిద్ధమై యున్నది. ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. యితరులు నిర్ణయించిన బ్రహ్మము అట్టిదికాదు అని తేలింది.

పరిపూర్ణమునందు అన్య మేమీ లేదు. పరిపూర్ణము తప్ప తదన్యమంతయు యెరుక స్వరూపమే. ఆలేని యెరుకదాని యందు యీషణ్మాత్రమూ లేదు. పరిపూర్ణ పరబ్రహ్మమును గుర్తించు యెరుక పరిపూర్ణమందు లేదు. కనుక అది గుర్తింపబడజాలదు. అట్లని అది శూన్యం కాదు అదియే యేకైక అస్తిక్యత గలది. దాన్ని తెలుసుకొనే తెలివేలేదు. యింద్రియములున్నూ లేవు. యింద్రియ రూపంగానూ, అతీంద్రియ రూపంగానూ, వున్న దెరుకే. పరిపూర్ణమట్టి అతీంద్రియ రూపమైన యెరుకచే గూడా గుర్తింపరానిది. దానియందు పంచతన్మాత్రలే లేవు. కనుక

అవి దేనికిన్నీ విషయరూపం కాజాలదు. అయితే దీనిని తెలసికొనుట ఎట్లు? వివరించుట యెట్లు? యితరులకు తెల్పుట యెట్లు? అంటే — ఉన్నవి రెండే (1) పరిపూర్ణము (2) లేనియెరుక. కనుక లేనెరుకను క్షుణ్ణముగా వివరించి, చూపించి, అదికానిది అది లేనిది యేదో అదే పరిపూర్ణము, అని మాత్రమే చెప్పవచ్చును. అట్టి లేని ఎరుకను విడచితే అంతా పరిపూర్ణబ్రహ్మమే. వాక్కుచే చెప్పరాని దానిని చెప్పుట కింతకంటె మార్గములేదు. యిక దీనిని గురించి ఆవిధముగా విన్న శిష్యుడు ఎట్లు దీనిని తెలుసుకొనును? అంటే — గురువు చెప్పిన చూపించిన, లేనెరుకను ముందుగా తెలసికొనును. అదిమాత్ర మంత సులువుగా తెలియబడునా? అంటే — తెలియబడదు. కాని అంతఃకరణ శుద్ధి కల్గిన శిష్యుడైతే, ఆలేనెరుక స్వరూపుడు తానే అని గుర్తించి ఆ సర్వ స్వరూపమైన అఖండాత్మ స్వరూపుడు తానే అయి నిలుచుటే, అ లేనెరుకను తెలియుట. అట్టి స్థితియందే తానుకాని, తాను లేని, పరిపూర్ణ పరబ్రహ్మమున్నది, తానే లేడు, అనే యదార్థ జ్ఞానము శిష్యునికి కల్గుచున్నది. యిదే పరిపూర్ణమును వుండజూచుకొనుట అట్లు వుండజూచిన తెలివి లేనేలేదని దాని రహితమొనర్చుకొనుటే లేనెరుకతో పరిపూర్ణమును గనిపెట్టుట. యిదే

యెరుక లేక సేవించుటకుప్రథమ సోపానము. యీ విషయ మంతయు అనుభవ విషయమునకు సంబంధించినది. అనుభవమును యింతకటే అనువదించుటకు సాధ్యము కాదు. సద్గురువులచెంత సచ్ఛిష్యులు సేవా శుశ్రూషలు చేసి ఆత్మ సాక్షాత్కారము కల్గించుకొన్న పిదపనే యిది గ్రాహ్యమగు విషయము. గురు కృపాపాత్రులకే సాధ్యం. "స్వయంబ్రహ్మ మయోభూత్వా తత్పరం చావలోకయేత్" అని గురుగీత చెప్పుచున్నది.

పరిపూర్ణమును సామాన్యులు అవగాహన చేసుకొన లేక యీ పరిపూర్ణ భావమును శూన్యబోధ అనటం కూడా కద్దు. ఎరుక లేక సేవించువార్కి అనగా ఎరుక వదలినవారికి మాత్రం పరిపూర్ణం ప్రత్యక్షమే. ఎరుక చేత ఎరుగరానిది. యెరుకను మీరినది. యెరుక మరుపులు లేనిది. ఎరుకతో రాలేదు. కనుక దానితో పోదు. పరిపూర్ణమందు ఎరుకే వుంటే, పరిపూర్ణమున్నూ ఎరుకే అగును. ఎరుకచే తెలియ బడినవన్నియు ఎరుక పరిణామ రూపమగు వస్తువులే, లేక విషయములేగాని పరిపూర్ణము యెరుకకు విషయము కాదు.

పరిపూర్ణమునందు ఎరుకేలేదు. కనుక దాని కహం వృత్తిలేదు. అది అహమును పుట్టించదు, అహంకారమును ఎరుగదు. ఎరుకే లేదు. గనుక యే నిర్ణయమును చేయదు.

ఉపాసింపతగినదిగాని, ధ్యానింప తగినదిగాని కాదు. వర మీయదు. శపింపదు. "తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం బ్రహ్మ యదిదముపాసతే" అని కేనోపనిషత్ చెప్పుతూంది. అనగా ఉపాశింపబడేదేదీ బ్రహ్మము కాదని తెల్సుకో అని తాత్పర్యము. "భూమానమిత్యుపాస్వ" "ఆత్మానమిత్యుపాస్వ" "ఓం మిత్యుపాసీత" "ఓ మిత్యాత్మానంధ్యాయీత" "ఆత్మావాఽరే ద్రష్టవ్యశ్రోతవ్యో, మంతవ్యోనిధి ధ్యాసితవ్యః" కనుక ద్రష్టవ్యము, శ్రోతవ్యము, మంతవ్యము నిధిధ్యాససితవ్యం. ధ్యాతవ్యము, ఉపాస్యము అని చెప్పబడ్డ బ్రహ్మము, అనగా ఆత్మ, ప్రణవము, యిత్యాది నామములచే ప్రసిద్ధమగు అధిష్ఠానాచేతన-బ్రహ్మము పరిపూర్ణ పరబ్రహ్మము కాజాలదు. "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా అని బ్రహ్మసూత్ర రచన ప్రారంభించిన వ్యాసులవారు, వెంటనే "జన్మాద్యస్యయతః" అని సూత్రీకరించిరునా. అనగా సృష్ట్యాదులకు కారణమగు బ్రహ్మమె జిజ్ఞాస గావింపబడుచున్నది, అని వ్యాసులు స్పష్టముగా చెప్పినట్లే, పరిపూర్ణ పరబ్రహ్మము జిజ్ఞాసితవ్యము కాదు. "శబ్దబ్రహ్మమునకు సంబంధించినదే. శ్రవణ మననాదులకు చిక్కునవి. ధ్యానింపతగినది, ఉపసింపతగినవి, అగుచున్నది. అవి కేవల పరిపూర్ణ పరబ్రహ్మము కాదని పైన వుదహరించిన

కేనోప నిషద్వాక్యం చెప్తుతూంది. ఐనప్పటికీ "శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధి గచ్ఛతి" అని చెప్పబడింది. అనగా శబ్దబ్రహ్మమును తెలిసినగాని పరబ్రహ్మము ఆశబ్ద (బ్రహ్మమునకు పరమైన బ్రహ్మము — పరిపూర్ణ బ్రహ్మము) తెలసికొనుట కధికారి కాజాలడని తేల్తోంది. పరిపూర్ణభావ జ్ఞులిట్లే చెప్పుచున్నారు. కాని శబ్ద బ్రహ్మమునకు లే నేరుకని పేరు పెట్టినారు. శబ్ద బ్రహ్మమున్నూ పూర్ణమయ్యే వున్నది. పరిపూర్ణపరబ్రహ్మమున్నూ పూర్ణమయ్యేయున్నది. కనుకనే

పూర్ణమిమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా౽వశిష్యతే॥

శు।యు।బృహ। అ 7.

"పూర్ణవస్తువుగా తోచబడేయెరుకను పూర్ణవస్తువునకు పూర్ణామైయుండే పరిపూర్ణ బ్రహ్మమునుండి తొలగించిచూచినను పరిపూర్ణమే శేషించుచున్నది." అని అచలఋషుల భావము. అద్వైత పద్ధతియందు యిందొక పూర్ణ" శబ్దము జగత్తుగా నిర్ణయించి, దాని రహితస్థితియందున్న అధిష్ఠాన బ్రహ్మవస్తువు, పూర్ణమైవుంటూ శేషించుచున్నదని అర్థము చెస్తారు కాని జగత్తు పూర్ణముగా వుంటూన్నదంటే అంగీకరించ సాధ్యముకాదు. ఏలననగా యెక్కడకక్కడ నానాత్వముగా ఖండ ఖండ రూపంగా గానవచ్చే పాంచభౌతికమై

అనృతజడదుఃఖస్వరూపమై, దేశకాలవస్తుపరిచ్ఛేదసహితమై గానవచ్చు జగత్తు పూర్ణమనిచెప్పరాదు మరిన్ని "పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" అనగా తా॥- బ్రహ్మమునందలియొక నాల్గవభాగము విశ్వముగానున్నదనీ, మిగతా మూడుభాగాలు దివ్యమూ అమృతస్వరూపమూ, గానూ వుందనిన్ని శ్రుతి చెప్తూంటె ఏకపాదస్థితమైన విశ్వము పూర్ణమని అన జెల్లునా? జగదధిష్ఠానవస్తువు అన్ని పాదములతోనూ కూడియున్నపుడే అది పూర్ణముగావుందని అనవచ్చును. ఈ జగదధిష్ఠాన వస్తువే యెరుక అనిన్ని అది పూర్ణముగా తోచబడినా, పరిపూర్ణదృష్ట్యా అది లేనేలేదు కనుక, దాని రహితస్థితియందున్న పరిపూర్ణ బ్రహ్మమే ఏపాదృముబూయెన్నడూగాక పూర్ణమైశేషించుచున్నదనిన్ని అచలఋషులు చెప్పు అర్థమే సమంజసము.

పరిపూర్ణభావము ఉపనిషత్ప్రమాణమును అంగీకరిస్తుందన్నాము. జగత్కారణ వస్తువు బ్రహ్మమేనని ఉపనిషన్మతము అనిన్ని అన్నాము. ఐతే జగత్కారణముగా చెప్పబడిన బ్రహ్మము మాత్రమె ఉపనిషత్ప్రతిపాదిత బ్రహ్మమౌతుందిగాని మరోటి కాదేమోనని శంక కలుగవచ్చును. గౌడపాదాచార్యులువారు, అజమూ అమరమూ అయిన పరిపూర్ణ బ్రహ్మము జగత్కారణం ఎన్నడూకాదని

వార్తికారికలలో స్పష్టంచేసినట్లుగా మనం సృష్టివిజ్ఞాన ప్రక్రియణమునందు గమనించినాము. పూర్వపక్ష సిద్ధాంతములను 77 లగాయితు 83 వరకుగల పేజీలలో వివరించడమున్నూ అయినది. మరిన్నీ ఉపనిషత్తులు సోపానక్రమముగా అనేక వస్తువులను బ్రహ్మమని చెపుతూవచ్చినవి. అవన్నీ సోపాధికములే వానినన్నిటినీ మనోవాక్కులకందని పరిపూర్ణబ్రహ్మముగా గ్రహించమని ఉపనిషత్తుల తాత్పర్యముకాదు. "అన్నం బ్రహ్మేతివ్యజానాత్" "ప్రాణోవై బ్రహ్మ" "వాగ్వై బ్రహ్మ" సర్వం ఖల్విదం బ్రహ్మ" "ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ" యిత్యాది వాక్యాలు యెన్నో కనుపిస్తాయి. యీ వాక్యాలన్నీ కారణకార్యరూపంగానున్న బ్రహ్మ పదార్థమునే చెప్పాయి. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనుటలో యీ కార్య కారణ సమూంతం అంతా, ఒకేవస్తువునందు కన్పడు నామరూపాత్మక భేదమేకాని వస్తువిభేదంలేదని చెప్పటానికి యీ కార్యకారణ స్వరూపాలన్నీ అధిష్ఠానచేతన బ్రహ్మముగా నిర్దేశించి చెప్పింది. దీనికి విలక్షణమైన పరిపూర్ణ బ్రహ్మము వాక్కునకందనిది. కనుక దానినిగురించి విశేషంగా వాచా విజ్ఞాపనం చేయలేదు ఐనా దానిని లక్షింపచేయు వాక్యాలు అందందు లేకపోలేదు. అసలు "పరబ్రహ్మం" అనే శబ్దా

ర్థం విచారించిచూస్తేనే యీ విషయంకొంచెం స్పష్ట మౌతుంది. బ్రహ్మమునకు పరంగానున్నదే పరబ్రహ్మము అని అనవచ్చును. బ్రహ్మము అనే శబ్దానికి బృహి=వృద్ధౌ అనే ధాతువునుంచి వచ్చింది. కనుక పెద్దవస్తువు అని అర్థం. పరబ్రహ్మమంటే, అత్యంత పెద్దవస్తువునకుకూడా పరంగా యున్నదని అర్థం. సర్వలక్షణ విలక్షణమైనదే పరిపూర్ణ పర బ్రహ్మము కనుక అవిలక్షణత్వం సూచించుటకై అచల ఋషులు దానికీతగు పేర్లుపెడుతూ వచ్చారు. కార్య కారణ సమూంతంలో చేరినదానిని వారు బ్రహ్మమని పేరెటితే యీ పరిపూర్ణభావజ్ఞులు దానికి అతీతమైయున్నదానికి (పరిపూర్ణ బ్రహ్మమునకు) పరబ్రహ్మమని పేరెట్టారు. వారుపూర్ణమని దానికి పేరెడితే వీరు దీనికి పరిపూర్ణమని పేరెట్టారు. యీ విధంగా యీ పరిపూర్ణ పరబ్రహ్మమునకు దాని అత్యంత విలక్షణత్వము సూచించుటకై పేర్లుపెడుతూ వచ్చారేకాని దానికేపేరూ లేదు. "శబ్దబ్రహ్మణినిష్ణాతః పరబ్రహ్మాధిగచ్ఛతి" అని యున్నది గదా! బ్రహ్మము, శబ్ద పరంబ్రహ్మమనిన్ని బ్రహ్మమనిన్ని రెండు విధములుగాయున్నట్లే గదా! శబ్ద బ్రహ్మము యెరుక. పరంబ్రహ్మ మీ పూర్ణాభావజ్ఞులు చెప్పే కేవల బ్రహ్మము **(Absolute).**

లేనియెరుక :- పరిపూర్ణమునూ లేనెరుకనూ యెరిగి

యెరుకను మానుటయే పూర్ణబోధ. పరిపూర్ణమునుగురించి మాటలతో వివరింపగలిగినంతగా వివరించితిమి యికలేని యెరుక యెట్టిదో యెరిగి, అపిమ్మట యెరుకను మాను విధము తెలియవలసియున్నది. కేవలపరిపూర్ణ పరబ్రహ్మము తప్ప మిగిలిందంతయు లేనియెరుకగా నిర్ణయింపబడింది పరిపూర్ణ దృష్ట్యా అసలు వునికి అనేదివుండుటకే వీలులేనిది అగుటచే యెరుకను లేనెరుక అనివాడుటసాంప్రదాయకము

ఎరుక అనగా యెరిగెడు తెలివి, జ్ఞానము. కార్య రూపమగు జీవేశ్వర జగత్తుయొక్క సృష్టిస్థితి నాశములకు అత్యంత మూలకారణ స్వరూపమైనదే యెరుక. సృష్టియం దున్న పదార్థజాత మంతటికీ, యీ యెరుకే ఆధారమూ అధిష్ఠానమూ అయివున్నది. ప్రళయమునందిజీవేశ్వర జగత్తు బీజరూపందాల్చి, యీ యెరుకయందు గర్భీకృతమైయుండి పునస్సృష్టియందు తిరిగి అవిర్భావం చెందుతోంది. కనుక ప్రళయమనగా తిరోభావం మాత్రమేననాలి. సృష్టికిపూర్వం సత్పదార్థమేయుందని కొందరు, అసత్ పదార్థమె యుందని కొందరు, సదసత్ పదార్థమని కొందరు, శృతియుక్తం గానే వాదిస్తున్నారు వీనియన్నిటి సమాహారమందు తేలే సత్యమేమంటే సృష్టిపూర్వమున్న యెరుక సత్తుగానూవుంది అసత్ గానూ వుంది. సదసత్తుగానూ వుంది. సద్ఘనమనీ,

చిద్ఘనమనీ, ఆనందఘనమనీ దీన్నే పేర్కొంటూన్నారు. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అణువుకంటె చిన్నదిగానూ మహత్‌కంటె పెద్దదిగానూ యిదేవుంది. విశ్వగతము (immanant) గానూ విశ్వాతీతము (transcendental) గానూ యున్నది. పురుష ప్రకృతులుగా, పంచతన్మాత్రలుగా, పంచభూతములుగా, జీవేశ్వర్లుగా, సగుణ నిర్గుణాలుగా, క్షరాక్షరములుగా, సర్వజగద్రూపంగా, అన్నిటికీ సాక్షిగా నియామకుడుగా, కర్తగా, భోక్తగా, లోకములుగా, లోకేశ్వర్లుగా, తేజోంధకారములుగా, ఏకవస్తువుగా, అనేక వస్తువులుగా, సర్వస్వరూపంగా నున్నదే ఎరుక. ఇదేసంవిత్, యిదేప్రత్యగ్బ్రమాత్మలు. యెదే అహంపదార్ధము. యిదేతత్, త్వంపదార్ధములు యిదే అసి పదార్ధము. అన్నీ యిదే, యిదే లేకుంటె పరిపూర్ణ పరబ్రహ్మముతప్ప యింకేమీలేదు. సర్వనామరూప క్రియానటనలు దీనివే. యిదే ఖండాఖండాలుగా, పిండ బ్రహ్మాండములుగాయుంది. వానియందు అహంకారూపంగానున్నదీ యిదే. సర్వద్విపుటులు, త్రిపుటులు యిదే సర్వశక్తులుకలదిదే. సంకోచ వికాసములు, సంశ్లేష విశేషములు దీనికే. కార్యకారణములు రెండూ యిదే. భావాభావములు రెండూ యిదే. సర్వమహత్తులు దీనియందే

యున్నవి. చేతనమూ భౌతిక పదార్థమూ రెండూ యిదే. చేతనము ప్రతిపదార్థమునందూ సూక్ష్మంగా, నువ్వులలో నూనె, కట్టెయందు నిప్పు, పాలలో వెన్న పూవులో తావివలె వుందని, అనటుంకంటె, విడదీయుటకు వీలులేనంతసూక్ష్మంగా వుంది. అని అనటం సమంజసం. ఏలనంటే, ఆయాపదార్థము లనుండి నూనె, నెయ్యి యిత్యాదులను తేలికగా విడదియ వచ్చును. యీ విడివడిన పదార్థములుగూడా పదార్థరూపంగా, వస్తురూపంగా, స్థూలరూపంగానే, పంచేంద్రియగోచ రాలౌతున్నాయి. కాని చేతనము అట్లా గోచరించేది కాదు. అది పదార్థమునువిడచి వేరేయుండజాలదు. అట్లే పదార్థము చేతనమును విడచివుండజాలదు. విశ్లేషంపొంది పదార్థమే నాశనమౌతుంది. యీ రెంటినీ, చిజ్జడములని అంటారు. ఈరెండూ కలసే వస్తున్నాయి. కలసేవుంటున్నాయి. యిం దొకటిపోతే, రెండోదికూడా, దానితోనేపోతుంది. యిదే వస్తువుయొక్క లక్షణం. ప్రపంచమందున్న వస్తువులన్ని యిట్టివే. యీచిజ్జడముల సమష్టి స్వరూపమునకే యెరుక అని పేరెట్టారు ఐతే యీరెంటినీ వేరువేరుగా వ్యవహరించ వలసివున్నపుడు సూక్ష్మభాగమును. ఎరుకనీ, తెలివిఅనీ, చేతన మనీ, శక్తి అనీ, గుణమనీ, స్థితిగతుల భేదములను పురస్క రించుకొని పేరెట్టడమైనది. అట్లే స్థూలభాగమును, మరుపనీ

అజ్ఞాననునీ, జడమనీ, భౌతికమనీ, జగత్తుఅనీఅన్నారు. యీ స్థూల సూక్ష్మముల ద్వంద్వమే సర్వత్రా గోచరిస్తోంది. ఏకవస్తువుగాకనబడినా; ద్వంద్వరూపంగాయున్నది. కనుక యిది ద్వంద్వరూప ఏకము, అని అనవలసివచ్చింది.

ద్వంద్వరూపంగా వస్తువునందు గానవచ్చే యీ రెంటిలో, సూక్ష్మంగా చేతనంగా తెలివిరూపంగా నుండేది నిత్యమైన బ్రహ్మపదార్థమనిన్ని; స్థూల రూపంగానున్నది అశాశ్వతమైన మాయా కార్యమగు జడమనిన్ని కొందరంటున్నారు యీ రెండూ అవినాభావ సంబంధం కలవై యుండి. వాసికి పృథక్సత్తా లేనప్పడు యిట్లా అనడం న్యాయంకాదు. అంటే రెండూ నిత్యమని అనాలి. లేకుంటే రెండూ అనిత్యమనే అనాలి. స్థూలభాగం మన కట్టెదుట నశిస్తోందికదా! దానినికూడా నిత్యమని ఎట్లా అనడం? అని శంకింప పనిలేదు. ఏవస్తువూ, కేవలంగా నశించిపోవడంలేదు జరిగేదేమంటే, రూపంలో మార్పు మాత్రమే. మార్పు అనంతరం పూర్వపు పేరు పనికిరాదు. కనుక దానిని మరో పేరుతో పిలుస్తున్నాము. యింతే నామరూపాలు నశిస్తున్నాయి, కాని పదార్థం నశించడంలేదు. అసలు పదార్థానికి నాశనంలేదు (matter is indestructible) అని నేటి పదార్థవిజ్ఞాన శాస్త్రజ్ఞులు ప్రయోగాత్మకంగా ఋజువుచేసి

చూపిస్తున్నారు కూడా చేతనము బ్రహ్మమనీ దాని యావరణ భూతమగు భౌతికపదార్థము మాయారూప అశాశ్వత పదార్థమనీ అనరాదు. మరికొందరేమంటున్నారంటే, పదార్థరూపంగా తోచబడే వస్తువే పరమాణురూపంలో శాశ్వతం అయివుందనీ, దానికంటె శాశ్వతం అయివున్న చేతనమనేది వేనేలేదనీ అంటున్నారు. చేతనమనేది భౌతిక పదార్థము యొక్క స్వభావమని మరికొందరు అంటున్నారు. పదార్థంచే మొట్టమొదటిదని కొందరంటే, కాదు చేతనమే మొదటిదని, కొందరంటారు. కాని యీ యుభయులు చెప్పేదీ సరికాదు. రెండూ కలసి ఏక కాలమందే వస్తున్నాయి. ఏకకాలమందే పోతున్నాయి. ఉదాహరణకు బెల్లమూ దానియందు తీపి ఒకేసారి పుట్టుతున్నాయి. బెల్లంపోతే దానితోపాటే తీపి పోతుంది. తీపిపోయి బెల్లం నిలువదు. అథవా నిలిస్తే దాన్ని బెడ్డముక్క అంటాము కాని బెల్లంముక్క అనంగదా! మరిన్ని నేటి శాస్త్రజ్ఞులు తమ ప్రయోగాత్మక పరిశీలన వలన పరమాణువునందు యింకా సూక్ష్మంగా చైతన్యవంతంగావుండే శక్తి నిక్షిప్తమై నిగూఢంగావుందని ఋజువుచేసి యాటంబాంబులు హైడ్రోజను బాంబులు తయారు చేసి ఆశక్తిని ప్రదర్శిస్తున్నారు. కనుక పదార్థమూ, దానియందుండేచేతనమూ, రెండూ కలసి, ఏకవస్తువుగా వున్నాయి.

యిందులో చేతనము మిథ్యనిగాని, పదార్థం మిథ్యనిగాని, అనరాదు. యీరెండూ యెరుకే. కానీ యిందేదీ పరిపూర్ణపరబ్రహ్మము కాదు. పరిపూర్ణ దృష్ట్యా యీ రెండూ యెరుక స్వరూపాలే.

కారణ కార్యములు రెండూ ఎరుకే. అట్లే కర్తృత్వ కారయితృత్వములు కలదిన్నీ యెరుకే. అద్వైత పద్ధతియందు (సృష్టి స్థితి లయములకు) కారణ కర్తృత్వములు గల అత్యంత మూలకారణ వస్తువే బ్రహ్మమని శ్రుతులు చెప్పుచున్నవి. సృష్టి కారణము బ్రహ్మము, అని ప్రతిపాదించు శ్రుతులను సృష్టి విజ్ఞాన త్రికరణములో యిదివరకే వుదహరించాము. కారణమే కార్యరూపమై, తిర్గి కారణ వస్తువుగా సంచర ప్రతిసంచర పద్ధతులచే మార్పు చెందుతుంది. యిట్టి మార్పులు చెందే కార్య కారణ రూపమైన వస్తువు, పరిపూర్ణ బ్రహ్మము కాదు. కనుక అద్వైత పద్ధతి యందు చెప్పబడ్డ బ్రహ్మము పరిపూర్ణ భావజ్ఞులు చెప్పే లేని యెరుక యొక్క నిజస్వరూపమై యున్నది.

ఎరుకే సర్వమును యెరిగేది. నేరుగనని చెప్పేది యిదే. చెప్పేదానిని యెరిగేదీ యెరుకే వ్యష్టియందు అంతఃకరణ రూపముగానుండి, జ్ఞానేంద్రియములద్వారా శబ్ద స్పర్శ రూప రస గంధములనే, పంచ విషయములను తెలుసుకొంటూంది. అంతే కాక, ఆ శబ్దాదుల యందు

తారతమ్యమును గుర్తించి, ప్రతి వక్కదానియందలి మంచి చెడ్డలను గుర్తించేది యిదే. మరిన్ని కర్మేంద్రియాల ద్వారా కర్మ చేసేది యిదే. కనుక యీయెరుకే, జ్ఞానకర్మ ద్వయ స్వరూపంగా తానే వ్యవహరిస్తూన్నది. ఏపని చేయాలన్నా ముందు సంకల్పించి, పిదప ప్రయత్నించి, తర్వాత బ్రహ్మాండమందున్న పనిముట్లు కొన్ని స్వీకరించి,తలపెట్టిన కార్యం పరిసమాప్తి నొందిస్తూంది. "అధిష్ఠానం, తథాకర్తా కరణంచ పృథగ్విధం వివిధాచ పృథక్చేష్టాదైవంచైవాత్ర పంచమం॥భ గీ॥ 18 అధ్యాయం. 14 శ్లో॥ అని గీతలో చెప్పబడిన యీ యైదున్నూ యెరుకే. యెరిగేపని జేయునపుడు, (అనగా తెలసికొనునపుడు), యెరుక(జ్ఞానము) అనిన్ని, ఎరిగె క్రియ చేయకుండా నున్నపుడు మరుపు(అజ్ఞానము) అనిన్ని దీనికే పేర్లు. పనిచేయునపుడు కర్త అనీ, చేయనపుడు అకర్తయనీ కూడా దీనికే పేర్లు. జాగ్రదవస్థయందు యెరుక రూపంగా స్వరము తెలుసుకొంటూ నున్నది. మరుపు సుషుప్తి, మూర్ఛ, మరణసమాధ్యాద్యవస్థలయందు మరుపురూపంగా నున్నది. సమాధియందు తన స్వరూపమందున్నా వ్యుత్థానదశయందు ఆ స్వరూప జ్ఞానమును మరచిపుండుటచేజాగ్రదవస్థదృష్ట్యామరుపురూపమే. మరియుసమాధిస్థితి యందున్నపుడు దేహేంద్రియాదులన్నిటిని సర్వ ప్రపంచ

మును కూడా మరచియుండుటచే కూడా దీన్ని మరపు అని అనుకుంటే తెల్సు. మూడవస్థలూ కానిదనుటకే తురీయమని పేరెట్టేరు. ఏ పేరుచే ఈ స్థితిని వర్ణించినా యిది యెరుక యొక్క స్థితి భేదం మాత్రమే.

ఎరుక మూలము:- సర్వమునకు యెరుకే మూలకారణముగా నున్నది. కాని దానికిమాత్రం మూలం లేదు. సృష్టికి కారణమున్నప్పుడు, ఏబ్రహ్మమును యితరులు ప్రతిపాదించారో, అదే యెరుక. ఏవస్తువును ప్రారంభంగా తీసుకొని కారణ పరంపరను విచారిస్తూ పోయినా, చివరకు అత్యంత మూలకారణ వస్తువు ఎరుకేనని తేట తెల్లమవుతుంది. ఉదాహరణకు ఒక కుర్చీ తీసుకుంటే దానికిమూలం కర్ర, కర్రకు మూలంచెట్టు, చెట్టుకు మూలం పృథ్వి. దానికి జలం, అగ్ని, వాయువు, ఆకాశం, ఆత్మ, (ఎరుక) యిట్లా కారణ పరంపర గోచరిస్తుంది. ఆత్మనుంచి యివి వరుసగా పుట్టాయంటే, ఆత్మకు కూడా పుట్టుక వుండితీరాలి. ఎంచేతనంటే పుట్టనిదానినుండి యితరం పుట్టజాలదు. కనుక ఆత్మ అనబడే యెరుక దేనినుండి పుట్టుచున్నది? ఉన్నవి రెండే. (1) పరిపూర్ణము (2) లేనెరుక. పుట్టని పరిపూర్ణమునుండి యేదీ పుట్టదు. దానియందెట్టి కారణ బీజములూన్నూ లేవు పుట్టించే సత్తా కల్గినదీ పుట్టేదికూడా యెరుకే. కనుక ఎరు

తకు ఎరుకే కారణమనాలి. అందుకే స్వతః కారణమనీ, లేక స్వకారణమనీ, స్వయంప్రకాశమనీ, స్వయంభూ అనీ, యీ లేనెరుక వర్ణింపబడుతూంది. కనుక ఎరుక స్వకారణంగా తనకు తానే తోచింది. లేక ప్రకటమైంది అని అనాలి. యిది ఎట్లాసంభవము? విత్తనమునందుచెట్టు, చెట్టుయందు విత్తనము కల్గుట స్వకారణం. అట్లే యెరుక, మరుపు అను రెండు రూపాలుగా తోచబడే యెరుకయు నుత్పత్తి చెందుచున్నది ఏలాగంటే, ఎరుకయందు మరుపున్నూ, మరుపునందు యెరుకయున్నూ కల్గుచున్నవి. ఎరుక సూక్ష్మమగు విత్తనము వంటిది. మరుపు స్థూలమగు వృక్షము వంటిది. బీజ వృక్షముల యుత్పత్తికి వేరే విత్తనము లేనట్లుగానే, యెరుక మరుపుల యుత్పత్తికి వేరే మూలం లేదు. "విత్తే చెట్టుకు మూలము, చెట్టుకు మూలం విత్తు" అనిన్నీ, మేనెరుకల రెండింటిలో దానిని యిది, దీని నదియు తగసృజియించునే" అనిన్నీ, శ్రీ భాగవతుల కృష్ణ దేశికులు తమ కందార్థములలో సెలవిచ్చినారు. మేను స్థూలమగుస్వరూపము. నేను, సూక్ష్మమగు యెరుక రూపము. ఈ నేనుమేనులు పిండాండమందు గాక అధిష్ఠాన స్థానమందే అన్వయం చేసుకోవాలి. నేనుమేనుల ఏకైక రూపమగు ఎరుకకు వేరే మూలం ఏమీలేదు. పరిపూర్ణ పరబ్రహ్మము

నందు స్థానమున్నూ లేదు. కనుకనే దీనిని లేనెరుకన్నారు. పరిపూర్ణ పరబ్రహ్మము, సకల దేశములయందు, సర్వకాలములయందు, సమస్తమైన వస్తువులయందు, వున్నది. కనుక ఎరుకయు తత్కార్యరూపమగు సమస్తమున్నూ కూడా, యీ పరిపూర్ణములోనే తోచవలెను. కాని అన్యస్థానము లేదుగదా? కనుక పరిపూర్ణము ఎరుకకు ఆధారమూ, అధిష్ఠానము కాదా? అని సంసయం కలుగవచ్చును. అదిసరికాదు. ఎరుకే ఎరుకకు ఆధారమూ అధిష్ఠానమూ అయివున్నది. రజ్జు సర్పము, స్థాణు పురుషుడు, మృగజలము, వంధ్యాసూనుడు, శశవిషాణము, గగన కుసుమము, గంధర్వ నగరము (లేక యక్షరాజధాని), స్వప్నానందం. వలె (పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేకనే), ఎరుక తనంత తానే, తనయందే, తాను తోచింది. కాని పరిపూర్ణమీ లేనెరుకకు

వివర్తోపాదాన కారణమున్నూ కాజాలదు.

ఈ దృష్టాంతములలో లజ్జుసర్పము, స్థాణు పురుషుడు మృగజలము అనువానిలో బ్రాంతికి కారణము, లేక ఆధారము, లేక అధిష్ఠానం (Basis or Substratum) స్పష్టంగా కనుపించుచున్నది. వంధ్యాసూనుడు, శశవిషాణము, గగన కుసుమము, గంధర్వనగరము, స్వప్నానందము. అనువానికి కేవల నామప్రతీతియేగాని వస్తురూపం లేదనిన్నీ అవి

కేవలం అలీకపదార్థములు (బొత్తిగా లేనేలేనివి) అని స్ని కొందరంటూరు. కాని అది సరికాదు. ఎట్లనగా:—

(1) వంధ్యాసూనుడు అనగా గొడ్రాలి కొడుకు:- ఆమె గర్భవాసమున నిజముగా యెన్నడూ ఏబిడ్డా పుట్ట లేదు. కాని ఒక కుర్రవానిని పెంచినది. కాలవశాత్తు, ఆ కుర్రవాడు గతిస్తే పెంచిన ప్రేమచేత "నాకొడుకా" అని యేడ్చినది. అతడే వంధ్యాసూనుడని అనుటలో పొరపాటుందా? వంధ్యాసూనుడు అభిధానము. ఆ పెంపుడు బిడ్డే అభిధేయము.

(2) శశవిషాణము (కుందేటి కొమ్ము):- కుందేటికి కొమ్ముండదు. కాని కుందేలు ప్రాణభీతిచే పరుగిడి పోవునపుడు, తనచెవులను రెంటినీ నిక్కించి, ఒకచోటికి చేర్చును. అది కొమ్మువలెనే కనుపించును. కుందేటి చెవులే కొమ్మువలె భాసించును, కుందేటి కొమ్ము అనే పేరుకు కూడా ఆధారమున్నది కనుక అది అలీకము కాదు.

(3) గగనకుసుమము (ఆకాశ పుష్పము):- ఆకాశమెన్నడూ, పూవు పూయదు. కాని వర్షాకాలములో కానవచ్చు యింద్రధనస్సు పుష్పమని భ్రాంతి చెందుతూంది. ఆకాశమందున్న వర్షతుంపురులలో సూర్య కిరణములు విశ్లేషముచెంది, వానియందున్న సప్త వర్ణములు బైటకు వచ్చి

యింద్రధనస్సు రూపంగా కనుపడుతున్నాయి. కనుక ఆకాశ పుష్పమునకు కూడ ఆధారమున్నది అలీకము కాదు.

(4) స్వప్నానందము:- స్వప్నములో కల్గిన ఆనంద మున్నూ కేవలం లేనిది కాదు. స్వప్నమందలి ద్రష్ట, దృక్, దృశ్యములు మూడూ మనస్సే అయివున్నవి. శోక మోహములు మనోధర్మములు. అమనస్సు స్వప్నకాలమున నిజంగా ఆనందించినది. స్వప్నగతుడగు వానికి నవ్వు,ఏడ్పు వీర్య స్ఖలనాదులు వాని స్థూల శరీరమున కన్పడుతున్నాయి. కనుక ఇదిన్ని కేవలం లేనిదికాదు. స్వప్నానందమునకు మనస్సు ఆధార అధిష్టానములుగా వుంది.

(5) గంధర్వనగరం (లేక యక్షరాజధాని):- గంధ ర్వులు, లేక యక్షులు, మాయాజాలములలో (యింద్ర జాల మహేంద్రజాలాది విద్యలు) శిద్ధులు. యింద్రజాలకుడు తన విద్యవలన కేవల మొక వస్తువును మాత్రమే కాక ఒక మహానగరమును కూడా ప్రదర్శింపగలడు అట్టివాడు సృష్టిం చిన మాయానగరమునకు (గంధర్వ విద్యలు నేర్చిన ఐంద్ర జాలక నిర్మితం గనుక) గంధర్వ నగరమని పేరొచ్చినది. దీనికాధారము ఐంద్రజాలకవిద్య, సర్పప్రతీతికి రజ్జువు. పురు షప్రతీతికిస్థాణువు, మృగజలమునకు మండుటెండవంధ్యాసూ నునికిపెంపుడుకొడుకు.శశవిషాణమునకు పరుగెత్తుకుందేలు చెవు

లు గంధర్వ నగరమునకు ఇంద్రజాలకు నివిద్యస్వప్నా నందము నకు వాసనావాసితమగు మనస్సు, ఆధారములు, అధిష్టాన ములు లేక అభిదేయములు అయివున్నాయి, భ్రాంతికి మూల జనకములై వున్నాయి భ్రాంతికి మూలజనకములై కారణ స్వరూపంగాయున్నవిన్ని; కార్య రూపముగ తోచ బడు భ్రాంతి సిద్ధవస్తు జాతమున్నూ, కూడా యెరుకే కాని అం దొకటిన్ని కార్య కారణ విరహితమగు పరిపూర్ణ బ్రహ్మ ముతో బోల్చుటకు వీలుకానిదై వున్నది. రజ్వాదులయందు భ్రాంతిని కల్గింపచేయు లక్షణములు అనగా సాదృశ్య. సామాప్యాది దోషము లుండుటవల్లనే భ్రాంతి కల్గుతోంది. లేనియెడల కలుగనేరదు. ఉదాహరణకు రజ్జువునందు సర్ప భ్రాంతియే కల్గును. ఒక సౌధము ప్రతీతి కాజాలదు. కారణము? రజు సర్పములకు సమాన సాదృశ్యాది లక్షణము లుండుటయున్నూ, రజ్జు సౌధములయందు అట్టి సమాన సాదృశ్య లక్షణములు లేకపోవుటయు మాత్రమే. ఏ ఇంద్రి యమునకు గోచరించనిదియు, సర్వ లక్షణ విలక్షణము. సర్వదోష విదూరము, అయిన పరిపూర్ణ బ్రహ్మమునందు. అన్యవస్తు ప్రతీతి కీషణ్మాత్రము ఆధారము లేదు. పరిపూర్ణ మేవిధముగానూ వివర్త రూపంచెందజాలదు కనుక, ఎరుకకు అధిష్టానమున్నూ కాదు. పరిపూర్ణ పరబ్రహ్మమునకున్నూ ఎరుకకున్నూ ఏలాటి సంబంధమూ లేదు. రెండు న్నూ

అత్యంత విభిన్నములు. పరిపూర్ణ పరబ్రహ్మము మినహా తదన్యమంతయు ఎరుకే. కనుక వివిధనామ రూపాత్మకము గనున్ననూ, అనేక వస్తువులుగాభాసించిననూ, మొత్తమంత యు ఎరుకయొక్క స్వరూపమే. కనుక అందొకదానిని చూచి మరొకదానిగా భ్రాంతి పడుటకు అవకాశమున్నది. కొన్ని వస్తువులకు సాదృశ్య సారూప్యాది సమానలక్షణము లనూ వుండవచ్చును. "గోసాదృశ్యో గవయః" గోవున కును గవయ మృగమునకును సమాన రూపాదులున్నవి. అద్వైత పద్ధతియందు చెప్పబడ్డ వివర్తవాదమునందు రజ్జు సర్పాదులకు సాదృశ్య లక్షణములే లేనిచో భ్రాంతికే తావు లేదు. కనుక ఎరుకయొక్క ఒకానొక రూప నామ క్రియ లను చూచి యెరుక యందలి మరొక వస్తువుగా భ్రాంతి చెందుట కవకాశముండును. ఏలననగా మూలమునందు ఆ రెండూ ఒకేపదార్ధమునకు సంబంధించినవి కనుక తప్పక సాదృశ్య సాధర్మ్యము లుండును. అన్యోన్యాధ్యాసకు తగిన సామగ్రియును యుండును. కనుక భ్రాంతి పొందింపచేయు అధిష్టాన వస్తువున్ను, భ్రాంతి జన్యవస్తువున్నూ, రెండూ కూడా సమాన ప్రతిపత్తి కల్గినవేగాని, అందొకటి నిత్య మగు బ్రహ్మము మరొకటి అనిత్యమగు జగత్తు కావు.

ఎరుక జ్ఞానజ్ఞానములు, నేను మెనులు, సదసత్తులు,

అధిష్ఠాన అవ్యక్తములు, యిత్యాది ద్వంద్వ స్వరూపములు గానుండి, ఆ ద్వంద్వ స్వరూపంలో ఒకటి మరొకదానికి ఆధారముగా లేక అధిష్ఠానముగా నున్నది. ఒకటి కారణముగాను, రెండోది కార్యరూపంగానూ, వుంటున్నాయి. ఎరుక పుట్టనేలేదని అచలఋషులన్నారు ఎందుకన్నారంటే:_

(1) పరిపూర్ణ పరబ్రహ్మమునందు, ఎరుక కేవిధంగానూ యుత్పత్తి కారణంలేదు.

(2) ఎరుకకు ఎరుకే మూలముగాని, వేరే మూలం లేదు. కారణరూపమగు ఎరుకకు వేరే కారణంలేదని వారి అభిప్రాయమే గాని, కార్యరూపమగు జీవేశ్వర జగత్తునకు మూలము లేదనిగాని, కనుక యీ జీవేశ్వర జగత్తు లేనేలేదని గాని వారి యభిప్రాయము గాదు. అందుకనే. (యీ జీవేశ్వర జగత్తు లేనిదే అయితే) నీదారి కడ్డముగా గోడ యొకటున్నపుడు, గోడ కడ్డముగా పోక, దర్వాజాగుండా ఎందుకు పోతున్నావు? అని ప్రశ్నిస్తున్నారు.

(3) ఎరుక పుట్టినది అంటే, దేనివల్ల? ఎవరికి? అనే ప్రశ్నలు వస్తాయి. ఎరుక తనకు తానె వచ్చింది. తన రాకకు మరేదీ కారణంకాదు. అని అచల ఋషులజవాబు. తనకు తానే తోచినందుకు లోకమందేమైనా దృష్టాంతము

లున్నవా? అంటే, వున్నవి. పాచితీగ అనేదిన్నీ, అంతర తామర అనేదిన్నీ, ఎట్టి మూలము లేకుండా, తమకు తామే అల్లుకునిపోతాయి. ఎంతవెదకినా వానికి భూమితో సంబంధమే కనబడదు. పరిపూర్ణ బ్రహ్మమునందు దీనికి మూలము లేదు. కనుక నున్ను, యీ యెరుక తనయందే తోచి తనయందే తాను లేకపోవుచున్నది కనుకనున్ను. మూలం లేని దానిని సత్యమనుటకు వీలులేనందుననున్ను, దీనికి లేనెరుకని పేరు ప్రసిద్ధమైనది. షట్టనే లేదని కూడా ఆ కా ర ణ ము చేతనే అనవలసి వచ్చినది.

(4) పరిపూర్ణ బ్రహ్మమునందు యీ లేనెరుక రానూ లేదు. పరిపూర్ణములో వుండేటందుకు స్థానమూ లేదు. పోని తిర్గి పోయేటందుకు మరొక స్థానమున్నూ లేదు. ఈ లేని యెరుకే. ఎరుక జగములుగా భాసిస్తూవున్నది సూలసూక్ష్మ రూపంగా ద్వంద్వ స్వరూపమైయుండి యీద్వంద్వములలో ఒకటి మరొకదానికి కారణరూపమై, పిదప దానివల్ల తిర్గి కార్యరూపంగా తానే యుత్పత్తి అవుతూంది. కనుక దీనికి అన్యోన్యాశ్రయ దోషం, అనవసాదోషం యిత్యాది దోషాలు సంక్రమిస్తున్నాయి. "యా, మా, సామాయ" అనే మాయా శబ్ద నిర్వచనానుసారం ఏది లేనిదో, అదే మాయ కనుకనున్ను, యీ పరిపూర్ణ బ్రహ్మమునందు లేదు. కనుక నున్ను మాయాశబ్దము దీనియెడల సా ర్థ క మౌ తో ం ది.

"మీయతే అనేన యితిమాయ" అనే నిర్వచనం ప్రకారం గూడా ప్రతీదానినీ మితిలో చూపించి అణుప్రమాణంగానూ మహత్ ప్రమాణంగానూ ఏదో మితిలో గానవచ్చేది యిదే కనుక యెరుకకు మాయాలక్షణములన్నియు సరిపోవుచున్నవి అందుచేత కూడా దీనికి లేనెరుక అని పేరువచ్చింది. యీ అన్ని కారణములచేత యీ లేనెరుక పుట్టనే లేదని అన్నారు.

సంవిత్ అనీ అభిజ్ఞ అనీ, గుర్తు అనీ, సాక్షి అనీ, ద్రష్ట అనీ, దృక్కు అనీ, ఎరుక అనీ, మరుపు అనీ, స్ఫురణయనీ, జ్ఞప్తి అనీ, మనోబుద్ధి చిత్తాహంకారములనీ తెలివి అనీ, జ్ఞానమనీ, అజ్ఞానమనీ, ప్రజ్ఞఅనీ, ప్రజ్ఞప్తి అనీ, ప్రజ్ఞానమనీ, అహం అనీ, తత్ అనీ, త్వం అనీ, నేనుఅనీ మేను అని అంతఃకరణమనీ మొదలగు అనేక పేర్లతో "యెరుకే" స్థానభేదముచేతను వృత్తి భేదము చేతను వ్యవహరింపబడుతూంది. జ్ఞానరూపమైన యెరుకకు స్థూలరూపమైన ఆవరణ వకటీ వుంటుందని యిదివరకే తెలుసు కొన్నాము. కనుక ఏస్థానమందైనా యిది ద్వంద్వ స్వరూపంగానే వుంటోంది. పిండాండమందు యీ యెరుక ప్రాణ ప్రజ్ఞలు లేక మనఃప్రాణములు అనే ద్వంద్వ స్వరూప ఏకవస్తువుగా నుండి సర్వమును గుర్తెరుగుతోంది. యిదే లింగశరీరమని అంటారు. ఈ లింగశరీరం భంగం ఐతేతప్ప జన్మరాహిత్య రూపమోక్షం లేద

న్నారు కాని బ్రహ్మాండమందున్ను అధిష్ఠానస్థానమందున్ను ఈ వ్యష్టి లింగశరీరానికి కారణస్వరూపంగా నున్న వస్తువును గురు కృపచే గుర్తించాలి. అదే యెరుక యొక్క కూకుడు వేరు అదే మూలంలేని గుర్తెరిగే శరీరం, దాని రహితస్థితియందే జన్మరాహిత్యం. యీ మూలంలేని గుర్తెరిగే శరీరమే సకల భ్రాంతులకు మూలం, దాని రహితస్థితియందే సర్వభ్రాంతి రహితం. రహితమనగా, నాశనమని అనరాదు. ఈ విషయం మున్ముందు స్పష్టమవుతుంది. గుర్తెరిగే జ్ఞానం వ్యష్టిగానూ సమష్టిగాను గూడా యున్నది. వ్యష్టి ఉపాధి మరణావస్థలో మార్పుచెందితే సమష్టిరూప బ్రహ్మాండమునందు నిలచుచున్నది. బ్రహ్మాండం గూడ ప్రళయం చెందితే అధిష్టాన స్థానమున బీజరూపంగా నుంటున్నది. కనుక ఈ వ్యష్టి లింగశరీరం రహితమై తిర్గి జనన మరణాలు పొందకుండా వుండాలంటే మూలమందున్న మూలం లేని గుర్తెరిగే శరీరమునకు పరిపూర్ణ బ్రహ్మమునందు మూలం లేదు. ప్రవేశించుటకు స్థానమున్నూ లేదు. అని ఆరూఢం కావలెనని అచలఋషులు చెపుతున్నారు. అట్లా ఆరూఢమైతే, వ్యష్టిలింగ శరీరాలన్నీ భంగమై అందరూ జన్మరహితం పొందుతారా? అంటే, పొందరు. ఏలననగా ఒక ఘటము భిన్నమైతే అఘటాకాశమే పోయినట్లు,

ఏవ్యక్తి తన మూలమును యీ పరిపూర్ణ బోధవలన లేనేలే దని దృఢము చేసికొంటాడో ఆవ్యక్తియొక్క లింగశరీరమే భంగమై ఆవ్యక్తికే జన్మరాహిత్యం కల్గుతూంది. ఏక జీవ వాద మంగీకరిస్తేనే యీ శంకకు తావుంది. ఏక జీవవాద మనగా:- పరబ్రహ్మ మొక్కటే. మాయా ఒక్కటే, కనుక జీవుడున్ను ఒక్కడే అయివుండాలి. అనేదే యీ వాదము. యీ వాదమునకు శ్రుతి స్మృత్యాది ప్రమాణ ములేమైనా గలవా అను విషయ మటుంచి, యీ వాదము అనుభవ విరుద్ధమై యున్నది. ఒకడు సర్వ సుఖము లనుభ వించుచుండుటయు, వేరొకడు సకల దుఃఖము లనుభవించు టయు ప్రత్యక్షముగా చూచుచున్నాము. సుఖ దుఃఖము లనుభవించునది మనస్సు, మనః ప్రాణ సమష్టి జీవుడు. ఎవరి మనస్సు వారిదే. ఎవరి సంస్కారములు వారివే. కనుక ఎవరి బంధ మోక్షములున్ను వారికే. ఒకజీవి మోక్షం చెందితే, అందరు జీవులు మోక్షం చెందెదరని ఎవ్వరున్నూ చెప్పుటలేదు.

## చలాచలములు రెండూ యెరుకే

ఎంతదూరం విచారించినా ప్రపంచంలో అన్నీ చలన రూపమయ్యే వున్నాయి. చివరకు పరమాణువులు, అందలి యెలక్ట్రాన్‌లు, ప్రోటానులు న్యూట్రానులు కూడా, నిరంతర

చలన క్రియయందే వున్నవి. చలనమంతా సాపేక్షికమే. సూర్యచంద్ర నవగ్రహ నక్షత్రాదులన్నీ చలిస్తూన్నాయి. కాని సాపేక్షికముగా చూస్తే యిందులో తరతమ భేదాలు కన్పిస్తాయి. అంటే ఒకదాని దృష్ట్యా రెండోది ఎక్కువగానో తక్కువగానో చలించడమో, లేక అచలస్థితిలో కనపడ్డమో, జరుగుతోంది. యీ చలనక్రియలో విశ్రాంతి స్థానములుంటే యుండవచ్చు. అది చూచి దానికి కదలిక లేదని అనుకోడం పొరపాటు అవుతుంది. సృష్టికి పూర్వం, ఎరుక అచలస్థితిలో వుందనుకోవచ్చు. కాని దానియందు చలనాత్మక లక్షణం బీజరూపంగా లేకపోలేదు. వివిధ దశలలో, ఎరుక చలనక్రియలలో తారతమ్యం వుండొచ్చు. ఈ వివిధరూప చలనములను యిదివరకే విమర్శించడం అయింది. కనుక ఎరుక చలాచల రూపములు రెండూ కల్గివుంది. అందుకే శ్రుతి "తదేజతి" తన్నైజతి, తద్దూరే, తద్వదంతికే తదంతరస్యసర్వస్య, తదు సర్వస్యాస్య బాహ్యతః" అన్నది. అనగా అది కదలుతూ వున్నది. కదలకుండానూ యున్నది. దూరమున నున్నది. దగ్గరనూ యున్నది. సర్వమునకు లోపలా యున్నది. బైటనూవున్నది. అని అర్థం. అద్వైత పద్ధతియందు— బ్రహ్మ సాన్నిధ్యమందు స్వయంగా జడమని చెప్పబడే మాయ చలించి

జీవేశ్వర జగత్తునకు కారణమైంది — అని, అన్నారు. అంటే చలింపచేసేది బ్రహ్మము. చలించేది మాయ. చలన కార్యము జగత్తు కనుక చలింపచేసే బ్రహ్మము సహా, సర్వమూ చలించే వస్తువర్గములోనికే వస్తాయి. అథవా, యీ బ్రహ్మము సృష్టికి పూర్వం అచలంగా లేదా? అంటే మాయతో సంబంధం కల్గినపుడు చలనక్రియ వున్నది. అంతకుపూర్వం లేదు అనేనా అనాలి ఆ కల్పంలో ఎవరేనా వుంటే మాట్లాడేనేను, ఎవరూలేనపుడు మాట్లాడనంత మాత్రాన, నేను మూగవాడినని ఎవరేనా అనగలరా? అట్లే ఒకపుడు చలించనంతమాత్రాన ఈ లేనెరుకను కేవలం అచలమనరాదు. చలాచల ద్వంద్వరూపంగా వున్నదనే అనాలి.

## ఎరుక నిష్క్రియం కాదు.

ఇతరలు చెప్పిన బ్రహ్మము అచలఋషులు చెప్పిన ఎరుకేగాని కేవలం పరిపూర్ణ బ్రహ్మము కాదని కొంతవరకు తెలసికొన్నాము. ఈ యెరుక బ్రహ్మము (అనగా జ్ఞానరూపమైన బ్రహ్మము) నిష్క్రియము, సాక్షి మాత్రము, అని యితరు లంటారు. కాని యిది సరికాదు. ఎరుకే (జ్ఞానమే) ఒక స్థితియందు అజ్ఞానరూపమైన మరుపు లక్షణం చెందుతోంది. తాను తానై యున్న స్థితియందు (అనగా సృష్టికి

పూర్వం బ్రహ్మము "జ్ఞానాదేవతు కైవల్యం" అనే రీతి గా ప్రజ్ఞానఘనమై యుండి తనను తాను మరచిన స్థితియందు అవ్యక్తరూపమైనది. అనగా తనస్వరూపజ్ఞానమును మరచెననుట. జ్ఞానాజ్ఞాన రూపంగాయున్న యీ బ్రహ్మము నిష్క్రియ మాన చెల్లునా? జ్ఞానమునకు యెరుగుట అది భౌతిక వ్యవహారము. ఎరుగుట, ఎరుగక పోవుట, అను రెండూ క్రియలుగావా? అట్లే సాక్షిగానుండుటయు యుండకపోవుటయు గూడ. అయితే మరి పనిచేయుశక్తి వున్నచో, పనిని అపుచేయుశక్తియును యుండును. కనుక ఒకానొక స్థితిలో ఏపని చేయనట్లు తోచబడినా దానిని నిష్క్రియమని అనరాదు.

## అన్నీ ఎరుకే – ఏదీ ఎరుక కాదు.

మనోవాక్కులకందే సర్వమూ, అనగా యిదికాదిది కాదని, నిషేధించగలిగిన సమస్తమూ యెరుకే, శేషించినదిన్నీ ఎరుకే. ఏలననగా శేషించినది శూన్యము మాత్రమే. ఆ శూన్యముగూడ మహాశూన్యమైతే– ఆపిదపనుండేదేది ? ఏమో, ఏమనుటకు వీలులేనిది. ఉన్నదనీ, లేదనీకూడ పల్కరానిదది. ఏపేరు లేనిదానికి, వ్యవహారార్థం పరిపూర్ణ పరబయలనీ, పరిపూర్ణ పరబ్రహ్మమనీ, పేరెట్టేరు.

"నేతినేతినేతేతిహోవాచ" అని సర్వ నిషేధావధి

రూపంగా శేషించినవి పరాయెరుక అనీ, అంఖడ యెరుక అనీ, పిల్వబడుతోంది. అదే అద్వైత సిద్ధాంతమునందు పరమగమ్యము. యిదే సర్వాధిష్ఠానము. సర్వమునకు, అత్యంత మూలకారణం. ఇదియే "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అని చెప్పబడినది.

ఖండా ఖండ రూపముగా, "సర్వంఖల్విదం బ్రహ్మ" అనే శ్రుతియదంలి "సర్వ" శబ్దముచే తెలియ బడునది శుద్ధ యెరుక అనీ, ఉపాధి గతమైనపుడు మిశ్రిమ యెరుక అనీ, భూత భౌతికములుగా నున్నపుడు మలినయెరుకనీ, ఆ అఖండపుటెరుకే పిల్వబడుచున్నవి. శుద్ధయెరుకకే ఈశ్వరుడు, అక్షరుడు, కూటస్థుడు అని నామాంతరములు. ఈ శుద్ధ యెరుక వ్యష్ట్యోపాధులయం దున్నపుడు మిశ్రిమ యెరుక అగుచున్నది. మరియు భూతములయందు భూత కార్యముల యందు మలినయెరుక అని పేరుతో వ్యవహరింపబడుచున్నది.

అఖండపుటెరుకయే, యెరుకయొక్క అత్యంత శ్రేష స్వరూపము. యిదే పరిపూర్ణ బ్రహ్మమని, యితరులు భ్రాంతిచెందినారు. అన్ని నామరూపాలు వహించి, ఎరుకే సర్వమూ అయివున్నది. ఐనను, తన అఖండ స్వరూప దృష్టియందు, వ్యష్టిగానుండు సర్వమూ తానుగానని, నిషే

ధించడం జరుగుతోంది. నామరూప సహితమగునది, అఖండ స్వరూపమగు పరాయెరుక కానట్లున్నా, ఆ పరాయెరుక అత్యంత విలక్షణంగా వున్నట్లున్న భ్రాంతి కలుగుతోంది. కాని విమర్శించి చూచినచో అన్నీ అదే అయివున్నది. సర్వగతమును, సర్వాతీతమునూ అయివున్నదదే. సర్వవ్యాప్తులూ, త్రిపుటులు అదే అయివున్నవి. పూర్ణత్వ శూన్యత్వములు రెండూ దానివే. కనుకనే "పూర్ణమన్యత్ స్థానం శూన్య మన్యత్ స్థానం" అని శ్రుతి చెప్పుచున్నది. సత్పదార్థంగా, అసత్పదార్థంగా, సదసత్పదార్థంగా, అనిర్వచనీయంగా యున్నది. మాయాలక్షణములన్నీ దీనికి సిద్ధిస్తూన్నవి (1) సత్ఖ్యాతి, అసత్ ఖ్యాతి, అనిర్వచనీయఖ్యాతి, అఖ్యాతి. అనేవన్నీ దీనియందే సార్థకమౌతున్నాయి. ఇది సర్వాతీతమైయున్నపుడు, ఏదీకాదు. అని నామరూపాలను నిషేధించవలసి వస్తూన్నది. కనుక అన్నీ ఎరుకే, ఏదీ ఎరుక కాదు, అని కూడా, అనవలసియున్నది.



## శ్రుతి స్మృతుల ప్రమాణములు.

పరిపూర్ణము, ఎరుక, రెంటి తారతమ్యము, ఇప్పటికే గ్రాహ్యమై వుంటుంది. ఆ తారతమ్యము, యీక్రింది శ్రుతి స్మృతులెట్లు, నిర్దేశించుచున్నవో గమనించదగును.

మొదట ఎరుకకు సంబంధించిన శ్రుతి స్మృతులను పిదప పరిపూర్ణభావమునకుసంబంధించినశ్రుతి స్మృతులున్ను వరుసగా పొందుపరచబడినవి. ప్రతినెంబరు ఎరుక శ్రుతి యున్ను అదే నెంబరుగల పరిపూర్ణ శ్రుతితో పోల్చిచూచి నచో యీ తారతమ్యం విస్పష్టంకాగలదు.

(1) తదెజతి, తన్నైజతి, తద్దూరే, తద్వదంతికే. తదంతరస్య సర్వస్య; తదు సర్వస్యాస్య భాహ్యతః ॥ఈశా వాస్య॥ తా॥ అది (అనగా ఆబ్రహ్మము) కదలును; అది కదులదు. అది దూరముగా నున్నది; అది దగ్గరగానూ యున్నది. అది అన్నిటిలోపల నున్నది. అది అన్నిటి బైటను వున్నది.

(1) అచ్ఛేద్యోయ, మదాహ్యోయ, మక్లేద్యోఽశోష్యయే వచ, నిత్యస్సర్వగతః స్థాణురచలోయం సనాతనః ॥భ॥ గీ॥ 2-24.

తా॥ యీ అచలరూపమగు సనాతన బ్రహ్మము (కేవలాత్మ), భేదింపరానిది; దహింపరానిది; తడుపరానిది;

శోషింపరానిది; ఎల్లపుడు, అంతట నిండి వ్యాపించినది, స్థిరమై కదలకనే యున్నది.

(2) (ఎ) బ్రహ్మైవేద మమృతం, పురస్తాత్ బ్రహ్మ
పశ్చాత్ బ్రహ్మ దక్షిణ తశ్చోత్తరేణ
అధశ్చోర్ధ్వంచ ప్రసృతం బ్రహ్మైవేదం
విశ్వమిదం వరిష్ఠమ్ ॥ముండక।

తా॥ అమృత స్వరూపమైన బ్రహ్మము నాల్గు దిక్కులయందును, క్రిందనూ మీదనూ అంతటను నిండి వెలుగుచున్నది. అన్నిటికన్న శ్రేష్ఠమగు యీ బ్రహ్మమే, విశ్వాకారముగనున్నది. అనగా ఈ బ్రహ్మము, అమృత మృత్యువులను ద్వంద్వములో నొకటిగా నున్నది. శ్రేష్ఠ అశ్రేష్ఠములను ద్వంద్వములలో నొకటిగానున్నది. కనుక సాపేక్షికము. మరియు దిక్కులు అనే భావము, (అదియు నొకద్రవ్యమేనని వైశేషికులు) దేనివలన కలుగుచున్నదో, ఆ సూర్యుని యునికిని అపేక్షించి వాక్కుచే వర్ణింపబడినది. మరియు విశ్వాకారముగా పరిణామము చెందినది. అనగా రూపాంతరము నొందినది. (పరిపూర్ణ పరబ్రహ్మము అట్టిదికాదు. అది సాపేక్షికమున్నూ కాదు. వర్ణింపరానిది. ఎన్నడూ మార్పులేనిది.)

(2) సర్వదానవచ్ఛిన్నం బ్రహ్మ, కాలభేదం వస్తుభేదం

దేశభేదం స్వభేదకం, కించిద్భేదం నతస్యాస్తి, కించిద్వాపి నవిద్యతే॥ యోగచూడామణి యుపనిషత్॥

తా॥ ఆ బ్రహ్మము దేనిచేతను అవచ్ఛిన్నముకాదు. అనగా ఖండములు గానేరదు, దేశ, కాల, వస్తువులచే అవి భిన్నములుకాదు; దానియందు స్వగతభేదము అనగా దాని అంతరమందు యెట్టిభేదమున్ను లేదు. కనుక భేదమనునది కించిత్తూ దానికి లేనేలేదు.

2. (ఎ) ఆత్మేత్యేవోపాసీత

(బి) ఓమిత్యుపాసీత

(సి) భూమానమిత్యుపాస్వ. ఛాందో॥

తా॥ ఆత్మయని నుపాసింపుము। ఓంకారముగా దాని నుపాసింపుము భూమ అని; అనగా, అదిచాలా గొప్ప వస్తువు అని ఉపాసింపుము.

(3) తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యందముపాసతే కేనోపనిషత్॥ 1-5-9.

తా॥ ఏదియుపాసితవ్యము, అనగా, యుపాసించుటకు సాధ్యమగునది కాదో, దానిని బ్రహ్మముగా తెలుసుకొమ్ము (అదే పరిపూర్ణ బ్రహ్మము ఎందుకనగా ఉపాస్య ఉపాసకోపాసనలను, త్రిపుటికందు స్థానములేదు)

(4) నతస్య కార్యం కరణంచ విద్యతే నతస్సమశ్చాభ్యధి

కశ్చ దృశ్యతే, పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే, స్వాభావికీ జ్ఞానబల క్రియాచ॥ శ్వేతా॥

తా॥ ఆ బ్రహ్మమునందు కార్యకరణములు లేవు. దానితో సమమైనవి గాని దానికంటె అధికమైనదిగాని లేదు. జ్ఞానబల క్రియాత్మకమగు దాని పరాశక్తి ప్రభావముచే అది సర్వమును సృజించుచున్నది.

(4) (ఎ) స్వయమేవపరంబ్రహ్మ పూర్ణమద్వయ మక్రియం॥
॥అధ్యాత్మ॥

తా॥ పరిపూర్ణ పరబ్రహ్మము తనయందుగాని, తనకు వేరుగాగాని, రెండవదనేదేమియు లేక ఒక్కటియై నిష్క్రియమైయున్నది.

(బి) యఏవం నిర్బీజంవేద, నిర్బీజ ఏవ సభవతి ॥సుబాలోపనిషత్॥

తా॥ అది బీజరహితమని, అనగా అది దేనికిని కారణం కావని, తెలుకొన్నవాడు, బీజరహితుడై, తిరిగి పుట్టడు.

(5) యతోవాయిమాని భూతానిజాయంతి, ఏనజాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మేతి॥ తైత్తిరేయోపనిషత్॥

తా॥ దేనియందు భూతములు పుట్టుచున్నవియో,

పుట్టినవి దేనిచేత బ్రతుకుచున్నవో, తిర్గి మరణానంతరం దేనియందు ప్రవేశించుచున్నవో అదియే బ్రహ్మము (యిది సృష్టికారణమగు బ్రహ్మము) దీనినిగురించేజిజ్ఞాసగావించుము. అనగా విచారణ సేయుము.

(5) కార్యోపాధిరయం జీవః॥
కారణోపాధిరీశ్వరః ।
కార్యకారణ తాంహిత్వా।
పూర్ణబోధోవ శిష్యతే॥

శుకరహస్యోపనిషత్॥

తా॥ జీవుడు కార్యరూపముగల వుపాధి అనగా అక్షరోపాధిగలవాడు, ఈశ్వర్డు కారణోపాధి అనగా అక్షరోపాధి. ఈయుపా ధిద్వయరహితమునందు, పరిపూర్ణ బ్రహ్మమే శేషించుచున్నది.

(6) బ్రహ్మశబ్దేన, తద్బ్రహ్మ స్వప్రకాశాత్మ రూపకం॥
॥తేజోబిం॥

తా॥ "బ్రహ్మ" అను శబ్దముచేత స్వయంప్రకాశ రూపమగు అనగా ఎఱుకగల ఆబ్రహ్మమే చెప్పబడుచున్నది. ఇది తత్ పదవాచ్యము.

(6) బ్రహ్మ శబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మ రూపకం,
ఏకత్వాభావవినిర్ముక్తంతద్బ్రహ్మ బ్రహ్మతత్పరం ॥తేజోబిందు॥

బ్రహ్మ శబ్దముచేస్వ ప్రకాశబ్రహ్మము (అనగా తత్పదవాచ్య మగు బ్రహ్మము) చెప్పబడినది. ఆభావమునుంచి విడువబడిన బ్రహ్మము ఏదిగలదో, అది యీ తత్పద వాచ్యమగు బ్రహ్మ మునకు పరముగా యున్నది.

(7) (ఎ) ఏషుసర్వేషు భూతేషు గూఢోత్మాన ప్రకాశతే
దృశ్యతేత్వగ్ర్యయా బుద్ధ్యాసూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥
కఠో-1-3-12

తా॥ ఏయాత్మ (బ్రహ్మము)సర్వ భూతములయందు కనుపించకుండా గూఢముగానున్నదో, ఆయాత్మను తత్వవేత్తలు తమనునిశితమగు ఏకాగ్రమగుబుద్ధిచే చూచుచున్నారు.

(బి) సుఖమాత్యంతికం యత్తద్బుద్ధి గ్రాహ్యమతీంద్రియం
వేత్తియత్రనచైవాయం స్థితశ్చలతి తత్వతః॥ గీ॥ 6-21

తా॥ అతీంద్రియమగు బుద్ధిచే యీ బ్రహ్మము గ్రహింపదగియున్నది. అనగాబుద్ధీంద్రియమునకునిశ్చయా నిశ్చయములు ఆదిభౌతిక వ్యాపారమై యున్నది. యీ వ్యాపారమును వదలినచో ఆబుద్ధియే అతీంద్రియ మనబడి యీ బ్రహ్మమును గ్రహింప సమర్థకమగుచున్నది.

(సి) సోఽన్వేష్టవ్యః స్సవిజ్ఞాసితవ్యః మరియు "విగితే వేద్యం నాస్తి"

తా॥ యీ బ్రహ్మము వెదుకదగినవి. అనగా వెదకి

నచో దొరకగలదు. మరియు యీబ్రహ్మము జిజ్ఞాసచేయ తగినది. ఇది తెలిస్తే ఆపైన తెలియబడేదిలేదు.

(డి) ఆత్మావాఽరేద్రష్టవ్యశ్శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః ॥బృహ॥

**తా॥** ఆత్మయే చూడదగినది; వినదగినది; మననము చేయదగినది ధ్యానముచే పొందదగినది. అనగా మనస్సుచే తెలియదగినదిగానున్నది.

(ఇ) మనసైవాను ద్రష్టవ్యం; మనసైవాను శ్రోతవ్యం.

మనస్సుచేత యీబ్రహ్మము చూడదగినది వినదగినది

(యఫ్) ఏతద్జ్ఞేయం. నిత్యమేవాత్మసంస్థం నాతః పరంవేదితవ్యంహికించిత్, భోక్తాభోగ్యం ప్రేరితారంచమత్వాసర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ మే త త్॥ శ్వేతాశ్వతర ॥1వ అధ్యా 12 శ్లో.

**తా॥** ఈ బ్రహ్మము తనయందేయుండి నిత్యమైనదై యున్నదనిదీనితెలిసికొనవలయును.ఇంతకంటెతెలసికొనదగినది కొంచమైనాలేదు. బోక్తయగు జీవుడున్ను భోగ్యమగు ప్రపంచమున్ను ప్రేరకుడగు అంతర్యామియు అని త్రివిధముగా చెప్పబడిన యిదంతయు బ్రహ్మయే (అనగా తెలుసుకొనదగిన బ్రహ్మయే) (అనగా పరిపూర్ణ పరబ్రహ్మము దీనికన్యమై తెలియరానిదై యున్నదిని గ్రహించవలెను)

(7) (ఎ) నతత్రచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి, నోమనః, నవిద్మో నవిజానీమో. యథైవ తదనుశిష్యాదన్య దేవతద్విదితా దథో అవిదితాదధి యితి శుశ్రుమ పూర్వేషా యేనస్తద్వ్యా చచక్షిరే ॥కేనోపనిషత్॥

తా॥ వాక్కుకు అందదు! మనస్సుకు చక్షువుకు అందదు; జ్ఞానమునకుగూడ తెలియరానిది ఏదో, అది తెలిసినదానికంటెను తెలియరాని దానికంటెను వేరుగానున్న దని పూర్వము పెద్దలు తెలుసుకొని శిష్యుల కుపదేశించిరి.

(బి) యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ ॥తైత్తరీయ॥

మనస్సున్ను వాక్కున్ను దేనిని తెలుసుకొనుటకు అసమర్థములై వెనుకకు మరలెనో అది పరిపూర్ణ పరబ్రహ్మము.

(సి) నైవచానమనసా ప్రాప్తుంశక్యోననకుషా అస్తీతి బ్రువతోఽన్యత్రకథం తదుపలభ్యతే ॥కఠోపనిషత్ 2-3-12

తా॥ వాక్. మనస్సు, చకువులకు ప్రాప్తింపరానిది ఉన్నది అని చెప్పుట వినాగా మరొకేరీతిగా దాని యుపలబ్ధి కాజాలదు.

(డి)సఏషనేతినేత్యాత్మాఽగృహ్యోనహిగృహ్యతేఽశీర్యో నహిశీర్యతే,-సంగోనహిసజ్జ్యతే;-సితోనవ్యథతే, నరిష్యతి॥

బృహ. అ. 5. బ్రా. 9.

తా॥ ఆ కేవలాత్మ (పరిపూర్ణ పరబ్రహ్మము) గ్రహింప దగినవాడు కాడు; గ్రహింపబడడు; నశింపదగినవాడుకాడు; నశింపడు; నిస్సంగుడు; శీతాదులు లేనివాడు; సుఖదుఃఖాదులు లేనివాడు; అశరీరుడు.

(8) (ఎ) సహస్ర శీర్షాపురుష స్సహస్రాక్ష సహస్రపాత్-- శ్వేతాశ్వతర

(బి) సర్వతః పాణిపాదంత త్సర్వతోఽక్షిశిరోముఖం, సర్వతః శ్రుతిమాల్లోకే సర్వమావృత్యతిష్ఠతి॥ భ. గీ॥ 13-13.

(ఎ) తా॥ ఆ పరమాత్మ కనేక శిరస్సులు॥ అనేక కండ్లు మరియు అనేక పాదములు.

(బి) అంతటను కాళ్లే, అంతటను చేతులే; అంతటను కళ్లే; అంతటను శిరస్సులే; అంతటను నోళ్ళే; అంతటను చెవులే; గల ఆ పరమాత్మ యన్నిటిని ఆవరించియున్నది.

(సి) సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితం— శ్వేతాశ్వతర.

తా॥ పైన చెప్పబడిన శిగః పాణిపాదాదులు వాస్తవముగా లేవనిన్ని ఆభాస మాత్రమనిన్ని యెరుగవలెను (ఐనను ఆభాసకు అవకాశమిచ్చినది అధిష్ఠాన చేతన బ్రహ్మమనిన్ని కేవలం నిరాభాసమైన యెట్టి భ్రాంతులకు, అధ్యారో

పములకు, తావివ్వనిది పరిపూర్ణ పరబ్రహ్మ మనిన్ని, యెరుగ వలెను.)

(8) (ఎ) అచక్షుష్క, మశ్రోత్రమవాగ్గమనః

తా॥ కండ్లు, చెవులు, వాక్కు మనస్సులు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము.

(బి) అప్రాణోహ్యమనః శుభ్రోహ్యక్షరాత్ పరతఃపరః- ॥ముండక

తా॥ మనః ప్రాణములు లేనిది, అమృత స్వరూపుడు అగు అక్షర పురుషునికంటె పరుడగు పురుషోత్తమునికంటె పరమైనది. (క్షర, అక్షర, పురుషోత్తములకుపరముగానున్నది)

(9) అణోరణీయాన్ మహతోమహీయానాత్మాఽస్యజంతోర్నిహితోగుహాయాం॥ కఠోపనిషత్.

తా॥ అణువుకంటె అణుస్వరూపమును; మహత్తుకంటె మహత్ స్వరూపమును, అయివున్నది

(9) (ఎ) అస్థూలమనణ్వమహ్రస్వ, మదీర్ఘ మశబ్ద మస్పర్శ మరూప మవ్యయం బృహః- 3. 3. 8.

తా॥ అది స్థూలముకాదు. అణువుకాదు. పొట్టికాదు పొడుగుకాదు. అది శబ్దస్పర్శ రూపాదులుగాదు. అవి దాని యందు లేనూలేవు అది తరుగులేనిది.

(బి) అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం, తథాఽరసం

నిత్యమగంధ వచ్చయత్, అనాద్యనంతం మహతః పరం ధృవం నిచాయ్యతం మృత్యు ముఖాత్ప్రముచ్యతే, కఠో?
1-3-15

తా॥ పంచతన్మాత్ర రహితమైనది, ఆద్యంతములు లేనిది, గొప్పదని చెప్పబడే భూమా పదార్థము కంటెను పరముగా నున్నట్టియు స్థిరమైనదియునగు దానిని (పరిపూర్ణ పరబ్రహ్మమును) యెరిగినవాడు మృత్యుయీ పనుగు సంసార మునుండి విడివడుచున్నాడు.

(10) ........ ఆత్మవస్తుకామాయ పతిః ప్రియోభవతి;.... ఆత్మవస్తుకామాయ జాయాప్రియాభవతి.... ఆత్మవస్తుకామాయ పుత్రాః ప్రియాభవన్తి.... ఆత్మవస్తుకామాయ విత్తం ప్రియం భవతి.... ఆత్మవస్తు కామాయ బ్రహ్మం ప్రియం భవతి.... ఆత్మవస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి.... ఆత్మవస్తు కామాయ లోకా ప్రియా భవంతి .. ఆత్మవస్తు కామాయ దేవాః ప్రియా భవంతి .... ఆత్మవస్తు కామాయ భూతాని ప్రియణి భవంతి... ఆత్మవస్తు కామాయ సర్వం ప్రియం భవతి ... ॥బృహా॥ 4 అధ్యా॥ 4 బ్రాహ్మ॥ 5 మం॥

తా॥ ఆత్మయందలి ప్రేమచేతనే, భర్తా, భార్యా, పుత్రులు, విత్తము, బ్రహ్మ, క్షత్రములు, లోకములు, దేవ

తలు, ఘాతములు, మొదలగు సర్వమూ ప్రేమాస్పదమై యున్నవి.

(10) (ఎ) యద్యత్స్వాభిమతం వస్తు తత్త్యజన్ మోక్ష ముశ్నుతే॥ మహోపనిషత్॥

తా॥ తనకు అభిమతమైన అనగా ప్రేమస్పదమైన వస్తువును వదలినవాడే మోక్షము పొందగలడు. ఆత్మకంటె ప్రియతరమైన వస్తువేదియు లేనేలేదు తన "స్వ" ఆత్మవస్తువే తనకు ప్రియతమము. కనుక అట్టి ఆత్మ యందభిమానమును త్యజించి ఆత్మాతీతము అయిన కేవలాత్మను అనగా పరిపూర్ణ పరబ్రహ్మమును తెలసి జననమరణ రహిత రూపమగు మోక్షమును పొందుచున్నాడు.

(బి) త్యజధర్మ మధర్మంచ ఉభేసత్యాऽనృతేత్యజ। ఉభే సత్యానృతేత్యక్త్వా యేనత్యజసి, తత్త్యజ॥ సన్యాస, అ. 2.

తా॥ శీతోష్ణాది సమస్త ద్వంద్వములను విడచిన విధంగానే ధర్మాధర్మములు(విధినిషేధాలు) సత్యాసత్యలుము అను భేదబుద్ధికూడా జ్ఞానివిడచిన వాడగుచున్నాడు. ఐతే దేనిచేత ఆ ద్వంద్వలక్షణములను విడచునో అట్టి జ్ఞానస్వ రూపమగు ఎరుకను విడువుము

(సి) (1) అర్ధ్రంజ్వలతి జ్యోతిరహమస్మి (2) జ్యోతిర్జ్వలతి బ్రహ్మాహమస్మి (3) యోహమస్మి బ్రహ్మాహమస్మి (4) అహ

మస్మి బ్రహ్మహమస్మి (5) అహమేవాహం మాంజుహోమి స్వాహా॥ (తైత్తిరీయోపనిషత్ - నారాయణ ప్రశ్నః - ద్వాదశానువాకః)

తా॥ ఆపోజ్యోతిని రూపంగా ఏది ప్రకాశించుచున్నదో, ఆజ్యోతి స్వరూపుడను నేనే అయివున్నాను. (2) పరంజ్యోతి అను పేరుతో ఏది ప్రకాశించుచున్నదో ఆ బ్రహ్మము నేనైయున్నాను. (4) నేను నేనై బ్రహ్మమునై యున్నాను. (5) అట్టి నేనే నన్ను నేనే, వ్రేల్చుకొనుచున్నాను అనగా త్యాగము చేయుచున్నాను, విడుచుచున్నాను (అనగా, ఎరుకయందలి సర్వవిధములైన అభిమానములను పూర్తిగా విడచుచున్నాను,

(11) (ఎ) సదేవశోమ్యేదమగ్ర ఆసీత్ ఛాందో॥ 6-2-1.

తా॥ సృష్టికి పూర్వము సత్పదార్థముండెను.

(బి) అసద్వాయిదమగ్ర ఆసీత్ ॥తైత్తిరీయ॥

తా॥ సృష్టికి పూర్వ మసత్పదార్థముండెను.

(సి) అమృతం చైవ, మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున ॥భ।గీ। 9-19

తా॥ నేనే సదసత్తులును అమృత మృత్యువులును అయివున్నాను.

(11) (ఎ) నాసదాసీన్నో సదాసీత్తదానీం... ఋగ్వేదం—

నాసదీయసూక్తం (1) వ మంత్రము.

తా॥ దానికి(పరిపూర్ణపరబ్రహ్మమునందు) సదసత్తులు లేవు. నోటు:- యీ మంత్ర తాత్పర్యము 30వ పేజీలో కాననగును)

(బి) నసత్తన్నా సదుచ్యతే భ॥గీ॥

తా॥ అది సత్తనిగాని అసత్తనిగాని చెప్పుటకు వీలు లేనిది.

(సి) అన్యత్రధర్మాత్, అన్యత్రాఽధర్మాదన్యత్రాస్మాత్కృతా కృతాత్, అన్యత్ర భూతచ్ఛభవ్యాచ్ఛ యత్తత్పశ్యతి తద్వద. (కఠో. 1-2-14)

తా॥ ధర్మాధర్మములకంటెను, చేయబడిన సృష్టికంటెను, చేయబడని సృష్టికంటెను, చేయబడని సృష్టికారణముగు వస్తువుకంటెను, భూతాది కాలత్రయముకంటెను, వేరైనట్టియు అతీతమైనట్టియు దానిని నీవెరుగుదువు.

అట్టిబోధను నాకెరింగిపుము.

(12) ఏషసర్వేశ్వర, ఏషసర్వజ్ఞ, ఏషోంతర్యామేషయోనిః సర్వస్య ప్రభవాస్యయోహి భూతానాం॥

తా॥ అతడు సర్వమునకు ప్రభువు; సర్వజ్ఞత్వ లక్షణములు గలవాడు; సకలజీవుల హృదయములయందు అంతర్యామి రూపంగానున్నాడు; సకల భూతముల యుత్పత్తికి అతడు

యోనిస్వరూపుడు.

(12) సాహివాచామగమ్యత్వా దసత్తామివ శాశ్వతీం, నైరాత్మ్య సిద్ధాంత దశాముపయాతేవ శిష్యతే ॥సన్యాస॥

తా॥ మనోవాక్కులకు అగమ్యమైన యీ పరిపూర్ణ పరబ్రహ్మము శాశ్వతత్వముగలదై దానియందు ఆత్మగల దని చెప్పుటకు వీలులేనిదై అసద్రూపమువలె (శూన్యము వలె) నున్నను చివరకు మిగిలియుండునది అదియొక్కటే.

(13) (ఎ) ఉల్కాహస్తో యథాకశ్చిత్ ద్రవ్య మాలోక్య తాంత్యజేత్; జ్ఞానేన జ్ఞేయమాలోక్య పశ్చాద్జ్ఞానం పరిత్యజేత్ ॥ఉత్తరగీత॥

తా॥ వస్తువును దీపసహాయముతో వెదకి పిమ్మట దీపమును విసర్జించిన విధముగా జ్ఞేయమును జ్ఞానసహాయముతో యెరింగి జ్ఞానమును వదలుము అనిభావము బ్రహ్మరూపమైన ఆత్మయే జ్ఞానరూపముగాను జ్ఞేయరూపముగాను గూడయున్నది. అట్టియెడ జ్ఞేయరూపమును దెలసినపిమ్మట జ్ఞానమును వదలుట అనగా బ్రహ్మమునే వదలుట యగును. వివరణకు 213 పేజీ చూడవలెను.

(బి) నాంతః ప్రజ్ఞః నబహిఃప్రజ్ఞః ...... స ఆత్మా సవిజ్ఞేయః ॥మాండూక్య॥

తా॥ ... ... ఆ ఆత్మస్వరూపమే తెలియదగినది.

అదియే జ్ఞేయరూపము.

(13) జ్ఞేయవస్తు పరిత్యాగే విలయయాతి మానసం, మనసే విలయంయాతి కైవల్య మవశిష్యతే ॥శాండిల్యోపనిషత్॥

తా॥ విషయరూపము (జ్ఞేయరూపము) వహించనపుడు మనస్సు ఆ జ్ఞేయివస్తు రూపమును దాల్చును. అట్లు వహించనపుడు మనసు నిర్విషయ స్వరూపమై నిజస్వరూపముగా అనగా జ్ఞానరూపమైనిల్చును. కనుక జ్ఞేయవస్తువును విడచినచో జ్ఞానజ్ఞేయ రహితమగు కైవల్యము అనగా కేవలాత్మ లేక పరిపూర్ణ బ్రహ్మము మాత్రయే స్థిరమై యుండును.

(14) (ఎ) యద్యద్పశ్యతి చక్షుభ్యాంతత్తదాత్మేతి భావయేత్; యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాంతత్తదాత్మేతి భావయేత్ ... ... యోగతత్వ ॥

తా॥ శబ్దస్పర్శరూపరసగంధాత్మకమగుసర్వము ఆత్మయే అని భావించుము ఏలననగా అపంచీకృత పంచభూతములగు పంచతన్మాత్ర స్వరూపమగు ఆత్మయే పంచీకృతమై విషయరూపంగా పరిణమించినది గనుక "సర్వం యదయమాత్మా" అంతయూ ఆత్మస్వరూపమే.

(బి) దృష్టిం జ్ఞానమయీంకృత్వా పశ్యేత్ బ్రహ్మమయం జగత్ ॥తేజో॥

తా॥ దృష్టిని జ్ఞానమయంగా జేసి జగత్తును బ్రహ్మమయ

ముగా చూడుము.

(14) (ఎ) యత్రనాన్యత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి, నాన్య ద్విజానాతి సభూమా ॥ఛాందో॥ 7-24-1

తా॥ యెచ్చట నన్యమేదియు గానరాదో అన్యము వినరాదో అన్యము తెలియబడదో అదియే భూమా పదార్థము.

అన్యమును చూచేదీ వినేదీ తెలుసుకొనేదీ యెచ్చట లేదో అది పరిపూర్ణము. ఆవిధంగా చూడబడేవీ వినబడేవీ తెలియబడేవీ లేనిచో, తెలుసుకొనే జ్ఞాతా, తెలివి రూప, ముగా నుండు జ్ఞానముకూడా లేవని తెలుసుకోవలెను। అదియే పరిపూర్ణ పరబ్రహ్మము—

(బి) ద్రష్టృదర్శన దృశ్యానాం విరామోయ త్రవా భవేత్ ॥తేజో॥

తా॥ త్రిపుటి యెచ్చటలేదో అదియే పరిపూర్ణ పర బ్రహ్మము.

ద్రష్టృ దర్శన దృశ్యంవా ఈషణ్మాత్రం కలాదికం అనాత్మేతి ప్రసంగోవా, హ్యనాత్మేతి మనోపివా,

తా॥ ఏ ఆత్మకు చూచువాడు, చూడబడునది, చూపు అనే భేదము లేదో, అనాత్మ అనెడి ప్రసంగముగాని, అన్మాత యనెడి మనస్సుగాని లేదో అది కేవలాత్మ—
(ఋభుగీత। 19 శ్లో। ప్రథమాధ్యాయ)

(15) బ్రహ్మైవ విద్యతే సాక్షాత్ వస్తుతో అవస్తుతో పిచ॥ పాశుపత బ్రాహ్మణం॥

తా॥ వస్తువుగాను (అనగా సత్తు) గాను అవస్తువుగాను (అసద్రూపంగాను) వుండునది బ్రహ్మమే. అనగా ఒకప్పుడు వస్తురూపం వహించును మారొకవుడు ఆ వస్తువుయొక్క నామరూపములను తనయందు బీజరూపం గావించుకొని అవస్తువుగా గోచరించును. కాని పరిపూర్ణమునందు వస్తురూపము ప్రకటమై యుండుటగాని దాగియుండుట లేనేలేదు. అదివస్తుమద్రహితం.

(15) సర్వ విశేషం నేతినేతీతి విహాయ యదవశిష్యతేతద ద్వయం బ్రహ్మ ॥అద్వయతారక ॥

తా॥ ఏ విశేషములు, ఏ లక్షణములున్ను పరిపూర్ణపర బ్రహ్మమునకు లేవు. ఏవిశేషములు ఏలక్షణము లున్ననూ అది పరిపూర్ణపరబ్రహ్మము కాదనితోసిపుచ్చగా, ఇక రెండవ లక్షణము లేక ఏకమైయున్నదే పరిపూర్ణ పరబ్రహ్మముగా గుర్తెరుగవలెను.

(15) (ఎ) సర్వవిశేషం నేతి నేతేతి విహాయ యదవశిష్యతే తదద్వం బ్రహ్మ ॥అద్వయతారక॥

తా॥ ఏ విశేషములు, ఏ లక్షణములున్ను పరిపూర్ణ పరబ్రహ్మమునకులేవు. ఏవిశేషములు ఏలక్షణములున్ననూ

అది పరిపూర్ణ పరబ్రహ్మముగాదని తోసిపుచ్చగా, యిక రెండవలక్షణములేక ఏకమైయున్నదే పరిపూర్ణ పరబ్రహ్మ ముగా గుర్తెరుగవలెను.

(బి) అథాత ఆదేశోనేతినేతి ॥బృహ॥ 2-3-6

తా॥ యిదికాదిది కాదని మనోవాక్కులకందు సమస్త మును నిషేధించగా మనోవాక్కుల కందనిదే శేషించును.

(బి) సిద్ధాంతో అధ్యాత్మ శాస్త్రాణాం సర్వాపహ్నవ ఏవచ=సర్వమును (ఎరుకతోసహా) మిధ్యని నిషేధించుటయే వేదాంత సిద్ధాంతము-

(16) విద్యా విద్యాదిభేదేవ, భావాభావాది భేదతః। గురుశిష్యాది భేదేన బ్రహ్మైన ప్రతిభాసతే ॥ఆత్మోపనిషత్॥

తా॥ జ్ఞానాజ్ఞానములుగా, భావాభావములుగా, గురు శిష్యులుగా, భేదములతో ఈబ్రహ్మమే ప్రకాశించుచున్నది.

(16) యస్యకించిత్బహిర్నాస్తి కిదిచిదంతః కియచ్చన యస్య లింగం ప్రపంచవా బ్రహ్మైవాత్మాన సంశయః ॥తేజో॥

తా॥ దేనికిలోపల బైట, అనునిర్ణయమేలేదో, దేని కెట్టి చిహ్నములు లేవో, దేనియందు సృష్ట్యాదులు లేవో, అది కేవలాత్మగా తెలియవలెను.

(బి) ననిరోధోనచోత్పత్తిర్నబద్ధో నచసాధకః, నముము. క్షుర్న వైముక్త యిత్యేషా పరమార్థతః॥

తా॥ జనన మరణములు, బద్ధులు, సాధకులు ముముక్షువులు, ముక్తులు అను భేదములు యెన్నడూలేనిదే పరిపూర్ణ పరబ్రహ్మము.

(17) (ఎ) సన్నాప్య సన్నాప్యు భయాత్మికానో, భిన్నాప్య భిన్నాప్యు భయాత్మికానో, సాంగాన్యనంగా న్యుభయాత్మికానో, మహాద్భుతాఽనిర్వచనీయరూపా॥ వివేకచూడామణి,

తా॥ సత్తుగా, అసత్తుగా, వుభయత్మికంగా, భిన్నంగా అభిన్నంగా, వుభయాత్మికముగా వున్నందున, మాయ మహాద్భుతమున్ను అనిర్వచనీయమున్ను అని చెప్పబడెను. ఈమాయాలక్షణములు ఎరుక బ్రహ్మమునకున్ను సరిపోవుచున్నవి.

(బి) అనిర్వచనీయ జ్యోతిస్సర్వవ్యాపకం నిరతిశయానంద లక్షణం పరమాకాశం. (మండల బ్రాహ్మణోపనిషత్ ॥)

తా॥ అతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవ దోషములు లేకుండ చెప్పుటకు సాధ్యముకానిది అనిర్వచనీయమని చెప్పబడును. యీ యెరుకయున్ను - అన్నీ అదే అయి తిర్గి అన్నియు కానిది అయివున్నది. ఈ అత్మ ప్రకాశ రూపకము. చిదాకాశమని పేరొందినది. మయాలక్షణములు కల్గియున్నది.

(17) తద్బ్రహ్మ కేవలం పూర్ణం, జీవేశ్వర వివర్జితం, చిదూర్

పం నాస్తి సర్వత్ర, సద్రూపంనాస్తి సర్వదా, ఆధారాధేయ రహితం....

తా॥ జీవేశ్వర్లు లేనిది చిద్రూపము యెచ్చోటనూ లేనిది. ఏకాలమందైన సద్రూపము అని చెప్పనలవికానిది ఆధారాధేయములు లేనిది. ఖండా ఖండములుగానిది. అదే కేవలము పరిపూర్ణ పరబ్రహ్మమైయున్నది.

(18) (ఎ) తదనుత్తమ నిష్పకదం, దీపకం తేజసామపి, స్వానుభూత్యేకమానంచ యత్ర త్వం తదసౌస్థితః॥ అన్న పూర్ణ॥

తా॥ అదియే యుత్తమమైనది దానికంటె నుత్తమమైనది లేదు, నిశ్చలమైనది. తేజస్సులకు తేజస్సునిచ్చునది అది స్వానుభవగమ్యమైనిది (అనుభవము - జ్ఞానమునకు విషయము)

(బి) తదేతద్బ్రహ్మ అపూర్వమనపర మనంతర మభాహ్యమయమాత్మా సర్వానుభూః॥ బృహ॥ అ॥ 4 బ్రా॥ 5.

తా॥ .... యీ ఆత్మ విచారించు సర్వులకు అనుభవ రూపముగానున్నది.

(18) అనుభూతిపరం తస్మాత్సారం బ్రహ్మేతి కథ్యతే॥ అన్నపూర్ణ॥

తా॥ అనుభవమునకు కూడ చిక్కనిదేదో అదే శాశ్వ

తము. అది పరిపూర్ణ పరబ్రహ్మమే. పరిపూర్ణ పరబ్రహ్మము అనుభవగమ్యము కాదనుటకు ఈ గ్రంథం 215 పేజీకూడా చూడవలెను.

(19) దృగ్దృశ్యం యదిచిన్మాత్రం
అస్తి చేచ్చిన్మయం సదా
సర్వాశ్చర్యంచ చిన్మాత్రం।
దేహాశ్చిన్మాత్రయేవహి ॥తేజో॥

తా॥ దృగ్దృశ్యములు రెండూ చిత్స్వరూపములే. ఉన్నివన్నీ, చిన్మాత్రములే- దేహములన్నియుగూడ చిన్మాత్రములే. ఏలననగా అఖండ జ్ఞానరూపమగు యెరుకే సర్వస్వరూపములుగా పరిణమించెను.

(19) ఆత్మేతి శబ్దహీనోయ
ఆత్మ శబ్దార్థవర్జితః
సచ్చిదానంద హీనోయ
ఎషైవాత్మా సనాతనః ॥తేజోబిందూపనిషత్॥

తా॥ ఆత్మయను శబ్దముగాని, శబ్దార్థ ప్రతిపాదిత వస్తువుగాని తనయందులేనిది. సత్తు, చిత్తు, ఆనందములు తనయందులేక వున్నదే, సనాతనమైన కేవలాత్మ, లేక పరిపూర్ణ పరబ్రహ్మము.

(20) ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ.

తా॥ బ్రహ్మ యొక్కటియే రెండవది లేనిదైయున్నది,

(20) ఏకాభావేద్వితీయం న,
నద్వితీయే నచైకతా
సత్యత్వమస్తి తేత్కించి దసత్యం
నచసంభవేత్ ॥ఋభుగీత॥ ప్రథ॥ 25 వ. శ్లోకం.

తా॥ ఒకటేలేనపుడు రెండవదిలేదు. రెండులేపునడు ఒకటునేదిన్నీ లేదు. సత్యముంటే అసత్యమున్నూ యుండును. అసత్యము లేకుంటే సత్యమూ లేదు.

ఎరుకను మానుము:- "పరిపూర్ణమునూ యెరుకనూయెర్గి యెరుకను మాను" అను ఒక్క వాక్యములో పరిపూర్ణబోధ అంతా యిమిడుంది అన్నాము పరిపూర్ణమునూ, యెరుకనూ సంగ్రహంగా తెలిసికొన్నాము ఎరుకను మానుటనగా, ఎట్లు మానవలెను? పరిపూర్ణమున్నది ఎరుక లేనేలే దంటే సరిపో తుందా? "యింతే సాధన. యింకేమీ అవసరంలేదు." "ఏసాధన నీకెందుకు పీసానికి పనికిరాదు" అని పరిపూర్ణభావ జ్ఞులము అని చెప్పుకొనే కొందరు అనుకుంటూ వుండడం చాలాశోచనీయం. ఎరుకను వస్తునిశ్చయపూర్వంగా అనగా యెరుకయొక్క స్థానస్వరూప స్వభావములను గురుముఖతః గుర్తెరిగి తానుఎరుక స్వరూపుడైనిలచి, అపుడు తవకన్యంగా వున్న పరిపూర్ణపరబ్రహ్మమునందు, తనకుమూలంగానిస్థాన

ము గాని లేనేలేదని ఆరూఢస్థితి నందినవాడే, యెరుక విడచిన వాడు. అందుకే భాగవతుల కృష్ణదేశికేంద్రులు, తమ కందా ర్థములలో "గురుడచల చలములను తనకెరిగించిన శిష్యుడెరిగి యెరుకైవుండన్, ఎరుకను నిల్పుకుమనినను, ఎరుకను విడనాడి శిష్యుడెట్లుండునంటే...." అంటూ వ్రాసినారు. అనగా శిష్యుడు ప్రథమంలో ఎరుకై నిల్వవలెననునది స్పష్టము. "ఎరుక బ్రహ్మమనియె యిల శంకరార్యులు, తెలివి బ్రహ్మ మనుచు తెలిపె వ్యాసు, లెరుక తెలువుల రెంట్ని యెరు గడు వేమన, విశ్వదాభిరామ వినురవేమ" అనగా వ్యాసశంక రాదులు దేనిని బ్రహ్మముగా ప్రతిపాదించినారో, అదే యెరుక. కనుక ఎరుకైనిలుచుట అనగా:- అద్వైతసిద్ధిపొం దుటగాని సామాన్యంగాదు. ఆస్తియందు శిష్యుడుండగా దీనినికూడా వదలివేయమని జన్మరాహిత్యంగోరిన శిష్యునికి గురువు కర్తవ్యవం చెప్పినాడు "పరిపూర్ణ యెరుకల నెరిగితివి. కదాయిక గురుదక్షిణగా యెరుకను మరివేగిరమివ్వు" మంటు న్నాడు. యిది యెట్టివానికిసాధ్యము. ఎరుకను గురుదక్షిణగా యిచ్చివేస్తిని. అని, వాచా అంటే సరిపోతుందా ? చాలదు. ఎరుకను యెర్గిపిమ్మట దానిని వదలవలె. ఎరుకనుగూర్చి పరోక్షంగా శ్రవణంచేసినంత మాత్రమున ఎరుగుట యగునా? దేనిని పూర్తిగా యెరుగవలెనన్ననూ, తనమనస్సు ఆ వస్తు

స్వరూపమును దాల్చిననే, అవస్తువ పరోక్షమైనట్లుచెప్పాలి. యిక్కడ ఎరిగేది, యెరుగబడేదీ రెండూ ఎరుకే వ్యష్టి రూపమైన యెరిగే యెరుక జ్ఞానరూపము. సమష్టిరూపమైన తన స్వరూపమే జ్ఞేయం. (గురుగీత)

శ్లో॥ జ్ఞేయం సర్వమతీతంచ, జ్ఞానంచమనవుచ్యతే
జ్ఞానం జ్ఞేయం సమంకృత్వాయ ధానాన్యద్వితీయకం॥

అని అంటోంది అనగా యీ జ్ఞాన జ్ఞేయముల అంతరం (భేదము) నశించి, రెండూ ఏకరూపంవహిస్తేనే, ఎరుక అపరోక్షమైనదన్న మాట. అపుడే శిష్యుడెరుకై నిల్చెననాలి. యిందుక్కు ముందుగా జ్ఞేయరూప యెరుకయొక్క స్థానస్వరూప స్వభావములను, గురుముఖతా, వస్తునిశ్చయ రూపంగా గుర్తించవలసివుంది. ఆ పిమ్మట ఆ జ్ఞానం ఆరూఢంకావలె అపుడింక తెలివిచేతెలియదగిన యితరంలేదు అపుడు సర్వము తానైనిలచిన తానూ, తనకన్యమగు పరిపూర్ణమూ, మాత్రమే వుంటాయి. పరిపూర్ణమునందు తనకు మూలంలేదనే, విషయమున్నూ యిచ్చటనే ఆరూఢమవుతుంది. పరిపూర్ణమును ఘట్టిగా వుండచూచుకొనే స్థితిన్నీ యిక్కడనే. అపుడు చేయతగిన కర్తవ్యము ఏమి ? గురుడు ఎరుకను నిల్పకుమని చెప్పినమాటను పాటించి పాలించుటయే. యీ స్థితయందే ఎరుకను విడచే సామర్ధ్యము కల్గును. "ఎరుకకూ

కుడువేరునెరిగి త్రివ్వితేచాలు" నని కృష్ణదేశికులన్నారు జ్ఞానజ్ఞేయ రూపంగానున్న తనస్వరూపంకంటె, అన్యంగా పరిపూర్ణ పరబ్రహ్మమునందు, తనకమూలంలేదన్ని నిలచుటకు స్థానం లేదనిన్ని, తెలిసికొని, తానే బ్రహ్మననేభ్రాంతి పూర్తిగా వదలివేయుటయే, ఎరుకను విడచుట. యిందుకేమి సాధనకావలెను? అనగా, ఎరుక స్వరూప మపరోక్షమగువరకే సాధనగాని అపైన సాధనలేదు. కనుకనే శ్రీ శివరామదీక్షితులవారు "ఏసాధనవలన యెరుక రహితమగును"? అనే ప్రశ్నకు "ఏసాధనచేస్తే కలయందున్నవానికి కల రహితమగును ?" అని యెదురుప్రశ్న వేసినారు. శ్రీ భాగవతుల కృష్ణదేశికేంద్రులవారు "ఏసాధననీకెందుకు పీసానికి పనికిరాదు" అన్నారు. యీ రెండు వాక్యములున్నూ ఎరుకను వస్తునిశ్చయ రూపంగా గుర్తెరిగి ఆరూఢత పొందినవారికే అని గుర్తింపవలెను. అట్టిఎరుక స్వరూపుడుగా నిలచినవాడు, తనకన్యంగానున్న పరిపూర్ణ బ్రహ్మమును సత్యముగాను, తనకలిమి కలవంటిదనిన్ని మృష అనిన్ని గురువాక్యరీత్యా భావిస్తే ఎరుక రహితమగును. "యాదృశీభావనా యత్రితా దృశీభవతినిశ్చయం" అనే మాటయిక్కడ సార్థకమగును.

యిచ్చట మరియొక విశేషము ముఖ్యంగా గమనించవలెను. ఎరుకైనిల్చిన శిష్యునితో ఏరుకను నిల్పకుమని

గురుడానతిచ్చెను. యెరుకై నిలుచుట అనగానేమి ?తనవ్యష్టి రూపమగు జ్ఞానమును (అనగా తన తెలివిని) పరాయెరుక రూపమగు అఖండ చిత్స్వరూపమునందు పూర్తిగా లయ పర్చి తన గుర్తునే రహితపరచుకొనుటయా ? కాదు కాదు. ఏలననగా లయమని చెప్పినచో తిరిగి విడదీయరాని విధముగా అనగా

శ్లో॥ సముద్రేవై యథాతోయం, క్షీరేక్షీరం, జలే జలం,
భిన్నే కుంభే యథాకాశం తథాత్మా పరమాత్మని॥

అన్న రీతిగా ఏకమగుటకదా ! తాను జీవించియుండగా యిది సాధ్యమా? అంటే, "అహా సాధ్యమే అసంప్రజ్ఞాత నిర్వికల్ప సమాధులయందు సాధ్యమే" అని కొందరు చెప్ప వచ్చునుగాని ఆపక్షంలో తన వ్యష్టిగుర్తు అనేది తిర్గిరాకనే పోవలె. మరి లేకనేపోవలె. అట్లు లేకపోవుటలేదుగదా! రాకపోవుటయులేదుగదా !

కనుక ఎరుకై నిలుచుట యనగా :- తన వ్యష్టి జ్ఞానము నిజముగా, ఏమాత్రమూ అల్పమైనదికాదు, కించి జ్ఞత్వాది అల్ప లక్షణములుగలదిన్ని కాదు. అది సామాన్య మైనదికానేకాదు. అది కేవలము పరాయెరుకయే అయి వున్నది. కాని దోషలక్షణములుండుటచే దాని శక్తి సామ ర్థ్యములు మరుగుపడినవి. అనిగ్రహించి, సర్వాతీతమైన పరా

యెరుకయే సర్వగతమైనపుడు కేవల యెరుకయనీ (లేకశుద్ధ యెరుక) వ్యష్ట్యుపాధిగతమై యున్నపుడు మిశ్రమయెరుక యని పేరొందినదనీ, కనుక తానే ఆ పరాయెరుకయనీ, పరా యెరుకకు పరిపూర్ణ పరబ్రహ్మమునందుమూలము లేదు గనుక మూలంలేని గుర్రెరిగే శరీరమువకు మూలం లేనేలేదనిన్నీ దోషములను దూరీకృతమొనర్చుకొన్న శుద్ధాంతః కరణ ముచే గ్రహించి ఆ ఆరూఢజ్ఞానముచే సుస్థితుడై యిక యెట్టి నిర్ణయములను చేయక శాంతచిత్తుడై యుండుటయే ఎరుకను మానుట అని అర్థము. ఈ అర్థములో వ్యష్టియందు గాని సమష్టియందుగాని యెరుకనాశనమగుచున్నదా? ఎంత మాత్రం లేదు. మరిన్ని ఎరుక పుట్టనేలేదని అచల ఋషుల పరమసిద్ధాంతము. పుట్టని ఎరుక గిట్టబోదు. కనుక ఎరుకకు నాశనమున్ను లేదు. కనుక వుండియు ఎరుక లేనిదే యగు చున్నది. ఎరుక అను కలబాసిన మనుజుడుకూడా కలలో వలె పనులు చేయుచునే యుండునుగాని అట్టి కర్మ, ఆగామి రూపంగా ఎట్టి అదృష్టఫలమున్ను సృష్టించజాలదు.

పరిపూర్ణ బోధ కధికారి—84 లక్షల జీవోపాధులలో వుత్తమమని కొనియాడబడే మానవజన్మ యెత్తిన ఏ వ్యక్తి అయినా లక్షణయుతుడై యున్నచో యీ బోధ కాతడధి కారే. లక్షణయుతుడనగా ఏభ్రాంతీలేని వాడు. అనగా ఇహ

పరములయందు ఏవిధమైన కోర్కె లేనివాడు. "కేవల మోక్షాపేక్ష సంకల్పోబంధః" మోక్షము కావలెననే కోరిక కూడ బంధమే. అంటే మోక్షస్థానమును, అనగా ఎరుక అఖండ స్వరూపమును గుర్తెరిగినతర్వాత ఆస్థానం కావలెననే కోరికకూడ లేనివాడు అయివుండాలి. ఏ పదవి, లేక ఏ స్థానమందు తాను శాశ్వతంగా వుండాలనుకొన్నా, అది భ్రాంతి రూపమే. కనుక అట్టి భ్రాంతి లేనివాడే లక్షణయుతుడు, రోసితి మోక్షాద్యపేక్ష" అనే భావం వుండాలి. అతడే "యుత్తమాధికారి. అంతకుపూర్వం యోగరూపంగానో జ్ఞానపద్ధతిచేతనో, తన స్వరూప జ్ఞానం కల్గి అందువల్లకూడా తనకు శాంతిసుఖములు లభించనపుడే ఆ మోక్ష స్వరూపము నందుకూడా అయిష్టత కల్గును. కనుక ఆత్మస్వరూప నిశ్చయ జ్ఞానంకల్గి దానియందుకూడా భ్రాంతి విడచినవాడే ఉత్తమాధికారి అని సిద్ధిస్తోంది.

శ్లో॥ భ్రమేణాహంభ్రమేణత్వం, భ్రమేణోపాసకాజనాః
భ్రమెణేశ్వర భావత్వం భ్రమ మూలమిదంజగత్ ॥

యీ సర్వభ్రమలకు మూలం, మూలంలేని యీ గుర్తెరిగే శరీరం. అనగా లేనెరుక. యీ లేనెరుక వక్కటుంటే దానివల్ల అనేకభ్రాంతులు కలుగుతాయి. ఈ ఎరుకే బ్రహ్మమని ఘట్టిగానమ్మియున్నవారు యీబోధకధికారులు

కారు. ఏలననగా "భ్రాంతి రహిత మిదం మోక్షం" అని అన్నారు కనుక అన్ని భ్రాంతులకుమూలమైనయెరుకయే బ్రహ్మమని మొండిపట్టు వున్న వార్కి జన్మరాహిత్యం కలగజాలదు. కనుక యెరుక రూపమైన బ్రహ్మమును తెలసికొని దాని వల్ల తాను కోరిన జన్మరాహిత్యం కలుగనేరదని తెలిసికొని నిస్పృహ చెందినవాడే యీబోధకుత్తమాధికారి.

ఐతే యిప్పట్లో పరిపూర్ణ గురువులను ఆశ్రయించిన వారట్టి యుత్తమాధికారులేనా? అని శంక గల్గుతుంది. నిజంగా యుత్తమాధికారులుకారు. యీ కాలంలో స్వస్వరూప సాక్షాత్కారము కల్గినవారు బహు అరుదు, వేయి మంది మహాపండితులలో స్వరూపజ్ఞానమున్న వారు నొకరైన నుండరనుటలో అతిశయోక్తిలేదు. పామరుల విషయంలో చెప్పవలసిన పనేలేదు, కనుక ప్రస్తుతం పూర్ణగురువులను ఆశ్రయించేవారిలో నూటికి నూరుమందీకూడా అట్టి లక్షణ యుతులు కానిమాట నిజమే. కనుక పూర్ణబోధ కధికారులు న్నూ కారు అనుమాట యదార్ధమే అట్టి శిష్యులకు పూర్ణ బోధచే జన్మరాహిత్యాన్ని కల్గిస్తానని గురువు అభయ ప్రదానముచేసియున్నాడు. కనుక వారికి ముందుగా ఆత్మ స్వరూప నిశ్చయజ్ఞానం కల్గించి, అందువల్ల జన్మరాహిత్య మెందుక్కు గలుగదో వార్కి బోధించి, ఆ పిమ్మటనే గురువు

వారికి పూర్ణబోధ చెప్పుటకు పూనుకోవాలి, యీ కార్య క్రమ మంతకు గురువు పూచీవహించాలి. సాంప్రదాయక సద్గురువైతే యీ భారము తప్పక వహిస్తాడు. అట్లు చేయని యెడల యీ పూర్ణబోధవలన మేలుకన్న కీడే యెక్కువ జరుగుననుటలో ఏమీ సందేహంలేదు.

ఈ సిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్యులగు శ్రీ శివరామ దీక్షితులవారు, తమ గ్రంథములో, సర్వభ్రాంత రహితుడే యీ బోధకధికారి అని వ్రాసిపెట్టినారు. "స్త్రీలేగాని పురుషులేగాని, భ్రాంతి రహితంగావలెనని మిక్కిలి యిచ్ఛ వున్నవారు, ఒక్కటైనా భ్రాంతిలేకుండా ఎవ్వరు సూచన చెస్తారా అని అత్యంత ఆసక్తిగలవారు, సూచన చేయగానే తనుక్కునే సూక్ష్మ ప్రజ్ఞగలవారు" మాత్రమే యీబోధ కధికారులని వ్రాయబడింది. శాస్త్రవాసనగలవారు, దేవతా భ్రాంతిగలవారు, యెదురుబడి మొండిగావాదిం చేవారు, గురుసేవ చేయనివారు, గురువు ఏదంటే అదే (మూఢంగా నమ్మి) అనేవారు, కర్మ, భక్తి, జ్ఞాన వైరాగ్యములలో దేనియందైనా భ్రాంతివున్నవారు, స్త్రీ వ్యామోహంగల వారు, మొద్దుబుద్ధిగలవారు, మోక్షభ్రాంతి, అనుభవభ్రాంతి అదినేను కావలెననే భ్రాంతి, అయితిననే భ్రాంతి, శ్రవణ భ్రాంతి, మననభ్రాంతి, ధ్యానభ్రాంతి, ద్వైతాద్వైత

విశిష్టాద్వైత మతాంతర భ్రాంతులు, మొదలగు భ్రాంతులు గలవారు, అహంకారంచే వాదించేవారు, నామతమే దొడ్డదని వాదించేవారు, కపటపద్ధతిచేతనున్న వారూ, యిత్యాదులందరినీ యీ బోధ కనధికారులుగా శ్రీ శివరామదీక్షితుల వారు పేరొన్నారు. కనుక ఏ ఆశవున్నా ఏ అభిమానమున్నా ఏభ్రాంతియున్నా, యీబోధకు అనర్హులే. కేవలం జన్మ రాహిత్యం (సర్వభ్రాంతి రహితం) కోరేవారే అధికారులు. కనుక జాతి మత కులగోత్ర వర్ణాశ్రమ దురభిమానము లేనివారై, జన్మరాహిత్యం మాత్రంకోరు స్త్రీ పురుషులందరూ ప్రస్తుత కాలమాన పరిస్థితులనుబట్టి, యీ బోధకధికారులని చెప్పవచ్చును. చంచలబుద్ధి విడచి, గురువుయందు లక్ష్యముంచి, గురువు చెప్పిన ప్రకారం నడచెదనని, గురువాజ్ఞ మీరనని, ప్రమాణంచేసి, కృషిచేసేవార్కి గురువు అచిరకాలముననే ఆత్మ స్వరూప వస్తుసాక్షాత్కారస్థితి గల్గించి, అధికారులనుచేసి, తదుపరి వార్కి జన్మరహితస్థితి గల్గించు పూర్ణబోధను చెప్పగలడు.

## పరిపూర్ణబోధ సిద్ధాంతమొక మతముకాదు.

మతము అనేది, మతి, లేక బుద్ధిచే నిర్ణయింపబడి కొన్ని సరిహద్దులు లేర్పరుచుకొన్న వ్యవస్థ అని, మతశబ్దమే సూచిస్తోంది. మతములు సిద్ధాంతంచేసిన బ్రహ్మము "మనస్సై

వాను ద్రష్టవ్యం" అనీ "బుద్ధి గ్రాహ్యమతీంద్రియం" అనీ, శ్రుతిస్మృతులు చెప్పుచున్నాయి. ఈ పరిపూర్ణ బోధయందు పరిపూర్ణ పరబ్రహ్మముగావాకొన్నది "నచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి, నోమనః" అని మనోవాక్కులకు కేవలం అందరానిది.

అంతేగాక, మతాభిమానమనునది ఏమాత్రమూ పూనక, ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది అన్ని మతములను, మహాసముద్రమువలె, తనలో నిముడ్చుకొని, సమష్టి దృక్పథము, లేక పూర్ణ దృక్పథము విద్యుక్తపబడియుండుటచేతనే దీనికి పరిపూర్ణ భావమనిన్ని పేరువచ్చినది. మతములన్నియు, లేని యెరుకయందే, తమతమ గమ్యస్థానములను నిర్ణయించుకొన్నవి. పరపూర్ణభావమో! ఎరుకలేనిది, ఎరుక మీరినది. కనుక పరిపూర్ణబోధ సిద్ధాంతమొక మతమనే అనరాదు. దేశకాల; సమాజముల ననుసరించి, మతప్రవక్తలాయా మతములను సమాజ శ్రేయస్సుకొరకు నిర్మాణముగావించిరి. పరిపూర్ణ భావమట్లుకాదు. సకలదేశకాల సమాజములకు సరిపడియున్నదని, నిష్పక్షపాతముగా యీ సిద్ధాంత ధర్మములను శోధించినవారు తెలియగలరు.

పరిపూర్ణబోధకెట్టి గురువు కావలెను.

అష్టవిధ నామములచే యొప్పు ప్రపంచమునందలి

గురువులలో ఏగురువున్ను పూర్ణబోధ సిద్ధాంతమును శిష్యునికి తెలుపజాలడు. శ్రోత్రియ బ్రహ్మనిష్టుడగు గురువు కావలెనని యితరులంటారు. అనగా శ్రుత్యర్థమునుగూడ చక్కగా యెరిగినవాడై యుండవలెనని అందురు. కాని,

శ్లో॥ అవిజ్ఞాతే పరేతత్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా
విజ్ఞాతేపి పరేతత్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫల॥

అని చెప్పబడింది. పరతత్వమును దెలియక శాస్త్రజ్ఞానము ఎంత తెలిసినను నిరర్థకమే. పరతత్వమును తెలిసినచోగూడ శాస్త్రజ్ఞానము నిరర్థకమే. కనుక శాస్త్రజ్ఞానముతో ఏమీ పనిలేదు. బ్రహ్మమును తాను దర్శించి యితరులను దర్శింపచేయగలవాడే గురువు.

వాగ్వైఖరీ, శబ్దఝురీ, శాస్త్రవ్యాఖ్యాన కౌశలం, యిత్యాదులన్నీ బ్రహ్మమును చూపించుపట్ల నిరర్థకములే, "దేవుని నీవు చూచితివా ?" అని, వివేకానందుడడిగిన ప్రశ్నకు, మహాపండింతులెందరో సిగ్గుపడిమౌనమువహించిరి రామకృష్ణ పరమహంస మాత్రము "ఔను నేనుచూచితిని, నీకు చూపగలను" అని, నిస్సంకోచముగ చెప్పగలిగెను. ఆవిధంగా గురువు తాను స్వయంగా చూచినవాడున్నూ యితరులకు చూపగలవాడున్నూ అయివుండాలి.

ఈ సందర్భములో యీక్రింది గురుగీతా శ్లోకములు

గమనించదగును.

(1) శ్లో॥ భవారణ్య ప్రవిష్టస్య దిఙ్మోహ భ్రాంతిచేతనః
ఏనసందర్శితః పంథా తస్మై శ్రీ గురవే నమః

(2) శ్లో॥ స్థావరం జంగమంవ్యాప్తం యత్కించిత్సచరాచరం
త్వం పదం దర్శితం ఏన - తస్మై శ్రీ గురవేనమః

(3) శ్లో॥ అఖండ మండలాకారం వ్యాప్తంయేన చరాచరం
తత్పదం దర్శితంయేవ తస్మై శ్రీ గురవేనమః

(4) శ్లో॥ చిన్మయం వ్యాపితం సర్వంత్రైలోక్యంచరాచరం
అసిత్వం దర్శితం ఏన తస్మై శ్రీ గురవే నమః

(5) శ్లో॥ నిరస్త సర్వసందేహో ఏకీకృత్య సుదర్శనం
రహస్యం యోదర్శయతి భజామి గురు మీశ్వరం

(1) సంసార మహారణ్యమున దిక్కులు తెలియక తల్లడిల్లు వానికి దారి యెవనిచే చూపించ బడుచున్నదో,

(2) (1) త్వంపదము, (2) తత్‌పదము (3) అసి - పదము అను మూడునూ ఎవనిచే చూపించ బడుచున్నవో

(3) సర్వ సందేహముల పోగొట్ట గలిగిన, ఆత్మ వస్తు దర్శనము చేయించి, అపిమ్మట అతిరహస్యమైయున్న దానిని ఎవడు చూపించునో అటువంటి సద్గురునికి నమస్కారమని యీ శ్లోకముల తాత్పర్యం అంటే

పరిపూర్ణమును, ఎరుకను, రెంటినీ వస్తునిశ్చయ రూపముగా చూపగలిగినవాడును, గురుపరంపరా ప్రాప్తమగు, పూర్ణబోధను తనగురువుల వలన గ్రహించినవాడును అయిన గురువే యీపూర్ణబోధ తెలుప సమర్థుడని తెలియవలెను.

## గురుశిష్య న్యాయము

మిగతా మార్గాల్లో యెట్లున్నా యోగమార్గమందున్నా పరిపూర్ణ ప్రబోధ విధానమునందునూ గురుని ఆవశ్యకత మరీ మరీ కలదు. పూర్ణ గురువు కేవలం శ్రుతపాండిత్యం వల్లనూ, తనస్వంత ఊహాపోహాలచేతనూ ఏదోరీతిగా ప్రబోధ చేసేవాడు కాకూడదు. విధిప్రకారం తానొక పూర్ణ గురువును ఆశ్రయించి ధర్మోపదేశము పొంది సాంప్రదాయక సిద్ధాంతములను అవగాహన చేసుకొన్నవాడై, "స్వయం తీర్ణః పరాంతారయతి" అనే న్యాయంగా తాను సర్వ భ్రాంతిరహితం చేసుకొన్న పిదపపీఠత్వితాధిపతివలనబోధాధికారంపొంది తదాజ్ఞానుసారంమాత్రమే శిష్యసేకరణగావించి ప్రబోధ ప్రచారములు గావించువాడై యుండవలెను. కేవలం లోకసేవయే పరమార్థంగా పూని స్వార్థబుద్ధి యేమియు లేక యీసాంప్రదాయ సిద్ధాంతమును ప్రపంచమునందు ప్రచారం చేయవలనేగాని, ధనకీర్తి ప్రతిష్ఠలకై ప్రాకులాడరాదు.

(ఎ) సద్గురు లక్షణములు (బి) గురుస్వరూప నిర్ణయం (సి) గురు ప్రభావ వర్ణనము (డి) గురూపాసనావిధి (ఇ) గురు కృపా విశేషము, యిత్యాదులను గూర్చి స్కాంధపురాణాంతర్గతమగు గురుగీత విపులంగా చెప్పియున్నది. గ్రంథ విస్తర భీతిచే యిందు పొందుపరచలేదు.

## గురుపూజ అవసరమా ?

"గురువల్ల వుపదేశము పొందవచ్చును. బోధ వినవచ్చును. విశ్వాస రూపంగా గురువునకేమైనా నీయవచ్చును. కాని గురుపూజాదికములు అవసరంలేదు. వ్యర్థములు అని, కొందరు పొరపడుచున్నారు. కాని వేదశాస్త్ర పురాణాదులన్నీ గురుపాసన విధించుచున్నవి.

(1) "యస్యదేవే పరాభక్తిర్యథాదేవే తథాగురౌ, తస్యైతేకథితాహ్యర్థా ప్రకాశంతే మహాత్మనః" గురుగీత

(2) "తద్విద్ధిప్రణిపాతేన, పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతితే జ్ఞానం, జ్ఞానివస్తత్వ దర్శినః
॥భగవద్గీత॥

"గురుభక్తిం సదాకుర్యాత్ శ్రేయసేభూయ సేనరః
(3) గురురేవ హరి స్సాక్షాన్నాన్య ఇత్యబ్రవచ్ఛ్రుతిః ॥
॥బ్రహ్మవిద్యోపనిషత్ ॥

(4) "గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవోస్సదాఽచ్యుతః

నగురోరధికం కశ్చిత్ త్రిషులో కేషు విద్యతే
దివ్యజ్ఞానోపదేష్టారం దేశికం పరమేశ్వరం
పూజయాత్పరయాభక్త్యాతస్యజ్ఞానఫలం భవేత్
యథాగురు స్తథై వేశోయథైవేస్తథా గురుః
పూజనీయో మహాభక్త్యాన భేదోవిద్యతేఽనయోః

యోగశిఖోపనిషత్ 5వ అ. 56-58

(5) "ఉపాస్య ఇతిచ :- సర్వశరీస్థ చైతన్య బ్రహ్మ ప్రాపకో గురు రుపాస్యః

తా॥ సకల శరీరములయందుండు చైతన్యమైనట్టి బ్రహ్మమును పొందింపచేయు గురువే ఉపాసింపదగినవాడు.

(నిరాలంబో పనిషత్ - 31)

(6) యంయంలోకం మనసాసంవిభాతి
విశుద్ధసత్వః కామయతేయాంశ్చ కామాన్
తంతంలోకం జయతేతాయాంశ్చ కామాన్
తస్మాదాత్మజ్ఞం హ్యర్చ యేద్భూతికామః

తా॥ ఆత్మజ్ఞాని సత్య సంకల్పుడు. తనకుగాని యితరులకుగాని అతడు కోరిన లోకములుగాని యితర కోరికలుగాని వెంటనే సిద్ధించును. కనుక విభూతికాలములందరు నిర్మలాంతః కరణ కల్గిన బ్రహ్మవేత్తను అర్చించవలెను.

(ముండక ఉపనిషత్ 1 ఖండ 110 వ మంత్రం)

(7) సవేదైతత్పరమం బ్రహ్మధామ యత్రవిశ్వం నిహితం భాతిశుభ్రం ఉపాసతే పురుషం యేహ్యకామాస్తే శుక్రమే తదతివర్తన్తిధీరాః॥

తా॥ ఆత్మజ్ఞానిని పూజించునట్టివాడు, ఆత్మజ్ఞుడగు పురుషుని పూజించునట్టివాడు, ఆపరబ్రహ్మమును పొందు చున్నాడు (ముండకోపనిషత్ 3ముండ 2వ,ఖం.1వ.మంత్రం)

యీ విధంగా శ్రుతిస్మృతులెన్నో, గురూపాసన అత్యంత ముఖ్యమని చాటుచున్నవి. పూజింపబడు గురు మూర్తియందున్న శమదమాది సద్గుణములు, అఖండ జ్ఞాన సంపత్తి, స్థితప్రజ్ఞాదులన్నీ పూజచేయ తనకు సంక్రమించ గలవలెననే వుద్దేశముతో, శిష్యుడు గురునకు పూజాదికము లొనర్చును. తనయందున్న మలినలక్షణములన్నియు నశించి గురువుయందున్న శుద్ధలక్షణములు, వాని స్థానమాక్రమించ వలెను. చివరకు తానే గురుస్వరూపముగా మార్పు చెంద వలెను ఈ లక్ష్యము దెలిసి గురూపాసని గావించువాడు లక్ష్యసిద్ధిగాంచి కృతకృత్యుడు కాగలడు.

సాధన :- ఆత్మస్వరూప సాక్షాత్కారము కల్గువరకు శిష్యుడు సాధనయందుఏమరకూడదు. జన్మతరణోపాయము కోరిన శిష్యుడు, గురువు నాశ్రయించిన వెంటనే గురువాత నికి ధర్మోప దేశముచేసి, అతనిని ఒకసంవత్సరమైననూ పరీ

క్షించి అతడీ బోధయందు తీవ్రముగా కృషిచేయగలడని స్థిరపరచుకొని, జన్మకారణమేదియో ముందుగా తెలియు పరచి, దాని స్థానస్వరూప స్వభావములను వివరించిచూపును అద్దాని రహితమునందుగాని జన్మరాహిత్య ముండదని. గుర్తింపచేయును. సృష్టికి మూలముగానున్న వస్తువే జన్మ పరంపరకును కారణముగనుక, ఆవస్తు నిశ్చయముగావించు టకై శాంఖ్య, తారక, అమనస్కములు, మహావాక్య నిర్ణ యము, నిర్వాసనా మౌనముద్రా నిష్ఠారూపమగు వార్తిక నిర్ణయము, చెప్పి, ఆయామార్గములను వానివాని సాధనలను యెరిగించును. అందే సాధనవల్లనూ జన్మకుమూలకారణమగు యెరుక రహితమగుటలేదని రుజువుచేసి వానిని నిరసించును. గురుమూర్తి చెప్పిన ప్రబోధ శిష్యుని అంతఃకరణయందు పాదుకొనే పర్యంతము. శిష్యుడు పదేపదే అడిగి గురువువల్ల సర్వసంశయ విముక్తిపొందుతూ వుండవలెను యిదిశిష్యుడు చేయవలసిన జ్ఞానరూప సాధన.

గురువు వస్తునిశ్చయ రూపంగా తనకు చెప్పిచూపిం చిన వస్తువునందు, పదేపదే శిష్యుడు తనమనస్సును లగ్న పరచి అనుసంధాన మొనర్చుటకై సులభోపాయములు గురు మూర్తివల్ల తెలిసి, ధ్యానసాధనయున్నూ చేయవలెను. యిది యోగరూప సాధన.

గురుకృపా ప్రసాదసిద్ధికి గురుమంత్ర జపము, గురు గీత పారాయణ, నిత్యమూ సలుపుచూ చతుర్విధ శుశ్రూష లొనర్చుకొనుచు గురునిష్ఠయందుండవలెను. గురుభక్తి లేనిచో, కుక్కయెంత బలిసినా గోనెబస్తాలు మోయజాల నట్లు, శిష్యునికి వాచాజ్ఞానమెంత వర్ధిల్లినా ఉన్నదివున్నట్లు పడదు. అనగా పరిపూర్ణ బోధోక్తస్థితి కుదురదు. భయ ముతో కూడిన ప్రేమయే భక్తి. గురుతత్వమునందు ప్రేమ గురువాజ్ఞను పాలింపలేకపోతానేమో అను భయముకల్గి, యున్నపుడే, గురుభక్తుడను పేరు సార్ధకము. గాంధీటోపీ ఖద్ధరులాల్చీవున్న ప్రతివాడూ, (గాంధీగారి అంహిసా సత్య సిద్ధాంతాలు పాటించనివాడు) గాంధీగారి శిష్యుడనచెల్లునా? అట్లే గురువు నిర్ణయించిన ఆచార అనుష్ఠాన పద్ధతులను అమలులో పెట్టనివాడు గురుభక్తుడు కాజాలడు. యిది శిష్యునియొక్క భక్తిరూప సాధన.

త్రికరణశుద్ధి అక్షరాలా పాటించి సత్కర్మానుష్ఠాన మనగా సమష్టి శ్రేయస్సునకు తోడ్పడు కార్యనిర్వహణకు చేతనైనంతలో తోడ్పడుచుండవలెను. మానవులను ధర్మ పద్ధతికి తెచ్చునుపాయముల నన్వేషించి కృషిచేయుటకంటె గొప్పదగు లోకసేవలేదని గుర్తింపవలెను. స్వార్ధముపూర్తిగా విడువవలెను. స్వకష్టార్జితముచే పొట్టపోసుకొంటూ తనపై

నాధారపడిన స్త్రీ శిశు సంరక్షణా బాధ్యతయందు యేమరరాదు. అది తన కర్తవ్యరూప కర్మగానెంచి, కర్తృత్వత్యాగరూపముగ, అవసర కార్యములు చేయచుండవలెనే గాని, ఫలప్రాప్తివిషయంలో ఎట్టిఆందోళనకు తావివ్వరాదు. ఆశపడరాదు. ఫలప్రాప్తియందు మనస్సును లగ్నము కానీయక, ఏతత్సంస్కారముల ముద్ర అంతఃకరణయందు పడకుండా జాగ్రత పడవలెను. అంతఃకరణయందు ఆత్మస్వరూపమునకుతప్ప, అన్యమునకుతావివ్వరాదు. యదృచ్ఛాలాభసంతుష్టిగల్గి దొరికినంతలో కాలక్షేపము చేయవలెను. గృహస్థాశ్రమమే అత్యుపమమని గ్రహించి, రాజయోగ రీవి గల్గియుండవలెను. భోగములయందు ఆశకూడదేగాని తనకు చితమగు విధముగా వానిని అనుభవించదగును. రాగ మెంత అనర్థకమో, వైరాగ్యమున్ను అంతఅనర్థకమే. సకల తృష్ణలకు, కోరికలకు కారణస్వరూపమగు వస్తువు ఆత్మగా గుర్తించి, దానియందు వైరాగ్యముగల్గి యుండవలెను. అనగా "అదియే నాకు మోక్షస్థానము, దానివల్లనే నాకు జన్మరహితమగు" ననేఆశ వదలివేయవలెను "ఆత్మనస్తుకామాయ సర్వంప్రియం భవతి" నాయందు నాకున్న ప్రేమ చేతనే సర్వవస్తువులయందు నాకు ఆశరూపమైన ప్రేమ జనించుచున్నది. కనుక ఆత్మయే స్వార్థమని గుర్తించి

పరిపూర్ణబోధ గ్రహించిన అనంతరం దానియందుకూడా వైరాగ్యము కల్గియుండుటే నిజమగు వైరాగ్యము. అట్టి వాడే నిజమగురాజయోగి. కర్మకౌశలమునెరింగినకర్మయోగి యిదే భుక్తిముక్తి క్రియలందు పూర్ణయోగము పూనుటకు చేయు కర్మరూప సాధన.

కనుక బోధ అరూఢమయ్యే పర్యంతం యీ మార్గమందు కూడా, జ్ఞాన, యోగ, భక్తి, కర్మ రూపంగా సకల సాధనలు కావలసియేయున్నవి. ఈ సాధన లన్నియు ఏకకాలముననే అభ్యసించు తూండాలి గాని ఏదో ఒకదానిని మాత్రం పూని తక్కుంగల వానిని వదలకూడదు. అందుకే ఈసాధనామార్గమును పూర్ణయోగమని అంటారు. తానే అత్మస్వరూపుడై నిలువగల సమర్థత లంభించినవెనుక యిక సాధనలతో పనిలేదు. అపుడే వానికి గురుకృపాసిద్ధి కల్గినదన్నమాట. యిట్టి సిద్ధిపొందిన శిష్యునకే "అత్మనా త్మల కవ్వలి" దగు పరిపూర్ణప్రబోధ తెలియపరచబడును. "అతనికి దయవసై అరనిముసముననె బోధస్తితి నీకు కుదిరించు" నన్న మాటలు యీపరిస్థితి నందినవాని నుద్దేశించి పల్కినవే. అట్లే ఏసాధన నీకెందుకు వీసానికి పనికిరాదు" అనే మాటలుకూడా యిట్టి పూర్ణాధికారికి చెప్పినమాటలే. పూర్ణాధికారి కాని శిష్యునిచేత సాధనలన్నియు చేయించి

స్వస్వరూపస్థితి గల్గించుటకూడా గురువుయొక్క విధ్యుక్త ధర్మమైయున్నది. శ్రీ భాగవత కృష్ణదేశిక ప్రభువులు, అందుకే "హృదయగ్రంథి విడుటకై సదయత యీబోధ దెల్ప జనదాగురుడై" అని గురుకర్తవ్యమును సూచించినారు. ఆకందార్థంలోనే "వదలక తనచిత్తములో గురుపదయు గళముదలపవలదె భక్తుడైనపుడు" అనే శిష్యుని లక్షణ మున్నూ వివరించారు. ఈసచ్ఛిష్యలక్షణముంటేనే గురువా తనికి "సదయత" యీ బోధ చెప్పునని గమనించవలెను.

## ఉ ప సం హా ర ము

ప్రపంచమునందున్న అన్నిమత సాంప్రదాయముల గమ్యమూ ఎరుకయొక్క సగుణరూపమో, లేక నిర్గుణ రూపమో అయివున్నది. కనుక ఆకాశమునుండి పడిన వర్ష జలమంతా సముద్రమునే చేరునట్లుగా, అన్నిమతములున్నూ చివరికొకే గమ్యస్థానమును చేరగలవని చెప్పుటలో విప్రతి పత్తియేమీలేదు. అయితే, ఆకాశమునుండి పడిన వర్షము చివరికి సముద్రమునే చేరినను, మరల ఎండకు ఆవిరియై మేఘమండలమున చేరి మరల వర్షాకాలమున భూమిపైననే పడుచున్నది. కనుక మతములన్నియు తిరిగివచ్చు పద్ధతినే సూచించును. పరిపూర్ణబోధ మాత్రమే తిరిగి తీసికొనిరాని మార్గము. ఎరుకయేలేని, పరిపూర్ణబోధవలన గల్గు జన్మరా

హిత్యమే మా ఆశయమున్నూ, అని ఆయా మతానుయా యులు చెప్పుకొనవచ్చును. కాని కేవల జన్మరాహిత్యము మాత్రం వారికి సిద్ధించదు. కాలినడకతో మాత్రమే గమ్య స్థానమును జేరనెంచువాడు, భూమిపైనున్న ఏఆనందప్రదేశ మునకైననూ ఎప్పటికో యొకప్పటికి చేరవచ్చునేగాని, చంద్రమండలమందలి ప్రశాంతి స్థానము నెన్నడును చేర లేడుగదా! అట్లే, ఎరుకయందలి సాధనావిధానము లవలం బించి, యెరుకయిదంలి ఏలోకమైననూ, ఏపదవులైననూ పొందనగునేగాని, ఎరుకేలేని పరిపూర్ణమును అవగతము చేసుకొనుటకు ఎరుక లేక సేవించు పూర్ణబోధ విధానమును పూనుటయే ఏకైక మార్గము. కనుక యేమార్గమునకైనా గమ్యమొక్కటే అనరాదు. పరిపూర్ణ పరబ్రహ్మము సర్వ లక్షణ విలక్షణము. అందుకు మార్గమున్నూ అత్యంత విలక్ష ణమే ఆశయమున్నూ విలక్షణమే.

ఐతే ప్రపంచమునగల సగుణారాధనలసహా అన్ని సాధనాలకు ఫలశ్రుతియందు జన్మరాహిత్యముగూడ. ఫల ముగా చెప్పబడుచున్నదే ! అని అనవచ్చును "రోచనార్థా ఫలశ్రుతిః" అని రుచిపుట్టించి సాధకుని సోపానక్రమముగా ఉత్తరోత్తరాభివృద్ధి మార్గమునకు తీసుకొనిపోవుటయే ఆయాఫల శ్రుతులు పల్కిన పెద్దల ఆశయముగా గుర్తించవలెను.

షడూర్ములలో శోకమోహములు మనోధర్మములుగా చెప్పబడినవి. అట్టిమనోరూపమగువ్యష్టి అంతఃకరణమున్నూ దానికత్యంత మూలమగు పరాయెరుకయున్నూ, పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేనేలేదని అరూఢ పరచుకొన్న రాజ యోగి, ఎల్లప్పుడూ, ఎట్టి పరిస్థితులందునూ తన అంతఃకరణ స్తిమితమునుగోల్పోడు పారమార్థికముగా మానవుడు తన జీవితములో ఆసించదగిన . కేమిగలదు? యీమార్గమును చేపట్టినవానికిదే యీలోకమునందు సిద్ధించగల యుత్తమ ఫలము. మరియును అతడట్టి శాంతిసౌఖ్యములు పొందుటయే గాక. అతనివల్ల లోకమునకును శ్రేయస్సు చేకూరుతుంది. ఎట్లన :- అతడే నిజమగు స్వార్థరహితమగుసమష్టి శ్రేయో దాయక, కర్మచేయడానికిసమర్థుడు. ఏలననగా స్వ+అర్థము =స్వార్థము. తనయొక్క వస్తువు అనగా "నేను" అను వస్తువందు సంపూర్ణముగా సమస్తాభిమానములను వదలిన వాడు. యీ నేనను వస్తువు వ్యష్టియందు ప్రత్యగాత్మగాను, సమష్టియందు పరమాత్మగాను యున్నది. కనుక ప్రత్య గ్బ్రహ్మైక్యరూపమగు అఖండపు ఎరుకయనేనస్తువే స్వార్థ ము. పరిపూర్ణబ్రహ్మమునందు యీ "స్వార్థ" సార్థకనామధే యమగు అఖండ ఎరుక లేదనేభావం దృఢం అయితేనేగాని వ్యష్టిరూపమగు స్వార్థము పూర్తిగా పోనేపోదు. తన ఆత్మ

యందలి ప్రేమయే సర్వవస్తువులయందు తనకు ప్రేమాభిమానములు కల్పిస్తూంది, అను భావమునే "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అను బృహదారణ్యక శ్రుతి యున్నూ చెప్పుతోంది, కనుక విశ్వమానవ కళ్యాణము కొరకు స్వార్థరహిత కర్మ జరుగవలెనంటే, పరిపూర్ణ బోధయందారూఢత సాధించిన రాజయోగివలననే కాగలదు. మరియును జనన మరణ రహితరూపమగు పరమపురుషార్థ మాతడు మాత్రమే సాధించగలడు. జన్మకారణమగు వస్తువును వస్తుతః గుర్తెరిగి, దాన్ని రహితము చేసుకొని, ప్రత్యక్ష జన్మరాహిత్యం పొందు విధానమీ పూర్ణబోధ స్థితియందేగలదు. తత్ఫలశిమాంచిన వారెప్పటికైనా యీ మార్గమవలంబించక తప్పదు. ఈ సిద్ధాంతం, వేరేఒక మతం కాదనీ, సనాతనమైనదనీ, వేదసమ్మతమైనదనీ, సర్వసిద్ధాంతములను సమన్వయం చేసుకొన్న అతీత సిద్ధాంతమనీ, తెలిసికొన్నాము. హేతువాద యుక్తమై సర్వభ్రాంతి రహితమే ఆశయుగాగలవార్కి శిరోధార్యమైయున్నది. సహృదయులు సత్యాన్వేషణా తత్పరులై విమర్శించినచో యీ సిద్ధాంతము యొక్క ఔన్నత్యమును గుర్తింపగలరు.

పశ్చిమ గోదావరీ మండల నర్సాపురగ్రామ వాస్తవ్యుడు, ఆత్రేయసగోత్రికుడు, శేషమాంబా వెంకటశివ

రామార్యా పుణ్యదంపతుల పుత్రుడు, శ్రీ మదచలఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి ప్రియశిష్యుడు బుధజన విధేయుడునైన యిలపకుర్తి వీరవెంకట రామచంద్ర రావుచే రచయింపబడిన పరిపూర్ణ దర్శనమను గ్రంథము నందు సర్వము సమాప్తము-ఇతిసర్వం శ్రీ సద్గురు చరణార విందార్పణమస్తు!

శ్రీ మదచలఋషి శ్రీమద్రామడుగు శివరామదీక్షిత
సద్గురు ప్రభుమహారాజుకీ జై !
శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక సద్గురు ప్రభుమహారాజుకీ జై!
శ్రీ మదచలఋషి శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్ర
సద్గురు ప్రభుమహారాజుకీజై !

